# శిశుపాలవధ మహాకావ్యము

[ఆంధ్రమాఘము]

గోపినాథ వేంకటకవీంద్ర ప్రణీతము



గ్రంథకర్త
గోపినాథం వెంకయ్యశాస్త్రి
(గోపినాథ వేంకటకవి)

జీవిత కాలము : 70 ఏండ్లు

నిర్యాణము : 8–6–1892

(ఈ ఛాయాపటము తీసిన మఱునాఁడే వీరు పరమపదించిరి)

# వంశవృక్షము

తెలగాణ్యులు, ఆపస్తంబసూత్రులు, కౌండిన్యగోత్రులు, గోపినాథం వెంకయ్యశాస్త్రివరకు వంశవృక్షము గోపినాథరామాయణమందు ముద్రితము. తరువాత వారినుండి



# గోపీనాథుని కవితాప్రాంజలి

(శ్రీకృష్ణజన్మఖండమునుండి)

" శృంగారాది రసపోషితయు నానాలంకార భూషితయు నగు 'సీతా' కన్యకు జనకుండైన వాల్మీకిమునివరున నభినందించి లోకహితార్థం బష్టాదశపురాణంబులును, నానావిధేతిహాసంబులును, బంచమ వేదంబైన శ్రీమహాభారతంబును, బ్రహ్మసూత్రంబులును నిర్మించిన సుజనమానసధ్యేయు సాత్యవతేయుం బ్రస్తుతించి విరించను, శక్తి ప్రయత్నంబున భువనత్రయంబు నిర్మించుకైవడి బాలబోధార్థంబు మృదు మధుర శబ్దార్థ ప్రపంచసంచితంబైన కావ్యత్రయంబు రచియించిన యనంతవిద్యావిలాసుఁ గాళిదాసుం గొనియాడి నానావిధగద్యపద్యాత్మక ప్రబంధరచనాదక్షులైన దండి భవభూతి మాఘ మయూర బాణ భారవి ప్రముఖ విచక్షణుల నభినందించి యాంధ్రభాషాప్రబంధ నిర్మాణ చతురులగువారి కెల్లఁ బ్రథమాచార్యుండైన నన్నపార్యుం బ్రశంసించి భారతపురాణకౌశలీవిరాజిఁ దిక్కనసోమయాజి నభినుతించి సకల వేదాంతసారసంగ్రహంబైన శ్రీమహాభాగవతపురాణంబు నాంధ్రభాష రచించిన సహజపాండిత్యుండైన పోతనామాత్యు నారాధించి యుభయ భాషాకావ్యరచనా చమత్కార తిరస్కృత గురుకవియైన శ్రీనాథ భట్టసుకవిం బ్రస్తుతించి యంధ్రభాషాశబ్దప్రపంచ ప్రకాశన భాస్కరుం డగు భాస్కరు వినుతించి చతుర్విధ కవితా నిర్వహణ చాతురీవిశేషాభి రాముండైన సోమునిం గీర్తించి బహువిధసంస్కృతాంధ్ర ప్రబంధ రచనా చాతుర్యధుర్యులైన వర్తమాన కవివర్యులకు విధేయుండనై..."

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము



## కథాప్రారంభము

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

# ప్రకాశకుని విన్నపము

మా నాన్నగారు పోయే సమయానికి మేము పసిపిల్లలం కావడం మూలాన్నూ, ఆస్తి నాస్తి కావడంమూలాన్నూ మేము మా మేనమామల పైనా, ధర్మసత్రాలపైనా, వారాలపైనా ఆధారపడ వలసి వచ్చింది. 12 ఏండ్ల అమ్మాయి, 10 నెలల అమ్మాయి మధ్య ముగ్గురు మగబిడ్డలతో తల్లి పోషణకై ఎంత కష్టపడిందో చూచిన వారికి, దైవానికి ఎఱుక! పై పరిస్థితులలో మాకు మా ప్రప్రపితామహులు — గోపీనాథం వెంకయ్యశాస్త్రిని (వేంకటకవిని) గుఱించి, వాఙ్మయంలో ఆయనకు గల స్థానం గుఱించి తెలియదు. వెంకయ్య శాస్త్రిగారిని చూచిన మా నాయనమ్మ రంగమ్మవ్వ, ఆయనను గుఱించి ఆయన పొందిన గౌరవాలను గుఱించి తెగచెప్పేది. మేము పెడ చెవిని పెట్టి వినలేదు. సరిగదా, మనవాళ్ళెపుడూ మన పూర్వులను పొగుడుతూ ఉంటారు, అది లోకసహజం అనుకునేవాళ్లం. మాయింట్లో వారు వ్రాసిన పుస్తకాలు కనీసం గోపీనాథ రామాయణముకూడా ఉండేదికాదు.

భగవత్కృపవల్ల కాలం ఎలాగో గడిచిపోయింది. అందరము ఉద్యోగాలలో చేరాము. నేను ప్రభుత్వకార్యంమీద 1968 లో కడపకు వెళ్ళి, అక్కడ సాయంత్రం కాలయాపనకు గ్రంథాలయమునకు వెళ్ళి, పుస్తకములు చూచుచుండగా నా అదృష్టవశమున 'గోపీనాథ వేంకట కవి' అని ఒక పుస్తకమందు చూచి అందేమనియున్నదో చూతమని చూడగా 'ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము'న నిట్లున్నట్లు చదివితిని.

"........ఇతడాధునికు డగుట నితని విలువఁ దూచుటకు మన మశక్తులమేమో?...ఇతని యథామూల వాల్మీకిరామాయణ మాంధ్రీకృత యథామూలము లన్నిటిలో నుత్తమోత్తమమైనదని యట్టి పుస్తకముల నొకేచోట, నొకప్పుడే చదివినయెడల పాఠకులకు తప్పక విశదమగును. సంస్కృత పంచకావ్యములలో నొకటియగు మాఘము నితడు తెలింగించిన తెఱంగునకు శ్రీనాథుడును దలయూపవలసినదే! శైలి "విద్వత్సంస్తవనీయ కవితావేశంబును" మెఱయించుచు, సలలిత పదప్రయోగ నైపుణ్యమును జూపుచు, చదువఁజదువ నింపులుపుట్టించుచున్నది."

పై విషయములను చదివిన తదుపరి, ఆంధ్ర ప్రఖ్యాతకవులగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులగారిని కలిసి, వారివలన మా ప్రప్రపితామహులు వారికి ప్రత్యేకాభిమానముగల కవులలో ఒకరని తెలిసికొని, వారు అంతకు పూర్వము వ్రాసి అచ్చయిన 'మాఘుడు - గోపీనాథం వెంకటకవి' అను వ్యాసమును యివ్వగా తీసికొంటిని. అందు ముగింపు వాక్యము లివి. "గోపీనాథులు చాల ప్రసిద్ధులైన విద్వత్కవులు. శాస్త్రపాండిత్యముతో పండి పక్వమైనది వారి సాహిత్యము. ప్రాచీన మహాకవుల కోవకు చెందినవారిలో వీరు ఒకపటివారు."

అప్పటినుండియు మా ప్రప్రపితామహులను గూర్చి ఎవరెవరేమేమి వ్రాసిరో గ్రహించుటకు ప్రారంభించితిని. తెలుగు భాషా సమితివారు ప్రచురించిన విజ్ఞానసర్వస్వము—తెలుగు సంస్కృతి—యందు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు—వేంకటకవి కడపటి కృతి రాధికా పరిణయమనియు, అది ముద్రితమనియు—చదివి, వారికి నన్ను పరిచయము చేసికొనుచు, వారికృతులు వారి వారసులమైననూ మావద్ద లేవనియు, అవి లభించు చిరునామా తెలుపుడని ఉత్తరము వ్రాయగా వారిట్లు వ్రాసిరి.

"I am overjoyed to learn that you are the direct descendent of Sri Late Gopinatha Venkatakavi garu, the greatest poet of the 19th century. As a matter of fact I am the first person to bring to the notice of the public his great and everlasting contributions to Telugu literature...... As for his works .....Radhikaparinayam partly printed in Ratnakaram, a journal in Masulipatnam in 1894, this journal is not available......

I take opportunity of writing to you to know something about the family of Sri Venkatakavi garu. Are there any elder persons in your family now who can give some information about your family........ I will most willingly do what all I can in bringing to light the greatness of Sri Venkatakavi garu".

వేంకటకవీంద్రుల రచనలనుండి పాఠ్యగ్రంథములకు నిర్ణయింపబడకుండుటవలన కవిని గురించి లోకము మరచిపోవుటకు కారణమని ఊహించి మద్రాసు, వెంకటేశ్వర, ఉస్మానియా తెలుగుశాఖాధ్యక్షు

లకు ఉత్తరపూర్వకముగను, ఆంధ్ర విశ్వవిద్యాలయ తెలుగుశాఖాధ్యక్షుని ప్రత్యక్షముగను అభ్యర్థించితిని. శ్రీ నిడదవోలు వెంకటరావు గారికి విమర్శనాదృష్టితో వెంకటకవిపై వ్యాసములు వ్రాసిన ప్రచారమునకు తోడ్పడగలరని అభ్యర్థించితిని. శ్రీ నిడదవోలు వెంకటరావుగారిట్లు వ్రాసిరి.

"........As for a critical study of the works of Sri Venkata Kavi garu, I am equally happy to note that you have anticipated my intention of writing the same. As a matter of fact I wanted to write about this and also critical biography of Sri Venkatakavi garu to you ever before. But since it was my first letter to you I did not mention it. It was with the intention of writing a biography and critical study of his works, I wrote to you for details. I am writing to the persons whom you have mentioned. Can I get any information regarding his date of birth at least the year and date of his death?

This is the time when a critical and exhaustive study of his works should be made and his place in the history of modern literature has to be evaluated. In the opinion of competent critics, Sri Venkatakavi garu is the last of the great galaxy of poets commencing from Nannaya in Telugu literature.

If a biography with a critical study of his works is first brought out then it will go a long way in popularising the works of Sri Venkatakavi garu, which is our cherished desire. The biography and the studies should not be a big volume. It will be about 300 pages and on the lines of Indian Men of letters series. I have already published a biography of that type of Potana. It is published by National book trust of India,"

పై ఉత్తరము చూచిన పిదప నేను వెంకయ్యశాస్త్రి జీవిత విషయములు సేకరించుటకు వారి నివాసస్థానమైన లక్ష్మీపురమునకు వెళ్ళి మా చినతాతగారి భార్య గోపీనాథం సుబ్బమ్మద్వారా కొన్ని విషయములు సేకరించి, తన భర్త జననమునకు 6 నెలల పూర్వము గోపీనాథం వెంకయ్యశాస్త్రి వెంకటగిరికి సకుటుంబముగా వెళ్ళి,

ఆకస్మికముగా మరణము నొందినారని విని, వెంకటగిరి వెళ్ళి, మా చిన తాత జననతేదీ హైస్కూలు వారిద్వారా 15–12–1892 అని తెలిసికొని జననమరణ రిజిష్టారు కార్యాలయమున ప్రతులు తిరుగవేయగా 8–6–1892 న వెంకయ్యశాస్త్రి మరణించినట్లు తెలిసికొంటిని. వెంకటగిరియందు రాజాగారి అనుమతిని వేంకటకవీంద్రుల గ్రంథములను సేకరింపగలిగితిని. ముద్రణకు సహకరించుచు [illegible] యిచ్చిన శ్రీ వేంకటగిరి ప్రస్తుతరాజావారికి నా కృతజ్ఞతలు ఇందు మూలముగా తెలియచేయుచున్నాను.

శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు నా ఉత్తరము చూచి పాఠ్యభాగములుగ నిర్ణయించుటకేగాక "వెంకటగిరి సంస్థానము— సాహిత్యసేవ" అను అంశముపై పరిశోధనచేయుచున్న శ్రీ కాళిదాసు పురుషోత్తం అను విద్యార్థిని పంపి, లోకమునకు తెలియని ఎన్నో విషయములు ప్రకటింపజేయుట కెంతో సహాయము చేసినవారైరి. శ్రీ కాళిదాసు పురుషోత్తంగారు వెంకటగిరి సంస్థానము పరిశోధించి అందుగల అముద్రితగ్రంథములు వెలుగులోనికి తెచ్చుటవలన వారి సాహిత్యసేవ ప్రస్తుతింపతగినది. మారుతిశతకము, తిరునాళ్ళ దండకము, వెలుగోటివారి వంశావళికొన్ని పద్యాలు, కొన్ని తారావళి పద్యాలు, వేంకట కవీంద్రులచే రచింపబడిన మరికొన్ని ఆశుకవనాలు వెలుగులోనికి తెచ్చినందుకు వెంకటకవీంద్రుల వంశీయులుగా మా కృతజ్ఞత వారి కిందుమూలముగా తెలియజేయు చున్నాను.

మదరాసు విశ్వవిద్యాలయమునుండి శ్రీ S. Rama Krishna Sastry గారు యిట్లు వ్రాసిరి, "మీ ముత్తాత గోపీనాథం వేంకటకవి గారు ప్రఖ్యాత కవులనుట సర్వవిదితమైన విషయము. వారి గ్రంథములనుండి కొన్నిభాగములు మాత్రము University పరీక్షలకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించుట కెవరును కాదనరు. కాని అచ్చుపడిన గ్రంథములేవో, ఎక్కడ దొరుకునో తెలియదు. వారి రామాయణము మాత్రము పూర్వము వావిళ్ళ వారివద్ద కేటలాగులో గోచరించెడిది. ఇప్పు డదికూడ కానరాదు. కాన, వారి గ్రంథములు కాపీ యొక్కటైన పంపగలిగితే Meeting of Board of Studies లో తెచ్చి ఏదేనొక గ్రంథములోని కొంతభాగమును పాఠ్యభాగముగా ఒక్కొక్క మారు నిర్ణయింపగలము. ఇది నాచేతనయిన పని."

కవిసామ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిని ప్రచారమునకై అర్థింపగా వారిట్లు వ్రాసిరి. "మీ తాతగారు రచించిన గోపీనాథ రామాయణము ప్రసిద్ధ గ్రంథమే. రామాయణ కర్తలలో మీ తాతగారి పేరు తక్కువగాలేదు. తక్కువదికాదు. గ్రంథము నచ్చువేయించి ప్రచారములో నుంచవలసిన బాధ్యత మాత్రము తత్సంబంధీయులకు కలదు. ఒక కవి యెన్ని గ్రంథములు వ్రాసినను ఏదో ఒకటియే ప్రసిద్ధికి వచ్చును. దానితోనే వారి పేరు నిలుచును. వారి గ్రంథము లన్నియు అచ్చువేయించి Market లో పెట్టినచో ప్రచారమెక్కువగా నుండును. ఇదియే రహస్యము.

లేదు, మీరు నన్ను వారి గ్రంథములకు ఏ విధముగా ఉపకరించు మందురో, వ్రాసినచో, అది నాకు సాధ్యమయినచోఁ జేయగలను."

పై పండితాభిప్రాయ మొకవైపు, వెంకయశాస్త్రిగారి వినయత, భక్తి ఒకవైపు, మిళితమై నాకు వారిపై భక్తిభావములు, వారి పుస్తకములు ప్రచారములో లేనందున, అందుకు ప్రయత్నత గలుగ జేసినవి.

వెంకయ్యశాస్త్రి తన కవిత్వము అనర్గళగంగాప్రవాహమని ఎంత వినయముతో విన్నవించుకున్నారో కృష్ణజన్మఖండము నందలి దీనిని చూడండి—

"ఆంధ్రకవిత్వవిద్య మొదల వివిధవిచిత్ర శబ్దార్థగుణాలంకార రసబహుళప్రవాహరూపంబుగా నన్నపాఖ్యమహాకవి వదన వినిర్గతంబై ప్రబంధపరమేశ్వరుని కంఠప్రదేశంబున విశ్రమించి, యచ్చటనుండి తిక్కన యజ్వయందుఁ బ్రవేశించి, యచ్చటనుండి బహుప్రకారంబుల బహుకవిముఖంబులందుఁ బ్రవర్తిల్లె. నే నందులో నొక్కింత పరిగ్రహించి ప్రకారాంతంబుగా నిమ్మహాపురాణకథ రచియించెద. మత్కవిత్వంబు నన్నపార్యాదుల కవిత్వంబుకంటె నల్పంబైనను శ్రీకృష్ణకథావిలాస బహుళం బగుటవలన నతిపవిత్రంబై సకలజనంబులచేతం గొనియాడ బడి యుండునది. యెట్లనిన—

సీ. గంగాజలంబు పంకజగర్భకుండిక
యందుండి మొదల మహాప్రవాహ
రూపమై వెడలి స్వర్లోకంబు నందట్లు
ప్రవహింపఁ బడి భవునిశిరముఁ

జేరి యుపచ్చటనుండి చెలువొప్పఁగాఁ బెక్కు
ముఖముల బహుదేశములకుఁ బాఱె
నందులో నొకకొంత యలజహ్నుమునిచే ని
పీతమై గ్రమ్మఱ వెల్వరింప

తే. గీ. బడి మొదటికంటె మిక్కిలి స్వల్పమయ్యు
హరిపదాంభోజసంభవ మగుటఁ జేసి
చాలపరిశుద్ధమై సర్వజనములకును
సేవ్యమై ధాత్రిలోఁ బ్రకాశింపలేదె? (శ్రీకృష్ణజన్మఖండము)

రామాయణ రచనమందు తప్పులుండిన గణింపక తిలకింపు డని పండితులకు విన్నపము. ఇట్టి ప్రక్రియ సాహిత్యములో మహాకవులందు చాల అరుదని గ్రహింపగలరు.

మ. ఇలసర్వజ్ఞుడు దేవదేవుడు రమాధీశుండు లేఁడన్యుఁ డే
నెలమిన్ నేర్చినభంగిఁ జెప్పితి శుభం బీరామచారిత్రమున్
బలుమాఱిందులఁ దప్పులుండిన గణింపన్ బోక సద్భక్తితోఁ
దిలకింపం దగు భావిసత్కవు లమందీభూతచేతస్కులై

(గో. రా పీఠిక — 15)

ఇంతేకాక కవి వ్రాసిన "నీకేసేవ చేసితి నీరజలోచన చేకొని నను బ్రోవరా" అను లక్ష్మీపురభజనలలోని భక్తిపూర్వకమైన కీర్తన గుర్తున్నదని మాఅమ్మమ్మ గాదేపల్లి సుబ్బమ్మ పాడినది. అందలి భావము వారిపై భక్తి నినుమడింపజేసినది.

విశాఖపట్నం జిల్లా, కణితి గ్రామం జిల్లా పరిషత్ హైస్కూలు తెలుగు పండితులు శ్రీ కొక్కిరగడ్డ శ్రీరామమూర్తిగారు శిశుపాల వధ ననువదించుట చాల కష్టమనియు, యిది తిరిగి ముద్రింపబడి పండితుల హస్తగతమైన కవికి పండితలోకమున మంచి కీర్తి సంపాదింప గలదనియు చెప్పి, నాకు సాహిత్యప్రవేశము గల్గజేసి నందున వారికి నా కృతజ్ఞత.

కొంతకాలమునకు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారిని కలసి కొనగా వారు "మిత్రులు, సాహిత్యప్రియుల సహాయము నభ్యర్థించి, పుస్తకముయొక్క విలువగా ఒక్కొక్కరినుండి 10 రూ॥ చొప్పున

ముందుగా వసూలుచేసి, ఆ ధనము ద్వారా ముద్రించి పుస్తకము ను వారికి పంపవచ్చు"నని చక్కని సలహాచేయుటయేకాక, ప్రతి సందర్భమునను ప్రోత్సహించిరి. తద్వారా ఈ పుస్తకమును ప్రకటింప గలిగితిని. ముద్రణమునకు సగముకూడ వసూలు కాక పోయిననూ, పుస్తకము మీ హస్తగతముగ నుండుట శ్రీ స్వారాజ్య ప్రింటింగ్ ప్రెస్ యాజమాన్యులు శ్రీ కొత్తా మనోహర్ గారు ముద్రణకు ముందే కాగితఖర్చుకూడ అడుగక ముద్రణ ప్రారంభించుటయే కారణము.

నేను వసూలుచేయు సందర్భమున శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారిని కలిసికొనగా వారు ఈ పుస్తకము ననువదించుట చాల కష్టమనియు, అందువలన అభ్యంతరములేకపోయినచో పుస్తకము నిచ్చిన చదివి రపాలా ద్వారా పంపగలననియు తెలిపి, వారు తమ అభిప్రాయములను 23-3-69 న ఆంధ్రప్రభ సారస్వతకళా వేదిక ద్వారా యిట్లు తెలిపియున్నారు. వారికి నా కృతజ్ఞత ఇందుమూల ముగా తెలియ పరచుచున్నాను.

""మాఘేమేఘే గతంవయః" అని సుప్రసిద్ధ కావ్యవ్యాఖ్యాత మల్లినాథు డన్నాడని ఒక వదంతి. ఈ గ్రంథము వ్యాఖ్యానించుటకే ఇట్లుండ చందస్సుందరముగ అనువాదముచేయుట ఎంతకష్టతరమో ఊహింపవలసినదే! సంస్కృత పఞ్చకావ్యములలో నిండు జీవములతో తెలుగులోనికివచ్చి బ్రతికి బట్టకట్టినది శ్రీనాథుని నైషధము తప్ప మరి యొకటి కాన్పింపదు. మేఘదూతమునకు నవ్యులుచేసిన ఆంధ్రాను వాదములలో ఒకటి రెండు 'ఫర్వాలే'దనిపించును.

నేడు మాఘుని శిశుపాలవధమునకు సమర్థముగ చేసిన ఆంధ్రాను వాదమొకటి నాయెదుటకు వచ్చినది. తెలుగుమాఘ మనగనే సంస్కృత మాఘములోని కొన్నిప్రసిద్ధ శ్లోకములు జ్ఞాపకమువచ్చివానికి ఇందను వాద మెట్లున్నదో అను కుతూహలమున ఒందు రెండు పద్యములు చదివితిని. నిరాఘాటమైన రచనాసిద్ధికిని ధారాశుద్ధికిని అబ్బురపడితిని. శ్రీనాథుని అనువాదము తరువాత ఇంత ప్రౌఢసుందరమైన రచనము చదువలే దనిపించినది. అప్పుడు ఇంత చక్కని చిక్కని రచనచేసిన కవి ఎవరు అను ప్రశ్నము సహజముగా ఉదయింపక మానదుగదా!

ఈ మాఘానువాదము చేసినది శ్రీ గోపినాథము వేంకటకవి. ఈయన వేంకటగిరి ప్రభువయిన వెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణ

యాచేంద్ర రాజబహాదూర్ గారి ఆస్థానకవి. ఈ అనువాదము పై ప్రభువున కంకితముగా 1857 లో వావిళ్ళరామస్వామిశాస్త్రులవారి ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

శ్రీ వేంకటకవిగారి గోపినాథ రామాయణము ఉన్న తెలుగు రామాయణములలో ఎన్నికగన్న దని అందరికిని తెలిసిన విషయమే. కాని ఈ మాఘానువాదమునకు రావలసినంత ప్రసిద్ధి రాకుండుట ఆశ్చర్యకరము. ఈయన రామాయణ మాఘములనేకాక బ్రహ్మవైవర్తములోని శ్రీకృష్ణజన్మఖండమును భగవద్గీతను కూడ తెనుగించెను. ఈ గోపినాథుడు అనువాదకర్తయే యయ్యును శ్రీనాథునివలె తన రచనల కన్నిటికిని స్వతంత్రకావ్యప్రతిపత్తిని కల్పించిన ఘనుడు.

సరళమై అమృతప్రవాహంమువంటి వాల్మీకి రామాయణమును తెలిగించుట ఒకయెత్తు, అడుగడుగున పాండిత్యశౌండీర్యము నొలికించు మాఘమును తెనిగించుట వేఱొకయెత్తు. ఈయన 19వ శతాబ్దికి చెందిన ఆధునిక కవియే ఐనను, నవ్యుల ఆంధ్రీకరణములవలెను, చ-ల కోసము పెనుగులాడక పూర్వాంధ్రకవుల గడుసు పోకడలను పట్టుకొనెను. వారివలెనే ఈయనయు మూలకవి అక్షరముల కొరకు చూడక అతని అంతర్యములోనికి తొంగిచూచెను. మూలములో లేదు గదా! యని సందేహింపక కథాంశముల నతుకవలసినచోట స్వతంత్రముగ వచనము వ్రాసెను. వచనము వ్రాసినను చాలు అనిపించినచోట కొన్నిశ్లోకములకువచనమే వ్రాసెను. ఇట్లు ఈకవి మాఘాంధ్రీకరణము స్వతంత్రమై స్వరసమై సహృదయ ప్రీతి పాత్రము కాదగియున్నది.

ఈ ఆంధ్రమాఘము తెరువగనే అందలి పద్యములు వేనికో అనువాదము లనిపింపక కవిహృదయమునుండి స్వయముగ దూసికొని వచ్చినట్లుండి తొలుపొల్త పాఠకుని తమవైపు త్రిప్పుకొనును.... అనువాదములోని ధారాశుద్ధియును, శైలీమాధుర్యమును మాత్రమె రచయితను కృతార్థుని చేయజాలవు. శ్లోకములోని కవిప్రౌఢి మూలము లయిన అర్థాంతరములను అనువాదములో నిర్వహింపవలెను. దీనికి కవికి మంచి శబ్దప్రభుత్వ ముండవలెను. ఈ శక్తి ఈతని యందు సమృద్ధిగా నున్నదని తెలియనగును. మాఘుకవి కావ్యాంతమున పాండిత్యప్రకర్షకు చేసిన ఏకాక్షర, ద్వ్యక్షర, చిత్రబంధ రచనలు

రసరామణీయకదూరములని ఈకవిచాలావరకునిడిచినట్లుకాన్పించును.
తనశక్తి ప్రదర్శనమునకు మచ్చునకు కొన్నింటినిచేసి చూపెను.

ఇట్టి ప్రౌఢమై సరసమై ఒప్పు ఆంధ్రమాఘము పునర్ముద్రణము లేక రసజ్ఞపాఠకులకు దూరమైయుండగా శ్రీ వేంకట కవిగారి ప్రపౌత్రుడు శ్రీనివాసమూర్తిగారు దీనిని యిప్పుడు తిరిగి ముద్రింప పరిశ్రమించుట మిక్కిలి ముదావహము."

ఇట్లే శ్రీ నిడుదవోలు వెంకటరావుగారును మొదట కవిని గురించి 'ఆకాశవాణి' ద్వారా ప్రసారముచేసి, తదుపరి 'అపర పోతన-గోపినాథ వెంకటకవి' అను వ్యాసమును వ్రాసి వారి రచనల పునర్ముద్రణమునకై తోడ్పడమని విజ్ఞప్తి చేసి యున్నారు.

ప్రస్తుతము ఎనభైమూడేండ్లక్రిందట ముద్రితమైన శిశుపాల వధను, తిరిగి ఈనాడు, సర్వాంగసుందరముగా విపుల పీఠికాదులతో వెలువడుటకు ఆదినుండి కారణభూతులైన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారికి, శ్రీ దివాకర్ల వెంకటావధాని గారికి, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారికి నేను శాశ్వతముగా ఋణపడియున్నాను.

వెంకయ్యశాస్త్రిగారి "రాధికాపరిణయము" బందరునుండి వెలువడుచుండిన "రత్నాకరము" అను పత్రికయందు వరుసగా ముద్రింపబడుచుండెడిది. ప్రథమ చతుర్థ సంచికలు మాత్రము లభ్యమైనవి. లభ్యమైనపద్యములు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారి "అనువాదము – శైలి" తదుపరి ముద్రింపబడినవి. రత్నాకరము ప్రారంభసంచికలోని రాధికాపరిణయ పద్యముల నిచ్చిన శ్రీ కోరాడ శేషావధాని గారికిని నా కృతజ్ఞత.

లభ్యమైనపద్యములనుండి ఒకవిషయము గమనార్హము. అది కుకవినింద. రామాయణములో ఒక్కపద్యమున కుకవినిందయున్ననూ, శ్రీకృష్ణజన్మఖండ, శిశుపాలాదులలో కుకవినిందేలేదు. అట్టిది 4 పద్యములలో కుకవినింద యుండుట రాధికాపరిణయ మందలి విషయము. అందొక్క పద్యము.

మ. చతురత్వంబున చారుచిత్రకవితాసామ్రాజ్యసింహాసన
స్థితుడై యున్న కవీంద్రుగాంచి కుకవుల్ సిగ్గేది నిందింప త

త్కృతికిం దత్కవి కేమి యెగ్గు ? ద్విరదశ్రేష్ఠంబుపై నున్న భూ
పతినిన్ గన్గొని క్రింద కుక్కలదలింపఁ గూసినట్లే కదా !

సాధారణముగా మొఱుగుట కుక్కలకు సహజ గుణము. కాని ఆ మొఱుగుటలోకూడ నీచత్వము నాపాదించునది కనుకనే కుక్కలు "కూసినట్లే" యని కవి ప్రయోగించెను. ఇది "అదలించు"ధ్వని. ఇదే విధముగా ఈ శిశుపాలవధ మందు "పరుషము లు పల్కుచేది భూపతికి" (4-12) అను పద్యాంతమందు 'నక్క అఱుపుల కలుకపడునె?' అని ప్రయోగించియున్నారు. నక్క సహజముగ 'కూయును' కాని 'అఱచుట' విపరీత ధ్వని. ఇది 'పరుషము' నకు సూచితము.

'అముద్రితగ్రంథచింతామణి' సంపాదకులు 'అముద్రిత గ్రంథము లన్నియు సేకరించి ముద్రించుటయే తమ దీక్ష' అని సగర్వముగా ప్రకటించి మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి 'శ్రీకృష్ణాభ్యుదయము' తదితర ప్రముఖుల గ్రంథములను కొన్నింటిని ముద్రించుటయు అదే జిల్లాకు చెందిన సుప్రసిద్ధ కవివరేణ్యులగు గోపినాథం వెంకయ్య శాస్త్రిగారి అముద్రితమైన 'రాధికాపరిణయము' ముద్రింపకుండుటయు, దానినే బందరులోని 'రత్నాకరము' అను పత్రికయందు ప్రథమసంచికయందే ముద్రించుటయు గమనించిన, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు పీఠికయందు చర్చించినట్లు ఈర్ష్యయే కారణమని తోచును. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రివంటి పండితుల ప్రచారమునకు తోడ్పడిన ఈ పత్రిక గోపినాథం వెంకయ్యశాస్త్రిగారి ప్రచారమునకు ఏమాత్రము తోడ్పడకుండుట ఆశ్చర్యకరము. తనుపొందిన గౌరవములను సూత్రప్రాయముగ వేంకట కవియే యిట్లు తెలిపికొనియున్నారు.

చ. అనిశము భోజరాజసభయందుఁ జెలంగెడు కాళిదాసు చా
డ్పున మహిఁగృష్ణరాయసభఁబోల్పగు పెద్దనసూరిభంగి న
త్యనుపమమైన యాత్మసభయందు మహాకవినై చెలంగు నన్
ఘనమతి బిల్వనంపి కుతుకంబున సత్కృతుఁజేసి యిట్లనున్

(శ్రీకృష్ణ జన్మఖండము)

రాజుగారికి కవియందు ఇంత గౌరవపరిచయములు లేనిదే కామశాస్త్ర విషయకమైన బ్రహ్మానందశతకము వ్రాసినందున వచ్చిన

చెడ్డ పేరునురూపుమాపుటకు తనేస్వయముగా "గీతార్థసారసంగ్రహము" నువచనరూపకముగ వ్రాసి, అందు శ్రీనిడుదవోలు వెంకటరావుగారు పీఠిక యందు ఉదహరించిన విషయము వ్రాసియుండరు. శ్రీకృష్ణ జన్మఖండము రాజసభయందుపూర్తి చేయగ నేపనుగు పైకి రేగించియుండెడివారుకారు.

శ్రీకృష్ణజన్మఖండము 1969 న ముద్రితమైననూ, యిప్పుడలభ్యమైనందున శైలి గ్రహించుటకు "చైత్రమాసమున శ్రీకృష్ణుని వేణుగానమును విని రాధవచ్చు" సందర్భమున గల కొన్ని పద్యములు క్రింద నుదహరించు చున్నాడను.

ఉ. చిత్రతరప్రసూనమధుసేవనలుబ్ధమనోజ్ఞ చంచరీ
కత్రము పల్లవగ్రసనకామపికాళిశిపాదవల్లికా
ధాత్రము కామినీజనవితానమనోగతమానధీరతా
జైత్రము చైత్రమొప్పె సుమసాయకకేళిరసైకపాత్రమై.

సీ. తరుణారుణాంకూరదళరాజిరాజిత
భ్రమరరేఖాలసద్ధ్వనిమధురంబు
మంజులమంజరీపుంజసంజాతమే
దురకరంభితహరిత్పరిమళంబు
పల్లవాస్వాదనహల్లోహలానేక
కోకిల కుహుకుహూ కూజితంబు
శుకతుండఖండితప్రకటఫలస్రవ
న్మకరందవాహినీమానితంబు.

తే.గీ. బకుళహల్లకభల్లపుష్పప్రకాండ
దండితస్వాంతకాంతాప్రచండవిరహ
శిఖశిఖా గంధవాహంబు చెలగె నంత
భాసురంబగు మధుమాసవాసరంబు

ఉ. ఆవనజాయతాక్షుడు మహాత్ముడు కృష్ణుడు ప్రీతినందు సౌం
పావహిలన్ సితవృదమునందు త్రయోదశి నాటిరేయి తా
రావిభుడంబరంబున దిరంబుగ బూర్ణరుచి న్వెలుంగ బృం
దావన వీధికేగె సముదంచితరాసరసాభిలాషియై

వ. మఱియు మనోహరసౌరభమాలతీమల్లికామాధవీయూథికా కుసుమ మకరందరసాస్వాదనతుందిలేందిందిర సందోహామందా

నందసంజాతర్షుంకారసంకులంబును దరుణారుణవర్ణ సవర్ణరసాల కిసలయ గ్రసనోన్మత్త పుంస్కోకిలారావసంకులంబును బహువిధ మధురఫలభక్షణ సముత్పన్నహర్షోత్కర్ష సముదీరిత విరహిణీజన కర్ణకటుకకీరశారికా నిర్ఘోషభూషితంబును శుద్ధస్ఫటికసంకాశ నిర్మలతోయాగ్ర మందమారుతోచ్చలిత తరంగమాలికా డోలి కాందోళిత మరాళచక్రమధురధ్వని పరిష్కృతమణిదళ విభ్రా జితానేక రాజీవరాజిత సరోవరభాసితంబును వివిధకుసుమపల్లవ ఫలోపేతలతాప్రతాన సమాచ్ఛాదితానంత రంజత్కుంజకుటీర పుంజీకృతావాంతరోద్యానసంపన్నంబు నగు పావనంబైన బృందావనంబు ప్రవేశించి యందు నవలతారాససారసంయుక్తం బును జందనాగరుకస్తూరీకుంకుమసువాసితంబును గర్పూరతాం బూలచందనసిందూర మృగనాభిపంకమందారకుంద మాలతీ మాలికాదిబహువిధభోగద్రవ్యపరిపూర్ణంబును బ్రదీప్తదీపకళికా పరివేష్టిత మనోజ్ఞధూపసురభీకృత పుష్పవిరచితమృదులతల్ప కల్పితంబును సుందరకందర్పక్రీడానందితరతిశ్రమహారిమరాళ చక్రకారండవ జలకుక్కుట మధురనినాదసంకుల బహుసహస్ర క్రీడాసరోవరవిభాసితంబును దధిపూర్ణశుక్లధాన్యలాజ నిరంత రీకృతంబును సూక్ష్మసూత్రగ్రథితచారురసాలపల్లవ విరచిత తోరణపూగరంభాస్తంభముక్తాఫలరంగవల్లీవిరాజిత ప్రాంగణం బును నారికేళ ఫలాన్వితసిందూరచందనానులిప్త మాలతీ దామ పరివేష్టిత మంగళఘట పరిపూర్ణంబును మనోహరంబును వర్తులాకారంబునుంగా రాసమండలంబు నిర్మించి గోవిందుండు గోపికలకు మదనవర్ధనంబు గావించుతలంపున సకల జగన్మోహ నంబుగా వినోదమురళీనాదంబుగావించిన

ఉ. ఆనినదంబు కర్ణపుట మంటినయంతనె మన్మథార్తయై
మానినిరాధ స్థాణుగతిఁ బ్రాన్పడి మోహమునొంది మాధవా
ధీనమనస్కయై మఱలఁ దేఱి తదీయరవంబు సారెకు
స్వీనుల విందుగా వినుచు వేడుకతో గతసద్మకృత్యయై

చ. స్మరసుమబాణము ల్మదిని సందడిపెట్టఁగ నిల్వలేక య
త్తరుణి మనోజ్ఞహారపరిధానములం గయిసేసి భక్తితో
హరిచరణాబ్జముల్ హృదయమందుఁ దలంపుచు నాదలక్ష్యయై
పరువడి వేగఁ గాన్తెఱుఁగుఁ భంగి దిశల్వెలుఁగంగఁ జేయుచున్

చ. చెలువుగ వేణునాదహృతచేతనలై స్మరసాయకార్తలై
పొలుపుగ రాధికాసఖులు ముప్పదిమువ్వురు నాత్మమందిరం
బుల నిలుపోపలేక దమిఁబూని నిజేశ్వరి వెంటనేగి రు
జ్జ్వల శశిరేఖ వెంటజను చారుతరద్యుతితారలో యనన్

ఈ గ్రంథమును సరిదిద్దుటలో తోడ్పడిన బాలకవికోకిల శ్రీ రామేశ్వరపు సూర్యనారాయణమూర్తిగారికి నా కృతజ్ఞత. ఈ గ్రంథమునకై నేను అడుగగనే ధనసహాయముచేసిన మిత్రులందరికి సాహితీపరులందరికీ నా కృతజ్ఞత నిందుమూలముగా తెలియజేయుచున్నాను.

ఎంతో జాగ్రత్తతో చూచినను స్ఖాలిత్యములు లేకుండ చూచుకుట వీలులేకపోయినందున చదువునపుడు సహృదయులు మన్నించగలరు. రాయల్ సైజులో 1500 పుటలుగల రామాయణము, 650 పుటలుగల శ్రీకృష్ణ జన్మఖండము ముద్రించుటకునే నశక్తుడను. 1887 న ప్రథమ ముద్రణము నొందిననాటినుండియు 1923 వఱకు అనగా 36 సంవత్సరములలో 1500 పుటలుగల రామాయణము 5 ముద్రణలొంది 1923 నుండి నేటివఱకు ముద్రణకు నోచుకొననందున ఆంధ్రసాహితీపరులు పేరుబొందిన ప్రచురణకర్తల ద్వారా ముద్రింపించగలరని విజ్ఞప్తిచేస్తూ ఈ విన్నపమును ముగించుచున్నాను.

ఈ శిశుపాలవధ మహాకావ్యమును సర్వాంగ సుందరముగా ముద్రించిన శ్రీ స్వారాజ్య ప్రింటింగ్ ప్రెస్ యజమానులకు, పనివారలకు నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

హైదరాబాదు,
30-6-1970.

ఇట్లు
గోపినాథం శ్రీనివాసమూర్తి.

---

"గోపీనాథము వేంకటకవి — శబ్దసౌష్ఠవముపైననే యాధారపడలేదు. అర్థమునందే దృక్కునిముడ్పలేదు. కంకంటిపాపరాజు మున్నగువారివలె ననర్గళవేగముతో కవనమునల్లు దక్షతకలవాడు.... అట్టి పండితకవి యగుటచే తిక్కన, వెన్నెలకంటిసూరన, శంబుదాస, పినవీరభద్రనాదులచేతనేకాక యితని జన్మవలనగూడ నెల్లూరు మండలము కీర్తివంతమయ్యెను"

—శ్రీ వీరేశలింగయుగము

# పీఠిక

## పరిశోధనాపరమేశ్వర శ్రీ నిడదవోలు వెంకటరావుగారు

సంస్కృతమున పంచకావ్యములలో నొకటియైన శిశుపాలవధను తెలుగులో ననువదించిన గోపీనాథ వెంకటకవి క్రీ. శ. 19వ శతాబ్దిని జీవించియున్న మహాకవి. ఆంధ్రవాఙ్మయచరిత్రకారు లీ 19 వ శతాబ్ది సాహిత్యయుగమును నవ్యయుగమని వ్యవహరించిరి. కొందరు దీనిని క్షీణయుగముగా భావించిరి. కాని యిది యెంతమాత్రము సరికాదు. ఆంధ్రవాఙ్మయచరిత్రమునకు ఏనాడునులేని ప్రత్యేకవిశిష్టత, తెలుగునకీనవ్యయుగముననే కలిగినది. ఈ వఱకుగల యుగములన్నింటిలో, సాహిత్యము మనరాష్ట్రపుపొలిమేర దాటలేదు. ఇట్టి స్థితిలో పాశ్చాత్యులైన యాంగ్లేయుల పరిపాలన మూలమున మన తెలుగుభాష పశ్చిమఖండమున ప్రథమముగా పేరుగాంచినది. భాషోద్ధారకుడైన "బ్రౌను" మహాశయునివలన, తెలుగుభాష, తెలుగు కవులు, తెలుగు కావ్యములు, తెలుగుసాహిత్య ప్రత్యేకత, పశ్చిమఖండమున వ్యాప్తి చెందినవి.

ఈ యుగమునందే తూర్పుఖండమునగల భాషలలో మధురాతిమధురమైనది తెలుగుభాషయని ప్రపంచమునకు తొలుత ఇంగ్లీషువారే చాటిరి. రమారమి నూఱేండ్లక్రిందట, అఖిలభారతవర్ష దేశభాషా రచనలలో నగ్రగణ్యమైన ప్రథమబహుమతినిబడసి తెలుగుభాష కావ్యప్రశస్తి పాశ్చాత్యదేశమున ప్రవక్తమైన దీయుగమునందే[1] కాబట్టి కేవలము ప్రాంతీయమైన మన తెలుగుభాషకు అంతర్జాతీయముగా ప్రథమముగా ప్రతిష్ఠనార్జించిన దీయుగమే. ఇది మన భాషాచరిత్రలో సువర్ణఘట్టముగదా!

పాశ్చాత్యుల మూలమున పత్రికలు, వచనరచన, నవల, నాటకము, వ్యాసము, శాస్త్రీయగ్రంథములు, ఖండకావ్య రచన

---

1 క్రీ. శ. 1887 లో కొక్కొండ వెంకటరత్నంగారి "ప్రిన్సఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనము" అను తెలుగు కావ్యమునకు లండను క్రౌను పెద్ద్యూమరీ కంపెనీవారు ప్రథమ బహుమతి నిచ్చిరి. "The Telugu kavya, Prince of wales visit is a triumpth for India అని ఆనాటి London Times పత్రిక ప్రకటించినది.

మున్నగు నవ్యసాహిత్యప్రక్రియలు ప్రారంభమైన దీయుగమునందే. ముద్రణ సౌకర్యమువలన నీ నూతనసాహిత్య ప్రక్రియలు తెలుగు దేశమున నచిరకాలములోనే ప్రచురప్రచారము బడసినవి. ఈ యుగమున నిట్లొకవైపున నవ్యసంస్కారము వ్యాప్తియగుచుండగా, మఱియొక వైపున ప్రాచీనకావ్య సాహిత్యము, పునరుజ్జీవితమైనది. అంతకుముందు తాళపత్రములపైననే అవతరించి పండితాధీనమైన ప్రాచీనకావ్యములు ప్రజలకందఱకూ అందుబాటులోనికి వచ్చినవి. మన ప్రాచీనసంపదను గుర్తించుటకు వారి కవకాశము గలిగినది.

ఇట్లు ప్రాచీన కావ్యముద్రణమేగాక, నన్నయ యుగమునుండి చారిత్రాత్మకముగా తరతరాలుగా అనుస్యూతముగా వచ్చుచున్న ప్రాచీనాంధ్ర కవితా సంప్రదాయము చెక్కుచెదరకుండా నిలిపిన దీ యుగమునందే.

ఆంగ్లేయులు పాలకులై పాశ్చాత్యమైన నవ్యతను ప్రచారము చేయగా, వారి యధికారముక్రింద నుండు, స్వదేశ సంస్థానములు, ప్రాచీన కవితా సంప్రదాయజ్ఞులైన కవులను పోషించి, కావ్యములు రచింపజేసి, వాని ముద్రించి, యవిచ్ఛిన్నముగా తెలుగుసాహిత్య సంపదను సంరక్షించిరి.*

ఇట్లు ప్రాచీన కావ్యముద్రణము వలననేగాక, ప్రాచీనకవులతో తులతూగదగిన మహాకవు లీ యుగమున నున్నారు. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, ఓగిరాల జగన్నాథకవి, అభినవ పండితరాయ మాడభూషి వెంకటాచార్యుడు, ఇవటూరి సూర్యప్రకాశ కవి, మండపాక పార్వతీశ్వరశాస్త్రి, ప్రస్తుత గ్రంథకర్త గోపీనాథ వెంకటకవి ఈ యుగములో వారే. పై వారిలో మండపాక, గోపీనాథ కవులు ఇద్దఱును రెండు శృంగములు. ఒకరు మాలికాకవిత్వశాఖకు సృష్టికర్తలై అభినవాంధ్ర కవితాపితామహులని ప్రఖ్యాతిగన్నవారు— ఇంకొకరు—కవిత్రయ, శ్రీనాథ, ప్రబంధయుగ కవితలను జీర్ణించుకొని, నవ్యయుగమున ప్రాచీన కవితాసంప్రదాయమునకు యుగప్రతినిధిగా

---

* పీఠికాకర్త "విజయనగరసంస్థానము — సాహిత్యపోషణ" అను గ్రంథమును ఈ తలంపుననే రచించియున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయమున ప్రొఫెసరు డాక్టరు తోమాటి దోణప్ప "స్వదేశ సంస్థానములు — సాహిత్యపోషణ" అను పేర నీ విషయమై యొక యుద్గ్రంథమును రచించి యున్నారు.

నిల్చిన అపరపోతన గోపీనాథ వెంకటకవి. వీరిరువురను గూర్చి కూలంకషమైన పరిశీలన జరిగినచో నీ యుగము క్షీణయుగముగాక, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నభినవోన్మేషమైన మహాయుగమని నిర్వివాదముగా నిశ్చితమగును.

## ప్రాచీనత – నవీనత

### యుగసమన్వయము

ఈ యుగమున ప్రాచీన, నవీనకవితా సంస్కారవాహినులు రెండును, నొకే కాలమున గంగాయమునలవలె ప్రవహించినవి. ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున నిట్టిపన్నివేశము మరియొకకాలమున కన్పట్టదు. ఆంగ్లేయులు పరిపాలకులగుటచేతను, ఆంగ్లభాష నిత్యజీవితమునకావశ్యమగుటచేతను, నవ్యసంస్కారమునకే దేశము మొగ్గు చూపినది. దీనివలన ప్రాచీన సాహిత్యమునకు క్రమముగా నాదరము తగ్గును. అధికారరీత్యా నవ్యతకే ప్రాభవముగలిగి ప్రాచీనతకొంతకాలమునకు విస్మృతమగును ఇంతకు మన భాషాసాహిత్యసౌధమునకు పునాది ప్రాచీన సాహిత్యమే. ఆ పునాదిపైని నిర్మాణముకాని నవ్యసాహిత్యమునకు శాశ్వతస్థానము గలుగదు. ఈ నవ్యయుగమునముందు ప్రాచీన సాహిత్యమునకు గలుగబోవుముప్పును గ్రహించిన దూరదర్శులు – చిన్నయసూరి, కొక్కొండ. వీరే, నూరేండ్లకు పూర్వము, రాబోవు హానిని గుర్తించి నవ్యసంస్కారమును, ప్రాచీన పథకముతో సమన్వయించి, దిద్ది తీర్చిన ధీనిధులు. చిన్నయసూరి, కొక్కొండ–సంస్కృత భాషలో నుద్దండపండితులు – ప్రాచీనాంధ్రభాషా సాహిత్యమును మథించినవారు. నవ్యసంస్కారమున కాధారమైన యాంగ్లభాషను చక్కగా చదివినవారు. ప్రాచీన సంప్రదాయజ్ఞులైన కవి, పండితులు సంస్థానముల నాశ్రయింపగా, వీరు సమన్వయ సాధనకొఱకు, ఆంగ్ల ప్రభుత్వమువారి రాజధానీ కళాశాలలో పండితులై, తెలుగున మొదట చెప్పిన నవ్యసాహిత్యప్రక్రియలన్నింటిని ప్రాచీనరీతిని అనగా గ్రాంధిక భాషా పద్ధతిపై ప్రచారములోనికి దెచ్చిరి. నవ్యత మూలమున గలిగిన ముద్రణాది సౌకర్యముల నన్నింటిని, పూర్తిగా వినియోగించుకొని ప్రాచీన, నవీన, సాహిత్యపథక సమన్వయమును ప్రతిపాదించి స్థిరపఱచిరి. దీనివలన మన ప్రాచీనత నిలిచినది. నవ్య సంస్కారము సముచితరీతిని, సాహిత్యమున సమస్థానమందినది. ప్రాచీన కవితా

సంప్రదాయములను, వేంకటకవి సంస్థానమూలముగా ప్రచారము చేయగా, మండపాక పార్వతీశ్వరశాస్త్రి పత్రికల మూలముగా వ్యాప్తిచేసియున్నాడు.

క్రీ. శ. 1900 వఱకును చిన్నయసూరి కొక్కొండ సమన్వయ పథకమే వాఙ్మయ ప్రపంచమున వ్యాప్తమైనది. ప్రాచీన సాహిత్య ప్రాధాన్యము, నవ్య సంస్కారప్రాముఖ్యము, సమగతిని నడిచినవి. కాని క్రీ. శ. 1900 తరువాత ఇరువదవ శతాబ్దిని వీరేశలింగము తనకు ముందుగల సమన్వయ పథకము విస్మరించి నవ్యతనే ప్రతిపాదించి, నవ్యసాహిత్యప్రక్రియలను, నవ్యసాహిత్యమును సులభము చేయు పద్ధతులలో గ్రంథరచన గావించినాడు. అందువలన ప్రాచీనసాహిత్య పఠనాభినివేశము తగ్గినది. వీరేశలింగ సౌలభ్యపథకము, తెనుగుభాషకు జీవాతువైన సంస్కృతభాషను దూరముచేసినది. సంస్కృతభాషతో అవినాభావ సంబంధముగల ప్రాచీన సాహిత్య పరిశ్రమకు అస్కారము లేకపోయినది. నవ్యసాహిత్య చరిత్రకారులెవ్వరును, ఇంతవరకు, ఈ విషయమును గ్రహింపలేదు. వీరేశలింగ నవ్యతమూలమున, ప్రాచీన సాహిత్యముమాట అటులుండగా, నవ్యయుగమున ప్రాచీన సంప్రదాయానుసారులైన మహాకవుల కావ్యములు, వాని విమర్శలుకూడ విస్మృతప్రాయమైనవి. ఈ హేతువుచేతనే-నవ్యయుగమున ప్రాచీన సంప్రదాయ ప్రవర్తకులగు మండపాక,గోపినాథకవుల కావ్య విమర్శన యింతవఱకు వాఙ్మయ ప్రపంచమున నవతరింపనేలేదు[1]

ఈ సందర్భమున మఱియొక విషయము. ఈనాడు మనము గద్యపద్య రచనలు చేయువారందఱిని, సామాన్యముగా 'రచయితలు'

---

1. నేడు దేశములో వ్యాప్తమైన "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" అను గ్రంథమున. గోపినాథము వెంకటకవిని గూర్చి లేనేలేదు. దానికంటె శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి "ఆంధ్ర రచయితలు" అన్న గ్రంథములో గోపినాథము వెంకటకవినిగూర్చి లేకపోవుట చిత్రముగా నున్నది.

అని వ్యవహరించు చున్నాము. ఇది వచన రచయితలకు సరిపో వచ్చునుగాని పద్యరచయితలగు కవుల కెంతమాత్రమును సరిపోదు. దానివలన 'కవి' అను పదముయొక్క మహోజ్జ్వలార్థము, విస్మృత మైనది. భగవంతుడు, ధర్మము, సత్యము, నీతి, మొదలగువానివలె 'కవి' పదము మార్చరానిది.[1]

## గణన—గుణము

ఈ యుగపు కవులతో నింకొక విశేషమున్నది. అది సంఖ్యా పరిగణ ననుసరించి పద్యరచన చేయుట. ఈ దృష్ట్యా గోపినాథ వెంకటకవి ఈ యుగ కవులలో ప్రధాను డగుచున్నాడు. ప్రాచీన కవులలో తిక్కనయొక్కడే అందరికన్నా హెచ్చు కవితారచన చేసిన వాడు. అతని రచనలో 15600 గద్యపద్యము లున్నవి అంతటి కవితా సృష్టిచేసిన కారణముచేత నే ఎఱ్ఱన "తనుకావించిన సృష్టి తక్కొ్కరులచేతం గాదు" అని తిక్కనను ప్రశంసించినాడు. శ్రీనాథుడు "కాంచన గర్భతుల్యు" డన్నాడు—తక్కినవారు, ఎఱ్ఱన. పోతనలు—ఎఱ్ఱన లభ్య కృతులలో 7000 లకు పైగా గలవు. అలభ్యమగు రామాయణము నం దెన్నియున్నవో! అందు కనీసపక్షము మూడువేలున్ననూ, పది వేలకు పైగా రచన చేసినవా డెఱ్ఱన—పోతన రచనలో 9000 గలవు.

ప్రబంధ యుగమునన, సంఖ్యాగణన చేయుట కనువైన రచనలు జరుగ నేలేదు. ఇక సంఖ్యాగణనము ప్రధానముగా దీసికొనిన, నవ్య యుగమగు 19, 20 శతాబ్దములు ప్రత్యేకస్థానము నాక్రమించును. 19 వ శతాబ్ది కవులలో ప్రాచీన కవులనుమించి, 20,000 గద్యపద్య ములకు పైని వ్రాసిన కవి వెంకటకవి యొక్కడే.[2] ప్రాచీన కవితా సంప్రదాయానుసారముగా రచించినది, ఆయన యొక్కడే.

---

1. ఇందుననే నా వాఙ్మయ చరిత్రకు "తెలుగు కవుల చరిత్ర" అని పేరు పెట్టితిని.

2. ఈ విషయమై అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక (సంపు 7, సం. 8 మార్చి 1894) లో నిట్లు గలదు—ఆ పత్రికలో కొక్కొండవారి

20 వ శతాబ్దిని శ్రీపాద, జనమంచి వీరిద్దరును 20,000 చంపువులకు పైగా వ్రాసినవారే. జనమంచి, సంఖ్యా పరిగణమే చూచిన తెలుగుకవుల నందఱను మించును. ఆయనకృతులలో దాదాపు నలువది వేల గద్యపద్యము లున్నవి. కేవల సంఖ్యా పరిగణమేగాక గుణమును ప్రధానము. "కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః" అనునట్లు గణనచేతనేకాక *గుణము* చేత వేంకటకవి యందఱిని నవ్యయుగమున మించినవాడు. ఏలననగా, తదితర కవులెవ్వరియందు గన్పట్టని, ప్రాచీనసాహిత్య సంప్రదాయానుసరణము, ప్రాచీనకవ్యనుభావ్యత, వృత్తౌచిత్యము, రసభావపదసంపద, రచనా సౌందర్యము వేంకటకవి రచనలో మూర్తిభవించినవి. అట్టి మహాకవి జీవితవిశేషములు చదువుదము.

## జీవిత విశేషములు

"మహాకవుల అవతరణానికి దేశకాల వివక్షతలేదు. ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో, ఆధునికయుగంలో జన్మించిన అట్టి మహాకవి వేంకటకవి. వేంకటకవి పేరు చెప్పగనే 'గోపినాథ రామాయణం' వెంటనే గుర్తుకు వస్తుంది. రామాయణ పౌరాణికు లెవరి నడిగినా "ఆదిని భాస్కరరామాయణం, అద్యతనంలో గోపినాథ రామాయణం' అని అంటారు. కవితారసికులైన వారందరూ "వెంకటకవిగారా? పోతన అపరావతారమండీ!" అని ఐక్యకంఠముతో పేర్కొంటారు

---

విశ్వేశ్వరీయము విమర్శితమైనది.-అందు "ఇక్కాలమున నాంధ్ర నిర్వచన గ్రంథములలో 3652 పద్యములు వ్రాసినవారు పీరు తప్ప మఱియొక రున్నట్లు వినలేదు—ఇట్టి పాపిష్టపుఁగాలమందు మఱియొక కవికుంజరుడు 20,000 (ఇరవైవేల) పద్యములుగల చంపుపులు వ్రాసియున్నాడు. అక్కవిశార్దూలుని చిత్రచరిత్రమును మా పత్రికయందు త్వరలో జూడగలరు" ఇందు పేర్కొన్న "కవికుంజరుడు" గోపినాథము వెంకటకవియే. వారి చరిత్రము కాదుగదా! ఎంతోమంది కవిపండితుల మరణవృత్తాంతములు తెల్పిన పత్రిక వేంకటకవి మరణించినపు డొక్కమాటయైన వ్రాయలేదు—దీనికి కారణము "బిందుపూర్వక 'టత-'వర్గయతులు" అన్నశీర్షిక చూడుడు.

## బాల్య దశ

అట్టి వేంకటకవి నెల్లూరు జిల్లా కావలి తాలుకా లక్ష్మీపుర గ్రామంలో లక్ష్మిదేవి పద్మనాభభట్టు దంపతులకు క్రీ. శ. 1820 ప్రాంత మున జన్మించాడు. ఈ లక్ష్మీపురం వేంకటకవికి చాలా తరాలు పూర్వులైన పద్మనాభ భట్టు అప్పటి రాజులవల్ల క్రీ.శ. 1645 ప్రాంతా లలో అగ్రహారంగా స్వీకరించాడు.[1]

---

1. "శాలివాహనశకం 1523 రాక్షసనామ సంవత్సరం, మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రి పుణ్యకాలమందు లక్ష్మీపురం అగ్ర హారం హాజినాలకు అద్వైకల అంతి అంతాజీవంతులు హాల్లాయితీగారి అనుజ్ఞను ముత్తరాజు వేంకటకృష్ణయ్య దస్తూరీ కరణీ యిజారా దారుగా వ్రాయించి యిచ్చిన భూధాన ధర్మశాసన పత్రికే. ఉదయగిరి దుర్గాన్‌నకు ప్రతినామమై సహగదుడు గాక నీకు చెల్లు దుత్తలూరు సముతులో లక్ష్మీపురం అగ్రహారం చాలాకాదు ఆరూపకం అయి వుండగా యిప్పుడు 12 వరహాలకు సోత్రియం చేసి యిస్తిమి కనుక యిది మామూలు చేసికొని అనుభవించుకొని సుఖాన ఉండుకొనేది. ఇట నీమారాజీనయిన వ్రాయించి యిచ్చిన భూదానధర్మశాసనపత్రిక.

వేంకటకృష్ణయ్యవ్రాలు

వృత్తిభేదాలు—చెరుకూరి శీతారామభొట్లువృత్తి—1, కస్తూరి భొట్లువృత్తి—1, మూలా రాఘవభొట్లువృత్తి—1, గోపినాథభొట్లు పద్మనాభభొట్లువృత్తి—1, హరిభొట్లుగారివృత్తి—1; గొడ్లదొన మల్లమ రాజువృత్తి—1, 6 వృత్తులుచేసి సహిరణ్యోదక దానధారపూర్వక ముగా యిస్తిమి కమక మీ పుత్రపౌత్ర పారంపర్యం అందులకుకలిగిన అష్టభోగములతో అనుభవించుకొని సుఖానఉండుకొనేది."

ఇందు 1528 సంఖ్యలో ప్రతివ్రాయునపుడు పొరపాటుపడి యుండునని భావింపబడుచున్నది. ఈ శాసన పత్రిక Munsiff Court కావలియందు Original No. 658 of 1912 defence O.S. 490/14 తగాదాలో కోర్టు వారిచే అంగీకరించడమైనది (Admitted in Evidence.)

పువ్వుపుట్టగనే పరిమళించిన దన్నట్లు వేంకటకవి బాల్యమునుండి భక్తిపరుడై యుండేవాడు. పదహారేండ్ల ప్రాయములో ఒక పర్యాయం ఆ మండలంలో వేదాద్రి నరసింహస్వామి కళ్యాణ మహోత్సవానికి వెళ్ళి, ఆ స్వామిని దర్శించాడు. అక్కడ ఒక మహాయోగి కరుణవల్ల వేంకటకవికి విద్య అలవడింది. దానితో అఖండమైన కవితాశక్తి అవతరించింది. భగవత్ప్రీతిగా ఏదైనా కావ్యంరచించే సంకల్పంతో నుండగా స్వప్నంలో శ్రీకృష్ణుడు కనబడి "మదీయ దివ్యావతార చరిత్ర ములలో నీకభీష్టమెయ్యది,దాని మదంకితంబుగా నాంధ్రభాష వచింపు" మని యుపదేశము నిచ్చాడు.

వేంకటకవి వెంటనే గంటంపట్టి

మ॥ జననంబాదిగ రామపాదయుగళీసంసక్తచిత్తుండనై
జనితోత్సాహమునం దదీయకరుణాసంలబ్ధనానాకళా
ఖనినై తద్గుణవైభవప్రచురమై కన్పట్టు రామాయణం
బనువొంద న్విరచింతుఁ బ్రౌఢకవితావ్యాపార మేపారగన్
(గో. రా. పీఠిక—53)

అని ప్రతిజ్ఞ చేసి, వాల్మీకి రామాయణ షట్కాండలు రమణీయంగా పన్నెండువేల పద్యాలలో వ్రాసి శ్రీకృష్ణునికే సమర్పించాడు.

ఇలాఉండగా, ఆకాలంలో వేంకటగిరి సంస్థానాధిపతులైన సర్వజ్ఞకుమారయాచేంద్రు లొకనాడు తమగోష్ఠిలో "తెలుగులో భాస్కరాది రామాయణాలున్నా అవి మూలానుసారంగా లేవు. అంతేకాక, అవి మానవాంకితాలు. అన్యూనాతిరిక్తంగా ఆంధ్రభాషలో రామాయణాన్ని రచింపగల కవి ఉన్నాడా?" అని ప్రశ్నించారు. సభాసదులు అట్టి రామాయణమొకటి క్రొత్తగావెలసిన దని విన్నవించారు. రాజుగారు వేంకటకవిని తమ సమక్షమున కాహ్వానించారు. వేంకటకవి తమరామాయణ గ్రంథాన్ని 13—8—1853న సమర్పించాడు. అక్కడ

పండితులంతా దాన్ని అమూలాగ్రంగా పరిశోధించి వాల్మీకిచే ప్రతిపాదితమైన రామాయణార్ధం ఇంతవిశదంగా, మనోహరంగా చెప్పినది, మరొకటి లేదని వ్యక్తపరిచారు. స్వయంగా సర్వజ్ఞ కుమారయాచేంద్రులు విద్వత్తుగలవారు. కాబట్టి తాముకూడా పరిశీలించి మార్కెళ్లసీమలో పెరుగుపల్లి అనే అగ్రహారమిచ్చి ఆయనను సన్మానించి తమ ఆస్థానకవిగా ఎన్నికచేశారు వేంకటకవి స్వగ్రామము చేరుకున్నాడు.

## శ్రీకృష్ణజన్మఖండము

వేంకటకవికి రామాయణమూలంగా లభ్యమైన సన్మానాలకు ఆస్థానకవి నియామకానికి, అక్కడి కవులంతా అసూయపడ్డారు. ఒకనాడు. రాజుగారితో "మహాప్రభూ! వేంకటకవి రామాయణాన్ని తమసన్నిధిలో వినిపించినా, ఆగ్రంథం యిక్కడ వ్రాసినది కాదు. ఎక్కడో మారుమూలగానున్న లక్ష్మీపురంలో వ్రాసినది. ఇక, అక్కడైనా ఆయనస్వయంగా వ్రాసినాడో లేక యితరులచేత వ్రాయించి తన పేరు దానికి పెట్టుకున్నాడేమో అన్నసందేహం మమ్ము బాధిస్తున్నది'' అని విన్నవించారు. ఇంగితజ్ఞులైన రాజుగారు వెంకటకవిని తడణమే రమ్మని కబురుచేశారు. ఆయన రాగానే రాజుగారు బ్రహ్మవైవర్త పురాణంలోని "శ్రీకృష్ణజన్మఖండము" తెలుగు చేయించవలెనని కుతూహలంగా ఉన్నది కాబట్టి ఆగ్రంథంప్రారంభం కావాలని చెప్పారు. వేంకటకవికి పరిస్థితులవగాహనమైనవి.

రాజుగారు వేంకటకవికి వెంకటగిరిలో ఆయన వచ్చినప్పుడుండ డానికి ఒకబస యేర్పాటు చేసారు. కాని, వేంకటకవి రాజుగారి కోటకు దూరంగా ఉన్న ఆబసలో వ్రాయుట కంగీకరింప లేదు. తన కవితాశక్తిని పరీక్షించడానికి పండితులెత్తిన ఎత్తని గ్రహించి. రాజుగారి కోటలోనే గ్రంథం వ్రాస్తానని లేఖకుల నిమ్మని కోరాడు ఏర్పాట్లన్ని జరిగినవి. లేఖకుడు వ్రాస్తుండగా, మూలాన్ని దగ్గర పెట్టుకొని వేంకటకవి,

ఉ. కీర్తియు భోగసంపదలు కేవల మోక్షమొసంగు రామునిన్
భర్తనుజేసి వ్యాసముని భావితమై దనరారు బ్రహ్మవై
వర్తపురాణమందు దెలుపంబడు శ్రీహరిజన్మఖండమిం
గార్తిక కౌముదీరుచిర కావ్యముగా నొనరింప బూనితిన్
(కృ జ.20)

అని దాదాపు 6000 శ్లోకాలుగల మూలాన్ని 4500 గద్యపద్యములుగా నవరసభరితముగా తెలుగుచేసి, మూడు నెలల లోపుగా ముగించాడు. రాజుగారితోసహా అందరూ ఆయన కవితా ప్రతిభ కాశ్చర్యపడ్డారు. రాజుగారు (వేయార్లు) 6000 రూ॥ సింహ లలాటపుతోడాలుకాక రాధాకృష్ణపురము అనే అగ్రహారంలో పన్నెండో భాగము యిచ్చి వేంకటకవిగారిని, అల్లసాని పెద్దనవలె— ఏనుగుపై నెక్కించి వైభవముగా నూరేగింప జేసినారు. ఈవిషయము జగద్వి ఖ్యాత శతావధానులైన తిరుపతి వేంకటకవులు వెంకటగిరి సంస్థానము నకు పంపిన రెండవ అర్జీలో నిట్లు తెలుపబడినది.

సీ. ఏరాజు కవిరాజు నేనుంగు నెక్కించి
యూరేగఁజేసె నీయూరియందు[1]
నేరాజు కవిరాజుచే రాజితశతావ
ధానంబు చేయించి పూనెఁ గీర్తి
నేరాజు వేదాంతసారబోధక సుప్ర
బంధముల్ రచియించి వన్నెకెక్కె
నేరాజు సర్వవిద్యాకారా జటంచును
గవులచే సన్నుతిఁగాంచిమించె
గీ. నట్టి విద్వత్కుమారభూపాగ్రగణ్య
పూర్వకృతపుణ్యరాశి యోముద్దుకృష్ణ!
స్వాగతంబుగ దర్శనం బీగదయ్యె
ఘనతఁదిరుపతి వేంకటకవుల కిపుడు[2]

---

1. ఈవిషయమింతకుముందే ప్రకాశకుని విన్నపమునందు సూచనగా తెలుపబడినది.

2. చూ. నానారాజసందర్శనము పూర్వార్ధము 29 వ పద్యము.

పై పద్యమున పేర్కొనబడిన విద్వత్కుమారభూపతియే-వేంకటకవిగారిని గౌరవించిన సర్వజ్ఞకుమారయాచేంద్రులు— వారొనర్చిన కవిపోషణ, వారివైదుష్యము పైన తెలుపబడినవి.

1. కవిరాజు నేనుగు నెక్కించుట— ఇది వెంకటకవిగారికి సంబంధించిన దని ముందు తెలిపితిని.

2. శతావధానము చేయించుట-తిరుపతి వేంకటకవుల కంటె ముందు తెలుగుదేశమున శతావధానములుచేసి స్థిర కీర్తి నార్జించిన అభినవపండితరాయ మాడభూషి వేంకటాచార్యులవారిచేత సర్వజ్ఞకుమారయాచేంద్రులు శతావధానము చేయించి ఘనముగా సన్మానించినారు.

3. సర్వజ్ఞకుమారయాచేంద్రులు తెలుగున చక్కని వేదాంత వచనగ్రంథములు రచించియున్నారు. వానిలో గీతార్థసారసంగ్రహాము వేంకటకవీంద్రులు బ్రహ్మానందశతకమున సంభోగశృంగారమును ప్రవచించిరన్న అపప్రథను పోగొట్టుటకై వ్రాసిరి. ఇంకను నాస్తికధ్వాంత భాస్కరము మనస్స్వాతంత్ర్యము మున్నగు వచనగ్రంథములు వ్రాసిరి.

4. ఆ కాలమునందు సంస్థానాధిపతులలో విద్వాంసుడని ప్రసిద్ధి కెక్కిన రాజు సర్వజ్ఞకుమారయాచేంద్రుడే. కాబట్టియే ఆయనను విద్వత్కుమారయాచేంద్రుడన్న బిరుదము సార్థకమైనది.

తనరామాయణాన్ని శ్రీకృష్ణుని కంకితమిచ్చిన వేంకటకవి శ్రీకృష్ణజన్మఖండాన్ని శ్రీరాముని కంకితమిస్తూ తన రామకృష్ణ భక్తినిట్లు సమర్థించాడు.

తే.గీ. పరగ రామకథాప్రతిపాదిత మగు
కృతికి కృష్ణుండె శ్రీకృష్ణకృతికి నార
ఘూత్తముడె భర్తయగుటకు నొప్పుగా
యన్యు డధినాయకుండౌట కర్హు డగునె? (కృ.జ.)

ఈరోజులోనే అనగా 1880లో రాజుగారి కోరిక పైన శ్రీకృష్ణ ప్రోక్తమైన భగవద్గీతను బ్రహ్మానందశతకము పద్యకావ్యంగా రచించాడు.

అప్పటికి రెండు దశాబ్దాలు గడిచినా కవి పండితులలో వేంకటకవిని గూర్చిన అంతశ్శైత్యాలు అంతరించలేదు. వేంకటకవిని గౌరవించిన సర్వజ్ఞకుమారులు పదవి చాలించగా, వారి కుమారులు రాజగోపాలకృష్ణయాచేంద్రులు రాజ్యము చేయుచున్నారు. అప్పుడు పండితులు మళ్లీ యిలా విన్నవించారు "సంస్కృతంలో బహుసులభంగా ఉండేకావ్యాలు, పురాణాలు అనువదించడంలో ప్రతిభ ఏమున్నది? "మాఘేమేఘే గతంవయః" అని మల్లినాథుడు చెప్పుకొన్న మాఘ కావ్యం శిశుపాలవధ తెలుగు చేసినట్లయితే వేంకటకవిగారి పస బయట పడుతుంది"[1]

రాజుగారు వేంకటకవికి "శిశుపాలవధ" తెలుగు అనువాదము స్వల్పవ్యవధిలో కావాలని నిర్ణయించారు. వేంకటకవి స్వగ్రామమందే మూలగ్రంథాన్ని మల్లినాథునివ్యాఖ్య దగ్గర పెట్టుకొని లేఖకునికి చెబుతూ 20 సర్గల మహాకావ్యాన్ని 1318 గద్యపద్యాల తెలుగు కావ్యంగా రచించి గడువుకు ముందుగానే రాజుగారికి సమర్పించాడు.

అసలు మాఘాన్ని అనువదించటమే అందరకు సాధ్యంకాని పని ఆ పైని నిదానంగా ఆలోచించి స్వయంగా తనంతటతాను వ్రాసుకో వలసిన మహాకావ్య మది. అట్టి పరిస్థితులలో వేంకటకవి ఇతరులు వ్రాస్తుండగ దానిని మూలానుగుణ్యంగా తెలుగు చేశాడంటే అది దుర్ఘటకార్యమనే చెప్పాలి. ఈ అనువాదమూలంగా వేంకటకవి కీర్తి విశ్వవ్యాప్తమైంది. ఈ శిశుపాలవధను మదరాసు విశ్వవిద్యాలయం వారు పఠనీయగ్రంథంగా నిర్ణయించారు. రాజుగారా గ్రంథాన్ని క్రి శ. 1887లో ముద్రించి తెలుగు విద్యార్థు లందరికి ఉచితముగా అందించారు.

---

1. ఈవిషయము నెల్లూరు పురవాస్తవ్యులు శ్రీ చదలవాడ జయరామ శాస్త్రిగారు తమచిన్నతనంలో పెద్దలు చెప్పుకొనగావిన్నట్లుతెలిపారు

వేంకటకవికి ముందు 'పోచిరాజువీరన్న' అనేకవి శిశుపాలవధను ఆంధ్రీకరించాడు. ఆసంగతి వేంకటకవికి తెలియదు. ఈనాడు దానికి ఒక పద్యానువాదము, ఒక వచనానువాదము వెలువడినవి. వీటిలో గోపీనాథకవిదే గుణవత్తరమని కోవిదుల యభిప్రాయము.

## పోతన—వేంకటకవి

గోపీనాథరామాయణం చదువుతున్నప్పుడు పోతన మనకు ప్రతి ఘట్టంలోను ప్రత్యక్షమవుతాడు. ఇది వాఙ్మయచరిత్రలోను ఒక అపూర్వసంఘటన.

పోతన, వేంకటకవి యిద్దరూ బ్రాహ్మణులు, ఆపస్తంభ సూత్రులు, కౌండిన్యసగోత్రులు, బాల్యము నుండిభక్తులై ఒకయోగి దర్శనం వల్ల సహజపాండిత్యకవితాసంపన్నులైనారు కృష్ణభక్తి ప్రతిపాదితమైన పోతనభాగవతం శ్రీరామునికంకితమైతే, వేంకటకవి రామాయణం కృష్ణాంకితము. పోతన రచనల కుద్దీగా వేంకటకవి రచనలుచేశాడు. పోతన నారాయణ శతకానికి ప్రతిగా వేంకటకవి మారుతీ శతకము[1]న్నది, భోగినీదండకానికి పోలుపుగా తిరునాళ్ళ దండకము[2]న్నది వీటి నన్నింటిని మించినది రాజపోషణ.

## రాజపోషణ

వేంకటకవిని గౌరవించిన సర్వజ్ఞకుమార యాచేంద్రులకు సరిగ్గా ఇరవైతరాలకు పూర్వుడైన సర్వజ్ఞసింగమహీపాలుడు పోతన భాగవతము తనకు కృతినీయలేదన్న ఈర్ష్యచేత ఆ భాగవతాన్ని పాతి పెట్టించిన కథ కూచిమంచి తిమ్మకవి గ్రంథస్థం చేశాడు. ఆవిషయం వేంకటగిరిరాజుల చరిత్రలో ఒకకళంకముగా నిలిచి పోయినది. సర్వజ్ఞసింగభూపాలుడు పోతనను బాధలుపెట్టినన్న విషయం కూడా వంశంలో అనుశ్రుతంగా నిలిచిపోయినది. తమయశస్సుకు మచ్చగా

1, 2 మరికొన్ని లఘుకృతులు పరిశోధన విద్యార్థి శ్రీకాళిదాసు పురుషోత్తం వలన వెల్లడింపబడినవి.

ఉన్న ఈఅపప్రథ పూర్తిగా మాయము చేయడానికి పోతనను బాధించిన అసర్వజ్ఞసింగమహీపాలుడు—ఇరవైతరాల తరువాత ఈ సర్వజ్ఞకుమారయాచేంద్రుడై జన్మించి వేంకటకవి స్వరూపంతో తిరిగి తనకాలంలో విలసిల్లిన పోతనను గౌరవించి తనవంశాన్ని నిష్కళంకం చేసి ధన్యుడైనట్లు ప్రాజ్ఞవిద్వల్లోకము భావింపవచ్చును.

బాల్యంలో పోతన వీరభద్రవిజయం వ్రాస్తే పరిణత వయస్కుడై వేంకటకవి రాధికాపరిణయ మనే ప్రౌఢరసవత్ప్రబంధాన్ని రచించాడు.

శిశుపాలవధను రాజగోపాలకృష్ణయాచేంద్రులవారి కంకితము. రాధికాపరిణయము వారిబావమరది చెలికాని గోపాలరావు కంకితము. ఈవిధంగా రాజులకు కృతులిచ్చినా, పోతనవలె నరస్తుతివిముఖుడు

చ. నృపతుల వేడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతివాజిగ
ణపటధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపులకృపాపయోధి యదువీరుని వేడినఁ బ్రీతినిచ్చు ని
త్యపదము నట్టివానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్
(గో. రా. పీఠిక—17)

చ. వృజిన మటంచుఁజిత్తమున నించుకచూడక కావ్యకన్యకన్
కుజనులకిచ్చి నిందితపుఁగూడు భుజించెడి వాని కుర్విలో
సుజనత గల్గునే బుధులు చూచి గణింతురె వానిపాండితిన్
నిజముగవాఁడు పాత్రమగునే మధువైరిప్రసాదదృష్టికిన్
(శ్రీకృష్ణజన్మఖండము—అవతారిక

క. చెప్పితి శ్రీహరిచరితము
చెప్పగవలె నొండుగాథ చెప్పిననోటన్
దుప్పరలు రాలినట్లగు
గొప్పగు నమృతంపుసోన కురియదె చెపుడీ (రాధిపరిణయము

పై మూడును— "ఇమ్మనుజేశ్వరాధములు....", "బాలరసాల సాల....", "పలికెడిది భాగవతమట". అనుపోతన పద్యాలకు ప్రతిబింబాలు.

## విమర్శకుల శంక—సమాధానము

ఒకవైపు వేంకటకవి, పోతన అపరావతార మని వర్ణిస్తూ, మరోవైపు వేంకటకవి రాజులకు కావ్యాంకితము చేశాడని చెప్పడం పరస్పరవిరుద్ధంగా వున్నదని విమర్శకులు శంకింపవచ్చును. పోతన, వేంకటకవి జీవితాలను, చరిత్రలను లోతుగా పరిశీలించిన వారికి అట్టి శంకల కవకాశమే లేదు.

పోతన భోగినీదండకాన్ని సర్వజ్ఞసింగభూపాలునికి కృతి యిచ్చిన తరువాతనే అతనికి రాజులకు కృతినీయకూడదని సంకల్పము కలిగినది. సహజంగా ఐహికేచ్ఛావిముఖుడైన పోతన జీవితంలో భోగినీదండక రచన తాత్కాలిక సన్నివేశము మాత్రమే. పోతన మూర్తి ఆపాదమస్తకము భక్తిస్వరూపమే.

వేంకటకవి భక్తిప్రమత్తులు పోతన వరవడిలో నడచినవే, తాను ఐహికంగా, ఆనాడు తెలుగుదేశంలో ఇతరకవు లెవ్వరూ పొందని గౌరవాల్నను అపారధనసంపదను రాజులవల్ల అతను పొందినమాట వాస్తవమే, అయినను ఆయన తామరాకుపై నీటిబొట్టు వలె నిర్లేపుడై వానిని గ్రహించాడు. రాజులసొమ్ము శ్రీరామార్పితం కావాలని ఆయన దీక్ష. పారమార్థికచింతయే తప్ప వేరర్థచింత లేని వేంకటకవి లక్ష్మీపురానికి సమీపముగానున్న రామాలయానికి అయిదెకరాల భూమిని, కొల్లపూడి కోదండరామస్వామి దేవాలయానికి పదిహేను ఎకరాలభూమిని దానంచేశాడు. తటాకాలు త్రవ్వించాడు. నేటికి లక్ష్మీపురగ్రామంలో ముఖ్యజలాధారమైన చెరువును వెంకయ్య చెరువని చెప్పుకుంటారు.

ఇట్లు దానాదికములు చేయడమే కాదు, శ్రీరామనవమి, శ్రీకృష్ణాష్టమీ పుణ్యదినాలలో మహావైభవంగా పూజలు, ఉత్సవాలు జరిపించేవాడు. వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ సమయాల్లో, చుట్టుపక్కలనుండి వందలాది జనులువచ్చినపుడు సంతర్పణలు, సమారాధనలు, చేయించేవాడు,

ఇంటివద్ద ప్రతినిత్యము రామసహస్రనామపారాయణ, పురాణ పఠన, భజనలు జరుగుతునే ఉండేవి. వెంకయ్య[1]గారిల్లు విడువరాని మహాసత్రంగా పరిణమించినది. భక్తునికి భౌతికవాసన యుండదు. భక్తిరసమగ్నుడై వేంకటకవి తానార్జించిన అగ్రహారాలు, ధనము సమస్తము శ్రీరామసేవకై వినియోగించాడు. అంతఆస్తిని శ్రీరామునికై ం కర్యములో హారతి కర్పూరమువలె లీనమైనది.

ఇంత ఆర్జించి తుదకు తనసంతతివారి కీనాడు ఇల్లుకూడ లేకుండ నివేశస్థలం చూపునకు మాత్రమే మిగిల్చిన మహాభావతుండైన వేంకటకవి రాజులకు కృతులిచ్చినా పోతన అపరావతార మనడంలో సందేహ మణుమాత్రం లేదు కదా!

## బ్రహ్మానందశతకము

గోపినాథవేంకటకవి కృతులలో బ్రహ్మానందశతకాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పకతప్పదు. ఈశతకము శృంగారపరమైనదికావడము చేత దేశవ్యాప్తమైనది. ఇందులో సంభోగశృంగారమే విపులంగా ప్రతిపాదితమైన కారణంగా, దీనిని తక్కిన శృంగారరచనలవలె, విమర్శకులు చులకనగా పరిగణించారు వేంకటకవి జీవించి యుండగనే, ఇట్టి మహాభక్తుడు కేవలముగ్రామ్యాపర్మము వర్ణించినాడన్న అపప్రథ రాగా ఆశతకరచనను ప్రోత్సహించిన సర్వజ్ఞకుమార యాచేంద్రులు, లోకమునగల ఆ అపప్రథ రూపుమాపుటకై తాను రచించిన " గీతార్థసారసంగ్రహాము" న పీఠికయందు యిట్లుస్పష్టపరచి యున్నారు.

"మాయాస్థానకవీశ్వరులైన గోపినాథం వెంకయ్యశాస్త్రుల వారికి చక్కగాతెలియజేసి, వారివలన శృంగారరస ప్రధానమైన బ్రహ్మానందశతకమును సీసపద్యములుగ చెప్పించివారము. ఈ పద్యములలో నుండెడి భావ మిప్పటి జనులకు చక్కగా బోధపరచుకొను యోగ్యత లేకపోయినందున యాధ్యాత్మవిషయమైన ఈగీతార్థసార

1. 'వేంకయ్యశాస్త్రి' తల్లిదండ్రులు చేసిననామకరణం.

సంగ్రహ మనెడు గ్రంథమును పద్యరూపముగ జేయించక, సందరికి దెలియుటకు నింగ్లీషుగ్రంథముల రీతిగ, తెలుగుమాటలతో రచించుచున్నాను"

పైరాజుగారి మాటలను బట్టి ఈ శతకమున గంభీరమగు కృష్ణలీలాతత్త్వము ప్రతిపాదితమైయున్న దనుట నిశ్చితమగుచున్నది. తెలుగున కామశాస్త్రవాఙ్మయమున నింకను పరిశోధన ప్రారంభము కాలేదు. అయినచో నీశతకమున కందుప్రాధాన్యమున్నది.

పోతన జీవితంలో కనబడుతున్నట్లు దైవప్రత్యక్షాన్ని నిరూపించే ఘట్టాలు వేంకటకవిజీవితంలో ఉన్నవి. ఒకసారి వేంకటకవి నెవరో తిట్టారు. అకారణంగా తిట్టినతడు చనిపోయాడు. వాని బంధువులు వేంకటకవి శాతపడి మంత్రించగా చనిపోయాడని, వేంకటకవిని చంపడానికి దివిటిదొంగలను నియోగించారు. అప్పుడొక రెడ్డి అతనిని చంపకుండా రక్షించాడు. ఈకథ నిజమని చెప్పడానికి ఆరెడ్డిమనుమడు అల్లంపాటి పెదబోసిరెడ్డి జీవించియుండి, తనతాత చెప్పినవిషయం ధృవపరచడమే తార్కాణం.

వేంకటకవి మరణంకూడా విచిత్రమైనదే. అతని ఛాయాచిత్రము తీయప్రయత్నించిన రాజుగారికి 'చిత్రం తీస్తే ఆయువు క్షీణిస్తుందని నిరాకరించేవాడు. బలవంతంగా 7–6–1892న ఛాయాచిత్రం తీయడం మరునాడే అస్తమించడం చిత్రం.

## అద్యతన వాఙ్మయంలో స్థానం

ఈనాటివాఙ్మయచరిత్రలలో కెక్కకపోయినా, వేంకటకవికి అద్యతనాంధ్రవాఙ్మయంలో చాలా ఉన్నతస్థాన మున్నది. "ఏగతి రచించిరేని సమకాలమువారు మెచ్చ" రని విజయవిలాసకర్తసూక్తి. వేంకటకవి దీనికి అపవాదం. ఆయన సమకాలికులు, ఆంధ్రవాల్మీకి బిరుదాంకితులు వావిలికొలను సుబ్బారావుగారు (1863–1933) తమరామాయణంలో ప్రత్యేకంగా వేంకటకవి నిట్లు ప్రశంసించారు.

శా. శ్రీరామాయణ పూర్వభాగము రచించెన్ భక్తినాంధ్రంబుగా
ధీరుం డార్యజనాస్తవార్హుడును పృథ్వీదేవతాశ్రేష్ఠుడు
ర్వీరామాత్మభవేశభక్తుడగు గోపీనాథవేంకార్యు డా
సూరింగూర్చి నమస్కరించెదను సత్పూక్తిం బ్రశంసించుచున్

ఆంధ్ర కవితాప్రపంచంలో ఉత్పథంలో విహరించే కవి అనీ, ప్రాచీనసాంప్రదాయసిద్ధమైన కవిత్వరచన, వేంకటకవితో ఆశ్వాసాంతమైనదనీ విమర్శకులు ముక్తకంఠంతో విసుతించారు. దీనికి మకుటాయమానంగా కందుకూరివారు ఆంధ్రకవులచరిత్ర మూడో భాగానికి, వేంకటకవిచరిత్రతో భరతవాక్యం పలికారు.

జగద్విఖ్యాత శతావధానులగు తిరుపతివేంకటకవులు తెలంగాణాలోని ఆత్మకూరుసంస్థానమున అవధానము చేసినపుడు క్రీ.శ. 1897 సం॥న శ్రీరాజావారు శ్రీనివాస విలాసమును తెలుగు చేయుడని వారిని కోరగా, ఆసందర్భమున వారీక్రిందిపద్యమును చెప్పిరి.

సీ. భారతమ్ము తెలుంగు పఱప రాజనరేంద్ర
నృపతి నన్నయకవి కిచ్చినట్లు
రామాయణంబు నాంధ్రము సేయుమని మార
నృపతి భాస్కరకవి కిచ్చినట్లు
కాశిఖండము తెల్గుగావింపుమని వేమ
నృపతి శ్రీనాథుని కిచ్చినట్లు
మాఘమ్ము తెల్గుగామార్ప వేంకటగిరి
నృపతి వేంకటకవి కిచ్చినట్లు

తే. గీ. శ్రీనివాసవిలాస మాంధ్రీకరింప
సరసతిరుపతివేంకటేశ్వరుల కిప్పు
డానతిచ్చుట మిగుల భాగ్యమ్ముగాదె?
యాత్మకూరు పురీరాజ! యతులతేజ! 1

1. చూడుడు, నానారాజసందర్శనము పూర్వార్థము 186వ పద్యము.

పై పద్యమువలన గోపీనాథం వేంకటకవిగారు గతించిన 6 సం. లలోనే తిరుపతి వేంకటేశ్వరులవంటి మహాకవులు వారిని ప్రాచీనులైన నన్నయ, భాస్కర, శ్రీనాథులతో సమానస్కంధుడని స్పష్టముచేసిరి ఇదియును నవీనయుగమున ప్రాచీన కవితాప్రతిభా సంపత్తి సంప్రదాయము నిలిపిన వారిలో వేంకటకవి గారు కడపటి వారని నిర్వివాదముగా నిరూపించుచున్నది.

రామాయణము నేటికాలమున రచియించుచున్న శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు తమ గోవిందరామాయణంలో "లలితా మ్నాయ కథావిధానరచనాలావణ్య శ్రీభాస్కరున్ విలసత్ శబ్దసమ న్వయప్రథితు గోపీనాథునిన్ సత్కవిన్" అని వేంకటకవిని భక్తితో స్మరించారు."

—శిశుపాలవధ—

ప్రథమముద్రణమున వావిళ్లవా రుపయోగించిన వ్రాతప్రతి, వేంకటగిరి రాజాగారు పంపిన వ్రాతప్రతియే. అయినను నీద్వితీయ ముద్రణ సమయమున శ్రీ వేంకటగిరి రాజుగారు దయతో కవి వంశీయులైన శ్రీ గోపీనాథం శ్రీనివాసమూర్తిగారి కొసంగిన వ్రాతప్రతి సహాయమున పరిష్కరించుటకు వీలైనది. ఆవ్రాతప్రతికి ప్రథమ ముద్రణప్రతికి ఎంతవ్యత్యాసమున్నదో, విమర్శకులు గ్రహించుటకు, ఆభేదములలో వర్గమునకు రెండుచొప్పున ఉదాహరించుచున్నాడను. అవి నాలుగువిధములు.

1. పద్యములలోమార్పులు , 2. పాదములలోమార్పులు 3. పాదపంక్తులు లోపించినవి. 4 పాఠాంశములుగా ఒకే భావమును తెలుపునవి.

---

19 వ పుటలో జీవిత విశేషములు–అనుశీర్షిక మొదలు ఇంతవఱకు. ఆంధ్రప్రభ(19-10-'69)నుండి కొలది మార్పులతో నిందు చేర్చ బడినది. ఆంధ్ర ప్రభ పత్రికాధి పతులకు నా కృతజ్ఞత.

1. పదములలో మార్పులు

| పుట | పంక్తి | పూర్వముద్రణ | ప్రస్తుతముద్రణ |
|---|---|---|---|
| 24 | 6 | విశద | నిశిత |
| 25 | [illegible] | నిక్షిప్త | నిక్షేప |
| 74 | 6 | ల్సలిత[1] | ఖ్సలిత |
| 297 | 26 | ఖారు[2] | తండు |

2. పాదములలో మార్పులు

| పుట | పంక్తి | పూర్వముద్రణ | ప్రస్తుతముద్రణ |
|---|---|---|---|
| 211 | 15 | గృహాము లు | దవసితంబులు |
| | | జనంబు చేత | జనముచేదాట |
| | | లంఘింపబడియె | బడియె |
| 234 | 12 | బాలురుతోడుగ | బాలురగూడుక |
| | | చేనేయాగలన్ | తేనెటీగలన్ |

| పుట | పద్య గద్యసంఖ్య | పూర్వముద్రణ | ప్రస్తుతముద్రణ |
|---|---|---|---|
| 192 | 75 | మూడుమార్గం | మూడుమార్గంబుల |
| | | బులనేగె | జనుటచే గంగయు |
| | | దద్వాహిని | త్రిపథగాఖ్య ప్రసిద్ధి గాంచె ననేక మార్గంబులనేగె దద్వాహిని |
| 250 | 7 | గాక. రథసంబు | గాక. యదుపుంగవా శిశుపాలునిచేత ఘటనొందిన భవత్సంబంధి వికచోత్పలచారులోచ నంబునగు పసుర నవాసంబు నీయందలి బంధు సౌహృదయంబున ద్రావంబడు గాక. రథసంబు |

---

1,2 ఈపదముల మార్పులు వావిళ్ళవారు యతిస్థానమందు చేసి భంగపరచుట ఆశ్చర్యముగానున్నది.

**4. పాఠాంతరములుగా ఒకే భావమును తెలుపునవి**

| పుట | పద్యం | ముద్రితపాదము | పాఠాంతరము |
|---|---|---|---|
| 13 | 41 | దమి నగమ్యా గమనము సేయ కుండెనా ధనద పుత్రుడు తుల్యుం డనఁగవచ్చు | వెలయాలి కనికంబు విటుడు గాకుండెనా నలకూబరుడు జోడనంగ వచ్చు |
| 240 | 270 | కనకమయచారు కోటీరఘటితరమ్య | నిబిడకోటీరగతరత్న నికరకిరణ |

వ్రాతప్రతియందు కొన్నిపద్యములు ముద్రితప్రతిలో వేఱుగా నున్నవి. వీటిని ముద్రణకుముందు కవిమార్పులుగా గ్రహింపనగును. వ్రాతప్రతి పద్యములు, ముద్రిత పద్యములు క్రిందచూపబడినవి.

ముద్రణప్రతి—1

గీ. శాత్రవకృతాపరాధ సంస్మరణజాత (1.147) నుండి
గీ. వితతసంధ్యారుణవ్యోమవిస్ఫురితము (1.151) వరకు

వ్రాతప్రతి—1

సీ. విమతస్మరణతాప విస్ఫురల్లలనాధ
రామృతపానవిత్తాధరుండు
మదపానమదఘూర్ణమాన రేవతిముఖో
చ్ఛిష్టపావనపుటాశిద్వయుండు
ఆశ్లేషలుబ్ధనిజాంగనావక్షోజ
కార్కశ్య సాక్షివిశాసమాన
మానోష్ణనిశ్వాసమారుతమ్లాన సు
గంధిలవనమాలికాధరుండు

గీ. వితత సంధ్యారుణవ్యోమవిస్ఫురత్స
మగ్రతారాంగణంబుల నమకరించు

శత్రు విద్వేషరక్తాంగ సంగిసాంద్ర
ఘర్మజలబిందువులు దాల్చి గ్రాలువాడు
గీ. నిబిడ కుండలకలిత మాణిక్యసకల
ప్రభలచేత నీలాంబరాభంగసంగ
రుచిని నవచూతపల్లవరుచినిగాగ
నంచితంబుగ గావించునట్టివాడు

ముద్రణప్రతి—2

గీ. అల్పరిపుమారుతము వ్యాప్తమగుచునుండ
బరగ నిష్పౌరుషుండైన నరుడు తృణము
మాడ్కి దనయంత దానె నమ్రతవహించు
నవని దుర్బలులకును దృష్టాంతమిదియ (1-177)

వ్రాతప్రతి—2

గీ. స్వల్పమగు మారుతము చేత బహుతృణంబు
బోలె గతపౌరుషుండైన పురుషు డుర్వి
స్వల్పుడగు వైరిచే పరాభవమునొందు
నదియె దృష్టాంత మబలల కెంచిచూడ

ముద్రితప్రతి—3

మందాక్రాంత. రాజీవాళీవళగతచలద్రమ్యభృంగవ్రజంబై
భూజశ్రేణీవ్రాతరవికరోద్భూత సాంద్రాతపంబై
భ్రాజద్దైతేయనికరకృతోపప్లవం బొందకుండన్
నోజంగాంతాలకపవనభుగ్వ్యోమజం దాల్చు దానిన్ (1-316)

వ్రాతప్రతి—3

వసంతతిలకావృత్తము. రాజీవరాజీవళరమ్యమధువ్రతంబై
భూజాతపుంజవ్రాతభూరితరోతపంబై
రాజన్నికుంజ విహరచ్ఛలితాలకాంతా
వ్యాజామరీ నివహమై వెలుపొందు దానిన్

ముద్రితప్రతి—4

గీ. కరిఘటవిఘట్టంబునఁ దరువులూఁగ
గడ్డపఖలభంగి గొమ్మల గ్రాలుపెరల
నిరవుకొనియున్న సరఘుల నెగయఁజోప
నవియు ఝుమ్మని మ్రోయుచు నరిగెనపుడు (3-99)

వ్రాతప్రతి—4

గీ. కరిఘటవిఘట్టనంబునఁ దరువులూఁగ
వానికొమ్మలపైనున్న తేనెపెరల
నలముకొనియున్న సరఘుల తొలఁగద్రోలి
సేన లటు దోయిటను బట్టి తేనెద్రావె

ఈ మార్పులు కాక మఱొక వ్రాత ప్రతి యందు కొన్ని మార్పులున్నట్లు గ్రహింప వలసియున్నది. వేంకటగిరి సంస్థానము వారు ముద్రించిన 'శృంగారపద్యరత్నావళి'[1] యందు 24 పద్యములు శిశుపాల వధ నుండి యివ్వబడినవి. అందొక పద్యము మాత్రము 1887న ముద్రితమైన శిశుపాల వధ యందు గాని, ప్రస్తుతము లభించిన వ్రాత ప్రతి యందు కాని లేదు. ఆ పద్యమిది

చ॥ అటు మధుమన్మథాప్తిఁ గడువ్యంజితరాగ యజస్రకేళిలం
పట యగుకాముకాళిఁ బరివర్తులహస్తయవాగ్రచంద్రయై
పటుగతిఁ జూచి యామిని యభంగురగ్రామ్య వినోద దర్శనో
త్కట పరివ్రీడ నమ్రముఖికై వడి నొప్పెఁ బ్రభాతసంపదన్

ఈ పద్యము యొక్క భావమును ముద్రితప్రతి యందు 174, 175 పుటలలో వచన రూపమున(నిట్లు మదనుల చేత... .ప్రభాతప్రాయమై యొప్పె) కానవచ్చు చున్నది.

పైవానిని పాఠాంతరములుగా గ్రహింపవచ్చును. అనువాదకులు మహాకవులైనప్పుడు వారొకమారు చెప్పినదానితో తృప్తి

1. ఈశృంగార పద్యరత్నావళియను సంకలనగ్రంథము మోదీజగన్నాథ మల్లుచే సమకూర్చ బడినది, ముద్రితము 1908,

నొంచక, వెంటనే మఱియొకరీతిగా భిన్నచందస్సులో దానినిచెప్పుదురు పూర్వకవులు కావ్యములను యథాతథముగా శ్లోకమునకుసవ్యములో ననువాదము చేయకపోవుటచేత మనకిట్టివి తెలియరావు—కాని నవీన కవు లట్లు పాఠాంతరములు చెప్పుట సమంజసమే యగుచున్నది.

## -ఛందస్సు-

ఈ శిశుపాలవధయందు అవతారికతో కలిపి 1317 గద్య పద్యము లున్నవి. వాని వివరణము. పీఠిక 64—ప్ర.ఆ—372 ద్వి.ఆ—336. తృ. ఆ. 303 చ. ఆ. 242 అంతమున రథబంధము—1 (సీసము) కలిపిన 1318 అగును.

## —ఛందో విభజన—

దీనివలన యీకావ్యమున నేవృత్తముగాని లేక జాత్యుపజాతి వృత్తముగాని కవి వాడియున్నాడో గ్రహింప వచ్చును.

ఉత్పలమాల—56, చంపకమాల—284, శార్దూలము—14 మత్తేభము-97, కందము—111, తేటగీతి-337, ఆటవెలది-58, సీసము, —171, మిగిలిన వృత్తములు-24*, వచనములు-166, మొత్తం-1318

పైపట్టిక చూచిన నిందు తేటగీతు లధికముగా నున్నట్లు తెలియగలదు.

ఇందుకొన్ని విశేషములు

1. వనవిహారమున-మాలిని-మత్తకోకిల-వసంతతిలక—పుష్పిణి-స్రగ్ధరా-సుగంధి-చంపకమాల-గీతముల నుపయోగించుట సరసమై యున్నది,

---

*తరళ—4, తరువోజ—3' మత్తకోకిల-2. సుగంధి—2. మాలిని—2, మందాక్రాంత—1. రగడ—1, పంచచామరము—1, ఆర్యాగీతి—1. స్రగ్ధర—1, పుష్పిణి—1, వసంతతిలక—1. ప్రభాతవృత్తము—1, స్వాగతవృత్తము—1, వంశస్థవృత్తము..1, ఉపేంద్రవజ్రము—1.

2. హయప్రచార రగడ—ఈరగడ యందొక విశేషము గలదు. సురతవర్ణనలో-రగడను వాడిన కవులలో వేంకటకవియే ప్రథముడు—చివరివాడు నని చెప్పవచ్చును. యిట్లు ప్రయోగించుటకు హేతువు గూడ గలదు. ఇచ్చట సురతవ్యాపారము జరిగినది. ఒక్కజంటకే కాదు- పెక్కుమంది స్త్రీలు—పురుషులున్నారు-ప్రతివారిని గూర్చి ప్రత్యేకముగ పద్యములు వ్రాసిన పాఠకులకు ఎంత సురతవర్ణనమైనను విసువు పుట్టించును. కావుననే వెంకటకవి రగడ బహుగతులతో నడుచును గాన-బహుగతులైన రతులను రగడలో వర్ణించియున్నారు ఇది రసానుగుణ్యము.

సవతిచూచుచుండ నొక్కయువతి కుచయుగంబుచేత
వాఁడిమెఱసి పతియురంబు పీడసేయుచుండఁగాంచి

ఇందు పాదములు రెండుదళములుగా విభజింపబడి రెండవ దళమున ప్రాస పాటింపబడినది. కాని పూర్వకవులెవ్వరు నిట్లు చేయలేదు. యతిమాత్రమే పాటించియున్నారు.

మఱియు మఱ్ఱిమాని మొదల మరఁగియున్న గురునిచేత
కొఱల తాపసులకు నెఱుకఁగొలుపు జటిలవరునిచేత-[1]

ఇది రగడ చందస్సులో నొక నూతనప్రక్రియ, ఇది మూడు మాత్రలకు విఱుగును-గాన త్రిశ్యగతిని నడుచును-రూపకతాళము సవతి, చూచు, చుండ, నొక్క, యువతి, కుచయు, గంబు, చేత

3. తరువోజలు-పదునైదవశతాబ్దినుండి వాడుకలేదు-కవి యీ వృత్తము నిందువాడుట విశేషము.

4. లాక్షణికులు—చంపకోత్పల మాలికలకే పంచపాదములు-లక్షణముచెప్పిరి. అనగా నారెండువృత్తములు మాత్రమే 5 పాదములుగా వ్రాయవచ్చును. కాని వెంకటకవి గీతములకు నీలక్షణము పట్టించినాడు ప్ర. ఆ—178, ద్వి. ఆ—111, 166, 295, 309, తృ. ఆ—54

1. ఉదాహరణవాఙ్మయచరిత్ర-పుట72. గ్రంథకర్త ప్రస్తుతపీఠికకర్త

పద్యములను గీతముగాముద్రితమైనను పంచపాదిగీతముగా గ్రహింప నగును.

5. ఇందు 'ఆర్యాగీతి' యనుకందముకలదు

మదమోహితాత్మయగు నొక
మదవతి యపరాధియైన మత్పతి నింకన్
గదియనని మధువు విడిచెను;
మదికి బ్రియంబగునె సుఖము మానముకన్నన్ (2—276)

ఇది కందమేయైనను—ఆర్యాగీతి యనుటలో విశేషమున్నది-కందముపేఱు గీతిపేఱు-కందము విసమపాదములు గలది. గీతి సమ పాదములు గలది.

అప్పకవీయమున నీవిషయమునుగూర్చి యిట్లుకలదు.

క. సముదీరిత పథ్యాకం
దముకన్నను నొక్కగురువు దాకించినచో
నమ నార్యాగీతియగు
న్గమలాప్తాణేశ సహజకందం బదియే (4—349)

6.1 శిశుపాలవధయందు సాధారణముగ నితర ప్రబంధకవు లుపయోగింపని నూతనవృత్తము లున్నవి.

ఉపేంద్రవజ్ర-రమాధిపానుగ్రహలబ్ధరాజ్య
రమాసదాలంకృత రమ్యగాత్రా (4—242)

ఇది త్రిష్టుప్ ఛందమున పుట్టినది. గణములు జ, త, జ, గగ-8వ అక్షరము యతి-కవిత్రయభారతమున తిక్కన యొక్కడే యొక్క చోట (స్త్రీ—186) మాత్రమే దీనిని వాడినాడు.

6.2 ప్రభాతవృత్తము-"వివిధసుమావళి భృద్వనాళిలో యా
దవులు సఖీసహితంబుగాఁ జరింపన్ (2—77)

ఇది అతిజగతీచ్ఛందస్సునఁ బుట్టినది. గణములు న,జ, జ,ర గ- 8వ అక్షరము యతి. వెంకటకవితప్ప తక్కినకవులు దీనినివాడినట్లులేదు.

ఇది వనవిహారమున నున్నది. ప్రభాతమనగా వేకువ-ఇచ్చట అప్రసక్తి లేదు-ప్రభాత, ప్రభాతి-అనగా, విశేషమైనకాంతి యని యర్థమున్నది. కాబట్టి వనమున అచ్చటికి వచ్చిన వనితల వదనములు ప్రభాతకాలమున వికసించిన కమలములవలె, కాంతితో నున్నవని స్ఫురణగల్గుటకు ప్రభాత వృత్తము ఉపయోగింపబడినది.

6.3 పుష్పిణీవృత్తము-ఇందు న,స,మ, య, లగ-గణములుగలవు. 9 వ యక్షరము యతి-దీనికి దరిదాపులలో న, స, య, య, లగ-గణములతో-నరకపుష్పిణీవృత్తము-అప్పకవీయమున (5-149) కాన వచ్చుచున్నది.

మందాక్రాంత : రాజీవాళీవళగతచలద్రమ్యభృంగవ్రజంబై (1-316)

ఇది అత్యష్టిఛందమున బుట్టినది. 'మ,భ,న,త,త,గ-గణములు-భారతమున తిక్కన యొక్కసారియే దీనిని వాడెను (స్త్రీ 2-185)

## యతులు

వేంకటకవి మహాకవియే గాక మహాలాక్షణికుడు. అప్పకవీయాది ఛందోగ్రంథము లన్నియు నాతడు సంపూర్ణముగా నాకళించుకున్నాడు కేవలము లక్షణగ్రంథములే గాక ప్రాచీన కవిప్రయోగముల నామూలాగ్రము నెఱిగిన కవీంద్రుడు.

## విశేషవళి

### జ్ఞ-క యతి

"యజ్ఞస్వరూపివి నీవెకావె యధిప" (8-178) అప్పకవి దీనిని విశేషవళియని వాడినను, పూర్వకవిప్రయోగములు చాలగలవు.*

*అప్పకవీయ పంచముద్రణపీఠిక-వావిళ్ళ 1951.ప్రస్తుతపీఠికకర్త.

## వికల్పవిరమణము

దళిత శిశుపాలగోత్ర భిన్మణివినీల
ధాళ్వనుతనామ యోగిహృన్మథ్యధామ (అప్ప 3-117)*

సంస్కృత వ్యాకరణ సూత్రమువలన-ఏతద్మురారి, ఏతన్మురారి యని రెండురూపములువచ్చును. కాబట్టి రెంటికిని యతివేయవచ్చును.
"హరిన్మణిసచ్ఛాయతృణోరు నీవ్రములచేతంబోలె (శిశు 1-281)

ఇచట హారిద్మణి సచ్ఛాయతృణీరు నీవ్రములచేతంబోలె' అని 'హారిద్మణి' రూపము నిశ్చితము చేయబడినది.

## శకంధ్వాదియతి

శకంధ్వాది గణములలో (శకందు,కర్కందు,సీమంత, మంజీరాది శబ్దములకు) అచ్చుతోడను హల్లుతోడను యతి వేయవచ్చును ఇందు హల్లుతో 'సీమంత' శబ్దమునకు యతిగలదు.

"మఱియొక వనిత సీమంతంబు కరములఁ దిద్దుచుండుటఁ జేసి సుద్దిగలిగి (శిశు 2-183)

## ఉపసర్గయతి

ప్రాదులకు నుపసర్గలకు, అచ్చుతో, హల్లుతో యతియుండును. ఇందు-అచ్చునకు యతి-

ప్రాంచదయమేయ రుక్కలితమై (శిశు-1-310)
ప్ర + అంచత్ = ప్రాంచత్, ము + అయి = మై

## ప్రత్యేకయతి

"భూరితటి దుజ్జ్వల స్వర్ణపుంఖపుల న
యోసితముఖంబు లధికరయంబులును" (శిశు 4-199) ఇచట అయః + అసిత = అయోఽసిత అని పదచ్ఛేదము-కాబట్టి అకారయతి.

అప్పకవి నిట్లనుసరించియు, వేంకటకవి తనపూర్వకవిప్రయోగ పరిజ్ఞానమువలన—అతడు విడిచిన యతులను, అంగీకరింపని వానిని గూడ వాడి తనచందోలక్షణజ్ఞతను ప్రదర్శించియున్నాడు.

## ర—ల యతి

అప్పకవి దీనిని అగ్రాహ్యాంశములక్రింద పరిగణించినాడు. కాని వేంకటకవి ఈయతిని పెక్కుచోట్ల ధారాళముగా వాడినాడు.

లేక విరించి నాల్గును గిరిప్రభు డైదు (శివ 1—17)

## అఖండయతి

అప్పకవి అఖండయతి నంగీకరింపలేదు. అనగా సంధివశమున నేర్పడిన యక్షరమునకు స్వతస్సిద్ధమగు నక్షరమునకు యతి అఖండ యతి—

ఉన్మూలింపక సుప్రతిష్ఠనొందఁగనగునె (శివ 1—168)

'ఉన్మూలన'లో ఉత్ + మూలన = ఉన్మూలమైనది. 'నూ' హల్లు—దీనికి 'నొందు' లో 'నొ' తో యతి. ఇక్కడ 'నొ'-ప్రతిష్ఠన్ + ఒంద—అను సంధివలన 'ప్రతిష్ఠనొంద అయినది-అంతేకాని'నొంద'కాదు. అది 'ఒంద'— కాబట్టి అఖండయతి.

## బిందుపూర్వక ట-త వర్గయతి

అప్పకవి ట, త వర్గములకు, రెండు చోట్లను-యతి స్థానముల బిందువులున్న నే—అనగా సున్నలున్న నే యీయతి సరిపోవును-అన్నాడు పెక్కుచం

దాలం బందు నొకప్పుడుం.దఱుగదింటం బాడియున్ వంటయున్
(అప్ప 3—51)

ఇచ్చట— 'దా' కు 'ట' కు, యతి కుదరదు. ఏమనగా రెండును వేఱువర్గములకుచెందినవి—అయినను 'ందా' అని 'ంట' అని రెండిటి ముందు బిందువు లుండుటచేత నీయతి సరిపోయినది— దీనినిట్ట-

పభిన్న వర్గాక్షరములై నా-ంక-ంచ-ంట-ఇత్యాదిగా యతులలో రెంటింటి ముందు బిందువు లుండవలె నని-అప్పకవి చెప్పినాడు-కాని వెంకటకవి స్వతంత్రించి- ఈయతిని నిట్లు వాడి యున్నాడు.

మేలంబులాడు

నగేంద్రాత్మజ మత్కృతీశు నృపచంద్రుంబ్రోచు నెల్లప్పుడున్ (శిశు1-5)

సీ.పా॥ యాస్యపాన మొనర్చెనటు దాని కదరఖం

డన శవవ్యథ చేతఁదగఁజలించు (శిశు 2-114)

ఇచట రెండుపట్టులను, యతులు బిందుపూర్వక ట త వర్గ యతులుకావు. మొదట "ఆడు" లో 'డు' కు ముందు బిందువులేదు. కేవలము 'డు' కు 'ంద్రు' కు యతిలేదు. డకార, దకారములకు లేదు- కొన్నిశబ్దములలో మార్పులుగలవు- దొంగ- డొంగ, దబ్బర-డబ్బర, డిండీరము - దిండీరము - మొదలగు కొన్నింటికి మాత్రమే ద-డ రూపాంతరములు గలవు. కాని యన్నింటికి గాదు-'ఆడు' నకు 'ఆదు అనురూపాంతరము లేదు.

రెండవపట్టున 'అంతే'. "ఖండన....ఁదగ." ఇచ్చట "ఖండనశవవ్యథ చేతన్దగఁజలించి" అన్నియున్నచో సరిపోవును - కాని చేతన్దగ "చేతందగ" అనియున్న గణభంగమగును.

అయితే ఇట్టి యతిని వేంకటకవి ఇంతకు ఇరవై యారేండ్లక్రిందట క్రీ.శ. 1860లో రచించిన కృష్ణజన్మఖండమునను

చ. తనువు సగంబొసంగె నొకతన్వికి నొక్కతె మౌళిదాల్చె నెం
త నిపుణు డీఘనుం డలపడంతుల నేలుట కంచు దారుకా
వన మునిపత్ను లేవిభుని వారనిప్రీతి వరించి రట్టి శం
భునకు నమస్కరించెద నమోఘ కవిత్వ పటుత్వసిద్ధికిన్ (1-4)

ఇందు రెండవపాదమున "ఎంతనిపుణుడీఘనుండలపడంతులనేలుట కంచు" అన్నచోట గూడ నైయతి వంటిదే యున్నది. ఇచ్చటను "ంత,.......పంథ" అని యున్నగావి యతికుదరదు.

శ్రీకృష్ణజన్మఖండము క్రీ.శ 1882లో ముద్రితమై వ్యాప్తి లోనికి వచ్చినది దేశములో పలుతావుల ప్రచారము నందినది- విశాఖపట్టణమండలమున బొబ్బిలిలో-మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారి పుత్రులు-కామకవిగారు క్రీ. శ. 1896లో తాము రచించిన "ప్రాస్తానికపద్యావళి" లో వేంకటకవీంద్రుని "కృష్ణజన్మఖండము" లోని యతి ననుసరించి యిట్లు ప్రయోగించియున్నాడు.

క. క్రమదళదరవిందమునం
దమందమకరందచిందు వందుచు దినాశ్యం
దము గడిపిన యట్టి మిణం
దము కటకట కుటజలంపటంబయ్యెగదా (73 ప)

ఇచట నాల్గవపాదము-'ంద'- కారమునకు-'ట'- కారమును యతిగలదు.

అముద్రిత గ్రంధచింతామణి—యతివాదము

ప్రాస్తాఁక పద్యావళిని-అకాలమున తెలుగుదేశమున ప్రసిద్ధ పత్రికయగు--అముద్రితగ్రంధచింతామణి[1] పత్రిక విమర్శించుచు, పై పద్యమున నాల్గవపాదమున యతి సరికాదని- ఆ పత్రికాధ్యక్షులైన శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు, కామకవిగారికి తండ్రిగారైన పార్వతీశ్వరశాస్త్రిగారిపేర ఉత్తరము వ్రాయుచు పూర్వకవిప్రయో గములను చూపమని కోరిరి. పార్వతీశ్వరకవిగారు పై కృష్ణజన్మ ఖండమునందలి ప్రయోగములనుచూపగా-రామకృష్ణయ్యగారు "ఇది (శ్రీకృష్ణజన్మఖండము) ప్రయోగార్హమైన గ్రంధముకాదని" స్పష్ట ముగా వ్రాసిరి. (చూడుడు. అముద్రితగ్రంధ చింతామణి సం॥ నెల్లూరు ఫిబ్రవరి 1898 సంచి 2 పుట 16)

అముద్రితగ్రంధచింతామణి పత్రికాధిపతులు పూండ్లరామ కృష్ణయ్యగారికి మొదటినుండియు, ననగా వేంకటకవి వెంకటగిరి

1. ఇదితెలుగుదేశమున సాహిత్యపత్రికలలో నగ్రగణ్యమైనది. దీనిని గూర్చి పీఠికాకర్త వ్యాసములు భారతి 1930 June చూడుడు.

సంస్థానమున అగ్రహారాది సన్మానములంది - అస్థానకవిరైన నాటి నుండియు వెంకటకవిపై నీర్ష్యగలిగియుండిరి. ఇరువురు నెల్లూరు మండలవాస్తవ్యులే-ఇరువురు వెంకటగిరి సంస్థానపోషితులే-అయినను పూండ్లవారు వెంకటకవిపై అసూయవహించి తమపత్రికలో వారిని గూర్చిగాని, వారిగ్రంథములను గూర్చిగాని ప్రకంసచేయక మానిరి. ఎంతమంది కవిపండితుల నిర్యాణమును గూర్చియో తేదీలనిచ్చి వివరములు ప్రకటించిన రామకృష్ణయ్యగారు-వెంకటకవి మరణించినప్పుడొక వాక్యమైనను వ్రాయలేదు-ఇక అంత ప్రసిద్ధిగల కవిని గూర్చి తెలుపకున్న లోకమేమనుకొనునో అని భయపడి "ఇట్టి పాపష్టిగాలమందు మఱియొక కవికుంజరుడు యిరవై వేల 20,000 పద్యములుగల చంపువులను వ్రాసియున్నాడు ఆక్కవిశార్దూలుని చిత్ర చరిత్రము త్వరలోచూడగలరు"[2] అనివ్రాసిరి. ఇందుపేర్కొన్న కవికుంజరుడు వేంకటకవియే. కాని అతని చరిత్రము పత్రికయందు ప్రకటింపబడలేదు

## సమర్థనము

ఇది శాస్త్రము ననుసరించి బిందుపూర్వక ట, త వర్గయతి కాదనుట వాస్తవమే.అయినను మహాకవులు ప్రయోగములలో నచ్చటచ్చట నిట్టి యతిచ్యుతు లున్నను, నవి యెంతమాత్రము పరిగణింపదగినవి కావు. ఇదియైన వెంకటకవి సర్వతంత్రస్వతంత్రమువల్ల నేర్పడినవిగాని వేఱుగాదు. ఇట్లే పోతనయు భాగవతమున నొకచోట "మయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్" అనియతి భంగపఱచినాడు. దీనికి వ్రాతప్రతులలో పాఠాంతరమేలేదు.

దీనిని సమర్థించుచు విద్వదగ్రేసరులైన దీపాలపిచ్చయ్యశాస్త్రిగారెట్లువ్రాసిరో చూడుడు.

---

2. అముద్రితగ్రంథచింతామణి సంపుటము7, సంచిక 8 మార్చి 1894 పుట 10.

"మయసూనుండగు దానవుండు నిజమాయన్" అన్నపాఠమున యతితప్పియున్నది. అయినను అదే కవిపాఠము... రచన ధారా వాహిగా సాగిపోవుచున్నప్పుడు. అట్టి జాఱుపాటులు-మహాకవులకు కూడ క్వాచిత్కముగా తటస్థించుచునేయుండును.

పద్యరచనానుభవముగల వారి కిది సువిదితవిషయమే పూర్వ కవుల గ్రంధములలోను, నేటిప్రసిద్ధకవుల గ్రంధములలోను, యతి భంగములున్నవని ప్రయోగములు చూపినారు. (ఎఱ్ఱన హరివంశము "నగుదీప్రరుచుల నధఃకరింప" హరి. పూ 8-168 వావిలికొలనువారు శ్రీకుమారాభ్యుదయములో (2-6) "నిక్కవుజగ మేలువాడ వేనీవకట", తిరుపతి వెంకటకవులు "దానిమ్రింగిన మునినాధుభార్యసుమిముగ్ధరో?" (నూఱీవీటి శతావధానము)

ఈసందర్భమున నింకొక్కవిషయమిచ్చట పాఠకులదృష్టికి తేవలసి యున్నది. వేంకటకవి పందొమ్మిదవశతాబ్దిని జీవించియున్న కవియే యైనను, అతడు పూర్వరీతిగా లేఖకులువ్రాయుచుండగా రచించెనని నీవఱకే తెలిపితిని-ఇది తిక్కన పెద్దనాదుల సంప్రదాయమే. వెంకటకవి శ్రీకృష జన్మఖండ శిశుపాలవధల నిట్లే లేఖకులు వ్రాయుచుండగా రచించెనని నీవఱకే తెలిపితిని-అందుచేత, అ మహాకవి చెప్పునప్పుడు-లేఖకుడు భాషా ఛందోపరిజ్ఞానమున్నవాడైన-అప్పుడే అతని దృష్టికి తెచ్చేడివాడు. ఇందు కొఱకే పెద్దన "ఊహ దెలియంగల లేఖక పాఠకోత్తముల్" అన్నాడు. ప్రస్తుతమట్లు జరుగలేదు - ఇంతకు ఇరవైవేల చంపులకుపైగా వ్రాసినమహాకవి రచనలలో నీమూడు స్థలములలో యతి భంగములు-సముద్రమున జలబిందువుల వంటివని గ్రహింపనగును. పూర్వకాలమున-ననగా రెండుమూడు తరముల క్రిందట తెలుగు పద్యకావ్యముల నెంతజాగరూకతతో చదువెడువారో తెలుపుటకు పైయుదంతము చాలునని యింతగా వ్రాయవలసివచ్చినది. నేటి విమర్శలో నిట్టి నిశితదృష్టి కావలెను.

---

1. భాగవతపాఠపరిశోధనము. 1968 పుటలు 212-218. ఇందు గ్రంథవిస్తరణ భీతిని కొన్ని విడిచిపెట్టబడినవి.

## ప్రాసలు

ఈ కృతిలో ప్రాసలు సలక్షణముగనే యున్నవి.

1. "వ్యాకర్ణ-వీఁకన్" అని 1-388లో ఖండాఖండప్రాసగలదు.

2. స్వవర్గజప్రాస ఒకచోగలదు (1-387) రథతురగ-బధికృత-ప్రథితము-రథరక-ఇందు 'ధథ' లోకేవర్గమునకు జెందినవి. అయినను ధ్వనిభేదముగలదు. ఇట్టివి భారతాదిపూర్వకృతులలోగలవు.

3. వేంకటకవి పోతనవలె, రేఫ శకటరేఫలకు ప్రాసలుకూర్చినాఁడు ఇది కవిత్రయ, శ్రీనాథాది కృతులలో లేదు. మఱియు-వరల (1-9).

ఈకావ్యమున తక్కినకృతులందువలె, ప్రాచీనకవులవలె, భాషా వ్యాకరణవిశేషాంశములు సంప్రదాయ సిద్ధములై యున్నవి.

1. "కణహిమాంశుమణి వికారప్రతిమ" (2-217)

ఇచట-ప్ర-తేలిపలుకవలయును, ఊదిపలికిన గణభంగము-ఇది పూర్వకవిసంప్రదాయమే.

2 కైకొంట (3-253) ప్రాచీనవ్యాకరణముల ననుసరించి ఈ రూపము సాధువు

3. "కుజనారియగుబలుఁగుత్ససేతు-రచటి" చేతురు, కోతురి త్యాది ప్రయోగంబుల సాధువులని చిన్నయసూరి, అయినను వీనికి పూర్వకవుల ప్రయోగములున్నవని గిడుగువారి బాలకవి శరణ్యము నిరూపించినది.

4. శితమతులు శరముక్రియవి
ప్రశుతముగ సూక్ష్మముగఁదాఁకి లోపలసొచ్చున్
జిశి మందబుద్ధు లువలా
కృతిఁగడుస్థూలముగ సోఁకి యెనగువెలువలన్ (1-200

ఇచట కర్తశీతమతులు బహువచనమున—సొచ్చున్ అని క్రియఏక వచనమున నున్నదని అట్లే "మందబుద్ధులు" అనుచోట కర్త బహువచనము-క్రియ "యొసగు" ఏకవచనము-గలదు అని ఆక్షేపము స్థూల దృష్టికి గలుగవచ్చును. కాని రెండుచోట్లను "శీతమతులసమూహము" "మందబుద్ధులసమూహము" అనిసమూహపదమధ్యాహార్యముచేసినచో నేయాక్షేపము లేదు- వెంకటకవియభిప్రాయమిదియే.

5. అఖిలలోకైకవిఖ్యాతమగుటఁజేసిఁ
తనగుణంబును దాఁజెప్పుకొనడు సాధు
లన్యులెవ్వారెఱుంగని దగుటఁజేసి
తనగుణంబును దాఁజెప్పుకొను ఖలుండు (4-19)

పైపద్యమునందువలె నిచ్చటను "సాధులు" అనుకర్త బహువచనముననుండగా "చెప్పికొనడు" అనుక్రియ ఏకవచనమని యాక్షేపము రావచ్చును-అచ్చట-'ల' సరికాదు 'వ'యుండవలెను. "జెప్పికొనడు సాధువు + అన్యులెవ్వారు" అని పదచ్ఛేదము—అప్పుడుసరిపోవును

వేఱొకపక్షమున సమర్థనీయమే.

"తాఁజెప్పికొనఁడు సాధు
అన్యులెవ్వారెఱుంగనిదగుటజేసి"

అనియుండవచ్చును. సాధుశబ్దముప్రథమా విభక్తిప్రత్యయము లోపించినది "వృద్ధు, నీచు, మూర్ఖు" లవంటిది—ఇకపద్యమధ్యమున విసంధికి ప్రాచీనకవిప్రయోగము లున్నవి.

ఆకవ్వడి యతివేషముఁ
జేకొనియున్నాడు ఇదిగో చెంతనెయున్నా (3-42)

విజయవిలాసకర్తను వెంకటకవి యనుసరించెనని యీావరకే చూపబడినది.

## పదజాలము

వెంకటకవి శిశుపాలవధ భాషాంతరీకరణమున గమనింపదగిన పదప్రయోగములుగలవు. అన్నియు సమకూర్చుట కిచ్చట యవకాశము లేదు. కొన్నిమాత్రమే అర్థములతో చూపుచున్నాను. అవి గ్రంథము చదువుచున్నప్పుడర్థము చేసికొనుటకు తోడ్పడును.

అపాంనిధి=సముద్రము (4-50), అవివరుఁడు=అణీయుడు-చిన్నవాడు (4-185) ఆపగాజుఁడు=భీష్ముఁడు (నదీసుతుడు) (3-246), ఉద్గ్రీవుడు=పైకెత్తబడిన మెడగలవాడు "ఉద్గ్రీవుడైన శౌరికిట్టు లనియె" (1-326), ఉపప్లవము=విప్లవము; ఆపద "ఉపప్లవంబొంద కుండ "(1-316), ఏకార్థులు=ఒకేకోరికగలవారు "ఏకార్థులైన మహీశులనెల్ల" (1-228). ఈపదము నన్నయ వాడినదే "ఎఱిఁగి ఎఱిగి నన్ను నేకార్థసముపేతు" (భార-అర-2-115), కఫోణి=మోచేయి "శ్రీకృష్ణుండు కఫోణినెత్తి" (4-203) కాండము=జలము, "కాండముల్ జల్లిన మండినట్లు" (1-181, కార్ష్ణి=కృష్ణసుతుడు; ప్రద్యుమ్నుడు (కృష్ణశబ్ద తద్ధితము) "ఉత్తమౌజుండు తలపడ్డనుగ్రుడగుచుఁగార్ష్ణిత త్తేజమును దూరగతము జేసి (4-142)

క్రోష్టృచయము=నక్కలగుంపు (4-182) గహ్వరి=భూమి "గహ్వరీభార మడప నాకముననుండి" (1-100) చక్కనయ్య=మన్మథుడు, "ఇంతులందును కార్ముకంబెక్కువెట్టి యెక్కుడించెనుఁ గ్రమముగా చక్కనయ్య (2-286)

జన్యము=యుద్ధము "జన్యమెునర్చుటకో" 4-20 తముడు=రాహువు "సూర్యచంద్రులదఱిఁగని బాధించుగాదె తముడొక్కడైనన్" 1-165 త్రైవిధము=మూడువిధములు "త్రైవిధమునొందునితండు (శ్రీకృష్ణుడు) భూవరా" (3-215) ధరము=పర్వతము "ధరముపైగ్రీడ సలుపంగ దలచు" (2-3) ధవిత్రము=విసనకఱ్ఱ "పటీరాంచద్ధవిత్రంబులన్" (1-128) నిందనము=నింద "రమేశునిందనమునకున్" (3-263)

నిమ్నగానందనుడు=భీష్ముఁడు (3-247), పత్తి=సేనావిశేషము "నరు మీదకరుగు పత్తుల" (4-92), పరిరంభించు=కౌఁగిలించు (2-24 పల్యయనము = గుఱ్ఱముపై వేసెడు జీను - పల్యాణశబ్దరూపాంతరము (3-74), పుష్యరథము = క్రీడకొఱకేర్పడిన రథమ "పుష్యరథంబవలీల నెక్కి" (1-254) ప్రయాగము=ప్రయాగ (1-4 ఇచట ప్రయాగ నపుంసకలింగము-వాడుకలో "ప్రయాగ" అకారాం స్త్రీలింగము. పెద్దన "కాశికుడు క్షేత్రయాగప్రయాగముల నేసేవిపక" అనినపుంసకముగా వాడియున్నాఁడు (మను-2-26) భువనము= నీరు "ధవునితోఁగూడి సిగ్గున భువనమందు మునుగుటకు" (2-150 భూభృత్తులు=రాజులు "సమస్తభూభృత్తులందు (4-48) ప్రమదిమ= మెత్తన (1-176), మోది=మోదము, సంతోషముగలవాఁడ (1-76), యౌతకము=వివాహకాలమునందు అల్లునికి ఆడుబిడ్డకున యిచ్చువస్తువు (1-3), రామానుజుఁడు=శ్రీకృష్ణుడు "రాజగుణము లేని రామానుజుండు రాజార్హపూజఁగొనగ నర్హుఁడగునె? (3-240) వనీపకుడు=యాచకుడు (3-208) వరరుకు=మహత్త్వముగలవాడు అందరికన్నశ్రేష్ఠుడు (4-185), వారిరారవుండు=మేఘధ్వనివంటి ధ్వనిగలవాడు (4-185) వాలవాయము=వైడూర్యము లేక వైడూర్యము "నిరుపమవాలవాయజమణీమయ భిత్తిక" (1-275), వెంబరవిత్తు=అవివేకి, బుద్ధిహీనుడు (4-18) "అవ్వెంబరవిత్తులఅచుపీటఁడియఅపులకు" భార, ఉద్యో (3-285) సక్థి=తొడ (1-12) సరకము= కల్లు "కాంతులొసగినట్టి గండూష సరకంబు (2-278), సామవాయకులు=సమూహముగలవాడు "శత్రుసామవాయకులట్లు సంతతంబు" (1-228), స్వాపస=నిద్ర (4-207), స్వార్థలిప్సులు=స్వార్థపరుల (4-33), హావిస్సు=హోమము చేయబడినది, మంత్రపూతహావిస్సు (3-188)

## అన్యదేశ్యములు

అద్మిలు=గొప్పవారు (1-24) ఇస్తిమిరారిసనదు=సర్వహక్కు

నొప్పగా తన రాజ్యమునకు నిస్త్రిమిరారిసనదు బొంచె" (1-38). చోపుదార్లు = బెత్తములవారు (1-24), నకీబులు = వెండిబెత్తములవారు (1-24).

## సూక్తులు

ఇందు పెక్కు సూక్తులు గలవు. కొన్నింటిని మాత్రము అకారాదిని యివ్వబడినవి.

1. "అల్పులధికులుగారె నీచాశ్రయమున" (2-206).
2 ఉపకారములనె తలపుదు
   రపకారములను దలంపరార్యులుధాత్రిన్ (3-262).
3. చిత్తసుఖమె భూరిమద హేతు వగుచు నొప్పారుగాదె(2-281).
4. జగతి దైవంబు ప్రతికూల మగుచుమండ
   సాధనము లెన్నియున్నను సఫలమగునె? (2-192).
5. పథ్యవృత్తిచే రోగము నశింప
   నెలమి వైద్యునిచేత నేమిగుణము (3-181).
6. భ్రమణశీలికి కలదె తత్త్వప్రచింత (2-261).
7. మలినాత్ములకుఁబరిచయం బప్రధానమై బరగుగాదె(2-123).
8. మేఘుడంతట వర్షించి ధరణి నూషరమున గురియకున్నె?
   (3-206).
9. విషయములయందు కామికి విరతిగలదె (2-183).
10. వైరవృతంబున కెంతయు యువతిజనులు మూలముగాదే?
   (1-166).

## మాఘుడు—ఆంధ్రకవులపై అతని ప్రభావము

తెలుగు కవులు సంస్కృత కవిస్తుతులలో వాల్మీకి, వ్యాస, కాళిదాసాదులను నుతించినట్లు మాఘుని నుతించిరి మాఘుని భావము

లను గ్రహించినవి కొన్నింటిని కావ్యమునకొక్కటి చొప్పున (గ్రంథ విస్తరణ భీతిని) చూపుచున్నాడను.

1. నన్నయ

గతం తిరశ్చీన మనూరుసారథేః
ప్రసిద్ధ మూర్ధ్వజ్వలనం హవిర్భుజః
పతత్యధో ధామ విసారి సర్వతః
కిమేతదిత్యాకుల మీక్షితం జనైః (1-2)

ఉ. నీరజమిత్రుఁడేల ధరణీగ్రతుఁడయ్యెడు నొక్కొ యంచువి
స్మేరమనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి మెచ్చుచుండగా
నారదుఁడేగుదెంచె గగనంబున నుండి (సభా 1-28)

2. నన్నెచోడుడు

చిక్రంసయా కృత్రిమ పత్రి పంక్తేః
కపోతపాళీషు నికేతనానామ్
మార్జార మప్యాయత నిశ్చలాంగం
యస్యాం జనః కృత్రిమమేవ మేనే (శిశు 3-51)

కమనీయాత్మకసర్వలోహమణిసత్కాష్ఠేష్టికా నిర్మితో
త్తమ హర్మ్యంబుల గండరించిన కపోతవ్రాతపంక్తుల్ బిడా
లము లోలిం గనివానిమీఁది కలుకన్ లంఘించె గాకున్నఁద
ద్భ్రమఁ బైనూఁగినఁ బల్కు వొందెడ గడిపారావతానీకముల్
(కు. సం. 7-111)

3. సోముడు

పర్యచ్ఛే సరసి హ్రుతే ఒంకుకేపయోభి
ర్లోలాక్షే సురతగురావ పత్రపిష్ణో

సు[శోణ్యా దలవసనేన వీచిహ_స్త
న్య_స్తేన [దుతమకృతాబ్జినీ సఖిత్వమ్ (8-46)

చ. కరఁగిన పూఁతచే కనకకందుకకాంతి వెలుంగు చున్నులన్
బెరఁగిన దొడ్డము_త్తియపుఁ బేరులు వాయఁగ మన్మథాంకముల్
దరుణుల నంబికావిభుఁడు దార్కొనుచోఁగనుచాటు మాటుఁగా
దరఁగలు చల్లు శీకరవితానము మానము గావకుండునే?
(ఉ. హరి. 5-66)

## 4. అయ్యలార్యుడు

నవకుంకుమారుణపయోధరయా
స్వకరావస_క్తరుచిరాంబరయా
అతిస_క్తి మేత్య వరణస్య దిశా
భృశమన్వరజ్యదతుషారకరః (9-7)

చ. ఉరుతరకుంకుమారుణపయోధరయై కరస_క్తభానురాం
బరయగుపాశహస్తు దెస భానుఁడు జేర దృఢానురాగసుం
దర యగుతూర్పు దాల్చె నుచితస్థితి లేనిదపోలె, యన్యులన్
మరఁగిన కాంత కాంతులకు మానుగఁ బిచ్చిమగణ్యయేకదా
(భా.రా. యుద్ధ 1581)

## 5. బిక్కన

హారత్యఘం సం[పతి హేతు రేష్యత
శ్శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః
శరీరభాజం భవదీయ దర్శనం
వ్యన_క్తి కాల[తితయేఒపి యోగ్యతామ్ (1-26)

చ. తలకొని యున్నతొంటిసుకృతంబుకతంబున వచ్చి మీఁదటం
గలిగెడు శోభనంబులకుఁ గారణమై మఱి వ_ర్తమాన ని

శ్చలదురితంబులం దలఁగి సన్మునినాథకులావతంస! ని
ర్మలభవదీయదర్శనము మాకొనరించెఁ ద్రికాలయోగ్యతన్
విక్రమార్క చరిత్ర (4-5)

ఈ విషయమై యింకను వ్రాయదగియున్నను గ్రంథవిస్తరణ భీతిని విరమించెద.

గోపినాథ వేంకటకవినిగూర్చి, ఆయన రచనలనుగూర్చి ప్రత్యేక విమర్శ గ్రంథమే వ్రాయదగినంత సాధన సామగ్రి గలదు. అట్టి గ్రంథ రచనకొఱకు నేనీవఱకే విషయములను చాలగా సేకరించి యుంచితిని. ప్రస్తుతగ్రంథముద్రణము ననుసరించి సంగ్రహముగా నిందు ముందు ప్రకటించుటకు నవకాశముగల్పించిన శ్రీగోపీనాథం శ్రీనివాసమూర్తి గారికి నాకృతజ్ఞతను దెలుపుచు నీక్రింది విజ్ఞప్తితో ముగించుచున్నాను.

## విజ్ఞప్తి

శ్రీ రామాయణము క్రి.శ. 1887 నుండి 1928 వఱకు 5 ముద్రణము లందినది. ఈనాటికి రామాయణ ఘట్టాలు చెప్పేటప్పుడు గోపినాథమువారిని స్మరించుచున్నప్పటికీ, ఆ రామాయణము ఈ నలభై యేడేండ్లనుండి ముద్రణలో లేదు.[1] కృష్ణజన్మఖండము క్రి.శ. 1889లో ఒక్కపరియాయమే ముద్రితమైనది. భాగవతముకన్నా శ్రీ కృష్ణతత్త్వమును, రాధాదేవీమాహాత్మ్యమును ప్రతిపాదించు నీ మహా కావ్యము, నాటికీ, నేటికీ, తిరిగి అచ్చుకాకుండానే యుండిపోయినది. క్రి.శ. 1887లో ముద్రితమైన శిశుపాలవధను నేడు తిరిగి, వేంకటకవి

1. గోపినాథరామాయణము పురాణపఠనము, ఒకసారిగాగాక, రెండుసారులు. చేసిన భాగ్యము నాకు లభించినది విజయనగరమున సంపన్న గృహస్థులు, రామాయణప్రియులు, భక్తులునైన, కీర్తిశేషులు చావలి రామమూర్తిగారి యింటివద్ద నేను చదవగా, నాజనకుడు సుందరము పంతులుగారును, మహాపౌరాణికులు మేడూరి అప్పన్నశాస్త్రిగారు, దూరి రామావధానులుగారు అర్థము చెప్పెడివారు. వీరిలో రామావధానులుగా రిప్పటికి జీవించియే యున్నారు.

మునిమనుమలు శ్రీనివాసమూర్తిగారు బహు వ్యయ ప్రయాసల కోర్చి ముద్రించి ఆంధ్రసాహిత్యలోకమునకందించియున్నారు. వారికి తమ తాతగారియందుండెడి భక్తిప్రపత్తులింతంతయని చెప్పవలనుగాదు. వేంకటకవి ప్రథమ రచన, మారుతీ శతకము, వారు ప్రకటించినారు. ఇంకను తిరునాళ్లదండకము మొదలగు కృతులు, అచ్చుకావలసి యున్నవి.

రామాయణ శ్రీకృష్ణ జన్మఖండ మహాకావ్య పునర్ముద్రణకు, ప్రసిద్ధ ప్రకటనకర్తలు, దేవస్థానములు, సాహిత్య అకాడమీవంటి మహాసంస్థలు పూనుకొనవలెను. అయినను వెంకటకవి రచనలన్నింటిని వెలుగులోనికి తీసుకొనివచ్చుటకు ప్రయత్నములుచేయుచున్న శ్రీనివాసమూర్తిగారికి ఆంధ్రమహాజనులు తోడ్పడి వేంకటకవి గ్రంథములను విపుల పీఠికలతో వెలయచేసి, నవ్యాంధ్ర సాహిత్య సమగ్ర చరిత్ర రచనకు తోడ్పడుదురుగావుత అని యభ్యర్థించుచున్నాను.



*గోపీనాథ రామాయణము :* రామాయణ షట్కాండ కథ మాత్రమే యిందున్నది. అనువాద విషయమున మూలమును జాగ్రత్తగ ననుసరించినదయ్యు రచనము కుంటువడలేదు. శరన్నదివలె ప్రసన్న మధురముగ చివరిదాక నడచినది. తెలుగు శబ్దములపై నీకవికి మక్కువ యెక్కువయయ్యు మూలముపై నాదరమున గాబోలు, చాలవరకచ్చటి శబ్దములనే తత్సమములు జేసి రచన సాగించినాడు. అనుప్రాసాది శబ్దాలంకారములు మితముగా నాదరింపబడినవి. కాండాంతములందు బంధ కవిత్వము కానుపించుచున్నది. ఇతిహాసమున ప్రధాన గుణమగు 'నిష్ఠ' శ్రీమద్రామాయణమునందువలెనే యిందును సంపూర్ణముగ ననుసరింపబడుటయే ఈగ్రంథ ప్రసక్తికి మూలము. మూలమునందలి కవితామాధుర్యము నందించగలుగుటయే దీని కీర్తికి జయపతాక. ఆర్షకవితాగుణములకు సంయమనశక్తి, అకృత్రిమత యిందుపాసింపబడినవి. రచన ద్రాక్షాపాకము — పుట 1086, విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము — తెలుగు భాషాసమితి ప్రచురణము,

# అనువాదము — శైలి

ఆచార్య దివాకర్ల వేంకటావధాని
(మాజీ) తెలుగు శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం

ఆధునిక కాలమున నాంగ్ల సారస్వతమువలెనే ప్రాచీన కాలమున నాంధ్ర వాఙ్మయమున కమరభాషాసారస్వతము లనేకవిధముల నాదర్శ ప్రాయములై యుండెను. ఆరంభయుగమునందలి ఆంధ్రమహాకవు లప్పటి భాషాసారస్వతసాంఘికపరిస్థితుల ననుసరించి సంస్కృత సారస్వతమునందలి యుత్తమ గ్రంథముల నాంధ్రీకరించుటకుఁ బూని యుండిరి. తొలుత సంస్కృతమందలి పురాణేతిహాసములును, తరువాత నందలి కావ్యములును పిమ్మట నందలి నాటకములును ఆంధ్రమున కనువదింపఁబడినవి. క్రీ.శ. 11వ శతాబ్దినుండి నేఁటివఱకును సంస్కృత గ్రంథముల యాంధ్రానువాద మవిచ్ఛిన్నముగా సాగుచునేయున్నది.

ఆంధ్రమునందలి అనువాద విధానమును మూఁడు విధములుగా విభజింపవచ్చును. కథానువాదము, భావానువాదము, పదానువాదము సంస్కృతభారతము ననువదించుటలోఁ గవిత్రయము వారవలంబించి నది కథానువాదపద్ధతి. వారు మూలమునంతను బాగుగాఁజదివి, యందలి కథాక్రమమున కెట్టి భంగమును గలుగకుండ, నవసరమని తోఁచినచోట్ల వర్ణనాదులచేఁ బెంచుచు, ననవసరములని తోఁచిన ధర్మ తత్త్వ నీతిబోధకప్రసంగములను సంక్షేపించుచు, అశ్లీలమని తోఁచిన యెడల అన్యథాకల్పన మొనరించుచు, ననువాదమును గూడ స్వతంత్ర కావ్యమువలె నలరారఁజేసిరి. ఇందనువాదముకంటె స్వతంత్ర రచనయే యెక్కువగాఁ గనుపించును. శ్రీనాథుఁడు నైషధకావ్యము నను వదించునెడ నవలంబించినది భావానువాదపద్ధతి అతఁడు మూలమును సన్నిహితముగా ననుసరించుచునే యౌచిత్యమును బోషించుచు, నన్నా

చిత్యమును బరిహరించుచు సరసప్రౌఢముగా ననువాదమును సాగించెను. ఈ విధాన మెడనెడ గొంత స్వాతంత్ర్యములోఁ గూడి యున్నను మూలవిధేయమైనట్టిదే. మూలమునందలి కథా విధానముతోపాటు భావసంపదయు నిందు సమగ్రముగా ననుసంధింపఁబడి యుండును. ఆంధ్రమున నాటకానువాదకు లవలంబించినది పదానువాద పద్ధతి. ఇందు వారు కథాభావములతోఁ దృప్తిపడక మూలమునందలి పదములన్నిటినిగూడ యథోచితముగా ననువదించుటకు యత్నించిరి. ఈ మూఁడు విధానములలో మొదటి దత్యంతస్వతంత్రమైనది; మూఁడవ దత్యంతాస్వతంత్రమైనది; రెండవ దతిస్వతంత్రమును అతిమూలవిధేయమును గాని సమరసపద్ధతి. శ్రీనాథాదు లవలంబించిన యీ రెండవ పద్ధతి. అనుసరణీయమును, ప్రశంసా పాత్రమును అని వేఱుగాఁ జెప్ప నవసరములేదు.

కాళిదాసకావ్యత్రయము, భారవి, మాఘము, నైషధము సంస్కృతమహాకావ్యములలో మిక్కిలి ప్రసిద్ధిని ప్రచారమునుబొందినట్టివి. వీనిలో నైషధము శ్రీనాథకవిసార్వభౌమునిచే ననూదితమై మూలతుల్య ప్రాభవమును జూఱగొన్నది. కాళిదాసుని కావ్యములను, భారవి కిరాతార్జునీయమును ఆధునిక కవులు కొందఱు అనువదించియుండిరి. మాఘుని శిశుపాలవధ కావ్యమును మొట్టమొదట పోచిరాజు వీరన్న యను కవి యాంధ్రీకరించెను. తరువాత క్రి. శ 19వ శతాబ్ది చరమ పాదమున వాల్మీకిరామాయణ, శ్రీకృష్ణజన్మఖండానువాదాది బహుగ్రంథకర్తలును, భక్తవరేణ్యులును, పండితాగ్రగణ్యులునైన గోపీనాథము వేంకటకవిగా రనువదించి వేంకటగిరిప్రభువులైన శ్రీ గోపాలకృష్ణయాచేంద్రబహద్దరువారి కంకితము కావించిరి. ఇటీవలనే సుగృహీత నామధేయులైన శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిలవారి శిశుపాలవధాంధ్రీకరణముకూడఁ బ్రకటింపఁబడినది.

ప్రౌఢములైన వర్ణనలచేతను, హృద్యములైన భావములచేతను, అర్థవత్పద ప్రయోగముచేతను, ఆలంకారికరచనాపచేళిమతచేతను

మంతుకెక్కిన మహనీయకావ్యరత్నము మాఘుని శిశుపాలవధము. మహామహోపాధ్యాయుఁడును వ్యాఖ్యాతృచక్రవర్తియునైన మల్లినాధసూరి "మేఘే మాఘే గతం వయః" అని పల్కియుండెనన దాని ప్రాశస్త్యమును వేఱుగాఁ బ్రస్తుతింప నవసరములేదు. ఇందలి నాయకుఁడు భగవంతుఁడైన యదునందనుఁడు, ప్రధాన రసము వీరము; శృంగారాదు లంగరసములు; వర్ణనలు ప్రౌఢసుందరములు; శిశుపాల వధ ఫలము మల్లినాధుఁడన్నట్లు ఏతాదృశమైన మహాకావ్యమును రచించిన మాఘకవియు, తత్సూక్తిసంసేవనాపరులైన సహృదయులును ధన్యులు. అనువాద మసిధారావ్రతము వంటిది. మూలము నన్యూనాతిరిక్తముగా ననువదించి, అనువాదమును మూలసమప్రాభవముఁగా వింపఁజాలిన కీర్తి, శ్రీనాధునికి దక్కినది. శ్రీ వేంకటకవిగారును శిశుపాలవధ ననువదించుటలో నాతని మార్గమునే యనుసరించి,

"వితతరసంబు లుగ్గులిడి పెంచి ధ్వనుల్ మఱి వృత్తిరీతులున్ జతురత పాకముల్ రుచిరశయ్యలు చక్కఁగఁ దెల్పి నాల్గలంకృతుల నలంకరించి" శిశుపాలవధ కృతికన్యను సర్వాంగసౌష్ఠవ సంపన్నను గావించిరి.

శ్రీ వేంకటకవిగారు శిశుపాలవధమును చంపూకావ్యముగా ననువదించిరి. వారు రచించిన వచనములసంఖ్య చాల తక్కువ. వారు సాధారణముగా శ్లోకమున కొకపద్యము చొప్పుననే వ్రాసినను సీసపద్యములు వ్రాసినచోట్ల రెండు మూఁడేసి శ్లోకముల భావము నొకేపద్యమున నిమిడించిరి. కొండొకచో మూలమునందలి భావములనేకాక మల్లినాధుని వ్యాఖ్యానమందలి భావములనుగూడ ననువదించియుండిరి. ఇది బమ్మెర పోతరాజుగారి పద్ధతి, బమ్మెర పోతరాజుగారుకూడ, శ్రీమద్భాగవతము ననువదించుచుఁ గొన్నిచోట్ల శ్రీధరవ్యాఖ్యను గూడ ననుసరించియుండిరి. మూలకావ్యమునఁ జివరినాలుగుసర్గలును యుద్ధాదివర్ణనములతోఁ గూడినవి. మాఘుఁడు పందొమ్మిదవసర్గమునఁ దనచిత్రకవితాకౌశలమును విశే

విగారు ప్రదర్శించెను. అందు, సర్వతోభద్ర, మురజ, గోమూత్రికా, చక్రార్ధభ్రమకాది బంధములు, ప్రతిలోమానులోమ పాదములు, గత ప్రత్యాగతములు, ఏకద్వ్యక్షరములు, అతాలవ్యములు, అర్థత్రయ వాచులు, యమకాదులు కనిపించును. అట్టివానిలో పాండితీశౌండీర్య మున్నంత అర్థగాంభీర్య ముండదు. శ్రీవేంకటకవిగారికి గూడ బంధాదులను రచించుటయందు సామర్థ్యమున్నను [1]కేవల పాండితీస్ఫోరకము లైన అట్టి శ్లోకములను గొన్నిటిని వారనువదింపక విడిచివైచిరి. "మాఘుడు : గోపీనాథవేంకటకవి" అను శీర్షికను[2] శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులిట్లు వ్రాసియున్నారు

"సంస్కృతమునుండి గ్రంథములను భాషాంతరీకరణ మొనర్చుటతో నారంభమైన యాంధ్రకవితావాహిని మూడునాల్గుశతాబ్దములలో పురాణవాఙ్మయము నంతటిని ముంచివేసినది. శ్రీనాథునినాటికే పురాణయుగ మంతరించినదా యనిపించుచున్నది. అతడందుకే నైషధమునకు జేయివేసెను. హరవిలాసము పురాణములనుండి గ్రహించిన నాలుగైదుకథల కూర్పు. కాశీఖండము స్కాందములో నొకభాగము. జైమినీభారతము పిల్లలమఱ్ఱి పినవీరభద్రునిచేతిలో బంగారుగా తయారైనది. అటుతరువాత ప్రబంధరచన యొకవైపును సంస్కృతకావ్య పరివర్తన మొకవైపును సాగెను. భారవి తెలుగున సాక్షాత్కరించెను. చంపూరామాయణ పరివర్తనము వచ్చెను. ఆ మహాకవుల కోవలో చెందినవారైన గోపీనాథము వేంకటకవిగారు మాఘమును పరివర్తింప బూనుకొనిరి. వీరి రామాయణము ప్రసిద్ధమైనది. రసవత్తరము. గత దశాబ్దములలో వచ్చిన రామాయణములలో గోపీనాథులవలె సుందరముగ పరివర్తించినవారు లేరని చెప్పవచ్చును. కైవర్త పురాణమునుండి శ్రీకృష్ణజన్మఖండమునుకూడ వీరనువదించిరి. ప్రాచీన మహాకవుల కుండవలసిన యన్ని యోగ్యతలును గోపీనాథులకుండెను.

---

1. గోపీనాథం వేంకటకవి రచించిన బంధములు కొన్ని అను బంధమునం దివ్వబడినవి.
2. "విక్రమ సింహపురి మండల సర్వస్వము 'లోని శీర్షిక

వారు మహాపృత్పన్నులు. లోకజ్ఞులు, రచన ప్రౌఢసుందరమైనది. వేంకటగిరిరాజులొనర్చిన గొప్పకార్యములలో నొక్కటి గోపీనాథుల నభిమానించి పోషించుటయని చెప్పవచ్చును. ఈ కవికి కవిత్ర యము వారిపైకన్నను ప్రబంధకవులపై నెక్కువ మక్కువ యున్న ట్లున్నది. గోపీనాథమువారు మాఘమున కాంధ్ర పరివర్తనమొనర్చిరి. ఇందనేకచోట్ల మను, వసు చరిత్రాది గ్రంథములలోని శైలిని అనుస రించవలెనను తీవ్రమైన అభినివేశము కనఁబడుచున్నది.

పెద్దన్నగారి:—

అంకముఁజేరి శైలతనయా స్తనదుగ్ధము లాను వేళ బా
ల్యాంక విచేష్టఁ దొండమున నవ్వలి చన్ గబళింపఁబోయి యా
వంకఁగుచంబుఁగాన కహివల్లభహారముఁగాంచి వేమృణా
లాంకుర శంకనంటెడు గజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్.

(మను : పీఠిక ప: 4.)

పై పద్యమును దృష్టిలో పెట్టుకొని వ్రాసినదే, గోపీనాథుని ఈ క్రిందిపద్యము :

అరయ నభేదరూపధరులౌ తలిదండ్రులమ్రోల బాల్యమం
దురమున నొక్కవంకఁగుచ మొక్కయెడ న్ఫణినాథహారము
న్వరుసవడిఁజూచి మౌగ్ధ్యమున భవ్యకపిత్థమృణాళ శంకచేఁ
గరమటుసాఁచు విఘ్నపతి గావుత సత్కృతినాథు నిత్యమున్

వసుచరిత్రలోని శైలి ననుసరించిన ఘట్టములు చాల కలవు.

నమ శ్రీరామపదారవిందభజనానందున్ జగత్త్రాణనం
దనకారుణ్య కటాక్షలబ్ధ కవితాధారాసుధారాశి సం
జనితైకైక దినప్రబంధఘటికా సద్యశ్శత గ్రంథ క
ల్పను సంగీతకళారహస్యనిధిఁ దిల్యాంబంచి వల్కెం గృపన్.

(వసు: I-16)

ఈ క్రిందిపద్యము, గో. వేంకటకవిగారిది :

నను శ్రీరామపదారవిన్దభజనానన్దప్రపూర్ణాత్ముఁ ద
ద్ఘనానామస్మరణాతిపూతరసనుం దమ్మూరికారుణ్య ల
బ్ధనితాన్తోజ్జ్వల సత్కవిత్వమహితు న్ధాత్రీసురగ్రామణిం
బ్రణుతప్రజ్ఞుని వేంకటాఖ్యసుకవి న్రావించి పల్కెం గృపన్ 1-25

భట్టుమూర్తి వసురాజును వర్ణించుచు,

ఆరాజధాని కధిపతియై రాజిలు వసున్నృపాలుఁడతఁ డసిధారా
ధారాధర ధారాజల ధారాహత రాజహంస పద్మోదయుడై
1-114.

పై విధముగా వ్రాసెను. వేంకటకవియు, వేంకటగిరిరాజు నిట్లు వర్ణించినాడు:—

ఆరాజధానికధిపతియై రాజిలు శారదాబ్జహారహారార
క్షీరపటీర సురద్విప, హీరాఞ్చిత యశుఁడు కృష్ణయాచేంద్రు
డిలన్. 1-16

వసుచరిత్రలో వలెనే అనేకచోట్ల శ్లేషపూర్ణరచనయు కనుపించును. ఆకాలమున వసుచరిత్రము ననుసరించుట, దానిని గౌరవించుట యొక గొప్ప యోగ్యతగా నెంచబడుచుండెడిది."

ఈ కావ్యమున శ్రీ వేంకటకవిగారు మూలానుకమముగా వ్రాసిన పద్యములును గొన్ని లేకపోలేదు. సాధ్యమైనంతవఱకు వారు మూలము నందలి శ్లేషశబ్దచమత్కారములకు భంగము కలుగకుండనే అనువాదమును సాగించియుండిరి. కొన్నిచోట్ల శ్రీనాథునివలె మూలమునకు మెఱుఁగుపెట్టుటకును ప్రయత్నించి తమ యాచితీప్రియత్వమును బ్రకటించిరి.

శ్రీ వేంకటకవిగారు మూలమునందలి శ్లోకముల వరుస ననువాదమున మార్చిన పట్టులు రెండు మూఁడున్నవి. ఈ మార్పు పొరపాటున జరిగెనో ప్రయత్న పూర్వకముగా జరిగెనో తెలియదు. పరి

శీలించి చూడఁగా మూలమునందలి వరుసయే యుక్తమైనట్లు తోఁచు చున్నది. మూలమున, "విపదమఖిలీకృత్య ప్రతిష్ఠా ఖలు దుర్లభా, అనీత్వా ...పంకతాం ధూళి ముదకం నావతిష్ఠతే" 2-34 అను శ్లోకము తరువాత

ధ్రియతే యావదేకోఽపి రిపుస్తావత్కుత స్సుఖమ్
పురః క్లిశ్నాతి సోమం హి సైంహికేయోఽసురద్రుహామ్
2-35

అను శ్లోకమున్నది. పిమ్మట కృత్రిమ సహజ ప్రాకృత శత్రు మిత్రుల ప్రసంగమును, ఎట్టివారితో సంధి చేయవలెను. ఎట్టివారితో సంధి చేయరాదు అను విషయమును. శిశుపాలుఁడు సహజ మిత్రుఁడైనను క్రియచే శత్రువగుటచే యాతవ్యుఁడే యను సంగతియుఁ జెప్పబడినవి. అనంతర మాతని కృత్రిమ శత్రుత్వము నాలుగు శ్లోకములలో వర్ణిత మైనది. ఈ క్రమము చాల సహజముగానున్నది. ఆంధ్రమున 35 వ శ్లోకము 34, 36, 37 శ్లోకముల తరువాత నమువదింపబడినది. ఇట్లే 16 వ సర్గమందలి 30, 31, 32 సంఖ్యలుగల శ్లోకముల ననువదించుచు వేంకటకవిగారు వరుస మార్చి మూఁడవ శ్లోకము తరువాత రెండవ దాని ననువదించిరి. ఈ మార్పనవసరమగుటచేఁ బ్రతిలిఖించునప్పుడు పొరపాటున జరిగియుండునని తోఁచుచున్నది

సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమస్తౌ హి కార్యతః
స్యాతా మమిత్రౌ మిత్రే చ సహజప్రాకృతా వపి 2-36.

ఈ శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథుఁడు కృత్రిమ, సహజ ప్రాకృత, శత్రు మిత్రుల, స్వభావములను వివరించెను. శ్రీ వేంకట కవిగారిచ్చట (1-164) వచనమున వ్యాఖ్యానము నంతను అనువదించి యుండిరి. ఇట్లే వారు వ్యాఖ్యానము నంతనో, అందలి కొన్ని భాగము లనో అనువాదమునఁ జూపించిన ఘట్టములనేకములున్నవి.

"ధ్రియతే యావదేకోపి" 2-35. ఇత్యాది శ్లోకమును శ్రీ వేంకట కవిగారు

అరి యొకఁడై నను వాడి
ద్ధరలో మనియుండు నంతదాఁక మపల వే
జెఱవెట్టుఁ; జంద్ర సూర్యులఁ
దఱిఁగని బాధించుఁగాదె తముఁడొకఁడై నన్ (1-165).

అని ఆంధ్రీకరించిరి. మూలమున "దేవతల పురోభాగముననే రాహువు చంద్రుని బాధించును గదా" అని చెప్పఁబడినది. ఇందు సూర్యుని ప్రసక్తియే లేదు. కాని వ్యాఖ్యాత "ప్రాచుర్యాత్ సోమగ్రహణం. సూర్యం చేతి భావః" అని తెల్పియుండెను. దాని నాధారముగాఁ గొనియే శ్రీ వేంకట కవిగారు "చంద్ర సూర్యులఁ దఱిఁగని బాధించుఁ గాదె తముఁడొకఁడై నన్" అని సూర్యునిఁ గూడఁ గలిపియుండిరి.

ప్రఫుల్ల తాపింఛనిభై రభీశుభిః శుభైశ్చ సప్తచ్ఛదపాంసు
పాండుభిః
పరస్పరేణ ఛురితామలచ్ఛవీ తదైక వర్ణావివ తౌ బభూవతుః
1-22.

అను శ్లోకమును వేంకట కవిగారు.

మఱియుఁ బ్రఫుల్లనూతన తమాల సుమోపమ కాంతిరాజిచే
బరువడి సప్తపర్ణ సుమపాండుమరీచులఁచే బరస్పర
చ్ఛురితవినిర్మలద్యుతుల సొంపువహించిరి యేకవర్ణులై
హరియు మునీంద్రుఁడర్కతనయాన్వితగాంగజలంబు కైవడిన్
1-87.

అని యనువదించిరి. శ్లోకమునందలి ఏకవర్ణావివ అను దానిని మల్లి-నాథుఁడు "ఉభయప్రభామేలనా దుభయోరపి సర్వాంగీణోగంగా యమునా సంగమ ఇవ స్ఫటికేంద్రనీలమణి ప్రభామేలన ప్రాయః కశ్చి దేకోవర్ణః ప్రాదుర్బభూవ" అని వ్యాఖ్యానించెను. వేంకటకవిగా రర్క-తనయాన్వితగాంగజలంబు కైవడి నను నుపమానము నందుండియే గ్రహించి యుండిరి.

తేజఃక్షమావానై కాంతం కాలజ్ఞస్యమహీపతేః
నైకమోజఃప్రసాదోవా రసభావ విదఃకవేః 2-83.

అను శ్లోకమును వేంకటకవిగారు వ్యాఖ్యానానుగుణముగా పెంచి క్రింది సీసపద్యముగా ననువదించిరి.

పొసఁగ శృంగారాది రసములు మఱియు ని
ర్వేదాది భావంబు లాదరమున
నెఱిఁగిన సత్కవి కెలమి సమాస బా
హుళ్యాదికముచేత నొప్పునొక్క
ప్రౌఢప్రబంధంబె బహుముఖ్య మనియును
బటుసుకుమార ప్రబంధమొకటె
నెఱిఁగేవలం బని నియమంబులేక తా
వలసినట్లుగఁ జెప్పవచ్చినట్లు

కాలవిదుఁడైన నృపతికి క్షాత్రమొండె
మఱియు క్షమయొండె నాశ్రయింపంగ వలయు
ననెడు నియమంబులేదు; కాలానుగుణ్య
ముగ నుపాదేయములు రెండు పురుషవర్య! (1-204)

"యథాకాలముభయమప్యాశ్రయణీయ మిత్యర్థః"
"రసాన్ శృంగారాదీన్, భావాన్ నిర్వేదాదీంశ్చ వేత్తి
యస్తస్యరసభావవిదః ఏకం ఓజః ప్రౌఢ ప్రబంధత్వం
వాఏకః ప్రసాదః సుకుమార ప్రబంధత్వంవాన"

అను వ్యాఖ్యాన వాక్యములు పద్యమున వివరింపఁబడినవి. "వలసినట్లుగఁ జెప్పవచ్చియుండు" అనునది తిక్కనగారి విరాటపర్వమందలి "కథ జగత్ప్రసిద్ధి గావున" అను పద్యములోని "వలసినట్లు చెప్పవచ్చి యుండు" అను దానిని స్మృతికిఁ దెచ్చుచున్నది. "రసానుగుణ్యేను యథాయోగ్య ముభయ మప్యుపాదేయ" మ్మను వ్యాఖ్యానవాక్యమున కిది సంగ్రహరూపము.

వ్యాఖ్యాన సాహాయ్యము లేకుండనే వెంకటకవిగారు సందర్భోచితముగఁ బెంచిన భాగములును గొన్నియున్నవి.

అభీక్ష్ణముష్ణైరపి తస్య సోష్మణః
సురేంద్రబందీశ్వసితానిలై ర్యథా
సచందనాంభః కణకోమలై స్తథా
వపు ర్జలార్ద్రాపవనై ర్న నిర్వవౌ 1-65.

అను శ్లోకమును వారు

కుసుమాస్త్రజ్వరతాపతప్తమగు రక్షోభర్త నెమ్మేనికిన్
వ్యసనాత్యుష్ణములైన దైత్యకులరాడ్బంధీకృతేంద్రాంగనా
శ్వసితోరుశ్వసన ప్రచారములచే సౌఖ్యంబువాటిల్లిన
ట్లసమానందముగల్గ దెప్పుడు పటీరాంచద్దవిత్రంబులన్ 1-128

"స్మరజ్వరేణసహితః సోష్మాతస్య" అని సోష్మణః అను పదమునకు వ్యాఖ్యానమిచ్చిన వివరణమున్నను బందీకృతేంద్రాంగనాశ్వసితానిలములేల యుష్ణములయ్యెనో యందుఁ జెప్పఁబడియుండలేదు. కవిగారా కారణమును వ్యసనాత్యుష్ణములైన అను విశేషణముచేఁ దెల్పియుండిరి. "సచందనాంభఃకణకోమలైఃజలార్ద్రాపవనైః" అను పదములను వారు "పటీరాంచద్దవిత్రంబులన్" అని సంగ్రహించిరి. ఈ పద్యము ధారాశుద్ధిశోభితమై శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు చెప్పినట్లు[1] శ్రీనాథ నైషధమందలి "పవిసంగంబునఁ దాపమొందిన శచీప్రాణేశు కెంగేలికిన్" అను పద్యమును స్మృతికిఁదెచ్చుచున్నది,

దధానమంభోరుహకేసరద్యుతీఃజటాశ్శరచ్చంద్రమరీచిరోచిషం
విపాకపింగాస్తుహినస్థలీరుహో ధరాధరేంద్రం వ్రతతీతతీ రివ
1-5.

1. ఆంధ్రప్రభదినపత్రికానుబంధసారస్వతకళావేదిక (28-8-69) లోనివ్యాసము 'ఆంధ్రమాఘము'

అను శ్లోకమును శ్రీ వేంకటకవిగారు మూలార్థము ననుసరించుచునే యించించుక పెంచి యతిప్రౌఢముగా నిట్లనువదించియుండిరి.

> శరదిందుప్రచయాభుఁడై మిగుల రంజత్కంజకింజల్కపుం
> జరుచిస్ఫీతజటాచ్ఛటాకలితభాస్వన్మౌళియై మౌనిశే
> ఖరుఁడొప్పెం దుహినస్థలీరుహవిపాకస్వర్ణశోభామనో
> హరవల్లీప్రతతీయుతోన్నత తుషారాద్రిన్ విడంబించుచున్
>
> 1-70.

"అంభోరుహకేసరద్యుతీః జటాఃదధానం" అనుదానికి వేంకటకవిగారి అనువాదము వృత్త్యనుప్రాసముతోఁగూడి యత్యంత మనోహరముగానున్నది. "విపాకపింగాః" అను సమాసమందలి పింగ పదమునకు "స్వర్ణశోభామనోహర"మను ననువాదము వ్యాఖ్యానప్రాయముగానున్నది. నారదుఁడు ధవళకాంతిశోభిత శరీరుఁడు. అతని కుపమానముగా మూలములోవలె ధరాధరేంద్ర పదమునుగాక ధవళత్వసూచియైన 'తుషారాద్రి' పదమును వాడుట అభిప్రాయగర్భితమును ఉచితతరమునై యలరారుచున్నది.

> ప్రకటాన్యపి నైపుణం మహత్ పరవాచ్యానిచిరాయగోపితుమ్
> వివరీతుమథాత్మనోగుణాన్ భృశమాకౌశలమార్యచేతసామ్
>
> 16-30.

అను శ్లోకమును వేంకటకవిగారు

> ఆత్మసుగుణంబులనుబోలె ననవరతము
> పరుల దోషంబులెవ్వియుఁ బలుకరార్యు
> లాత్మయందె సంగోపన మాచరింతు
> రల్పబుద్ధులు విపరీతు లగుదు రెందు 4-17.

అని ఆంధ్రీకరించిరి. మూలమునందలి "నైపుణం-అకౌశలం"అను రెండు భావములను వారుపమాలంకారపూర్వకముగాఁ జక్కగా ననువదించి

"అల్పబుద్ధులు విపరీతులగుదురెందు"నను నమూలకవాక్యమును జేర్చి యుండిరి. ఇదియొకవిధముగా విస్తరించి చెప్పిన శిశుపాలుని "అల్ప బుద్ధిత్వమును" నిపుణముగా వ్యక్తముచేయుచున్నది.

అసకలకలికాకులీకృతాలిస్థలన వికీర్ణ వికాసికేశరాణామ్
మరుదవనిరుహాంరజోవధూభ్యః సముపహరన్ విచకార

కోరకాణి 7-28.

అను శ్లోకము నుచితవిశేషణములతోఁ బెంచి వేంకటకవిగారిట్లాంధ్రీక రించిరి.

కుసుమసుగంధియై విపినకుంజమహీజనిరుద్ధ వేగుఁడై
యసమజలాశయప్రచలితాచ్ఛతరంగజలార్ద్రుఁడై వన
శ్వసనుఁడు సంచలద్భ్రమరపక్షవిఘట్టనసంభవోల్లస
త్ప్రసవరజంబు భామినులపై వెదచల్లుచు వీచె నత్తఱిన్ 2-101.

సువాసన, మాంద్యము, శైత్యము అనునవి వాయువుకుండ వలసిన లక్షణములు శ్రీ వేంకటకవిగారు వనశ్వసనమున కాలక్షణత్ర యము నాపాదించుటకై మూఁడమూలకములైన విశేషణములను వాడియుండిరి. కుసుమసుగంధిత్వము సౌరభవత్త్వమును, నిరుద్ధవేగ త్వము మాంద్యమును, జలార్ద్రత్వము శైత్యమును సూచించు చున్నవి. వారు "అవనిరుహాంరజః" అను దానిని 'ప్రసవరజం'బని మార్చుటయు నుచితతరమై యొప్పారుచున్నది.

విధాయవైరం సామర్షే నరోఽరౌ య ఉదాసతే
ప్రక్షిప్యోదర్చిషం కక్షే శేరతే తేఽభిమారుతమ్ 2-42.

అను శ్లోకమును వేంకటకవిగారు

అరి కపకృతిచేసి మదిన్
మఱచి యుపేక్షించునట్టి మనుజుఁడు పొదఁజి
చ్చుబఱకనిడి గాలి కెదురుగ
వెఱవక నిద్రించువాని విధమగుఁగాదే 1-170.

అని అనువదించిరి. ఇది తిక్కనాదుల నీతిపద్యముల యందమును బుడికి పుచ్చుకొనుచున్నది. మఱచి, వెఱపక యనుపదములు క్రొత్తగాఁ జేర్పఁబడినవేయయ్యు భావమునకు వన్నె చేకూర్చుచున్నవి. మూలము నందలి దృష్టాంతాలంకార మనువాదమున నుపమాలంకారముగా మాఱినది.

విసృజన్త్యవికత్థినః పరే విషమాశీవిషవన్నరాః క్రుధమ్
దధతోఽన్తరసారరూపతాం ధ్వనిసారాః పటహా ఇవేతరే 16-32

అను శ్లోకమునకి క్రింది పద్యమనువాదము.

విక్రమవంతుఁడైన పృథివీపతి క్రూరవిషాహిభంగి ని
ర్వక్రతవైరిమీఁదఁదటివచ్చినయప్పుడు చూపు శౌర్యమున్
విక్రమహీనుఁడెప్పుడును వెంబరవిత్తునిమాడ్కి కార్యహీ
నాక్రమవాక్యముల్ సభలయం దఱచుం బటహాంబు చాడ్పునన్
4-18.

పరేనరాః=సత్పురుషాః అని మల్లినాథుని వ్యాఖ్యానము. ఇతరే జనాః అనఁగా దుర్జనులని యర్థము. ఈ పద్యము రాజనీతికి సంబంధించినదగుటచే వేంకటకవిగారు విక్రమవంతుడైన - విక్రమహీనుఁడైన పృథివీపతియని వానిని చక్కగా విశదీకరించిరి. అవికత్థిన అను పదమును విడిచి తటివచ్చినయప్పు డనియు, క్రుధమ్అనుదానిని విడిచి శౌర్యము ననియుఁగ్రొత్తపదములను గలిపి అర్థమునకుఁ బుష్టికలిగించిరి. పటహములు పైకి పెద్దధ్వని నిచ్చుచున్నను లోపల బోలుగానుండునట్టివి. (అంతః+అసార+రూపతాః). ఈ భావమును గవిగారు అఱచున్ అను క్రియచే వ్యంజింపఁజేసిరి. మాఘుఁడిచ్చట నప్రస్తుతములైన సుజన దుర్జనుల స్వభావములను వర్ణించుచుఁ బ్రస్తుతములైన కృష్ణ శిశు పాలుర స్వభావములను సూచించెను. వేంకటకవిగారి విశదీకరణము వలన నాసూచనలెట్టి లోపమును గలిగియుండలేదు.

ముక్తామయం సారసనావలంబి భాతిస్మ దామప్రపదీనమస్య
అంగుష్ఠనిష్ఠ్యూత మివోర్ధ్వముచ్చైఛ్ఛస్త్రి స్రోతసఃసంతతధార మంభః
3-10.

అను శ్లోకమునకు అనువాదమైన క్రింది పద్యము.

అకలంకాప్రపదీనచారుకటిసూత్రాలంబిదంతావళే
తుకశుక్త్యుద్భవమౌక్తికావళితదంగుష్ఠాగ్రనిష్ఠ్యూతభ
వ్యకరోర్ధ్వప్రసృతోన్నతాచ్ఛతరగీర్వాణాపగాసంతతో
దకసంపాతము కైవడిం జెలఁగె నుద్యత్కాంతిశోభిల్లగన్
1-242.

సమాసజటిలమును, అర్థగంభీరమును, ప్రౌఢమును, ధారాశుద్ధి శోభితమునై యలరారుచున్నది మౌక్తికములు దంతావళేతుకశుక్త్యుద్భవము లనుటచే వాని యకలంకత ద్యోతిత మగుచున్నది. ఈ విశేషణము కవిగారు కల్పించినది. పద్యమునందలి భవ్యకరోర్ధ్వప్రసృతమను సమాసభాగమును వారు కల్పించినదే. అది మూలము ఊర్ధ్వ-ఉచ్చైః అను పదములకు వివరణము.

శ్రీనాథుఁడు నైషధము నాంధ్రీకరించుచు "సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా" ఇత్యాది శ్లోకములకు మొదట వ్రాసిన పద్యము తృప్తికలిగింపకపోవుటచేతనో, మూలమునందలి ప్రౌఢిమయందుఁ గొఱవడినదను నభిప్రాయముచేతనో రెండవపద్యమును గూడ వ్రాసియుండెను. "మృదురీతిం బ్రతివాసరంబు" "కమలేందీవరషండమండిత" మున్నగు పద్యములిందుకుదాహరణములు. అట్లే శ్రీ వెంకటకవిగారును కొన్ని శ్లోకములకు రెండేసి పద్యములు రచించియుండిరి.

స్ఫురత్తుషారాంశుమరీచిజాలైర్వినిహ్నుతాః స్ఫాటికసౌధపంక్తీః
ఆరుహ్య నార్యః క్షణదాసు యస్యాం నభోగతా దేవ్య ఇవ వ్యరాజన్
3-43.

దీనికి క్రింది రెండు పద్యములును అనువాదములు.

నిర్మలేందుమయూఖజాలనిహ్నుతాభ్ర
సంస్పృశత్స్ఫాటికోపలసౌధపంక్తు

లెక్కి నిశలందు నవ్వీటి యింతులొప్పి
రభ్రగత నిర్జరస్త్రీలయందమొంది    1-273.

ఇది యథామూలముగ నున్నది. "అభ్రసంస్పృశత్" అను నౌన్నత్య సూచకమైన విశేషణముమాత్రమిందధికము. ఇది గీతమగుటచేఁగాఁబోలు వెంకటకవిగారు తృప్తినందక యీ భావమునే మత్తేభమున మరల వ్యక్తీకరించియుండిరి.

చతురత్వంబునఁ దత్పురాంగనలు చంచత్ప్రీతితో రాత్రులం
దతులప్రస్ఫురదోషధీశకరజాలాపహ్నుతస్ఫాటికో
న్నత సౌధాగ్రములెక్కి మిక్కిలి వియన్మధ్యస్థలాదేవతా
సతులుంబోలె వెలుంగుచుందురు తనుచ్ఛాయల్ పిసాళింపఁగన్
1-277.

ఇందు క్రిందగీఁతలు గలపదము లన్నియు నమూలకములైనట్టివే. మూలానుసరణమున నీవృత్తములకంటెఁ బైగీతమే మేల్తరముగా నున్నది. ఇట్లే 8-44; (1-274, 1-278) 6-28 (2-31, 2-32) శ్లోకములకు రెండేసి పద్యములు వ్రాయఁబడినవి.

ఆతామ్రాభా రోషభాజః కటాంతాదాశూర్ణాతే మార్గణే
ధూర్గతేన
నిశ్చ్యోతంతీ నాగరాజస్య జజ్ఞే దానస్యాపో లోహితస్యేవ ధారా
18-42.

అను శ్లోకమును వెంకటకవిగారీ కందపద్యముతో నాంధ్రీకరించిరి.

కరటితటాకట విస్రుత
సురుచిరమదధార రోషశోణితమగుచున్
గురుతరబాణక్షతగళ
దురుశోణితధారపగిది వొగిఁ బ్రవహించెన్    4-110.

మూలమునందలి సంశయాలంకారమిందుపమగా మార్పఁబడినది. ధూర్గతేన మార్గణే ఆశూర్ణాతే అను పదములిందు విడువఁబడినవి.

ఈ పద్యము తరువాత వేంకటకవిగారి భావమునే యించుక మార్చి యొక చంపకమాలనుగూడ రచించిరి.

తెలుచుగ రత్నచిత్రితకుథాపరివేష్టితదంతికాయముల్
స్ఫురితపృషత్క జాలములు సోకి పగిల్చిన తత్ప్రధుతతో
త్కరగళితాస్రగుచ్ఛతరధారలు గాఱఁగసాగె భూరిభూ
ధరములనుండి జాలు వితతస్ఫుటవాహినులట్లు సాంద్రమై 4-111

దీనికి మూలమున శ్లోకము కానరాలేదు. (శ్రీ) వెంకటకవిగారు చూచిన ప్రతిలో నుండెనేమో తెలియదు. ఇట్లే యీ ఆంధ్రీకరణమున నమూలకములైన పద్యములు మఱికొన్ని కూడఁ గనవచ్చుచున్నవి.

4వ ఆశ్వాసమందలి 173, 174, 179, 212, 203, 204 మొదలగు పద్యములిందుకుఁదార్కాణములు. ఇవన్నియు సందర్భానుగుణములును, భావపూరితములునై సర్వవిధముల ననువాదములైన పూర్వాపరపద్యములతోఁ దులతూగుచున్నవి.

మహత స్తరసా విలంఘయన్ నిజదోషే కుదీర్వినశ్యతి
కురుతే న ఖలు స్వయేచ్ఛయా శలభానింధనమిద్ధదీధితిః 16-85

అను శ్లోకమును వేంకటకవిగా రనువదించియుండలేదు. ఇట్లే 17 వ సర్గమందలి 24, 25, 51 సంఖ్యగల శ్లోకములను, 18 వ సర్గమందలి 61, 77, 78 శ్లోకములను, 19 సర్గమందలి 56, 68, 96, 102, 104, 106, 114 శ్లోకములను, 20వ సర్గమందలి 9, 10, 11, 46, 47, 48, 49, 50, 51 శ్లోకములను వారు విడిచివైచిరి. 19వ సర్గమున వారు విడిచిన శ్లోకములను పెక్కు ద్వ్యక్షరములును, ఏకాక్షరములును; ఈ కారణముచేతనే ఆ సర్గమున మూలమందు 120 శ్లోకములుండ నాంధ్రీకరణమున (11+48) 59 గద్య పద్యములే గోచరించుచున్నవి. మిగిలినవానిని వారెందుకు విడిచివైచిరో పరిశీలింపవలసియున్నది. ఒకవేళ వానికిఁగూడ వారనువాదములు రచించినను అవి నష్టములై పోయిన వేమో తెలియదు.

మూలమునందలి శ్లేషతోఁగూడిన శ్లోకములను చిత్రకవితా రీతికిఁజెందిన కొన్ని శ్లోకములను అనువదించుటలో శ్రీ వేంకటకవి గారు చాల నేర్పు ప్రదర్శించిరి. 19 వ సర్గమందలి ఏకాక్షరద్వ్యక్షర శ్లోకములను వారు విడిచివేయుటకు వానిననువదించుట యసాధ్య మగుటయే కారణము. మఱియు వానిని విడిచివేయుటవలన రసము నకుఁగాని కథకుఁగాని యెట్టి భంగమును గలిగియుండలేదు.

నవపలాశపలాశవనంపురః స్ఫుట పరాగ పరాగత పంకజమ్
మృదులతాంతలతాంతమలోకయత్సురభిం సురభిం సుమనోభరైః
6-2

అను శ్లోకమును వేంకటకవిగారు మూలమునందలి అర్థముకాని, శబ్ద చమత్కారముకాని చెడకుండ క్రిందివిధమున చక్కగా ననువదించి యుండిరి.

నవపలాశపలాశవనంబు మఱియు
బటుపరాగపరాగతపంకజంబు
మృదులతాంతలతాంతమై మెఱయు కుసుమ
సురభిసురభిని గృష్ణుండు చూచెనపుడు 2-4

ఇట్టి చోట్ల మూలమునందలి పదములను యథాతథముగా గ్రహించుట అపరిహార్యము.

రాజీవరాజీవశలోలభృంగం ముష్ణంతముష్ణంతతిభిస్తరూణామ్
కాంతాలకాంతాలలనాస్సురాణాం రక్షోభిరక్షోభిత
ముద్వహన్తమ్ 4-9

అను శ్లోకమును శ్రీ వేంకటకవిగారు

రాజీవాళివశగతచలద్రమ్యభృంగవ్రజంబై
భూజశ్రేణీహృతరవికరోద్భూతపాంద్రాతపంబై
భ్రాజద్దైతేయ నికరకృతోపప్లవంబొందకుండన్
నోజం గాంతాలకసవనభుగ్యోషలం దాల్చుదానిన్ 1-816

అను మందాక్రాంతముగాననువదించిరి. ఇందు మూలమునందలి యమకము రాలేదు. కాని అర్థమంతయు చక్కఁగా వ్యక్తము చేయఁబడినది.

లక్ష్మీభృతోఽంభోధితటాధివాసాన్ ద్రుమానసౌనీరదనీలభాసః
లతావధూసంప్రయుతోఽధివేలం బహూకృతాన్ స్వానివ పశ్యతిస్మ
8-71

"బహూకృతాన్ స్వాన్" అనగా "అనేకీకృత స్వకీయ విగ్రహాన్" అని అర్థము. ఇందుఁగల విశేషణములు ద్రుమములకును హరి ఆకృతులకును సమముగా నన్వయించును. శ్రీ వేంకటకవిగారు రెండర్థములు చక్కఁగా స్ఫురించునట్లుగా దాని నిట్లనువదించిరి.

జలధితటాధివాసములు శ్యామలకోమలకాంతియుక్తముల్
లలితరమావిలాసములు రమ్యలతావనితాయుతంబులౌ
విలసితభూరుహంబులను వేడుకమీఱఁగ వేలయందు నాం
పలరఁగఁజూచె నవ్విభుఁడనంతనిజాకృతులంబలెన్ రహిన్ 1-381

ఇందలి యనువాదముకూడ యథామూలముగానున్నది.

ప్రతివాచమదత్తకేశవః శపమానాయ న చేదిభూభుజే
అనుహుంకురుతే ఘనధ్వనిం న హి గోమాయురుతాని కేసరీ
16-25

అను శ్లోకము ననువదించుచు వేంకటకవిగా రుత్తరభాగమున

వనదనాదంబునకుఁ బ్రతిధ్వని యొనర్పుఁ
గాక హరి నక్కయఱుపులఁగలఁకపడునె 4-12

అని మూలమునందలి కేసరిపదమునకు హరి (కృష్ణుడు-సింహము) పదమును వాడి అమూలకమును అభిప్రాయగర్భితమునైన శ్లేష చమత్కారమును ప్రదర్శించినారు.

రణాంగణం సర ఇవ ప్లావితం మదవారిభిః
గజః పృథుకరాకృష్ట శతపత్రమలోడయత్ 19-69

శతపత్రమనఁగా పద్మము. పత్రమనఁగా వాహనము అనునర్థమున్నది. శ్రీ వేంకటకవిగారనువాదమునఁగూడ (పృథుకరాకర్షితోరు విలసిత సహస్ర పత్రముల్ 4-168) మూలమునందున్న శ్లేషను చక్కఁగా సాధించినారు.

అచ్ఛాదితాయతదిగంబర ముచ్చకై ర్గా
మాక్రమ్య సంస్థిత ముదగ్రవిశాలశృంగం
మూర్ధ్ని స్ఫురత్తుహినదీధితి కోటిమేన
ముద్వీక్ష్య కోభువి న విస్మయతే నగేశమ్ [1] 4-19

నగేశ శబ్దమునకిచ్చట శివ రైవతకపర్వతములను రెండర్థములున్నవి. ఇందలి విశేషణములు శివునికిని రైవతకమునకునుగూడ నన్వయించును. ఇందర్థాంతర ధీకృద్ధ్వని కలదని మల్లినాథుఁడు చెప్పెను. శ్రీ వేంకట కవిగారర్థద్వయమును ధ్వనియుఁ జెడకుండ దానినిట్లనువదించియుండిరి.

ఘనపినద్ధదిగంబరాక్రాంతభూరి
శృంగగోతలమూర్ధస్థశిశిరకిరణ
నవ్యకోటిగిరీశ సందర్శనమున
నెవ్వని మనంబు భువి విస్మయింపకుండు 1-827

ఘన, తల శబ్దము లమూలకములు. వానిచే నర్థమునకుఁబుష్టియే చేకూరినది గాని లాఘవము కలుగలేదు.

భూరిభిర్భారిభిర్భీభిరాభూభారైరభిరేభిరే
భేరీరేభిభిరభ్రాభైరభీరుభిరిభైరిభాః 19-66

అను ద్వ్యక్షర శ్లోకము ననువదించుచు శ్రీ వేంకటకవిగారు

---

1. గిరిశమ్—పాఠాంతరమ్

భూరిభేరిరేఖా భ్రాభభాభూరిభే
భారభూభార మత్తేభ భూరిపంక్తి
తోడఁబ్రతినాగములు కొన్ని కూడుకొనియె
నచ్చెరువుగాఁగ నమ్మహాహవమునందు 4-164

అను పద్యమునఁ గొంతవఱకు ద్వ్యక్షర నియమమును బాటింపఁజాలిరి

వారు మూలమునకు మెఱుఁగు పెట్టుటకుఁ బ్రయత్నించిన పట్టులును గొన్ని కలవు.

బింబితం ధృతపరిస్రుతి జానన్ భాజనే జలజమిత్య బలాయాః
ఘ్రాతుమతి పతతి భ్రమరః స్మ భ్రాంతిభాజి భవతి క్వ వివేకః
10-5

"మద్యముతో నిండిన పాత్రమునఁ బ్రతిబింబితమైన కాంత కంటిని పద్మమని తలంచి తుమ్మెద దాని నాఘ్రాణించుటకు వ్రాలెను. భ్రాంతి వహించువానికి వివేకమెక్కడ నుండును" అని దీని యర్థము. శ్రీ వేంకటకవిగారీశ్లోకమును

భరితవారుణియగు పానపాత్రమందు
బింబితంబైన యువతిముఖంబు కమల
మని భ్రమించి తుమ్మెద వేగ నచట వ్రాలె
భ్రమణశీలికిఁ గలదె తత్త్వ ప్రచింత 2-26

నేత్రమునకును ముఖమునకును పద్మసామ్యము కావ్య ప్రసిద్ధమే. యైనను ఇచట నేత్రమును ముఖముగా మార్చుట యెక్కువ యౌచిత్యానుసరముగానున్నది.

విలులితాలకసంహతిరామృశన్మృగదృశాం శ్రమవారి లలాటజం
తనుతరంగతతిం సరసాం దళత్కువలయం వలయన్మరుదావవౌ 6-8

ఇది మరుద్వర్ణనము. గాలి కాంతల ఫాలమందలి స్వేదకణమును దొలఁగించుచున్నదని కవి వర్ణించెను. ఒక్క లలాటజమైన స్వేదమునే గాలి

తొలఁగించుచున్నదనుటకంటె సర్వావయవజమైన స్వేదమును దొలఁగించుచున్నదనుట యుక్తముగా నుండునని, శ్రీ వేంకటకవిగారనువాదమున

విలులితాలకనికరమై జలజముఖుల
కొుడలిచెమ్మట లార్పుచు నుత్పలములు
తరళతవహింప సరసుల తనుతరంగ
విసరము చలింప వాయువు విసరెనపుడు 2-5

అని కొుడలిచెమ్మటలార్పుచు నవి మార్చి వ్రాసిరి.

జితరోషరయా మహాధియః సపదిక్రోధజితో లఘుర్జనః
విజితేన జితస్య దుర్మతేర్మతిమద్భి స్సహ కా విరోధితా 16-26

అను శ్లోకమును వేంకటకవిగారు

మతిమంతులు జితరోషులు
మతిహీనులు రోషజితులు మఱి వారలకున్
సతతము సఖ్యము వైరము
ఋతిలో నెన్నటికైనఁ జెల్లునె తలఁపన్ 4-18

అని యనువదించిరి. మూర్ఖ పండితులకు మైత్రివలె స్పర్థయు సంగతము కాదను వ్యాఖ్యాన వాక్యమును బురస్కరించుకొని శ్రీ వేంకటకవిగారిటు పఖ్యమునుగూడఁ జేర్చియుండిరి.

పైని వేంకటకవిగా రనువాదమునఁ గావించిన మార్పుచేర్పులు సూచింపఁబడినవి. పెక్కు శ్లోకములను వారు మూలానుసారముగనే యనువాదము కావించియుండిరి. అందుకు దృష్టాంతములు కాఁదగినవి వారి యాంధ్రీకరణమున ననేకములున్నవి.

ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జావహిమరుచౌ హిమధామ్ని యాతిచాస్తం
వహతిగిరిరయం విలంబిఘంటాద్వయపరివారిత వారణేంద్రలీలామ్
4-20

మాఘునికి ఘంటామాఘుఁడను ప్రథ కల్గించిన యీ శ్లోకమును వేంకటకవిగారు

సుభగవితతోర్ధ్వరశ్మిపాశులగు శశిధ
రోష్ణకర్ణు లుదయాస్తంబు లొందుచుంత
నీయగంబు విలంబిఘంటాయుగవరి
వృతమదావళలీల వహించె నధిప ! 1—328

అని యనువదించిరి. 'వితతోర్ధ్వ రశ్మిరజ్జౌ' అను విశేషణము, హిమా హిమకరు లిరువురికిని సమానమైనది. వేంకటకవిగారాంధ్రీకరణమునఁ గూడ 'సుభగవితతోర్ధ్వ రశ్మిపాశు'లను విశేషణమును గూడ వారిరువు రికి నన్వయించునట్లు వాడి పద్యమును యథామూలముగను రమ్యముగను అనువదించిరి.

క్రామన్దంతౌ దంతినఃసాహసిక్యాదీషాదండౌమృత్యుశయ్యాతలస్య
సైసైర్యైరన్యస్తక్షణాదాశశంకే స్వర్గస్యోచ్చైరర్ధమార్గాధి రూఢః
18—43

అను శ్లోకమున కనువాదమైన క్రింది పద్యమున

శమనశయ్యాతివేషా దండములఁ బోలు
సామజదంతముల్ సాహసిక్య
మున నెక్కి యన్యుండు ఘనతర స్వర్గార్ధ
మార్గంబు నెక్కిన మనుజుఁడనుచుఁ
దక్షణంబునఁ జమూతతులచే మిగులనుత్రే
క్షింపఁబడియె నహీనభంగి 4—112

"శమన శయ్యాతి వేషాదండములఁ బోలు" అనునది "శమన శయ్యా యతేషాదండములఁ బోలు" అని యుండనగును. ఈషాదండౌ= దారువిశేషౌ—తత్సదృశౌ—ఆయతౌ విత్యర్థః అని వ్యాఖ్యానము. ఇట్లే మూడు నాలుగు పద్యములలోని పదములను మూలానుగుణముగ మార్చుకొనవలసియున్నది. ప్రతిని లిఖించు సమయమున నిట్టి పొర పాట్లు దొరలియుండును.

ఈ విధముగా శ్రీ వేంకటకవిగారు వర్ణనాబహుళము, భావ బంధురము, నతి ప్రౌఢమునైన శిశుపాలవధ మహాకావ్యమును యథా మూలముగను సరసమనోహరముగను అనువదించియుండిరి. నిజమున కిది యనువాదమయ్యును వారి రచనా వైలక్షణ్యముచే స్వతంత్ర కావ్యమువలె విరాజిల్లుచున్నది. మూలసహాయ్యములేకుండ నిందలి పద్యములందలి భావములను సమగ్రముగా గ్రహించి యానందించుట కవకాశము కల్గుచుండుటయే యందుకుఁ దార్కాణము. వారిశైలి రసానుగుణముగఁ గొన్నిచోట్ల మాధుర్యప్రసాదగుణభరితమును గొన్నిచోట్ల నోజోగుణ ప్రచురమునయి యింపునింపుచున్నవి. సాధా రణముగ వారు వర్ణన సందర్భములందు భూయిష్ఠమైన ప్రౌఢశైలిని సంభాషణ సందర్భములం దలఁతియలఁతి పదములతోఁగూడిన ప్రసన్న శైలిని అవలంబించు చుందురు. వారి శైలి ప్రౌఢమైనను ప్రసన్నమైనను ఎక్కడను కుంటుపడక ధారాశుద్ధి శోభితమై గంగాప్రవాహమువలెఁ బ్రవహించుచున్నది. ప్రౌఢములైన సంస్కృతసమాసములనువలెనేవీనుల విందులగు తెలుఁగు పదములనుగూడ వాడుటయందు వారు కడుంగడు నిపుణులు. మూలమునందలి యలంకారముల నచ్చటచ్చట యథావ కాశముగ వారు మార్చి యున్నను భావసంపద లెక్కడను భంగము కలిగించియుండలేదు. వారు మహాకవులగుటచే నప్రయత్నముగనే వారి కవిత్వమున నెడనెడ యమకానుప్రాసాదులగు శబ్దాలంకారములు గోచరించుచున్నవి. వారి భాష నిర్దుష్టము, లలితమధురము, జాతీయ మునై యలరారుచున్నది. నన్నయగారి కవిత్వమునందువలెనే వారి కవిత్వమందును అక్షరరమ్యత సర్వత్రనిండారియున్నది.

వేంకటకవిగారి రచనయందు ఛందోవైవిధ్యమంతగాఁగాన రాదు. మాఘుఁడు రైవతక పర్వత వర్ణన సందర్భమున చతుర్థసర్గ యందు వివిధవృత్తములను వాడియున్నాఁడు వేంకటకవిగారు వన విహారసందర్భమున మాత్రము వృత్తవైవిధ్యమును ప్రకటించి యున్నారు. వారు సాధారణముగా నుత్పల, చంపకమాల; శార్దూల మత్తేభవృత్తములను, కందములను ఆటవెలఁది, తేటగీతి, సీసము అను

వానిని వాడుచుండురు. నీతిప్రవచన సందర్భమున వారు తఱచు కంద గీతపద్యములను రచించియుండిరి. మందాక్రాంతము, తరల, మత్తకోకిల మున్నగు వృత్తములు వారిరచనలో నరుదుగఁగనిపించును. అన్ని పద్యములను ధారాశుద్ధిబంధురముగ నడపింపఁజాలుట వారికి ఛందఃప్రయోగమునఁగల యధికారమును సూచించుచున్నది.

వేంకటకవిగారు శాస్త్రీయవిషయపూరితములు, వివరణాత్మకములునైన కొన్ని శ్లోకములను వచనరూపమున వెలయించిరి. వారి వచనములు, సరళములు, సుబోధములునై హృద్యములుగానున్నవి. మొత్తముమీఁద శ్రీ వేంకటకవిగారు కావ్యహేతువులైన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు మూఁడింటికి నెలవులై, గద్యపద్యముల నవపద్యముగా రచించుటయందు నిపుణులై, సర్వవిధముల పూర్వాంధ్ర కవిపుంగవులను దలంపునకుఁదెచ్చుచున్నారు. వారాంధ్రీకరించిన ఈ శిశుపాలవధ మహాకావ్యము శ్రీనాథుని శృంగారనైషధమువలె నాంధ్రసరస్వతి కపూర్వాలంకారమై యలరారుననుటలో సందేహము లేదు. వారు రచించిన గోపీనాథరామాయణము, శ్రీకృష్ణజన్మ ఖండము మున్నగు నితర మహాకావ్యములుకూడ పునర్ముద్రితములై సర్వాంధ్రలోకమున శీఘ్రప్రచారమునొంది వారి కీర్తిని నలుదెసల వెలయించుఁగాక.



"ఈ యాంధ్ర వాల్మీకి రామాయణ ముత్తమకవికృతులలోనిదిగా గణింపఁదగినది. ఈ మహాకవీశ్వరుని కవిత్వ మతి సుకుమార సరస వచన గ్రథితము. రసవంతము. పండిత పామర జన హృదయాకర్షకమయి శబ్దార్థాలంకారోప శోభితంబై యనతి కఠినమై పాఠకుల కానంద సంధాయకమయియున్నది చదువునపుడు సులభముగా నర్థమగుటచే నీ కవిపుంగవుని కవిత్వము ద్రాక్షాపాక భరితము. నానావిధ వర్ణనోప శోభితంబై తత్త్వ ప్రతిపాదకంబై యతి గంభీరార్థయుక్తంబై మధుమయ ఫణితి సమలంకృతంబై యొప్పారు నీ రామాయణ మనునితిహాస రాజము నన్యూనాతిరిక్తముగా నాంధ్రీకరించుట మిక్కిలి దుష్కరము. అది సరస వచన రచనాధురంధరుఁడగు నిట్టి మహాకవికిఁగాని తదితరుల కలవిగాదు" గోపీనాథరామాయణ పీఠికనుండి

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ రాధికా పరిణయము

*(అలభ్యము; రత్నాకరము అను పత్రిక జయనామ సంవత్సర శ్రావణ శుద్ధపంచమి ఇందువాసరము సంపుటి ౧, సంచిక ౧ నుండి)*

శా॥ శ్రీరాధాకుచకుంభగంధరసకాశ్మీరాంకితోరస్థలుం
డై రాజీవభవాభవాచ్యుతులు తానై యుంట వాణీశివా
శ్రీరామామణులం ధరించెననగా జెల్వొందు కృష్ణుండు శో
భారమ్యుం జెలికానివంశభవు గోపాలప్రభుం బ్రోవుతన్ ౧

మ॥ అతసీసూనసమానభాసుడగు దైత్యారాతివక్షంబునన్
దతనీలాభ్రము చెంగటన్మెరయు నుద్యచ్చంచలావైఖరిన్
శతమన్యూపలహారమధ్యగతచంచత్పద్మరాగాకృతిం
జతురత్వమ్మున నొప్పుభార్గవి గృతిస్వామిన్ గృపన్ బ్రోవుతన్ ౨

మ॥ మగువా! నీకును నాకు రూపమును నామంబొక్కటై యుండు న
ట్లగుటన్ భేదమొకింతలేదు నను నర్ధాంగీకృతం జేసితం
చొగి నల్గన్ దగవే? యటంచు గిరిజాయోషామణిన్ వేడు నీ
లగళుం డీకృతినాథు బ్రోచు గలకాలంబున్ గృపాదృష్టిచేన్ ౩

చ॥ అతుడుగ నాదుమేన మణిహారములున్నవి మీ యురమ్మునం
దరయగ నంటరాని ఫణిహారములే యని గౌరి నవ్వ నా
యురమున రత్నహార మిదె యున్నది చూడుమటంచు తచ్చిర
స్ఫురదురహారరత్నముల జూపు శివుండు కృతీంద్రు బ్రోవుతన్ ౪

మ॥ రహిమీరన్ దివిషన్నదీయుతనభోరత్నాత్మజావైఖరిన్
మహనీయామలమౌక్తికాన్వితలసన్మాహేంద్రనీలాకృతిన్
మిహికాంశూస్రరుచి న్వెలుంగుపతి సామేనం దగం జేరి జం
భహరాశ్మద్యుతి నొప్పుశైలజ కృతిస్వామిన్ గృపన్
బ్రోవుతన్ ౫

చ. సనకసనందనాది మునిసత్తము లొప్పుగఁ గొల్వ వాక్సతిన్
దనరసనాగ్రభాగముస నొప్పక నిల్పి చతుర్ముఖమ్ములన్
బనివడి నాల్గువేదముల భావము వారికిఁ దెల్పు పంకజా
సనుఁడు కృతీంద్రునిన్ నృపతిసత్తమునిన్ సతతంబుఁ బ్రోవుతన్

మ. జనతానందిత తాళవృత్తగతులన్ సంగీతసాహిత్యముల్
స్తనయుగ్మంబయి రాగముల్ కళలు విద్యాప్రౌఢి దీపింప సా
రనితాంతశ్రుతివర్ణరూపకలనన్ రాజిల్లు వాగ్దేవి మ
న్ననఁ నెల్లప్పుడు నాదునాలుకపయి న్నాట్యంబు గావించుతన్.

మ. తను సేవించుజనాళివిఘ్నములు సంతాపమ్ములం బొందఁగాఁ
దన కెవ్వాఁడు విభుండు లేక జగతిన్ దానంతకున్ మూలమై
వినుతాన్వర్థముగా వినాయకుఁడు నా విఖ్యాతి వాటించు న
య్యనిమేషార్చితపాదు దంతివదనుం బ్రార్థింతు నర్థాప్తికై. ౮

సీ. ఇలఁ నెవ్వఁ డాదికవీంద్రుఁ, డెవ్వాఁడు పు
రాణేతిహాసనిర్మాణచతురుఁ,
డెవ్వార లధికసంస్కృతకావ్యనాటకా
లంకారరచనావిలాసవిదులు,
సకలభాషాశబ్దశాసనుం డెవ్వాఁడు,
పరిశిష్టభారతకరుఁ డెవండు,
రామాయణాదికగ్రంథంబు లెవ్వారు
జనహితంబుగఁ జేసి వినుతిఁ గాంచి

తే. రట్టి వల్మీకసంభవ వ్యాస కాళి
దాస భవభూతి ముఖసంస్కృతప్రబంధ
కవుల నన్నయభట్ట తిక్కన హుళక్కి
భాస్కరాదుల మదిలోనఁ బ్రస్తుతింతు.

చ. సముదితవృత్తి నింపగు రసాలకిసాలము మాని నింబప
త్రముఁ దినుమాడ్కి నీఁగయు ఘృతమ్మును మాని వ్రణమ్ము జేరు
చందమున రహి న్మహాకవికృతంబగు సత్కృతియందుఁ దప్పులే
నెమకుదు; రొప్పు లున్నను గణింపరు దుష్కవు లీర్ష్యచే మహిన్.

మ. చతురత్వంబునఁ జారుచిత్రకవితాసామ్రాజ్యసింహాసన
స్థితుఁడై యున్న కవీంద్రుఁ గాంచి కుకవుల్ సిగ్గేది నిందింపఁ ద
త్కృతికిం దత్కవి కేమి యెగ్గు? ద్విరదశ్రేష్ఠంబుపై నున్న భూ
పతినిన్ గన్గొని క్రిందఁ గుక్క లదలింపం గూసినట్లే కదా! ౧౧

క. తుమ్మెద పువ్వులె వెదకును,
దిమ్మరి కోలంబు పెంటదిబ్బలె వెదకున్,
సమ్మతి నొప్పులె వెదకు ము
దమ్మున సత్కవియు, గుకవి తప్పులె వెదకున్. ౧౨

క॥ తనయంత వలచివచ్చిన
ఘనపదము లు గూర్చి చెప్పు కవిపద్యము నూ
తనముక్తాఫలములచే
నొనగూర్చిన సరముమాడ్కి నొప్పుచునుండున్ ౧౩

తే. సరసశబ్దార్థసంగతు లెఱుఁగలేక
పూర్వకవుల శబ్దార్థముల్ ముచ్చిలించి
కూర్చుసమయం బెఱుంగని కుకవిపద్య
ముండు భువి గాజుపూసలదండకరణి. ౧౪

వ. అని యివ్విధంబున నభీష్టదేవతాప్రార్థనమ్మును సత్కవి బహూ
కరణంబునుం గుకవినిరాకరణంబునుం గావించి శిరీషప్రసూనంబులం
గల పేశలత్వంబును సౌగంధికపుష్పంబులం గల సౌరభ్యంబును
పారిజాతలతాంతంబులం గల మాధుర్యంబునుం గల మనోహర

శబ్దార్థమ్ములం గూర్చి సంస్కృతాంధ్రకవు లిచ్చు మెచ్చనొచ్చెంబు
లేని సచ్చరిత్రం బొక్కటి యక్కజమ్ముగ రచియింపం దలంచి
యున్న సమయంబున. ౧౫

సీ. వేడ్కతో నిత్యంబు విబుధులు సేవింపఁ
బ్రబల భోగైశ్వర్య పటిమ గల్గి
ప్రజల ధర్మాధర్మ పరిపాలనమునందుఁ
దతబుద్ధి సమవర్తితయును గల్గి
నిరుపమవాహినీశ్వరసేవ్యమానుఁడై
సముదగ్రభూరితేజంబు గల్గి
యసమానపుణ్యజనానందకారియై
చతురత త్యాగశీలతయు గల్గి

తే. లోకపాలాంశభవుఁడు భూలోకనాథుఁ
డగుటఁ దల్లక్షణము లన్ని యతనియందె
వెలుఁగుచుండంగఁ జెలికానికులపయోధి
రాజు వేంకటగోపాలరాయుఁ డలరె. ౧౬

సీ గోరాజ గోరాజ గోరాజులను మీఱుఁ
బ్రతిసృష్టి వైభవ ప్రాభవముల
మదనాగ మద నాగ మదనాగములఁ గేరు
తితిధూర్వహాణరూప ధృతుల గతుల
కమలాప్త కమలాప్త కమలాప్తులను మించు
చక్రపాలన కళైశ్వర్య రుచుల
వసురాజ వసురాజ వసురాజులను బోలుఁ
బ్రబల ప్రతాప సౌభాగ్యపటిమ

తే. ననుచు జను లెల్ల వినుతిసేయంగఁ దనరెఁ
జండదోర్దండమండితమండలాగ్ర
ఖండితోద్దండవిమతవేదండకాండ
శీర్షమండలుఁ డారాజసింహుఁ డిలను,

(జయనామసంవత్సరము కార్తికమాసము సంపుటి ౧, సంచిక ౪
తెలుగు మాస పత్రిక 'రత్నాకరము' నుండి)

క. చెప్పిన శ్రీహరిచరితము
చెప్పఁగవలె నొండుగాథఁ జెప్పిన నోటన్
దుప్పరలు రాలిన ట్లగు
గొప్పగు నమృతంపుసోన గురియునె చెప్పుఁడీ! ౫౧

సీ. సకలశృంగారచేష్టావిశేషములకు
లీలాగతులకును మూల మతఁడె
కమనీయరూపరేఖావిభ్రమాత్యంత
లావణ్యములకు మూలం బతండె
వరకవీశ్వరులకు వర్ణనీయములైన
బహుగుణమ్ముల కాటపట్టతండె
అనవరతంబు ధ్యానాసక్తులగు యోగి
తతులకు నిర్వాణదాత యతఁడె

తే. నిఖిల నిగమాంతసీమంతినీవతంస
చారుసీమంతభూషితచరణుఁ డతఁడె
అట్టి శ్రీకృష్ణరాధికాబ్జాక్షి భవ్య
పరిణయము చెప్పుకంటె సౌభాగ్య మెద్ది ౫౨

సీ. రచియించితిని మున్ను రామాయణాదిమ
హాకావ్య మాంధ్రకావ్యమ్ము గాఁగ
సరసోక్తులను గృష్ణజన్మఖండంబును
సంతరించితి సాధుసమ్మతముగఁ
బ్రణుతి కెక్కితి శిశుపాలవధాఖ్య మ
హాకావ్య మాంధ్రకావ్యంబుఁ జేసి
చెలఁగి రాధామాధవుల విహారంబు శృం
గారప్రబంధంబు చారుఫణితి

తే. వెలయ సకల వర్ణనములు గలుగునట్లు
చాల సత్కవు లంపఁలు మే లనంగఁ
దెలుఁగుఁజేసితి నిపు డాంధ్రదేశవిపిన
ఘనవసంతుండ వేంకటకవివరుండ. ౨౩

## షష్ఠ్యంతములు

క ఏతాదృశ బహుసుగుణ
వ్రాతోపేతునకు విమతపార్థివమకుట
స్ఫీతమణీరుచిరరుచి
ద్యోతితపాదునకు భూరిదోస్సారునకున్. ౧

క. ధర్మనిరతచిత్తునకును
శర్మమహీధరసమాన పటుధైర్యునకున్
నిర్మలమతికి విబుధజన
శర్మదునకుఁ బాలితప్రజాధర్మునకున్. ౨

క. శారద నీరద పారద
నారద హార హార హీర నవనీత నభో
వారణ కైలాసాచల
సారయశస్సాంద్రునకును జగతీంద్రునకున్. ౩

క. బుధజనసంస్తుతునకు మా
నధనునకుఁ బవిత్రపద్మనాయకవంశాం
బుధివిధునకు విద్యాభో
జధరాధీశునకు సాధుజనకల్పునకున్. ౪

క. భూపాలశేఖరునకు స
దాపాలితపండితునకు ధన్యాత్మునకున్
గోపాలరాయమణికిని
గోపాలసమప్రభావగుణవార్నిధికిన్. ౫

## ప్రథమాశ్వాసము

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన రాధికా పరిణయం బను శృంగారప్రబంధమునకుం గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యవాసులగు శౌనకాదిమహామునులు శ్రీకృష్ణరాధికా కళ్యాణమహోత్సవ కథాశ్రవణకుతూహలపరులై, సూతు నవలోకించి, మహాత్మా! రాధికాకృష్ణుల పరిణయంబు సమగ్రంబుగా వినిపింపు మనిన సూతుం డిట్లని చెప్పందొడంగె

## కథాప్రారంభము

సీ. శతకోటి యోజనాయత విరజానది
 పరగ నెద్దానికిఁ బరిఖ యయ్యె
శతకోటి యోజనశతశృంగనాయక
 శైల మెద్దానికి సాల మయ్యె
నెద్దాని కల కల్పవృక్ష బృందావనం
 బాతతవనదుర్గమై తనర్చె
మణిసారనిర్మిత మహనీయదాసిమం
 డల మెందుఁ జిత్రమై వెలయుచుండు

తే. దివ్యమణిమయమూలవేదికలు ధర్మ
శాఖలు ప్రవాళదళములు చారుపుష్ప
ఫలములును గల్గి శోభిల్లు వటతరువులు
గల పథంబు లవెచ్చోట గలిగియుండు

వ. మరియు నెయ్యది సకలలోకాతీతంబై రాధానిబంధమండయివ శ్రీకృష్ణునిచేత స్వేచ్ఛావినిర్మితంబై మారుతాచార్యమాణంబై యనంతముక్తజనమందిరబంధురంబై, యనేక గోపికాజనసంకులంబై యపరిమిత కామధేనుసంచారంబై, నిరుపమ నిరాధార నిత్యనిరుపాధికంబై, బ్రహ్మేంద్రరుద్రాదిదేవతల కధిగమ్యంబై, యనంతంబై, యప్రమేయంబై, రత్నేంద్ర సారవినిర్మితంబై

యొప్పునట్టి గోలోకంబునందు త్రయస్త్రింశత్కోటి పరిచారిణీ సేవిత సుశీలాది త్రయస్త్రింశన్ముఖ్య సఖీపరివేష్టితయై శ్రీకృష్ణ వామాంగసంభూతయై నిత్యంబును పదియాఱు వత్సరంబుల ప్రాయంబుగలదియై యగణ్యలావణ్య యుక్తయై త్రిలోకస్థ దేవతాబృందవందితపాదారవిందయై యొప్పు రాధికం గూడి శ్రీకృష్ణుండు తదీయమహామణిసార నిర్మితసుందరమందిరాభ్యంత రంబున గ్రీడింపుచుండినంత నొక్కనాఁడు. ౨

సీ. కృష్ణుండు విరజతోఁ గ్రీడించినాఁ డని
విని రాధ కోపించి విభునిఁ గాంచి
హితము నెంచక చోరరతిలంపటా! నన్నుఁ
గ్రీడించి పెఱదానిఁ గూడి తీవు
నరునకుఁబోలె మనశ్చంచలత నీకుఁ
గల్గెఁ గావున నింకఁ గమలనేత్ర!
యవనిలో మనుజుండవై పుట్టు మని రాధ
శాప మిచ్చిన విని చక్రిభృత్య

తే. వరుఁడు శ్రీధాముఁ డధికకోపమున రాధఁ
గాంచి సర్వేశ్వరుం డని కాన కిట్లు
హరికి శాపం బొసంగితి: వందువలనఁ
బుడమిలో మర్త్యకాంతవై పుట్టు మీవు. ౩

క. అని యిట్లు విశ్వజననీ
జనకులు రాధికయు హరియు శాపవశమునన్
జనలోకహితార్థముగా
మునుకొని ధర మనుజు లగుచుఁ బుట్టఁగవలసెన్. ౪

ఉ. అంత నిజేశుఁ బాసి మనుజాకృతి ధాత్రిఁ జరింపఁజాల క
క్కాంత దురంతదుఃఖమునఁ గాంతుపదంబులమీఁద వ్రాలి చే

త్రాంతములందుఁ దోరముగ నశ్రుకణంబులు వ్రాల నేడ్వ న
య్యింతిని శౌరి హస్తముల నెత్తి కవుంగిటఁజేర్చి యిట్లనున్. ౫

ఉ. ఇంతిరో! యింత నీకు వగ పేటికి నే నినుఁబాసి యొంటి నా
వంత మనంగ నేర్తునె? నవాంబురుహాయతనేత్ర! మందలోఁ
బంత మెలర్ప నీవు వృషభానునిమందిరమందుఁ బ్రీతిఁ ద
త్కాంత కళావతీయువతిగర్భమునం జనియింపు మింపుగన్ ౬

చ. వనజదళాక్షి! నీ వెనుక వచ్చి ముదంబున నేను ధాత్రిఁ గ్ర
క్కున వసుదేవదేవకులకున్ మధురాపురిలో జనించి పె
ల్చన నటు నందమందిరము శైశవవేళనె చేరి ప్రీతి నం
దుని వెలయించి నిన్నటు మనోభవలీలలఁ దేల్తుఁ గోమలీ! ౭

——:o:——

బాల్యంబు మొదలు శ్రీపతి పదాబ్జములపై మమతతోఁ జేర్చితి మానసంబు, "పదియాఱువత్సరములవాడనై యుండుతఱి నొక్కనాఁడు సింహపురంబునుండి నృసింహదేవ కల్యాణోత్సవసమాలోకన కుతూహలాతిరేకంబున వేదశైలంబునకుంజని యందొక్కమహాయోగి వలన నొక్కవిద్యవడసి తత్ప్రసాద లబ్ధకవిత్వవిద్యావిశేషుండనై," చదివితి నభినవోజ్జ్వల కావ్యనాటకాలంకారములు బెక్కులక్షణంబు, లభ్యసించితి సంస్కృతాంధ్ర పురాణంబులన్ని శోధించితి నాదరమున, రచియించితిని తొల్లి రామాయణగ్రంథ మాంధ్రకావ్యంబు కృష్ణాంకితముగ శ్రీకృష్ణజన్మఖండమను పేరఁదగు మహాగ్రంథమొకటి. కోరితెనిఁగింపఁ బూనితి గోపినాథ. పత్కులవరుండ వేంకటశాస్త్రిసుకవి.

"........................." సూచిత భాగము గోపినాథ రామాయణము నుండి గ్రహింపబడి శ్రీకృష్ణ జన్మఖండలోని సీసపద్య ప్రథమ ద్వితీయపాద మధ్యభాగమున గూర్పఁబడినది.

శ్రీ ర స్తు

# శి శు పా ల వ ధ మ హా కా వ్య ము

## ప్రథమాశ్వాసము

• సకల దేవతా ప్రార్థనము •

శా. శ్రీవైదర్భియు సత్యభామయు ముఖ శ్రీమీఱ నిర్వంకలన్
సేవింపన్ స్మితమొప్ప వారి నడుమన్ జెల్వొందు శ్రీకృష్ణుఁడున్
శ్రీ వెల్గోటికులాబ్ధిపూర్ణవిధునిన్ శ్రీరాజగోపాలకృ
ష్ణావిర్భావుని యాచభూవిభుని నిత్యశ్రీయుతుం జేయుతన్ 1

సీ. శ్రీమత్కళిందకన్యామనోహరతీర
పావన రమ్య బృందావనమున
లలితసుగంధిశైలాలతాగృహమధ్య
మందు మందారపుష్పాంచితోరు
రత్నతల్పంబుపై రాధికాసతిఁ గూడి
చతురత సురతంబు సలుపువేళఁ
గలిత వక్షోగత కౌస్తుభమణియందుఁ
బ్రతిఫలితాత్మ విగ్రహముఁ జూచి

గీ. వేఱొకతెఁ దాల్చినాఁడని వెలఁదియల్గ
నక్కునఁ గదించి కెమ్మోవి నొక్కు శౌరి
వర గ వెల్గోటి రాజగోపాలకృష్ణ
యాచవిభునిఁ గృపాదృష్టిఁ బ్రోచుఁగాత 2

చ. గురుఁడగు వార్ధి కౌస్తుభము కోరిక యాతక మిచ్చి చంద్రునిం
బరువడి వెంట నిచ్చి వనుపం జని భర్త యురోగృహంబు సో
దర సహితంబుగాఁ గడు ముదంబునఁ జేరి వసించినట్టి యిం
దిర కృతిభర్తకుం గరుణ నిశ్చలసంపద నిచ్చుఁగావుతన్ 3

ఉ. మామకసోదరిన్ సకలమంగళగేహిని గా నొసంగితిన్
మామఱఁదిన్ శిరః కుసుమమంజరిఁ జేసితి నింకనైన నీ
పాము ల వేసమున్ విడువు భావుకయంచిటు మేలమాడు మా
స్వామి మృదూక్తికిన్ నగుచు భాసిలు శూలి కృతీంద్రుఁ
బ్రోవుతన్ 4

మ. నను మున్నొల్ల నటంచుఁ బల్కి పిదప న్మాతండ్రినిన్ దల్లి నా
య్యనఁ బ్రార్థించి వివాహమై కరుణ నర్ధాంగంబు నాకిచ్చితో
యనఘా యీ ఘనమోహ మెందరిగె నాఁడంచిట్లు మేలంబు లా
డు నగేంద్రాత్మజమత్కృతీశునృపచంద్రుంబ్రోచు నెల్లప్పుడున్

సీ. పచ్చవిల్తునితండ్రి బలుబొడ్డు తమ్మిపై
లీలనాడెడు ముద్దు బాలకుండు
విసువక యేప్రొద్దు వింత బొమ్మలఁ జేసి
చతురత నాడించు జంత్రగాఁడు
వాగ్దేవి నెప్పుడు వదలక తనజిహ్వా
మీఁద ధరించిన మేటి మగఁడు
సనకాది యోగులు చారుశ్రుత్యుక్తుల
వినుతింపఁ దలయూఁచు వేడ్కకాఁడు

గీ. ధాత భువనైకకుశలసంధాత లోక
తాత సర్వక్రియాచారతతివిధాత
యెలమి గోపాలకృష్ణయాచేంద్ర విభునిఁ
జెలఁగి దీర్ఘాయు వొసఁగి రక్షించుఁగాత 6

చ. తనపతిజిహ్వికాగ్రమునఁ దప్పక నిల్చి విపంచి మీటుచున్
ఘనముగ వర్ణరూపమును గైకొని ప్రీతి సమస్తవేదముల్
పనివడి సర్వశాస్త్రములు భర్తృ ముఖంబునఁ బల్కరించు శో
భన సుచరిత్ర భారతి కృపాకలనం గృతినాథుఁ బ్రోవుతన్ 7

చ. అరయ నభేదరూపధరులౌ తలిదండ్రులు మ్రోల బాల్యమం
దురమున నొక్కవంకఁ గుచ మొక్కయెడన్ ఫణినాథహారమున్
బరువడిఁ జూచి మౌగ్ధ్యమున భవ్యకపిత్థమృణాళ శంకచేఁ
గరమటు సాఁచు విఘ్నపతిఁ గావుత సత్కృతినాథు నిత్యమున్ 8

సీ. రామాయణాఖ్యమహామృదుకావ్య సు
ధారసాంభోధి యేధన్యురసన
యఖిల పురాణేతిహాసకథామూల్య
మణిగణపేటి యేమౌనికుక్షి
లలితకావ్యనాటకాలంకార సుమనస్స
ఖకల్పశాఖ యెవ్వానివిద్య
యఖిల భాషోక్తశబ్దానుశాసన బిరు
దాంకిత మెవ్వానియలఘుకీర్తి

గీ. యట్టి వల్మీకసంభవవ్యాసకాళి
దాసనన్నపార్యులను బ్రార్థన యొనర్చి
మఱియు సంస్కృతసత్కవివరుల నాంధ్ర
సత్కవీంద్రుల మదిలోన సంస్మరించి 9

వ. ఇట్లు సకల దేవతా ప్రార్థనంబును సత్కవిజనాభినందనంబును
గావించి యుదంచితమందారకుసుమనిష్యందమకరందబిందు
పేశలసుందరశబ్ద ప్రపంచసంచితంబును సకలవిద్వజ్జనశ్రావ్యం
బును సర్వాలంకారరసవర్ణనాపూర్ణంబునగు నొక్క యాంధ్ర
కావ్యంబు రచియింపంబూని యున్న సమయంబున 10

## వేంకటగిరి పురీవర్ణనము

చ. నటితహరిజ్జయేందిరకు నాటకరంగ మనంత వైభవో
త్కటమున కాలవాలము తతస్ఫుట విద్యల కాటపట్టు ను
ద్భటభటసింహకోటులకు ధర్మమహీధరగహ్వరంబు వేం
కటగిరి పట్టణం బలరుఁ గాంతిజితామరరాజధానియై 11

సీ. అచటి మహీసురు లతికళాధారులై
ద్విజరాజులనఁ జాలవినుతి గాంతు
రచటి రాజవరేణ్యు లరిబలహంతలై
జిష్ణులనంగఁ బ్రసిద్ధి గాంతు
రచటి యూరుజులు పుణ్యజనైకపాలురై
క్షితి శ్రీదు లనఁగ విశ్రుతి వహింతు
రచటి శూద్రులు కుజనావన దక్షులై
కుజనారి యగు బలుఁ గుత్ససేతు

గీ. రచటి వెలయాండ్రు సక్థినాసాక్షి గాత్ర
హసితరంభాతిలోత్తమాహారిణిహేమ
లగుచు విశ్రుతిగాంతు రన్నగరికి సరి
గాఁ దగునె యమరాడలకాపురంబు 12

సీ. కరములు సాఁచి నాకధునీవరాంబువుల్
తమి దీరఁ ద్రావు దంతావళములు
రయరూపవర్ణ విభ్రాసితఘనసుధా
సింధుజంబులు మహాసైంధవములు

కేతనపటజాతవాతరుద్ధదినేశ
పథములు కమనీయ బహురథములు
బలుసింగములఁ బట్టి పై నెక్కి విచ్చల
విడి సంచరించు బల్వీరభటులు

గీ. గలిగి సౌధాగ్రసంచరత్కామినీ శి
రోజములు సూచి నీలాభ్రరాజి యనుచు
నచటి పోషితశిఖులు నాట్యంబు సేయ
వఱలు నతిచిత్ర భంగి నప్పురవరంబు 13

గీ. గాఢ పుణ్యంబులకుఁ గాశికాపురంబు
కలిత సౌభాగ్యముల కలకాపురంబు
కాంతి సంపదలకు ద్వారకాపురంబు
కాపురము సేయువారల కా పురంబు 14

గీ. విప్రులును యోధవరులు ఋత్విజులు నచట
ననిశమును శాస్త్రజీవులై యలరుచుంద్రు
వారిముంగిళ్లు సంతానభూరుహములు
నాకపద మప్పురంబు నెన్నంగఁ దరమె 15

## కృతినాయక గుణగణాభివర్ణనము

క. ఆ రాజధాని కధిపతి
యై రాజిలు శారదాబ్దహారహీరార
క్షీరపటీరసురద్విప
హారాంచితయశుఁడు కృష్ణయచేంద్రుఁడిలన్ 16

ఉ. ఏకముఖంబుచేతఁ దదహీనగుణప్రకరంబు నెన్నఁగా
లేక విరించి నాల్గును గిరిప్రభుఁ డైదు గుహుండు నాఱు ద

ర్వీకరలోకవల్లభుఁడు వేయు ముఖంబులు దాల్చి రెంతయున్
వాకొనినన్ నుతింప నరపాలకు లెంతటివారు ధారుణిన్ 17

శా. ఆరాజేంద్రుని రూపసంపదకు సామ్యంబొందఁగాఁ జాల కా
మారుం డంగవిహీనుఁడయ్యె శశియక్ష్మవ్యాధితుం డయ్యె న
య్యారే యక్షతనూభవుం డొక కుజంబయ్యెన్ జయంతుండు పొ
ల్పార న్వాయస మయ్యె నయ్యడవిపాలయ్యె న్వసంతుండిలన్

చ. హిమరజతాద్రులుఁ గుచము లిందుఁడు మోము శరద్ఘనంబు చే
లము మినువాఁక హారము విలాససఖిమణి వాణి పాలసం
ద్రము ఘనకేళికాసరసి రమ్యతరోడుతతు ల్నఖంబులై
క్రమమున నొప్పు నయ్యవనికాంతు సముజ్జ్వలకీర్తికాంతకున్

గీ. నవ్యతర వైభవంబున నాకరాజు
జనమనోహారి యగుట నక్షత్రరాజు
రమ్య సౌభాగ్యగరిమచే రాజరాజు
రాజమాత్రుండె యమ్మహీరమణుఁ డరయ 20

సీ. శ్వానము ల్భక్షించు చర్మ మర్కజుఁ డిచ్చెఁ
జర్చింప నది జరీశాల్వ యగునె
జంబుకంబులు దిను శల్యమిచ్చె దధీచి
యర్థి కది సువర్ణహార మగునె
గ్రద్దలు భక్షించు కండ లిచ్చెను శిబి
కండ లర్థికి మానికంబు లగునె
అఱచుచుఁ గసరుచు నప్పు లిచ్చెను మేఘుఁ
డప్పు లర్థులకు శాల్యన్న మగునె

గీ. వీరలాదాతలనఁగ నెవ్వేళలందు
నర్థులకు మణిభూషాంబరాన్న మొసఁగి

యేలుగోపాలకృష్ణయాచేంద్రవిభుఁడె
దాత యనుచు నుతింతు రా ధరణిపతిని 21

ఉ. అక్కట కామధేనువు సురాగము వేలుపుమానికంబు పెం
పెక్కఁగ సర్వకామములు నిచ్చు నటంచ్రదది యేటిమాట యం
దొక్కటి చాలగడ్డి దిను నొక్కటిదారు వొకండుఱాయి పో
నిక్కము పాటిసేయఁదగునే యవి యా నరపాలమౌళికిన్ 22

చ. పొలుపుగ భృత్యసంతతుల భూసురకోటుల సత్కరించుచోఁ
గలయఁగఁ బట్టుశాల్వ లొక కంబళిమాత్రముగా వరాలు గ
వ్వలుగ సువర్ణహారములు వావిరి నెప్పుడు గడ్డిపోఁచగాఁ
దలఁచి యొసంగు నవ్విభుని త్యాగసమృద్ధి నుతింప శక్యమే 23

## రాజసభా వర్ణనము

వ. అమ్మహీమండలాఖండలుం డొక్కనాఁడు మృదుచిత్రరాంకవ పటాస్తీర్ణకనకవేదికాళతజుష్టంబై, వజ్రకీలితద్వారబంధబంధురంబై, విశాలప్రవాళకవాటశోభితంబై, స్ఫటికశిలాసాలభంజికాపుంజశోభితానేకసువర్ణస్తంభసంభృతంబై, యనల్పశిల్పికల్పనాలంకృతవివిధచిత్రచిత్రప్రకాశితకుడ్యంబై, క్రిందం బఱచిన మేదినీ చిహ్నచిహ్నిత చిత్రకంబళంబును మీఁదం గట్టిన స్వర్గలోకలక్షణాంకితంబైన వితానంబునుం గలిగి ద్యావాపృథివీమధ్యగతగ్రహనక్షత్రశోభితాంతరిక్షంబు ననుకరింపుచు ననంతలక్ష్మీవిలాసంబై వైకుంఠంబుభంగి, వీరభద్రకుమారగణనాథసేవితంబై కైలాసంబు రీతిఁ, జతురాననవాణీవిలసితంబై సత్యలోకంబు మాడ్కి బుధకవిగురుసేవితంబై యింద్రలోకంబు చందంబున నందం బగుచున్నసభా సదనంబు ప్రవేశించి భరతలక్ష్మణశత్రుఘ్నసహితుండైన రామభద్రుని వైఖరి ముద్దుకృష్ణయాచేంద్ర వేంకటకృష్ణయాచేంద్ర వేణుగోపాలకృష్ణయాచేంద్ర నామంబులఁ బ్రసిద్ధులైన యనుజన్ములు మువ్వురతోడం గూడి యనర్ఘరత్నఖచితసువర్ణపీఠంబు మీఁద సుఖాసీనుండై ఛత్ర

త్యముహేంద) మణిమయ స్తంభాగ్రనిర్మితరత్నపాంచాలికలు కరతలఘటిత సువర్ణపాత్రాంతరాళస్థిత పద్మరాగమణిదీపికల నివాళింప నుభయ పార్శ్వ స్తంభనిబద్ధసాలభంజికలు మణిదండమండితతుషారకిరణకరపుంజ సంకాశ చారుచామరంబులు వీవ ఘ్రాణతృప్తికరంబులైన సాంబ్రాణియగరుల ధూపవాసనలు సభాసదనంబు నిండ గుబాళింపఁ బురోభాగంబున నపారశబ్దశాస్త్ర పారావార పారంగతులైన వైయాకరణులును, బరస్పరజిగీషాయత్తచిత్తులై హేతువాదంబులు సేయు తార్కికులును, వేదవ్యాసకృతబ్రహ్మసూత్ర వాక్యార్థోపన్యాసంబునఁ దర్క కర్కశోక్తులకు మార్దవంబుఁ బుట్టించు శారీరకమీమాంసకులును, కావ్యనాటకాలంకారశాస్త్రజ్ఞులైన యాలంకారికులును, జతుర్విధకవితానిర్వాహక మహాప్రబంధనిర్మాణచతురులగు మహాకవులు మొదలగు సకల విద్వజ్జనులు తమతమ విద్యావైదుష్యంబుఁ జూపుచు నుచితాసనంబుల నుండి పరివేష్టింప మంత్రిసామంతపురోహిత బాంధవ సంఘంబులును బలే అద్మీలును నర్హస్థానంబుల నుండి సేవింపఁ, గంచు కోష్ణీషధరులై చారుచామీకరవేత్రంబులు కరంబులం బూని నకీబులు చోపుదార్లు బరాబరులు సేయ గానవిద్యాధరీకృతవిశ్వావసుప్రముఖ దేవగంధర్వులైన వైణికులు మనోహరంబుగాఁ గాలానుకూలరాగసంపద లేర్పడ గ్రామమూర్ఛనాకంపనాదులు దెలుపుచు గాంధర్వంబు గావింప ముఖవాసాలోచనగాత్రోరు తిరస్కృత చంద్రరేఖా తిలోత్తమా హరిణీ హేమారంభలైన వారవిలాసినులు కందర్పసమానసుందరుండైన యీ ధరణీతరుణీపురందరున కెనయైన సుందరపురుషుం డెవ్వండును లేడని చూపు సైవడి హస్తంబుల నభినయింపుచు, ముఖలోచనభ్రూవిన్యాసంబుల భావార్థంబు దెలుపుచు లాస్యంబు సలుప, వందిమాగధపాఠకు లందంద కైవారంబులు సేయఁ, బణవకాహళమర్దళవేణుప్రముఖచతుర్విధవాద్యం

బులు గోరుకొనఁగ, ననంత వైభవాభిరంజితుండై పేరోలగం
బున నుఁడి 24

## కావ్యకరణ హేతువు

మ. నను శ్రీరామపదారవింద భజనానంద ప్రపూర్ణాత్ముఁ ద
ద్ఘననామస్మరణాతిపూతరసనుం దమ్ముఖ్యరీకారుణ్యల
బ్ధనితాంతోజ్జ్వలసత్కవిత్వమహితు న్ధాత్రీసుర గ్రామణిం
బ్రణుతప్రజ్ఞుని వేంకటాఖ్యసుకవిన్ రావించి పల్కెం గృపన్ 25

సీ. గరిమ రామాయణ కావ్యరాజము నాంధ్ర
కావ్యంబుఁ జేసిన ఘనుఁడ వీవు
బ్రహ్మకైవర్తపురాణంబులోఁ గృష్ణ
జన్మఖండంబును జారుఫణితి
నాంధ్రభాష రచించినట్టి పుణ్యుండవు
మహితసర్వజ్ఞకుమారయాచ
విభుని మాతండ్రిని వేమారు బహుసంస్కృ
తాంధ్రసత్కృతులచే నంచితముగఁ

గీ. బూని మెప్పించి యమ్మహీజానికరుణ
నభినవాంబరహారాగ్రహారహేమ
వలయముఖ్యసత్కారంబు వడసి వినుతి
కెక్కినాఁడ వాస్థానకవీంద్రుఁ డనఁగ 26

వ. కావున మాఘకవికృత శిశుపాలవధాఖ్య మహాకావ్యంబు సమస్తకావ్యరాజంబై, సర్వాలంకారశోభితంబై, నానావిధ వర్ణనా పూర్ణంబై, శ్రీకృష్ణనాయకంబగుటం జేసి భవ్యంబై, సర్వజనసేవ్యంబై, పండితజనశ్రావ్యంబై యున్నది. కావున నక్కావ్యంబు మదంకితంబుఁ జేసి, యాంధ్రకావ్యంబుగా రచింపుమని యానతిచ్చి, జాంబూనదాంబరహారాగ్రహారాది

ప్రదానంబుల సంతుష్టునిం జేసిన, నేను సంతుష్టాంతరంగుండనై యమ్మహాకావ్య రచనాభిముఖ్యంబు వహించి, కృతిపతివంశా వతారం బభివర్ణించెద 27

• కృతిపతివంశావతారవర్ణనము •

సీ. వెలయఁ బిల్లలమఱ్ఱి బేతాళనాయఁ డే
ఘనవంశమున కాదికర్తయయ్యె
రంగుగా సర్వజ్ఞ సింగభూపాలకుం
డే వంశమునఁ బుట్టె నింపుమీఱఁ
జెంజి దుర్గాధీశుఁ జెంచి చెండాడిన
బింగరేచేంద్రుఁ డే వంశభవుఁడు
కోరి డెబ్బదియొక్క గోత్రంబులకు శిరః
కోటీర మే పుణ్య గోత్ర మట్టి

గీ. మేటి రేచెర్ల గోత్ర వెల్గోటివంశ
మందు విద్వత్కుమారయాచాభిధాన
నృపవరేణ్యుఁడు జన్మించె నిరుపమాన
దుగ్ధవారాశియందుఁ జంద్రుండుఁబోలె 28

గీ. ధరణినమ్మేటి కీర్తిప్రతాపరుచులు
దిశలఁ బర్విన రేపవల్ దెలియలేక
సురుచిరంబుగఁ జక్రముల్ జోడుగూడ
వీడ సంశయ మొందు నెవ్వేళలందు 29

గీ. భూరి విద్యల కారాజు భోజరాజు
వీర్య వితరణముల కల విక్రమార్కుఁ
డుత్తరోత్తరయుక్తి ప్రయుక్తులందు
జీవసన్నిభుఁ డతఁడని చెప్పవచ్చు 30

గీ. ఆ మహీనాథ తిలకున కగ్రసుతుఁడు
గలిగె బంగారుయాచ భూకాంతుడనఁగ
ముదముతోఁ గశ్యపబ్రహ్మ కదితియందు
శుక్రుఁ డుదయించినట్లు ప్రసన్నయశుఁడు 31

సీ. అనఘుఁ డా బంగారు యాచభూమీశుండు
కాశికా సేతు మార్గంబునందుఁ
బేరైన నాయనిపేటఁ గట్టించి య
చ్చట విశాలంబుగా సత్ర మొకటి
నిర్మించి దానికి నిండార సగుటూరి
సీమాంతరస్థమై చెలఁగు విన్న
మాలయు జువ్వలపాళెంబు నారెండు
గ్రామంబు లిచ్చి ధర్మం బొనర్చె

గీ: నింపుమీఱ నా సత్రమం దిప్పటికిని
వచ్చుజనులకు నెపుడు నవ్వారిగాఁగ
నిచ్చుచుందురు భూపాలుఁ డేర్పరించి
నట్లు భోజనసామగ్రి యనుదినంబు 32

గీ. మఱియుఁ బోలూరి సీమలో మానితముగ
నొప్పునేకొల్లు పొలములో నొక్క సత్ర
మొక్క కోనేరు నిర్మించెనుర్వి దాని
సన్నుతింతురు దొరవారిసత్ర మనుచు 33

సీ. వెలయంగ శ్రీకాశివిశ్వనాథస్వామి
యాజ్ఞచే నొక భూసురాన్వయుండు
కాశికాపురి నుండి, కర మర్థి నొక దివ్య
లింగంబు గొని వచ్చి బంగరేచ

విభునకు నర్పించి వెసనీవు లింగప్ర
తిష్ఠ సేయు మంటంచుఁ దెలుప నతఁడు
కడు వేడ్కతో మహాకైవల్యనది పొంత
నతివిశాలంబుగా నాలయంబు

గీ. రమణ గట్టించి యన్నపూర్ణాయుతముగ
విశ్వనాథుఁ బ్రతిష్ఠించి శాశ్వతముగఁ
గాంచనధ్వజ మెత్తించి కట్టఁ జేసె
మహితగోపుర ప్రాకార మంటపములు 34

క. చిత్రంబులు శ్రితసురతరు
సత్రంబులు సకలసుకవిజనసంస్తుతికిం
బాత్రంబులు శాత్రవగణ
జైత్రంబులు నమ్మహీశుచారిత్రంబుల్ 35

గీ. అతని పత్నులు పాపమాంబక్కమాంబ
నాథుతోఁ గూడ సహగమనంబుఁ జేసి
వీరమాతలై వెలసి రవ్వీటిలోన
వెలయు తద్వంశ్యులకు నిలువేల్పు లగుచు 36

క. ఆ రాజశేఖరునకుఁ గు
మారుఁడు ఘనశక్తిచేఁ గుమారుండు తనూ
మారుఁడు సుకుమారుండు కు
మారుండు కుమారయాచమహిపతి యలరెన్ 37

సీ. పరఁగ వేంకటగిరిపుర మంతిపురమును
రచియింపఁ జేసెఁ జిత్రంబుగాఁగ
రాజవీధుల నెల్ల రమ్యంబుగాఁ జేసి
మూలల మంటపంబుల రచించె

విశ్వేశ్వరాన్నపూర్ణేశ్వరీ గుహులకు
ముదముతోఁ గట్టించె మూఁడు బేర్లు
హూణరాజులచేత నొప్పుగాఁ దన రాజ్య
మునకు నిస్తిమిరారిసనదుఁ బొందె

గీ. రమణఁ గట్టించె నన్నసత్రములు పెక్కు
విప్రులకు దాన మిచ్చెను విత్తమెల్ల
నమరపతిఁ బోలె భోగంబులనుభవించె
నతఁడు సామాన్యుఁడె కుమార యాచవిభుఁడు 38

గీ. పొసఁగ నారాజమౌళిప్రభుత్వకాల
మందు వేంకటగిరిపురమందు సర్వ
విభవములు సర్వసంపదల్ వృద్ధి నొందెఁ
బూర్ణశశిరాక కుదధి యుప్పొంగినట్లు 39

గీ. అమ్మహారాజపుత్రుఁడై యలరు నద్ధు
తప్రతాపుండు కీర్తి విస్తారుఁ డాది
రాజసంకాశుఁ డఖిలోర్వీరాజచిత్త
హారచరిత్రుండు బంగారు యాచవిభుఁడు 40

సీ. కళ లనారతమును క్షయము నొందకయున్న
శీతాంశుఁ డీ డని చెప్పవచ్చుఁ
బ్రమథాధిపతి విరోధము గల్గకుండెనా
యంగజు సాటి సేయంగ వచ్చు
దమి నగమ్యాగమనము సేయకుండెనా
ధనదపుత్రుఁడు తుల్యుఁ డనఁగ వచ్చు
మధుపల్లవ సమాగమము లేకయుండెనా
యల వసంతుఁడు సాటి యనఁగ వచ్చు

గీ. జగతి నిమ్మోటి కని జనుల్ పొగడ నెగడె
నతఁయకళుండు హరభక్తుఁ డనవరతము
ధర్మపత్నీప్రియుండు విద్వత్సమేతుఁ
డగుచుఁ జెలువొందు బంగారు యాచవిభుండు 41

ఉ. అంచితభంగి నానృపతి న్యాయము దప్పక యుండ విత్తమా
ర్జించి తదార్జితస్వమున, శిష్టమహీసుర భృత్యకోటిఁ బో
షించి సమస్త ధర్మములుచేసి యశంబున ధాత్రిఁబూర్తి గా
వించి నిరంతరం బనుభవించెఁ బురందర తుల్యభోగముల్ 42

క. ఆ రాజశేఖరునకుఁ గు
మారుఁడు జనియించె రాజమాన్యుఁడు మహిభృ
ద్వీరుఁడు వెలుగోటికుల
క్షీరపయోరాశిపూర్ణసితకరుఁ డగుచున్ 43

క. శర్వాంశసంభవుండు న
ఖర్వమహాశక్తిధరుఁడు గాన నతని నీ
యుర్వీశు లెల్లఁ బొగడిరి
సర్వజ్ఞకుమారయాచజనపతి యనుచున్ 44

క. కాముఁడు సుందరులకు రణ
భీముఁడు శత్రువుల కెల్లఁ బెంపలరంగా
సోముఁడు పౌరజనములకు
రాముఁడు భూప్రజల కా ధరాధిపుఁ డరయన్ 45

సీ. తన కీర్తిభామినీ ధమ్మిల్లమున కిందు
కళచారుకేతకీ దళముగాఁగఁ
దన ప్రతాపగ్రీష్మ తపనరశ్మిలకు రో
హితతురంగుఁడు దాఁపుడీల్లుగాఁగఁ

దననిరంతరదానధారాలహరి కల
పాథోధినాథుండు భర్తగాఁగ
దనశౌర్యహర్యక్షమునకు దుర్మదవైరి
సంఘంబు ఘనసామజములుగాఁగ

గీ. వెలసె నమ్మేటి లోకైకవిక్రుతోరు
సుగుణసంపన్నుఁ డనిశంబు శూలపాణి
కధికభక్తుండు సకలవిద్యావిదుండు
వరకుమారయాచేంద్రుండు వసుధలోన 46

సీ. విక్రమార్కుఁడు వీర్యవితరణ సాహస
ములకు విద్యల కెల్ల భోజరాజు
ఉత్తరోత్తరమహో యుక్త్యుపన్యాసంబు
నందుఁ జర్చింపంగ నమరగురుఁడు
చటుల మీమాంసాది శాస్త్రపరిజ్ఞాన
మందుఁ బరాశరనందనుండు
శబ్దార్థశాస్త్ర ప్రచారంబు లందుఁబా
ణిని గౌతములనంగ వినుతికెక్కు

గీ. బమ్మనాయకకులవార్ధి పారిజాత
మఖిల సుజనైక నుతచరిత్రాన్వితుండు
సుందరీకాంతుణీయాతి సుందరుండు
భోగిదేవేంద్రుఁ డా రాజపుంగవుండు 47

సీ. కాశిగయాప్రయాగములును మధుర బృం
దారణ్య రామేశ్వరాది పుణ్య
దేశముల్ సేవించి త్రిపథగాముఖ పుణ్య
నదులలో నవగాహనంబుఁ జేసి

గోభూహిరణ్యాది గురుదానములఁ జేసి
యందన్నసత్రముల్ పొందు పఱిచె
లలి రాధికాకృష్ణులకుఁ బ్రీతిగా నగ్ర
హారంబు విప్రుల కర్థి నొసఁగెఁ

గీ. తెలఁగి బొంబాయి కలకత్త చెన్ననగర
హూణరాజులతో సఖ్య మొనరఁ జేసి
వారిచేఁ జాల మన్ననల్ వడసి పెక్కు
బిరుదు లంది వెలింగె నా నరవరుండు 48

సీ. వెలయ వేంకటకవి విరచిత రామాయ
ణాంధ్ర కావ్యమువిని హర్ష మొంది
సత్కృపతో జరిశాల్వలు కాంచన
మయహారములు బహుమతి యొసర్చి
మారేళ్ళసీమలోఁ బేరైన పెరుగుప
ల్లాఖ్యగ్రామం బగ్రహార మిచ్చె
బ్రహ్మకైవర్తపురాణంబులోఁ గృష్ణ
జన్మఖండము కవిజనులు మెచ్చ

గీ. నమ్మహాకవిచేత నే యంచితముగఁ
దెనుఁగు సేయించి వేయార్లు ధనము హేమ
భూషలిచ్చి రాధాకృష్ణపుర మనియెడు
నగ్రహారంబులో ద్వాదశాంశ మొసఁగె 49

ఉ. రాజితకీర్తి సర్వజన రంజనుఁ డా నరనాథుఁ డొక్కఁడే
రాజనఁ జెల్లుఁ గాకితర రాజులు రాజులె శక్రచంద్రము
ఖ్రాజను పేరుదాల్చుట కరంబునిరర్థక మెట్టులన్న ఘో
రాజి నొకండు పుణ్యజన హంత యొకండునిశాటుఁ డారయన్

గీ. ద్విజవరేణ్యులచే జగద్విశ్రుతముగఁ
దెక్కు మఖములు సేయించి పెంపు వడసెఁ
బుడమి వేల్పులకును వేలుపులకుఁ దెక్కు
గ్రామము లొసంగె సమ్మహారాజవరుఁడు 51

గీ. అమ్మహారాజశేఖరుం డమితయశుఁడు
లీలతో సర్వసామ్రాజ్య మేలుచుండి
వరుసగా సప్తసంతానవంతుఁ డగుచు
దనరె భువిలోన రెండవధాతకరణి 52

కం. అందగ్రసుతుఁడు రాజపు
రందరుఁ డనఁ బొగడు గనెఁ బురందరకరిరా
ట్కుందేందుయశుఁడు సుగుణా
నందుఁడు గోపాలకృష్ణనరపతి యలరెన్ 53

కం. మును కశ్యపుచే నింద్రుఁడు
ననిమిషపదమందుఁబోలె నటు జనకునిచే
ఘనవేంకటగిరిసింహా
సనమం దభిషిక్తుఁ డయ్యె సంభ్రమ మెసగన్ 54

గీ. శ్రవణరహితుండు కోఁబనిసంబుగల్గు
వాఁడు పాండురదేహంబు వాఁడఁటంచు
నురగపతి రోసి మేదినీతరుణి ప్రీతి
నమ్మహారాజు భుజదండ మాశ్రయించె 55

గీ. ఇంద్రుఁ డమరావతీపురం బేలినట్లు
శ్రీదుఁ డలకాపురంబు రక్షించినట్లు
గరిమ నారాజు వేంకటగిరిపురంబు
పాలనము సేయుచుండు నపారయశుఁడు 56

గీ. శాలివాహనశకమందు శశివసుగగ
నాష్టసంఖ్యలు గల పార్థివాబ్దమందుఁ
బ్రకటితంబుగ వేంకటసుకవిపోత
నీకృతి రచింపఁ జేసె నాలోకవిభుఁడు 57

చ. వితతరసంబు లుగ్గులిడి పెంచి ధ్వనుల్ మఱి వృత్తి రీతులున్
జతురతఁ బాకముల్ రుచిరశయ్యలు చక్కఁగఁ దెల్పి నాల్గలం
కృతుల నలంకరించి తగ నీకృతికన్యను గృష్ణయాచభూ
పతికి నొసంగె వేంకటవిపశ్చిదపశ్చిముఁ డంచితంబుగన్ 58

• షష్ఠ్యంతములు. •

కం. ఏవంవిధగుణగణసం
భావితునకు భావజాభభవ్యాకృతికిన్
సేవితగౌరీవరల
క్ష్మీవరునకు దీనలోకచింతామణికిన్ 59

కం. శ్రీ వెల్గోటకులాంబుధి
జైవాతృకునకు నృపాలజనమాన్యునకున్
దేవాధిపసంకాశమ
హావిభవసమన్వితునకు నమితయశునకున్ 60

కం. అక్షీణవీర్యునకు జన
రక్షణచతురునకు రాజరాజసమధనా
ధ్యక్షునకు శౌర్యజిత హ
ర్యక్షునకు నితాంతఘనదయాదక్షునకున్ 61

కం. ఆర్యనుతచర్యునకు గ్రీ
ష్మార్యమసమతేజునకు సుధాంబుధిసమగాం

క్షీర్యునకు శక్రసన్నిభ
శౌర్యునకు మహానుమేరుసమధైర్యునకున్ 62

కం అతులప్రభావునకు యా
వతలీలామదనునకుఁ బ్రవర్ధితభాగ్యా
న్వితునకు జననుతునకు బుధ
హితునకు గోపాలకృష్ణదేవేంద్రునకున్ 63

## కథాప్రారంభము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లుగా నాయొనర్పం
బూనిన శ్రీశిశుపాలవధమహాకావ్యంబునకుఁ గథాప్రారంభం
బెట్టి దనిన 64

## నారదాగమనము

శా. శ్రీనాథుండు జగన్నివాసుఁడగు శ్రీకృష్ణుండు లోకావన
ధ్యానాసక్తత శ్రీసమృద్ధవసుదేవాగారమందున్ సుఖా
సీనుండై దివినుండి వచ్చు జటిలశ్రేష్ఠున్ విలోకించె భా
షానేత్రంగజుఁ గాయకాంతి విజితాంచచ్చారదున్ నారదున్ 65

మ. చెలు వొప్పన్ దిననాథయానము తిరశ్చీనంబు, వైశ్వానరో
జ్జ్వలయానం బది యూర్ధ్వగం, బహహా! సర్వవ్యాప్తమై
యీానము
జ్జ్వలతేజం బిటు క్రిందుగాఁ బడియెడిన్ జర్చింప నే మంచు, నా
కులతన్ జూచుచునుండి రప్పు డచటం గొల్చున్న వా రందఱున్

చ. తొలుత రుచిప్రతానమని తోడ విభావితరూప మౌటచే
వలనుగ దేహమంచుఁ బిదపన్ సువిభక్తతరాంగ మౌటచేఁ
దలఁపఁగఁ బూరుషుం డనియుఁదద్దయు నిశ్చిత మైనయవ్వేలుం
గలవడ నారదుం డని మురారి యెఱింగెఁ గ్రమక్రమంబునన్ 67

వ. మఱియును 68

ఉ. భూరివినీలనీరదము ముంగలఁ జూడఁగ నయ్యె సాంద్రనీ
హారపటీరహారనిచయాకృతి నమ్మునిశేఖరుండు సొం
పారఁగఁ దాండవోత్సవమునం దిభచర్మము మేనఁ దాల్చి నిం
డారఁగ భూతిలిప్తతనుఁడై కనుపట్టు పురారికైవడిన్ 69

మ. శరదిందుప్రచయాభుఁడై మిగుల రంజత్కాంచకింజల్కపుం
జరుచిస్ఫీతజటాచ్ఛటాకలితభాస్వన్మౌళియై యా మునిశే
ఖరుఁ డొప్పెన్ దుహినస్థలీరుహవిపాకస్వర్ణశోభామనో
హరవల్లీప్రతతీయుతోన్నతతుషారాద్రిన్ విడంబించుచున్ 70

చ. అతులనవాంబుదచ్ఛవిమృగాజినబద్ధవలగ్నుఁడై సము
ద్యతకపిశోరుమౌంజియుతుఁడై శశితోఁ దులదూఁగుమేనితో
వితతసువర్ణసూత్రపరివీతవినీలవిశాలచేలుఁడై
చతురత నొప్పు సీరి క్రియ సంయమి గన్గొన నయ్యె నయ్యెడన్

చ. అనుపమమైన తేయరుచిరాంగరుహాయత హైమమేదినీ
జనితవిపాకవల్లిచయసంభవతంతుకృతోపవీతుఁడై
ఘనహిమజాలశుభ్రుఁ డగు కంజభవప్రియపుత్రుఁ డొప్పె సం
జనితతటిల్లతాకలితశారదనీరధరంబుచాడ్పునన్ 72

చ. కలితమృణాళఖండసితగాత్రవిలగ్ననిసర్గకృష్ణసా
రలలితసూక్ష్మలోమచయరమ్యసమగ్రచమూరుకృత్తిచే

వెలసె విరించినందనుఁడు పృష్ఠగతా_స్తరణంబుచేత న
బ్బలరిపువాహనం బయినవారణరాజమువోలె న_త్తఱిన్ 73

మ. నలు వొప్పన్ ముని సంతతశుభితవీణాబద్ధతంతుకుతో
జ్జ్వలదంగుష్ఠనఖాంకుభిన్న మగుటం జారూల్లసద్విద్రుమం
బులచే ముంగల నర్ధభాగము దగం బూరించినట్లున్న యు
ల్లలదచ్ఛస్ఫటికాక్షమాలికను గేలం బూని యొప్పెన్ రహిన్

సీ. అనిలసమాఘూతమున నసంకీర్ణంబు
గా ననురణనాత్మకస్వరంబు
నిగుడఁ జేయుచుఁ బ్రతినియతసంఖ్యావ్యవ
స్థితఘనశ్రుతిచయాన్వితము లై న
షడ్జాదికము లగు స_ప్తస్వరంబులఁ
బ్రస్ఫుటీకృతము లై పరఁగునట్టి
షడ్జాదికావర స్వరసంఘ భేదత్ర
యారోహణావరోహణపరిక్ర

గీ. మప్రభేదంబు గల మహామహాతి యనెడు
వీణ నటు సారెసారెకు వేడ్క మీఱఁ
గనుఁగొనుచు భూరితేజఃప్రకాశితాఖి
లాశుఁ డై మౌని హరి డాయ నరుగుదెంచె 75

మ. ఘనతన్ వెంబడివచ్చువేల్పులనతుల్ గై_కోలు గావించి పె
ల్పన వారిం దగ నిల్వఁ బంచి తఱితో సర్వార్థసంద్రష్ట యా
మునివర్యుండు వికాటదర్పదళనామోదుండు శ్రీకృష్ణుఁ డు
న్ననగారాతినికేతనాథ మగు స్థానం బర్థిఁ జేరెన్ రహిన్ 76

## • శ్రీకృష్ణ సందర్శనము

గీ. ఇసిసమ్ముఖుఁ డైన యమ్మునిపదంబు
లవని సోఁకక మున్నె జనార్దనుండు
గట్టుపైనుండి లేచు మేఘంబు కరణిఁ
బీఠమున నుండి లేచె సంప్రీతి మెఱయ 77

క. అమితప్రయత్నమున న
న్నమితానమదురుఫణాహినాథునిచే సంక్ర
మమునఁ గ్రింద ధృతంబగు
క్షమపై హరి మ్రోలఁ దపసి చరణము లిడియెన్ 78

మత్తకోకిల. ఆదిపూరుషుఁ డచ్యుతుం డఖిలాంతరాత్ముఁడు కృష్ణుఁ డ
ర్ఘ్యాదిపూజలఁ బూజ్యుఁ డైన మహాత్ము నారదమౌని న
త్యాదరంబునఁ బూజఁ జేసె మహామతుల్ సుతపోధనుల్
మోద మొప్పఁగ రాఁదలంప రపుణ్యవంతులయిండ్లకున్ 79

చ. అనఘచరిత్రుఁ డైనముని నంబుజనేత్రు సఖాజనుల్ హిమాం
జనకుధరంబులన్ బలెఁ బ్రసన్నతఁ గన్గొనునంతలోఁ జిరం
తనముని కృష్ణుఁ డాత్మశయదత్తవరాసనమందు మౌనివ
ర్యుని దన కాభిముఖ్యముగ నుండఁగఁ జేసెఁ బ్రసన్నవక్త్రుఁ డై 80

## • శ్రీకృష్ణ–నారద వర్ణనము •

గీ. ఘనమహానీలరుచి యైనకంసరిపుని
మ్రోల విష్టరమున నున్న మునివరేణ్యుఁ
డపరసంధ్యకు నెదుటఁ బూర్వాద్రి నున్న
ధవళకిరణునిశోభను దస్కరించె 81

గీ. అపుడు యజ్ఞప్రియుం డైనహరి ప్రసన్నుఁ
డైన మునిపతిఁ బూజించి హర్ష మొందె;
సాధులను వరివస్యచే సంగ్రహింపఁ
గోరుదురు గాదె సతతంబు యోగిజనులు 82

గీ. తాపసేంద్రుఁ డశేషత్రిధోపహృతము
లఘువినాశసమర్థంబు లైనకుండి
సలిలములు పాణిచేఁ బట్టి శౌరి మీఁదఁ
జల్లె హరియు నతాస్యుఁ డై సంగ్రహించె 83

క. మునియనుమతి గొని నవఘన
తనుఁడగు కృష్ణుఁడు వసించెఁ దపనీయవరా
సనమున; నది యపు డొప్పెను
ఘననీలభద్రకలితకనకాద్రిక్రియన్ 84

చ. చెలువుగఁ గాఁక నార్చినపసిండిబిగిందుళకించు వల్వయుం
గలయఁగ నిండుచందురునికందువఁ బోలినమేని చాయయుం
గలిగి మనోజ్ఞవేషుఁ డగు కంజదళాక్షుఁడు చూడ నయ్యె నం
కలితవిశాలబాడబశిఖాయుతచారుపయోధిచాడ్పునన్ 85

చ. బలరిపునీలతుల్యరుచిభాసితశౌరితనుప్రభాళి సం
వళితము లైన నారదుని వర్ష్మరుచుల్ విలసిల్లె రాత్రియం
దలరు చలన్మహీరుహదళాంతరగోచరశీతధామరో
చులక్రియ నప్డు చూపఱులచూడ్కులకుం గడు విందొనర్చుచున్

చ. మఱియుఁ బ్రఫుల్లనూతనతమాలసుమోపమకాంతిరాజిచేఁ
బరువడి సప్తపర్ణసుమపాండుమరీచులచేఁ బరిస్ఫుర
చ్చురితవినిర్మలద్యుతుల నొంపు వహించిరి యేకవర్ణు లై
హరియు మునీంద్రుఁ డర్కతనయాన్వితగాంగజలంబు కై వడిన్

మ. లయకాలప్రతిసంహృతాత్ముఁ డగునేలక్ష్మీశు సత్కుక్షిలో
రయ మారన్ సవికాసతన్ భువనముల్ రాజిల్లు నక్కుక్షిలో
నియతిం దాపసరాట్సమాగమభవోన్నిద్రోరుసంతోషసం
చయముల్ మిక్కిలి దుర్వహంబులగుచున్ సాగెన్ మహాఘోరమై

చ. దినకరునిం బలెన్ నిశితదీధితి యైన తపస్వివర్యునిం
గనుఁగొని సమ్మదంబున వికాసము నొందుటఁ జేసి ప్రాప్తనూ
తనరుచి గల్గునేత్రములు దాల్చిన కృష్ణుఁడు పుండరీకలో
చనుఁ డనుప్రస్ఫుటాహ్వయము సత్యముగా నొనరించె
నత్తఱిన్ 89

• శక్ర సందేశము–ఉపోద్ఘాతము •

వ. అప్పుడు 90

ఉ. ఆ వసుదేవపుత్త్రుఁడు, మహాగుణశాలి, విసారిశుభ్రదం
తావళిదంభశీతకిరణాంశులచేత స్వభావశుభ్రసు
శ్రీవృతగాత్రమున్ సితిమచే ఘనసౌధము నట్లు చాల సం
భావన సేయుచున్ స్మితసమంచితవాక్యముచేత నిట్లనున్ 91

చ. అనఘ! శరీరధారులకు నద్భుతవైఖరి నీదు దర్శనం
బనిశము మూఁడుకాలములయందును బాత్రతనొందియుండు నె
ట్లనిన నఘం బడంచు నిపు డాయతియందును భద్రహేతువౌ
ననుపమపూర్వపుణ్యవిభవాధికతన్ గృతమయ్యెఁ గావునన్ 92

మ, అపరిచ్ఛిన్న సహస్రరశ్మియగు నయ్యంభోజమిత్త్రుండు వి
ష్టపమందే తమమున్ హరించుటకుఁ దా శక్తుండుగాఁ డయ్యె, న
వ్విపులాజ్ఞానతమంబు మీ యగణితావిర్భూతతేజంబులన్
నిపుణత్వంబునఁబోవు, దూరగతమై నిర్మూలమై, తాపసా! 93

సీ. అనఘాత్మ! ప్రజలకు నతిశుభకారి సు
పాత్ర నిక్షేప నిర్వ్యసన చిత్తుఁ
డగు సృష్టికర్తచే ననిశంబు ధనసంప
దలకును బోలె వేదంబులకును
గర మర్థి దానభోగములచే వ్యయమందుఁ
బరఁగ నామ్నాయంబువలన మఱియు
నానంత్యమునఁ జేసి యక్షయుండగు నీవు
నిక్షేపముగ ధాత్రి నిర్ణయింప

గీ. బడితి, వజపుత్ర! నీదృష్టిపాతమునను
యతికృతార్థుండనైతి నే నైననీదు
గురుతరోక్తులు నాలింపఁ గోరినాఁడ;
శ్రేయమందు నెవ్వాఁడు సంతృప్తి నొందు? 94

వ. అని యిట్లు ప్రియవచనంబులు పలికి యాగమన ప్రయోజనం బడుగువాఁడై వినయంబున నమ్మునీంద్రునిం జూచి, మహాత్మా! నిస్పృహుండవైన నిన్నాగమన ప్రయోజనం బెయ్యది? యని యడుగుటది మిక్కిలిధార్ష్ట్యంబగు నైనను సముదితాత్మ గౌరవంబును శ్లాఘ్యంబు నగు భవదీయాగమనంబె మాకు ధార్ష్ట్యంబు నిచ్చుచునదని పలికిన, నమ్మురారి వచనంబు విని నారదుండు, పురుషోత్తమా! నిస్పృహుండ వని నీవు వచింప నర్హంబు గాదు; పరమయోగుల కైన నీవు సాక్షాత్కరణీయుండ వట్టి నిన్ను సందర్శించు టదియె మాదృశులకుఁ బ్రయోజనం; బింతకంటె నన్యం బెయ్యది గలదు? 95

సీ. సముదీర్ణ విషయవాంఛా ప్రతిరోధకం
బతుష్ణి మగుట జనాళిచేత

నత్యంతదుర్గమంబైన మోక్షపథంబు
నొందిన సుమనస్విబృందమునకు
ననపాయసంశ్రయంబైన ప్రాప్యస్థాన
మగు దీవు; పూర్వజ్ఞులైన మునులు
నిగృహీతచిత్తులై నెగడు యోగులచేత
నధ్యాత్మదృష్టిచే నధికయత్న
మున గృహీతునిఁగా, సర్వభూతమయునిఁ
గాఁ, బ్రకృతికంటెఁ బరునిఁగా, ఘనపురాణ
పురుషునిఁగ, సర్వసాక్షిఁగా, భూతములకు
నీశ్వరునిఁగా నెఱుంగుదు, రీశ! నిన్ను 96

అని యిట్లు భగవంతుని నిర్గుణస్వరూపంబు వినుతించి ప్రస్తుతో
పయోగిత్వంబున సగుణంబు నాశ్రయించి వెండియు నిట్లనియె 97

వరగ లోకత్రయైకస్థ పతివి నీవు
గాన లీలాసముద్ధృత క్ష్మాతలంబు
చారుభుజగౌకమునకు నాచ్ఛాదనముగఁ
జేర్చితి వహీశ్వర స్తంభశిరములందు 98

తర. అరయ నీవు నరావతారుఁడ వయ్యు, సంసృతినాశకృ
ద్వరగుణంబుల నెల్లవారి నధఃకరించితి వట్టి నీ
గురుతరాద్యపురాణమూర్తిని గూఢ సన్మహిమంబు లె
వ్వరు నుతింప సమర్థు లిద్దరఁ ? బద్మపత్రనిభేక్షణా ! 99

గహ్వరీభార మడఁప నాకమున నుండి
యవతరించితి వీవు మహానుభావ !

కుక్షినిక్షిప్త నిఖిలలోకుండ వగుట
నంతకంటెను భూభార మధికమయ్యె 100

మ. క్రమ మొప్పన్ శిశుపాల కంస ముఖలోక ద్రోహులన్ భూరితే
జమునం జంపుట కీవు భూతలమునన్ జన్మింప వేనిన్ మహా
త్మ! మహాయోగులు యోగదృష్టినెపుడున్ దర్శింపఁగాలేని నిన్
విమలున్ మాదృశ చర్మచక్షువులకు న్వీక్షింప నెట్లయ్యెడిన్ ?

గీ. విశ్వవల్లభ! దుర్మద పీడితమగు
నీజగముఁ బ్రోవ దక్షుండ వీవె కావె;
పటుతమస్కాండమలినసఖంబు గడుఁ బ్ర
కాశముగఁ జేయ రవిదక్కఁ గలఁడె యొరుఁడు ? 102

గీ. హరి మృగప్రాయులైన కంసాదినృపులఁ
జంపుటది యొక్క ఘనమని జనులు నిన్నుఁ
బొగడుదురు కాంచనాక్షప్రముఖనిశాట
కరినివహాంతకు నీ కది గర్హణంబు 103

వ. ఇట్లు స్తుతివాక్యంబులచేత హరి నభిముఖుం గావించుకొని
యాగమన ప్రయోజనం బెఱింగించుటకు నుపోద్ఘాతంబుగా
వెండియు నిట్లనియె 104

సీ. జగదేకవల్లభ ! విగతశ్రముండవై
క్రమమున నీవు దుర్జనుల నెల్ల
నరసి చంపుటకు నీయంతన నీవె ప్ర
వృత్తుండ వైతివి వివిధగతుల ;
నైన నేకాంతంబునందు నీతోడ భా
షింపఁగ గోరు నా చిత్తమిపుడు

చతురత నన్ను వాచాలునిఁగా జేయు
చున్నది; గావున నో యుపేంద్ర !

గీ. యింద్రసందేశమున జనహితమునైన
వచన మచిరంబుగా విన్నవం బొనర్తు ;
నింద్రకార్యధుర్యత నొంది యొసఁగు నీవు
ప్రీతితో దాని నంతయు వినఁగవలయు 105

• హిరణ్యకశిప ప్రభావవర్ణన •

చ. విమతులచే నొకింతయును భీతి నెఱుంగనివాఁడు సూర్యతే
జమున వెలుంగువాఁడు దితి జాతుఁడొకండు గలండు వాఁడొగిన్
గొమరుగ నింద్రశబ్దమునకుంగల యర్థ మడంచి సంతతం
బునహితుఁ డై హిరణ్యకశిపుండను పేరంజరించు నిత్యమున్ 106

చ. పరగ సమత్సరుండగుట, వాఁడసురుండను దారుణాఖ్యకున్
ధరఁ బ్రథమాభిధేయతను దాల్చె; మహాబలుఁడైన వానిచేఁ
జిరగతి దేవతాతతుల చిత్తములందు మహాభయంబు సు
స్థిరముగ నించఁగాఁ బడియెఁ; జెప్పెడిదేమితదుగ్రకృత్యముల్ ?

చ. హరియమపాశియక్షులు దిశాధిపులైనను వారి వీటిలో
నరయక రాగసంహృతము లై తమ యంత నె సర్వసంపదల్
స్థిరముగ రాక్షసేంద్రుని భజించెఁ దదాదిగ సంపదల్ వసుం
ధర నతిచంచలంబు లని తద్దయు నాడిక గాంచె నెంతయున్

ఉ. నాకులు దైత్యధాటికి మనంబున భీతిలుచున్ స్వరూపశో
భైకఫలంబులైన నగరాదులకుం బటు శస్త్రకోటికి
స్వీక బలాలి కాయసవినిర్మితకంచుకచాపపాళి క
స్తోకత సంవిధానములు శూరులు చేసిరి పుష్కలంబుగన్ 109

తరల. భువనసంచరణైకశీలుఁడు భూరిసంపద కాశ్రయుం
డవు నిశాచరనాథుఁ డేదిశ కర్థి నేగుఁ దదాశకు
న్దివిజవర్యులు మౌళిబద్ధమణీగళత్కరయుగ్ములై
యవిరళస్పృహ మూఁడు సంధ్యల యందు మ్రొక్కుదు
రెప్పుడున్ 110

చ. వితతసటాచ్ఛటానిలవిభిన్నఘనంబగు భూరినారసిం
హతనువు దాల్చి ముగ్ధలలనాంచదురోభవసంగభంగురా
యతనఖరంబులన్ ఘనరణావని నద్దనుజేంద్రవక్షము
ద్ధతి విదళించి త్రుంచితివి తామరసేక్షణ ! నీవు ప్రేల్మిడిన్ 111

• దశగ్రీవ ప్రభావవర్ణన •

మ. ఘనుఁ డాదైత్యుఁడు భూరిదర్పభవదోఃకండూతి సైరింపలే
కనితాంతస్పృహ వెండి నిర్జరులతోఁ గయ్యంబు గావింపదే
వనివాసక్షతరక్షణం బగుచుఁ గుప్యద్ఘోరరూపంబుతో
దనుజుం డై జనియించె రావణుఁడనా దైత్యాన్వయ
స్వామి యై 112

వ. మఱియు నా రావణుండు త్రైలోక్యాధిపత్యంబుఁ గోరి యత్యం
తోత్సాహంబువలనఁ దన దశమశిరంబు ఛేదింపం దలంచి, యిష్ట
సాహసుండు గావునఁ దన యిచ్ఛకుం దగిన యీశ్వరవరంబును
విఘ్నంబునుం బోలె నుత్ప్రేక్షించె నదియునుం గాక 113

గీ. లీలఁ గైలాసగిరిని చలింపఁ జేసి
చలనసంభ్రమత్రస్తతుషారశైల
కన్యకాస్వయంగ్రాహసుఖంబు చేత
శివుని వరదానమునకు నిష్కృతి యొనర్చె 114

చ. ఘనబలశాలియైన దశకంఠుఁడు శక్రుని మీఁద నల్గి త
ద్వనమును బెల్లగించె మఱి వత్పుటభేదన మడ్డగించె న
య్యనువున రత్నముల్ గొనియె, నచ్చరలన్ జెఱఁబెట్టె నీగతిన్
బవివడి రేపవల్ దివి కుపద్రవ మర్థి నొనర్చె బల్విడిన్ 115

చ. తలఁప దశాస్యుచేత ననుధావితుఁడై యనిలో బలాంతకుం
డలికి పలాయితుండగుచు నభ్రము నాథసలీలయానను
ల్దలఁపఁడు, వార్థిఁ బుట్టిన చలద్దయచిత్రపదక్రమంబునుం
దలఁపఁడు, కేవలం బనుదినంబుఁ బ్రశంస యొనర్చు
శీఘ్రతన్ 116

గీ. కర మధీరలోచనుఁడగు కౌశికుండు
తపనసముఁడైన దైత్యుని దర్శనంబు
నేయఁ జాలక కాంచన శిఖరగుహల
నొదిగి దినములు గడపుచు నుండు ననఘ! 117

చ. కలితబృహచ్ఛిలాకఠిన కంఠవిఘట్టన జాతపావకో
జ్జ్వలకణజాలమొటనవిషహ్యతరం బగు విష్ణుచక్రమా
ఖలదనుజాన్వయప్రభుని కంఠమునం దతిమోఘ మయ్యెఁగే
వల భువనైకభర్తయయి భాసిలె వాఁడధిక ప్రతాపుఁడై 118

సీ. మఱియు నద్దైత్యుఁడు మదమునఁ గరిఁ బోలెఁ
జతురత నిర్భిన్న శంఖుఁ డగుచుఁ
గలుషితంబు నిరస్త గాంభీర్యము నపాస్త
గురుపుష్పకంబగు గుహ్యకేంద్రు
మానసంబును జాల మథితంబుగాఁ జేసె;
నదియును గాక జన్యంబులందు
వరుణదేవునిచేతఁ బ్రహితంబులైన దు
ర్ధమనాగరాజపాశములు దనుజ

గీ. వల్లభ సరోషహుంకారభయదరవము
చేత వ్యావర్తితంబులై చిత్తమందు
సాధ్వసము గూర్పఁ బ్రమ్మఱ జవములఁ జని
ముట్టి వాలిగళంబునుఁ జుట్టుకొనియు 119

చ. చెలువుగఁ జాపదండము రచింపఁగఁ గోరి దశాననుండు ని
చ్చలు యమవాహనంబయిన సైరిభరాజవిశాలశృంగమం
డల మటు వెళ్లఁగింప నది తత్పృథుభారము లేకయుండియుం
జెలువఱి వ్రీడనొంది వగచేఁ దలయెత్తకయుండు నెప్పుడున్

గీ. అనఘ! శుచికాలమందైన నధికభీతి
నర్కుఁ డసమగ్రకరముల నంటికొనుచు
విమలశీతలఘర్మాంబుబిందుమౌక్తి
కంబుల నలంకరించుఁ దత్కమలముఖుల 121

చ. అలఘుకళాసముద్రుఁడు శశాంకుఁడు దైత్యునియింటఁ గేవలన్
గొలుచుచు మానినీప్రణయకోపము దీర్చుచు రాగసంప
ద్దలకొనఁ జేయుచున్ రతివిలాసము నేర్పుచు సంచరించు న
వ్విలసనశీలుఁ డౌ దనుజవీరునకున్ శశి నర్మమిత్రుడై 122

తరువోజ. అతిదురహంకారుఁడగు దశాస్యుండు వితతవిలాసినీ విభ్ర
మార్థంబు
తతమతిఁ జెవులకు దంతపత్రికలు హితముగా రచియింప నిచ్చఁ
దలంచి
ప్రతిలేనిబలమునఁ బాసిల్లు విఘ్నపతి దంత మొక్కటి బలిమిమైఁ
బెఱికె
నతఁ డేకదంతుఁడై యందున నలరె జతముగా నది వెండి జని
యింపదయ్యె 123

మ. అవరోధప్రమదాంబరోచ్చలన సువ్యక్తాగుఁడై యుండి త
ద్ధవళాక్షీస్ఫురదూరులోలఘననేత్రశ్రేణి యా వాని కా
ప్తవరుం డైన సమీరుచే సనపరాధస్పర్ధబద్ధామరుల్
స్తవముల్ జేసి విముక్తులై చనిరి స్వస్వస్థానముల్ జేరఁగన్ 124

గీ. జనతిరస్కారియగు వాని సత్ప్రతాప
మహిమచే ధిక్కృతుండయ్యె దహనుఁ డాధి
చేఁగృశింపుచు బాష్పముల్ జిలుకరించి
ద్విగుణముగ ధూమపటలంబు విస్తరించె 125

వ. మఱియు నత్యుగ్రతేజుండగు రావణుని సేవించుటకు సర్పం
బులు స్వకీయంబైన పరమర్మభేదకద్విజిహ్వాతాదోషంబు పరి
త్యజించి యజిహ్వాగమనంబులైన సకర్ణవర్గంబులచేత నిజభుజం
గత్వంబు భజింపఁబడ దయ్యె నదియునుంగాక 126

చ. విపులతదీయవారణవిభిన్నవిశాలకటంబు లొటచే
నపరతదానధారలయి యోడి దిశేభములున్కిపట్లకున్
జపలతఁ బాసి యచ్చటనె సంతతమున్ వసియించినందునన్
విపులదిశాగజంబులను పేరది సార్థకమయ్యె వానికిన్ 127

మ. కుసుమాస్త్రజ్వరతాపతప్తమగు రక్షోభర్త నెమ్మేనికిన్
వ్యసనాత్యుష్ణములైన దైత్యకులరాడ్బందీకృతేంద్రాంగనా
శ్వసితోరుశ్వసనప్రచారముల చే సౌఖ్యంబు వాటిల్లిన
ట్లనమానందము గల్గ దెప్పుడు పటీరాంచద్విచిత్రంబులన్ 128

మ. అనిశంబున్ ఋతువుల్ సమగ్రఫలపుష్పాఢ్యంబులై భల్ తపం
బును హేమంతము సన్మనోజ్ఞశిశిరంబుం దద్వనం తేందిరన్
ఘనవర్షర్తు శరత్తులుం గలసి వేడ్కన్ దన్మహాపట్టణం
బున చాస్తవ్యకుటుంబితన్ వెలయు నామోదంబు సంధిల్లఁగన్

తరువోజ. అనఘాత్మ ! యజుఁడ వవ్యయుఁడ వనాది వసుపమాన బలుండవై నట్టి నీవు
తను వధించుటకు నై తత్పరత్వమున మనుజలోకంబున మను కులమందు
ఘనరాముఁడను పేరఁ గలుగుట యెఱిఁగి వినయంబుతో సీత విడువఁడు వాఁడు ;
పనివడి మానులై పరగినవారు ప్రణుతాభిమానైక ద్రవిణులు గారె ?　130

ఉ.　అప్పుడు, రామరూపమున నర్మిలి నీవు మహాపయోనిధిం
దప్పక సేతుమార్గమున దాఁటి యనిన్ వనితాపహారకున్
గప్పిన కిన్కచే నిశిత కాండములన్ వధియించి పుచ్చవే !
యిప్పుడు,తచ్చరిత్రము నహీనమతిం దలపోయు,మచ్యుతా!

**శక్రసందేశము**

వ.　మహాత్మా ! పరప్రతారణ పరుండైన యా రావణుం డిప్పుడు శైలూషుండు రూపాంతరంబునుం బోలె భవాంతరంబు నొంది శిశుపాలుండను సంజ్ఞచేతఁ దిరోహితాత్ముం డై యన్యులచేత నతం డె యితండని యెఱుంగంబడక వర్తింపుచున్నవాఁడా శిశు పాలుండు బాల్యంబున భుజచతుష్టయవంతుం డై ముఖంబుచేతఁ బూర్ణచంద్రప్రతిముండై లోచనత్రయోపేతుం డై యుండు నిప్పుడవి యన్నియు నంతర్హితంబు లగుటం జేసి తరుణుం డై కరాక్రాంతమహీభృద్వరుం డై యత్యున్నతతేజంబున సాక్షా త్సూర్యుండై వెలుంగుచున్న వాఁ డదియునుంగాక　132

చ.　'కడిమియదృచ్ఛచే నమరకర్బురకోటి నమగ్రహింపఁగాఁ
గడువడి నిగ్రహించుటకుఁ గర్తను నేనె' యఁటంచు గర్వి యై

తడయక ధాతృముఖ్యసురదత్తవరంబున వీర్యసంపదల్
వడసిన రావణాదులను వాఁడు హసింపుచునుండు నిచ్చలున్

చ. పరగ జిగీషుఁడైన శిశుపాలునిచేత బలావలేపతన్
దురుసుగ నిప్పుడున్ జగము తొంటి విధంబున గాసి నొందెడున్;
పరసతియైన కాంత వలె వారక సుస్థిరమౌ స్వభావమున్
ధరఁ బ్రతిజన్మమందవి తథంబుగఁ బూరుషు నొందునే కదా!

గీ. అట్లతిక్రాంతదైవాజ్ఞుఁడైన వాని
యమనికేతనాతిథిని గావింపుమీవు!
పృథివి కటు పీడ సేయు శుభేతర ప్ర
చారుల వధించు టది సాధుసమ్మతంబు 135

గీ. అరివధముచేత ధృతదార్ఢ్యమైన శక్రు
చిత్తమతిసాంద్రపులకకశీకుచాగ్ర
ధృత పరీరంభ పీడనోన్నత సహత్వ
మొందుఁ గాకిటుఁ మరల నస్పంద మగుచు 136

వ. అని యిట్లు విన్నవించి సురమునియగు నారదుం డాకాశం
బునకుద్గమించి చంద్రుని కాంతి వహింపుచుండ నప్పుడు చేది
దేశాధీశ్వరుండైన శిశుపాలునియందతిక్రుద్ధుండైన చక్రపాణి
వదనంబునందు గగనంబునందుం బోలె సంతతంబు శత్రువినాశ
సూచకం బగు నుత్పాతవిశేషంబు భ్రూభంగవ్యాజంబున నా
స్పదంబు గావించె* నయ్యుపేంద్రుం డింద్రసందేశశ్రవణా
నంతరంబున 137

## • శ్రీ కృష్ణ సంశయము •

గీ. హవముఁ జూడఁ బార్థుఁడు పిల్వ నంపెఁ జైద్యుఁ
జంపు మని చెప్పి పుత్తెంచె జంభవైరి

* మూలమున ప్రథమసర్గ సమాప్తము.

యొద్ది సేయుఁదు ? సెద్దాని నిపుడు విడుతు ?
ననుచుఁ గార్యాన్వయాకులుం డై మురారి 138

## • మంత్రాలోచనము •

గీ. గగనమున గురుకావ్యానుగతహిమాంశు
కాంతిని వహించి యుద్ధవ కామపాల
సహితుఁ డై రమ్యమగు సభాస్థలముఁ జేరె
వేడ్క మీఱ మంత్రంబు గావించుకొఱకు 139

క. నయముగ జగదవనార్థము
ప్రియ మొప్పఁగఁ దత్సభాస్థలీవేదిక పై
నయమున నన్నరవహ్ని
త్రయము ప్రకాశించె భూరితరతేజమునన్ 140

క. వితతమణి స్తంభంబులఁ
బ్రతిబింబితులగుచుఁ జుట్టు పౌరుషసంఘా
వృతులై న కరణి నొప్పిరి
చతురత నమ్మువ్వురతివిశాలవిభూతిన్ 141

సీ. ప్రీతి నుద్ధవ రామ కృష్ణు లేయుత్తుంగ
హైమపీఠము లపై నధివసించి
రా పీఠముల చేత నంచితకేసరి
క్రాంతత్రికూటశృంగములు చాల
నుపమింపఁగానయ్యె; నపుడు విచక్షణుం
డగు హరి యుద్ధవ హాలధరులకుఁ
గార్యద్వయమునకుఁ గల్గిన విప్రతి
పేధంబు దెలిపె విశేషయుక్తి ;

గీ. మాఘ్యముకుళాగ్రరదనుఁ డౌ మధువిరోధి
వాణి విద్యోతితాంతస్సుఖంబులైన
సుస్మితంబులచేఁ బరిశుద్ధమైన
కరణిఁ బ్రస్ఫుటవర్ణమై వఱలె నపుడు 142

• శ్రీకృష్ణుని తొలిపలుకులు •

గీ. వరుస మద్వాక్యములు భవద్వాక్యములకు
నవసరం బిచ్చుటకు నయ్యె, ననఘులార!
నలువుగాఁ బూర్వరంగంబు నాటకీయ
రమ్యవస్తుప్రసంజనార్థంబు గాదె? 143

వ. దిగ్జయశీలురైన భీమార్జునాదిభ్రాతల చేతఁ గరదీకృతసకల మహీపాలుం డగు యుధిష్ఠిరుండు మనసాహాయ్యంబు లేకయే యాగంబు నిర్వర్తించుటకు సమర్థుం డై యున్నవాడు; ప్రవర్ధమానుం డగు శత్రుండు సఖ్యంబు గోరు పురుషునిచేత నౌదాసీన్యంబునఁ జూడం దగినవాడు కాఁడు; వృద్ధినొందుచున్న రోగంబును శత్రుండును దుల్యవృత్తి గలవారని చెప్పంబడుదురు; గావున 144

సీ. ఒనరఁ జైతృష్వసేయుండగు శిశుపాలుఁ
డెలమి బంధుండయ్యు ఖలుఁడు వాఁడు
సతతంబు నాకపకృతిసేయుచుండు న
ట్లయినను దాని నే నరయకుందుఁ;
బరగ లోకంబును బాధింపుచున్నవాఁ
డది నాకు మిక్కిలి యార్తి నొసగెఁ;
దవిలి భవన్మత శ్రవణపర్యంతంబు
నామతం బిది; మీరు నయమెలర్ప

గీ. నార్యవర్యు లాలోచించి కార్యసరణి
దెలుపుఁ డిప్పుడు; భువి నెంత ధీరుఁడైన

నొకఁడు గావించు మంత్రంబు ప్రకటితముగ
సర్థనిశ్చయసందిగ్ధ మగుచు నుండు 145

వ. అని యిట్లు కృష్ణుం డభిధేయసమ్మితాక్షరం బైన వాక్యంబుఁ బలికి, యూరకుండె నుత్తమపురుషులు ప్రకృతిచేతనే మితభాషులై యుందురుగదా! యప్పుడు 146

## • బలరాముని వర్ణనము •

గీ. శాత్రవకృతాపరాధసంస్మరణజాత
వితతసాంద్రపశ్చాత్తాప విస్ఫురితము
సుదతిబింబోష్ఠచుంబనచుంచువు నగు
నోష్ఠమున లక్షితుఁడయి యొప్పు వాఁడు 147

గీ. మద్యసేవారుణితఘూర్ణమానములును
రేవతీవదనోచ్ఛిష్టపావనపుట
యుతము లగు లోచనంబుల నొప్పు వాఁడు
నురుక్రుధోన్నమితాంగుఁ డై వఱలు వాఁడు 148

గీ. గాఢపరిరంభలోలుపకామినీస్త
నాతికార్కశ్యసాక్షిణి యగు సుగంధి
దివ్యవనమాల నభిమానదీప్తవదన
వాతముల వాడఁ బాఱించు వాఁడు మఱియు 149

గీ. నిబిడకుండలకలిత మాణిక్యశకల
ప్రభలచేత నీలాంబరాభంగసంగ

రుచిని నవచూతపల్లవరుచిని గాఁగ
నంచితంబుగఁ గావించు నట్టి వాఁడు 150

గీ. వితతసంధ్యారుణవ్యోమ విస్ఫురత్స
మగ్రతారాగణంబుల ననుకరించు
శత్రువిద్వేషరక్తాంగసంగిసాంద్ర
ఘర్మజల బిందువులు దాల్చి క్రాలువాఁడు 151

మ. తతసౌరభ్యకకుద్మివృత్రివదనాంతర్వ్యాసలబ్ధాధివా
సిత మౌ మద్యరసంబుచేతఁ గృతసంశ్లేషాననా మోదమున్
సతతంబు న్వమియించువాఁడు నయశాస్త్రప్రోక్తసద్యుక్తులన్
జతురత్వంబునఁ దెల్పువాఁడు ఘనుఁడా సంకర్షణుండత్తఱిన్

గీ. తాను మొదలఁ జెప్పఁ దలఁచి తత్క్షణమె ని
జోక్తి వినఁ దలంచి యూరకున్న
యుద్ధవుని మనోజ్ఞసిద్ధాంతవాక్కుల
కవసరంబు నిచ్చు నట్టి వాఁడు 153

గీ. వదనకపటపద్మపర్యంతసంచర
చ్చంచరీకములకుఁ జలదుదగ్ర
దంతరుచులచేతఁ ధావళ్యమొసఁగుచు
నింపు సొంపు మెఱయ నిట్టు లనియె 154

• బలరాముని యభిప్రాయము •

గీ. హరి మొదల యానపక్షంబు నాశ్రయించి
దోషరహితం బదీన మై దొరయఁ నట్టి
వాక్య మెయ్యది పలికె నవ్వచనమునకు
నొనర నటు సేయు టదియె సుమ్ము త్తరంబు 155

సీ. ఇంధనరాశిదహించు పావకుడు దీ
ధితిచేత సూర్యు నతిక్రమింపఁ

జాలని క్రియఁ గాఁడు సంక్షిప్త మైన యీ
వచనంబు బహుళతరవాక్యచేత
నతిశయింపఁగఁ జాలఁ; దటు కాన మితపదం
బర్థగౌరవము నై యతిశయిల్లు
హరివాక్యమునకు మద్గురుపరభార్గవవా
క్యము భాష్యభూత మై యలరుఁ గాక;

మహితమతులు సెప్పు మాటలు ప్రతివాది
వక్త్ర యైన మూఁగ వానిఁ జేయు;
నవని సంతతంబు ననుకూలవాది యా
వాఁడు మందుఁ డైన వాగ్మిఁ జేయు 156

మందబుద్ధులయ్యును గొందఱు దుర్మేధులగు వా రౌశనసాది గ్రంథంబులు పఠించి సంధివిగ్రహయానాసనద్వైధీభావ సమాశ్రయంబు లనియెడు షడ్గుణంబులును బ్రభుమంత్రోత్సాహంబు లనియెడు త్రిశక్తులును శక్తిత్రయసాధ్యంబు లైన పురుషార్థలాభాత్మక ప్రభావసిద్ధిమంత్రసిద్ధ్యుత్సాహసిద్ధు లనియెడు సిద్ధిత్రయంబును క్షయ వృద్ధి స్థాన సంజ్ఞికం బైన యుదయత్రయంబును వ్యాఖ్యానంబు సేయుటకు సమర్థు లై యుందు రనాలోచితకార్యం బైన వావదూకుని వాగాడంబరంబు లక్ష్యంబు వలన స్ఖలితబాణం బైన ధనుష్మంతుని వల్గితంబు నుంబోలె నిష్ఫలంబగు; సర్వకార్య శరీరంబులందు సౌగతులకు రూప వేదనా విజ్ఞాన సంజ్ఞా సంస్కారంబు లనియెడు స్కంధపంచకాతిరిక్తం బైన యాత్మ యెట్లు లే దట్లు రాజులకుఁ గర్మారంభోపాయ పురుషద్రవ్య సంపద్దేశకాల విభాగవినిపాతప్రతీకారకార్యసిద్ధు లనియెడు పంచాంగంబుల కంటె వ్యతిరిక్తం బైన మంత్రంబు లేదు; 157

గీ. మఱియు సర్వాంగసంవృతమంత్ర మదియ
ధీరుఁడైన యోధుఁడు వోలెఁ దేజ మలరఁ
బరవిదారణశంకచేఁ బరగఁ బెద్ద
కాల మటు నిల్కడ వహింపఁ జాలదయ్యె 158

క. మానుగఁ దన కుదయ మరివి
హీనతయును రెంటి నెఱుఁగు టిది నీతి; పరి
జ్ఞానులు దీనిం గైకొని
పూనిక వాగ్మితను బ్రచురముగఁ జేయఁ దగున్ 159

క. తన కెంత కలిమి గల్గిన
జననాథుఁడు తృప్తినొందఁ జన దందులకున్
వనరాశి పూర్ణుఁ డయ్యును
ననిశము శశి రాక గోరు టది గుఱి గాదే? 160

క. ధర నల్పసంపదకు నె
వ్వరు తృప్తి వహింతు రట్టి వారిఁ దదల్పా
స్థిరసంపద నల దైవము
చిరకాలము వృద్ధి నొందఁజేయదు ధాత్రిన్ 161

క. కర మభిమానము గల భూ
వరు లరులను మొదలు ముట్ట వధియింపక యి
ద్ధర నుదయ మొంద రిందుకు
గురుతమము నడంచు రవియె గుఱి యగు ధాత్రిన్ 162

క. వాలాయము పగతుర ను
న్మూలింపక సుప్రతిష్ఠ నొంద నగునె? పై
వ్రాలిన ధూళిని గ్రిందికిఁ
దూలింపక జలము దేఱి తోఁచునె యెందున్? 163

వ. మఱియు నుపకారాపకారంబుల లోన నెద్ది యేనియు నొక క్రియచేత నిర్వృత్తులైన కృత్రిమమిత్రుండును గృత్రిమశత్రుండును యావజ్జీవపర్యంతంబు నేకస్వభావంబున నుందురు గావున వారు బలవంతులై యుండురు వారలుపకారాపకార కార్యవశంబువలన నిర్వృత్తులై యుందురు; సహజప్రాకృతులట్టివారుగా రెట్లనిన:-ఏకశరీరావయవవంతులైన మాతృష్వసేయ పితృష్వసేయాదులు సహజ మిత్రులు; పితృవ్యతత్పుత్రాదులు సహజ శత్రువులు; ప్రాకృతుండు పూర్వోక్తకృత్రిమసహజలక్షణరహితుండును విషయానంతరుం డైన రాజు ప్రాకృతశత్రుండు; తదనంతరుం డైన రాజు ప్రాకృతమిత్రుం డగు; నాసహజ ప్రాకృతశత్రుమిత్రులు తాదాత్మ్యకార్యవశంబు వలన నియమంబు లేక యుభయరూపత్వంబు నొందుదు రుపకారులై రేని సహజప్రాకృతశత్రువులతోడనైన సంధి సేయందగు; నపకారులై రేని సహజప్రాకృతమిత్రులతోడనైన సంధి సేయం దగ దుపకారాపకారంబులు శత్రుమిత్రులకు లక్షణం బని తెలియం దగిన యది; సాక్షాచ్ఛత్రునితో సంధియు మిత్రునితో విరోధం బెట్లు గావింపవచ్చు నంటి రేని యదికార్యవైపరీత్యంబు వలన దోషంబు గాదు; కావున సహజమిత్రత్వంబు నందును శిశుపాలుండు కార్యంబుచేత శత్రుండు; గావున వాం డవశ్యంబు హంతవ్యుండు 164

క. అరి యొకం డైనను వాండి
ద్దరలో మనియుండు నంత దాంక మనల వే
జెఱ వెట్టుం జంద్రసూర్యులం
దఱిఁగని బాధించుం గాదె? తమ్ముఁడొకఁడైనన్ 165

క. మునురుక్మిణిం దెచ్చిన నాం
డనఘా! యపకృతి యొనర్చె నా చైద్యుకున్;

విను ముర్విౕ వైరవృత్తం
బున కెంతయు యువతిజనులు మూలముగాదే ? 166

క. నరకుని వధించుటకు నీ
వరిగిన తఱి వాఁడు వచ్చి యరికట్టెను మ
త్పురిని గురుతమము గతభా
స్వరమగు చామీకరాద్రి సానువును బళెన్ 167

క. అరయక బభ్రుని భార్యను
హరించె నాతఁడు; స్మరింప నర్హుం డగునే ?
దురితాత్ముల కథ నొడివిన
దురితవిదూరులకు నైన దోసము వచ్చున్ 168

గీ. అతని కీవు చేసి తపకారమును మన
కతఁడు చేసెఁ దగ మహోపకార
మటు పరస్పరంబు నహితక్రియలచేత
శత్రుఁ డగుట కేమి సందియంబు ? 169

క. అరి కపకృతిచేసి మదిన్
మఱచి యుపేక్షించు నట్టి మనుజుఁడు పొదఁజి
చ్చుఱక నిడి గాలి కెదురుగ
వెఱవక నిద్రించు వాని విధమగుఁ గాదే ? 170

క. ఇంచుక తప్పులొనర్చిన
వంచింపక మది సహింపవచ్చును; తెక్క
ల్మించి యొనర్చిన జగతుని
నంచితముగ నెవ్వఁడోర్చు? నంబుజనాభా ! 171

సీ. అలివేణులకు రతివ్యతిరిక్తకాలంబు
నందు లజ్జయుఁబోలె నవనిపులకు

నపరిభవము నందు నధికశమంబు భూ
షణముయి చెల్లు; యోషలకు సురత
సమయంబు లందు ధార్ష్ట్యము మేలె; బరిభవ
మందు రాజులకు శౌర్యంబు సొమ్ము;
పరునిచేత నవజ్ఞఁబడి కడుదుఃఖసం
తప్తుఁడై యెవ్వాఁడు దాల్మి గలిగి

గీ. వసుధ జీవించు నతఁడు జీవన్మృతుండు;
పృథివిలో వాఁడు జనియించుఁ జెల్లఁ దల్లి
గర్భభారంబునకును నిక్కముగ యోని
హింసకును గారణం బగు నిది ఫలంబు 172

క. చరణాహత మై యేరజ
మరుదుగఁ బై కెగసి శిరము నారోహించెన్
గర యూరజ మధికము పర
పరిభవము సహించి బ్రతుకు పగతుని కన్నన్ 173

వ. మఱియు జాతిక్రియాగుణంబులచేతఁ బ్రయోజనంబు సంపా
దింపని పురుషుని జన్మం బిచ్ఛాకల్పితజాత్యాది ప్రవృత్తినిమిత్త
శూన్యం బైన డిత్థాది శబ్దంబు కరణిఁ గేవలసంజ్ఞార్థం బై
యుండు: మఱియును 174

చ. ఘనగిరి కున్నతత్వ మదిగల్గు నగాధత లేదు; వార్ధికిం
గనుఁగొనఁగా నగాధతయుఁ గల్గు సమున్నతి లేదు; ధాత్రిలో
ఘనత మనస్వివర్యునకుఁ గల్గును రెండును; గాన ధీరుఁడున్
గొనకొని వాని కన్న నధికుండయి యొప్పుఁ దలంచి చూడఁగన్

గీ. రాహు వెప్పుడు తుల్యాపరాధులైన
భానుమంతునిఁ దడవుగాఁ బట్టి మ్రింగు
సారెసారెకుఁ గబళించు శశకధరుని
బ్రమదిమ గల్గుట కుర్విలో నిది ఫలంబు 176

గీ. అల్పరిపుమారుతము వ్యాప్తమగుచునుండఁ
బరగ నిష్పౌరుషుం డైన నరుఁడు తృణము
మాడ్కిఁ దన యంతఁ దానె నమ్రత వహించు;
నవని దుర్బలురకును దృష్టాంత మిదియ 177

గీ. మఱియుఁ దేజస్వి తేజస్వి మధ్యమందు
గరిమతో దూరగతుఁడయ్యు గణుతికెక్కు;
మానితంబుగఁ బంచాగ్ని మధ్యమందుఁ
దపము గావించుతపసికిఁ దపనుఁ డరయఁ
బంచమవిభావసుండయి పరగునట్లు 178

క. విమతుల శిరములపైఁ బా
దము మెట్టక పుడమిఁ గీర్తిధనుని సమాఖ్యా
రమణి నిరాలంబంబుగఁ
బ్రమదంబున నెట్లు త్రిదివపథమున కెక్కున్ ? 179

క. మృగమును దొడపై నిడుకొని
మృగాంకుఁడనఁ బరగె విధుఁడు; మృగముల నెల్లన్
దెగఁ గొనుటఁ జేసి కేసరి
మృగరాజని బిరుదు గాంచె మేదినియందున్ 180

సీ. దండసాధ్యుం డైన దండిశాత్రవునందుఁ
గరము సామం బపకార మగును;

బరగ స్వేదోచితావక్వజ్వరము వారి
సేచనంబున వృద్ధిఁ జెందఁగాదె?
యగ్నిచే సంతప్తమైన ఘృతంబుపైఁ
గొండముల్ జల్లిన మండినట్లు
సక్రోధుఁడైన యీ చైద్యున కటు సాంత్వ
వచనంబు లధికదీపన మొసంగు;

గీ. జగతి నెవ్వారు సంధ్యాది షడ్గుణముల
క్రమము వివరింప లేక కార్యములు చెఱుతు
రట్టి శత్రుసంజ్ఞితుల సమగ్రమంత్రి
వేషధరులను జనపతి విడువ వలయు 181

వ. మఱియుఁ గొందఱు పెద్దలు తనకుపచయంబు గలుగునప్పుడు యానంబు యుక్తంబని పలికిరి; కొందఱు శత్రునకు వ్యసనంబు గలుగునప్పుడు యానంబు యుక్తం బని రీ రెండును నుదాసీనుండవైన నిన్నిప్పుడు ప్రేరేపించుచున్నయవి ; లోకాతిక్రమణశీలంబులును నలంఘ్యంబులును నత్యంత గురువులు నగు యాదవ వాహినీ సముద్రంబులను నీ తాల్మి వేల పగిది నరికట్టి యున్న దట్లుగాదేని యింతకు మున్నెన్నఁడేని శిశుపాలుని వధింప కూరకుండునే ? సాంఖ్యులచేతఁ బలుకంబడిన యాత్మ యందు మూలప్రకృతి సుఖదుఃఖానుభవంబునుం బోలె యాదవ వాహినీ విజయంబు సాక్షి మాత్రుం డవైన ఫలభోక్తవైన నీ యందు వ్యవహరింపంబడు నని పలికి బలభద్రుండు వెండియు నిట్లనియె 182

గీ అధిప ! చైద్యుఁడు ప్రియసఖుం డగు జరాత
నూజుఁ డనిలాత్మజునిచేత నాజి నిహతుఁ
డయ్యె; నది యాదిగా మహోద్వ్యసని యగుచు
నుండుఁ గావున నుదముఁడై యున్నవాఁడు 183

చ. బల మతి యున్నచో రిపునిఁ బట్టి వధించుట నీతి యన్న న
వ్వలు కభిమానవంతుఁ డగు వానికి మిక్కిలి సిగ్గొనర్చు ను
జ్జ్వలపరిపూర్ణతేజుఁడయి భాసిలు నప్పుడుగాక చంద్రునిన్
జలమునఁ బట్ట వచ్చునె ? నిసర్గరిపుండగు రాహు వుద్ధతిన్ 184

శా. సామర్థ్యంబున మాఱు లేని బల మన్యాంశ; బవ్విధి న్నీతి వి
ద్యామర్యాద నెఱింగి పోవు బల మన్యంబు; బిట్లు నీ రెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకున్ జీకట్లకుం బోలె బల్
సామానాధికరణ్య మెట్లు గలుగున్? జర్చింప లోకంబునన్ 185

గీ. చేదిదేశంబులు మదీయసింధుఘటల
చేతవామనీభూతభూజాతము లగు
నంత దాఁక నింద్రప్రస్థయాన మీవు
సేయ వలవదు నామాట చెవిని బెట్టి 186

క. అసమున నిరుద్ధ వివిధ
ప్రసారసారంబు లగుచు బహు యదుబలముల్
వెస గోవులు వ్రజముం బలెఁ
గసిమసఁగా నడ్డగింపఁ గల వరి పురమున్ 187

గీ. కౌరవుఁడు జన్న మొనరించుఁ గాక; రవి త
పించుఁ గా; కేలుఁగాక యా వృషుఁడు దివము;
పొసఁగ నీ వాజి రిపునిఁ జంపుదువు గాక;
స్వార్థలిప్సులు గారొకో ? సర్వజనులు 188

క. అరికంఠచ్ఛేదోచ్ఛల
దురురక్తనిషిక్తసాధనోత్కరములు భా
స్కరకరసంపర్కతటి
ద్వరకాంతిని బొందుఁగాక తతరణభూమిన్ 189

వ ఇట్లు బలభద్రుండు సంరంభవిజృంభితుండై పలికిన నప్పుడు చిత్రలిఖిత దేవతలు సభాసదన కుడ్యప్రతిధ్వనివ్యాజంబున భయంబు వలన సంకర్షణోక్తవచనంబె తెప్పలుచున్న దని యనువదించి నట్లుండె; నంత 190

క. బలభద్రుని వచనము విని
జలజాక్షుడు కృష్ణుఁ డపుడు సమ్మతి తోడన్
బలుకుట కై యుద్ధవునకు
నలయక కనుసన్నచేత నవసర మొసఁగెన్ 191

## • ఉద్ధవుని యభిప్రాయము •

క. హరి మోమునుఁ జూచి యుద్ధవుఁ
డరుదుగ సురగురుఁడు పోలె నతిశయయుక్తిన్
గురువినయంబునఁ బలికెను
బరమార్థం బర్థగౌరవం బగు సూక్తిన్ 192

గీ. అనఘ! సకలార్థ మీ ప్రలంబారిచేత
నుక్తమయ్యెఁ; గ్రమ్మఱఁ జెప్ప నుచిత మగునె ?
పత్ర మందె సర్వార్థంబుఁ బలుకుచుండ
వ్యర్థమగుఁ గాదె క్రమ్మఱ వాచకంబు? 193

క. ఐనను, గురు వితఁడని నా
పై నెఱపిన నీదు గౌరవం బిది చెప్పం
బూనిన నను వాచాలుం
గా నొనరించెడు విశేష కార్యము దెలుపన్ 194

గీ. అక్షరంబులలో మాతృకాక్షరముల
చేత సప్తస్వరంబులచేత మిగుల

గ్రగరసోదంచిత దూతవక్తృ్రిఁ దగుచు గ్రామీల్లు నేమేదినీ
వరుఁ డాతండె సుఖాత్మకుం డధికసంపల్లాభయుక్తుం డిలన్ 203

సీ. పొసఁగ శృంగారాది రసములు మఱియు ని
ర్వేదాది భావంబు లాదరమున
వెలిఁగిన సత్కవి కెలమి సమాసబా
హుళ్యాదికముచేత నొప్పు నొక్క-
ప్రౌఢప్రబంధంబె బహుముఖ్య మనియును
బటుసుకుమారప్రబంధ మొకటె
నెఱిఁ గేవలం బని నియమంబులేక తా
వలసినట్లుగఁ జెప్ప వచ్చినట్లు

గీ. కాలవిదుఁడైన నృపతికి జాత్ర మొండె
మఱియు క్షమ యొండె నాశ్రయింపంగ వలయు
ననెడు నియమంబు లేదు; కాలానుగుణ్య
ముగ నుపాదేయములు రెండు; పురుషవర్య! 204

గీ. అరికృతాపరాధుఁడయ్యు నంతర్గూఢ
బహువికారుఁ డగుట మహి నసాధ్యుఁ
డగుచు గదము మూఁడ్క- నవసరం బాసన్న
మైనఁ గోపమూను; నంబుజాక్ష! 205

క. మృదువస్తువ్యవహితమగు
పృథుతేజం బర్థమనుభవించుట కగు దీ
పదహనుఁ డంతర్గతచే
విదితంబుగఁదైల మనుభవించెనొ, లేదో! 206

క. విను సత్కవి శబ్దార్థము
లును బోలె నభిజ్ఞుఁడెపుడు లోపల దైవం

బును బౌరుషమును రెంటిని
ననువందఁగ నాశ్రయించు నయ్యేవేళన్ 207

వ. మహాత్మా! శృంగారాదిరససిద్ధి కొఱకు రతిహాసశోకక్రోధో త్సాహభయజుగుప్సావిస్మయ శమ సంజ్ఞికంబు లైన స్థాయి భావంబులలో నొక స్థాయీభావరూపప్రయోజనంబునం దనేక నిర్వేదాదిసంచారిభావంబు లెట్లు ప్రవర్తించు నట్లు సుస్థిరుండును విజిగీషుండు నైన యొక్కనాయకుని యర్థంబునం దనేకరాజులు ప్రవర్తింతు; రదియునుం గాక 208

గీ. పృథివిలోనఁ దంత్రావాప విదుఁడు యోగ
కలన ననిశంబు మండలాక్రమణ వర్తిఁ
జేయునట్టి నరేంద్రుని చేత రిపులు
ఫణుల క్రియ నిగ్రహింపంగఁ బడుదు, రనఘ! 209

గీ. మంత్రశక్తి బృహన్మూల మహితభూరి
రాజితోత్సాహనగము కరప్రవచేయ
పృథుతరప్రభుశక్తిని బెంపు మీఱ
సతతము ఫలింపఁజేయును, జలజనేత్ర! 210

సీ. అధిప! యనల్పత్వ మగుటఁ బ్రధానత్వ
మున నంశమునకు నొంపొనర నితర
షడ్జాదికస్వర సంఘంబు లైవడి
విజిగీషుఁడగు నరవిభున కన్య
మధ్యమండలవర్తి మనుజేంద్రు లందఱు
బొందుగా శేషత్వ మొందియుందు
రత్యనారభమాణుఁ డైనను విభునకుఁ
బరులచే నట్లు సంపాదితంబు

గీ. లైన యర్థంబులన్నియు ననవరతము
పరగ నాకాశమునకు శబ్దంబుఁబోలె
మిక్కిలి గుణత్వమును బొందిి నిక్కువముగఁ
జాల వర్తించు, యదుకులసార్వభౌమ! 211

గీ. ఒనర నేకార్థతంతుసంస్యూత మైన
యట్టి యాతవ్యపార్ష్ణిగ్రహాదిముఖ్య
మాలయం దధికద్యుతిఁగ్రాలు నాయ
కుండు నాయకమణి లీల నుండు నధిప! 212

గీ. శక్త్యపేతుఁ డగుచు షాడ్గుణ్యసిద్ధర
సాయనంబు నర్థి ననుభవించు
నట్టి మనుజవిభుని యంగంబు లెంతయు
స్థైర్య మొందు బలయుతంబు లగుచు 213

వ. దేవా! శక్య విషయంబునందు క్షమావంతు లైన యంగవంతు
లకు శక్తిచేత వ్యాయామంబునందు వృద్ధి యగు: శక్త్యతి
క్రమణంబున వ్యాయామం బత్యంత హానికిం గారణం బగుం;
గావునఁ జైద్యావస్కందనం బశ్రేయస్కరం బై యుండు నే
చైద్యుం డుదాత్తుండగుచు నుదాత్తస్వరంబు స్వరితాదిస్వరం
బులం బోలె శత్రువుల నేకపదంబునందు నీచులం గావించు నట్టి
వాని నవమానింపఁదగ; దదియునుంగాక 214

గీ. చెలఁగి యేకాకి యైన యా చేదివిభుఁడు
కలన భేత్తవ్యుఁడని మీరు దలఁప వలదు;
రోగసముదాయమగు క్షయరోగ మట్లు
రాజసముదాయమగువాఁడు, రమ్యచరిత! 215

తే. వరగ నార్జితసలుఁడు సవకుఁ డఖిల
పరవిదారణుఁ డైన యాబాణుఁడు గుణ
కలితుఁ డగువానికేఁ గార్ముకంబుచేతఁ
బోలె సంధానితుండ వయ్యెఁ బరుపవర్య! 216

క. నిను జేదిపకృతభేదము
తనువైనను నీవయిన్ గృతద్వేషుల దు
ర్జన బాణావళిఖరమే
ఆన సమిదలఁ బోలెఁ బ్రజ్వలింపఁగఁ జేయున్ 217

తే. అరయఁ గడు క్షుద్రుఁ డైన మహాసహాయుఁ
డగుచుఁ గార్యపారంగతుఁ డై వెలుంగు
శైలతటిని మహాపగానహిత యగుచు
నాపగానాథుఁ బొంది నట్లనఘచరిత! 218

వ. మఱియుఁ గాలయవనసాళ్వరుక్మిప్రభృతిరాజులు తమస్స్వభా
వు లగుటం జేసి తిమిరంబు రజనీముఖంబునుం బోలెఁ బ్రకృష్ట
దోషుండగు శిశుపాలు ననుసరించి వత్తురు 219

తే. భవదమిత్రు లెవ్వ రవనిలోఁ దన్మిత్రు
లెవ్వ రట్టి నృపతు లెల్ల వాని
వేగఁ గూడికొంద్రు విపరీతులగు వారు
నిన్నుఁ గూడికొంద్రు నిక్కువముగ 220

మ. మీరివు దర్శిఁ జేదిపతి మీఁదికిఁ బోయితిరేని యాజికిన్
వారక ధాత్రిలో నుభయపక్ష నృపాలురు గూడికొందు రే
పారఁగ నందువన్ గెలుచ నధ్వరవిఘ్నము గల్గుఁగాన నీ
వారయ ధర్మపుత్రునకు నగ్రవిపక్షుఁడ వయ్యె దెంతయున్

సీ. బాంధవుం డైన యీ పాండవుం డతిభర
తమఘునప్పుడుని సఖుని నిన్ను
బాసటగాంగొని బహుయాగభారంబు
నిర్వహించుటకుం దా నేర్పరియగు;
నరయ గంగాది మహానదుల్ సవతు లై
సెలయేఱులను వార్ధిం గలిపినట్లు
పరగ మహాత్ములు భజమాను లరులైన
ననుకంప వారిం జేకొని భరింతు;

గీ. రధికబలునకు నైన ఘోరారులందుం
దగ బలాత్కార దండంబు తడవు వలయు
సిద్ధి కగు; విమనీకృతాశేషమిత్ర
సమితి ఛందానువృత్తి దుస్సాధ్య మెందు 222

క. అరివధము వేల్పులకుం బ్రియ
కరమని తలంచెదరొ మీరు? క్రతుభోక్తలు ని
ర్జరు లటు గాన్పన వారికి
నరివధమున కన్న నిష్టమగు మఖ, మనఘా! 223

గీ అమృత మనంగ యాజకులు ప్రీతాగ్నులందు
విధియుతంబుగ నెయ్యాది వేల్తు రదియె
మందరతుద్దిమథితాబ్ధి యందుం బొడమె
ననుట యది కీర్తిమాత్రంబె, యదువరేణ్యా! 224

గీ. రమణ! 'నీ నందనునీ యపరాధశతము
నటు సహించెద' ననుచు మీ రధికపూజ్య
యగు పితృష్వసతోడ మున్నన్నమాట
తలంపు: మది తప్పి నడిచినం గలుష మొదవు 225

సీ. సురవరవినుత! సత్పురుషుని బుద్ధియు
వ్యాపారమును జిత్తమనవరతము
మిక్కిలి నిశిత మై మిగులఁ దేజోవంత
మై యభిమానోష్ణమై తనర్చు;
వైనను దీక్ష్ణశస్త్రాకృతిఁ బరమర్మ
భేదిని గాదు; ప్రస్ఫుత పంచ
వదనంబు కైవడిఁ బరహింసకము గాదు;
దహనునిమాడ్కి సంతాపి గాదు;

గీ. వాగ్మియగు సత్యసంధుని వచన మేక
రూపమున నుండుఁ గాని వైరూప్యమొంద;
దీవు పైతృష్వ సేయుపై నెత్తి పోవ
వలదు; చనితేని దోసంబు వచ్చు, నీకు! 226

వ. దేవా! పట్టపగలింటికి సూర్యుండునుం బోలె స్వయంకృత ప్రసా
దుండగు చైద్యుని వధంబు కొఱకు నియతకాలావసానంబు
నొందక నీ వైనను సమర్థుండవు గావు; కృత్యవిదులైన గూఢ
చారులు తీర్థంబులయందంతఃపదంబు గావించి మహాశత్రుజల
స్థలంబు నెఱుంగుదురు గాక మఱియు ననుత్సూత్రపదన్యాస
యు సువృత్తియు సన్నిబంధనయు నయ్యు రాజవృత్తి యప
స్పశ యైు శబ్దవిద్య కరణి శోభింపదు; చారప్రేషణం బావశ్య
కంబు తద్రహితుండైన మహీపతి యంధప్రాయుండగు; నది
యునుం గాక 227

సీ. అజ్ఞాతనిజమర్మ లహితమర్మజ్ఞులు
భయవేతనులు నభివ్యక్తభూరి
శాసనులగు నట్టి చారులచే శత్రు
సామవాయకు లట్లు సంతతంబు

పలుమఱు మాపిపోఁ బడి భీష్మ్రా లగుచురు
కాంచుకోషిరు లైన ప్రణిధు లరిగి
రేకార్థు లైన మహీశుల నెల్ల నిం
ద్రప్రస్థమున కధ్వరంబుఁ జూప

గీ. వరుసఁ బయనంబు సేయించు వారుగాఁగ
నటు నియోగించి పంపుమట్లయిన నందె
బంధు మఖకార్యకంబును వైరివధము
పొసఁగ రెండును సిద్ధించుఁ, బుణ్యచరిత! 228

చ. ఎసరున ధర్మనందనుఁడు నీపయి మిక్కిలి భక్తి సేయుఁ ద
క్కిన రిపురాజు లందఱును గేవలమత్సరు లౌట వానిఁగ
గొని మదినోర్వఁజాలక యసుంఠితవైర మొనర్తు రందునన్
మునుకొని వారికిన్ మనకు మోఘమహాకలహంబు గల్గెడిన్ 229

చ. వదలక సంతతంబు శిశుపాలునిఁ గూడి వసించి యున్న భూ
మిపయుతులం దభిజ్ఞులగు మేటినరేంద్రులు గొంద ఱచ్యుతన్
బెదరి ప్రియంబుతో మనలఁ జేరఁగఁ జయ్యన నేగుదెంతు రిం
పొదవఁగఁ గాకిమధ్యమున నుండి పికంబులు వోలె, మాధవా!

చ. జలరుహలోచనా! సహజచాపలదోషసముద్ధతంబు ని
స్తులమదయుక్తముం జలితదుర్లభపక్షపరిగ్రహంబు నై
తలకొని నీదు శత్రుసముదాయము తావకభూరివిక్రమ
జ్వలనమునం దుదగ్రశలభత్వము నొందెడుఁ గాక, కేశవా! 231

వ. అని యుద్ధవుండు పలికిన వివేచితార్థంబును ననుగతనయమార్గంబును దుర్ణయార్గళంబును జనితసమ్మోదంబును సమున్నతవక్షస్స్థలనియతనిషణ్ణలక్ష్మీశ్రితంబు నగు తదీయ వాక్యంబాలకించి, కృష్ణుండు శీఘ్రంబున నాసనంబు డిగ్గి * 232

మ. అతులశ్రీదదిగధ్వమున్ విడిచి యయ్యాగస్త్యదిగ్భాగముం
జతురత్వంబునఁ జేరఁ బూనిన సరోజస్వామి చందంబునన్
గతయుద్ధాభినివేశసౌమ్యుఁడగుచున్ గంజాతపత్రాక్షుఁ డా
తతభంగి న్మది నిశ్చయించె వెస నింద్రప్రస్థయానం బొగిన్ 233

* మూలమున ద్వితీయసర్గ సమాప్తము

## • ప్రసాధనము •

ఉ. సర్వజగత్ప్రపూజ్యుఁడగు సారసనేత్రుని మౌళి పై బృహ
త్పార్వణ చంద్రతుల్యము మఱి భాసిలు ఛత్రము పొల్చె నందునన్
సర్వజగత్పవిత్రకరసంభృతపాదములన్ స్పృశింపఁగా
సర్వజగత్ప్రకాశుఁడగు సారసమిత్రుఁడు చాలఁ జెంతయున్ 284

చ. అరయ మృణాలసూత్రసదృశాచ్ఛచలత్పృథుచామరద్వయాం
తరగతుఁడై మహేంద్రమణిధాముఁడు చారు సమస్త సద్గుణో
త్తరుఁ డగు యాదవేంద్రుఁ డభితఃపరిపాతుకసిద్ధసింధు వా
శరధి యభూత పూర్వ విలసత్పృథు కాంతి వహించె నత్తఱిన్

మ. అతుల శ్రీయదువర్య మౌళిగత నానానర్ఘ భాస్వన్మణీ
వితతానూనవిచిత్రదీధితులచే విఖ్యాతనానావిధాం
చితధాతుచ్ఛురితాశ్మరశ్మి యగుచుం జెల్వొందు రంజత్కరో
ద్వృతగోవర్ధనపర్వతం బనుకృతంబయ్యెన్ సమగ్రంబుగన్ 286

మ. విలసత్కాంచన కుండలాగ్రఘటిత స్ఫీతోరు గారుత్మతో
పలచంచత్కమనీయదీధితులచేఁ బద్మావరుండాతతో
జ్జ్వలజాలోచ్చితనీలకంధరదళద్బర్హావచూడాంచితా
కలనన్ దాల్చిన భంగి నొప్పెసఁగె వేడ్కన్ జారు లీలింపఁగన్

మ. అలరన్ మందరకూటకోటినికరవ్యాఘట్టనోత్తేజనా
కలితస్ఫీత విశాల నిర్మలమణీ కాండోరు కాంతిచ్ఛటో

జ్జ్వలరంజత్కనకాంగదంబులు జగద్వంద్యున్ రమావల్లభున్
జలజాతాక్షు నలంకరించె జనముల్ సంతోషముం జెందఁగన్ 238

మ. కమలాక్షుండు నిసర్గరక్తవలయాగ్రస్ఫూర్తమాణిక్యర
త్నమరీచిచ్ఛురితంబు లౌట నను వొందన్ నేఁటికిన్ దైత్యవ
ర్యమహోరస్థ్సలభేదనోత్థపటురక్తార్ద్రింబులై యున్న చం
దమునన్ బొల్పుఁ బసన్నఖాగ్రముల చేతం జూడనొప్పెన్ రహిన్

మ. అతులోదగ్రతమాలనీలము సమగ్రాముక్తముక్తావళీ
లత మై యొప్పు మురారివక్షము విశాలస్ఫూర్తిచే మింట నం
చితగీర్వాణనదీప్రవాహయుగముం జెల్వొంద వేర్వేఱ నా
యతలీలం బ్రవహించె నేని సరి సేయన్ వచ్చు నమ్మింటితోన్

మ. అనిశం బే మణియందు బింబగతబాహ్యస్థప్రపంచంబు త
ద్ఘనదేహంబున నిర్మలత్వమున సాక్షాద్భూతకుక్షిస్థలో
కనికాయంబనఁ జూడ నయ్యెను దదుగ్రక్షీరధిక్షీరసా
రనిశాంతద్యుతిదీపితాళమణిసారం బొప్పె వక్షంబునన్ 241

మ. అకలంకాప్రపదీనచారుకటిసూత్రాలంబిదంతావళే
క్షుకళుక్త్యుద్భవమౌక్తికావళి తదంగుష్ఠాగ్రనిష్ఠ్యూతభ
వ్యాకరోర్ధ్వప్రసృతోన్నతాచ్ఛతరగీర్వాణాపగాసంతతో
దకసంపాతము కైవడిం జెలఁగె నుద్యత్కాంతి శోభిల్లఁగన్

ఉ. చారుతరేంద్రనీలమణిసన్నిభవర్ణతనుండు శౌరి క
ర్పూరపిశంగవాసుఁ డగుచుం బరికింపఁగ నయ్యె వాయుసం
చారవిసృత్వరాంబురుహసాంద్రవిశాలరజోవిచిత్రదు
ర్వారకళిందజాసలిలభారముచాడ్పున నద్భుతంబుగన్ 243

చ. పరగఁ బ్రసాధితుండయిన పద్మదళాక్షున కన్యలక్ష్మి ఖా
సురగతి నయ్యె నన్నియధిచూడఁగ యుక్తమనన్యకాంత యై

యరుదుగ నిత్యలక్ష్మి హృదయంబున నిల్చె నశేషకాంతులై
సరసత మేన నంతటఁ బ్రసాధనలక్ష్మి వసించెఁ గావునన్ 244

గీ. ఘనకవాట విశాలవక్షస్థలముఁడు
హరికి సమ్మోదితాశేషనరయు సర్వ
గాత్రసంగిని యగుట విచిత్రభంగి
నయ్యలంకారరమ చాల నధిక యయ్యె 245

గీ. క్రమతరభూషణత్వభృత్కనకకళిపు
ప్రాణహారిలసన్నఖవ్రణప్రకాశ
కఠినతాగుణవక్షోజకలిత లైన
వెలఁదు లయ్యాదవేంద్రు సేవించి రపుడు 246

గీ. పరగ నత్యున్నతత్వంబు వలన మీఁది
కొనర నాకృష్టమైన యట్లున్న యువతి
మహితకుచభారమునఁ బీడ్యమాన మగుచు
నతికృశంబైన నడుము నమ్రత వహించె 247

శా. ఏయే కామిని వంకఁ గన్గొనియె శ్రీకృష్ణుండు సంప్రీతితో
నాయాకామిని మోమువాంచె ఘనలజ్జాలోలదృక్పద్మ యై
యేయే కాంతల వంకఁ జూడఁడపుడా హేలావతు ల్సంభ్రమా
యాయన్ వేఁ బ్రహరించిరయ్యదుపతిన్ కుఁభత్కటాక్షంబులన్

మ. అతసీసూన సమాన కాంతియగు కంసారాతి రమ్యైకహ
స్తతలం బొప్పెఁ బరిభ్రమత్కిరణసంచారోరుచక్రంబుచే
నతులప్రస్ఫురితభ్రమత్పృథుతరైకావర్త మౌ యామునా
యతతోయౌఘము మాడ్కి యాచకజనోద్యత్కల్పభూజాతమై

చ. విమతనృపాలవిగ్రహవిభేదనదక్ష మనంతసత్వమున్
సముద్ధితతేజమున్ సతతసన్నిహితంబు నమోఘ మైన యు

త్తమగద మూర్తమైన సముదంచితశక్తియుఁ బోలె శౌరి చి
త్తమునకు సమ్మదం బెసఁగఁ దప్పక వేఁ బొడసూపె నత్తఱిన్

సీ. తలఁప ననన్యసాధారణత్వంబును
బొందిన దయ్యు నే నందకంబు
గజహయరథములగలి నసాధారణ
స్వత్వంబుచేతనే చక్రపాణి
సంబంధిగా దది సతతంబు పగతుర
కుచ్ఛేజకారి యై యుంటఁ జేసి
చంద్రుని కైవడిఁ జర్చింప శౌరికే
యన్వర్థ నామ మై యలరె నపుడు;

గీ. హితవిబుద్ధమంద్రాంబుదహృద్యనాద
మచ్యుతార్ణవాభ్యర్ణచరైకహంస
మలసవాతప్రపూరణోద్యన్నినాద
ధారియగు పాంచజన్యాఖ్య దరము దోఁచె 251

గీ. అరయ నన్యునిచేత నొకప్పుడైన
నతనిఁ బొందక క్రియయందు శ్రుతి సమీప
కలిత గుణ మై విధేయ మై యలరునట్టి
శార్ఙ్గము సమీపగత మయ్యె సఖుని కరణి 252

వ. ఇట్లు సర్వాలంకార శోభితుండును సర్వాయుధ పరిష్కృ
తుండును నై 253

* ఇంద్రప్రస్థయానము *

ఉ. ఆదర మొప్పఁ గృష్ణుఁడు రయంబున సంతత మిష్టసిద్ధిసం
పాదకమున్ మనోజ్ఞము సమస్తదిగప్రతిషిద్ధమార్గమై

భూధరశీలనొప్పెసఁగు పుష్కరథం బవలీల నెక్కి యా
హ్లాద మెలర్పఁబుష్యరథుఁడైన శశాంకుక్రియన్ వెలుంగుచున్

చ. హరిరథకేతనాగ్రఘటితాంబరచాముఁడు పన్నగారి భా
స్వరతరరత్నసంఘటితచారుమహీప్రతిబింబితాంగుఁడై
తిరముగ నాళుగాళసతతిన్ వెలిపింప రసాతలం బవా
ర్యరయమునం జొరం దలఁచినట్లు గనుంగొనన య్యెసయ్యెడన్

చ. హరియిటు సంభ్రమంబునఁ బ్రయాణము సేయు తఱిన్ మహామహీ
ధరవిలసద్గుహోదరనదత్సుబృహత్పటహస్వనంబు ల
బ్బురముగ వారిరాశిజలపూరము లన్యజలంబులం బలెం
బరువడి నన్యశబ్దముల బాగుగ మ్రింగి సెలంగె నెంతయున్ 256

వ. మఱియుఁ గుశినిశిస్త్రాఖిలలోకుండైన వాసుదేవుఁ డేభాగం
బునకుం జనియె నాభాగంబున ధరణీధరుండైన శేషుండు మహా
భారకుబ్జీభూతశిరస్సహస్రసహాయకర్మత్వర మాణభుజంబులు
గలుగునట్లుగాఁ బ్రవర్తించెఁ; బవంపడి యత్యున్నతద్వార
దారుసంగభంగసాధ్వసావనమ్రీకృత కేతనంబులై నయదు సైన్యం
బులు నీతిమంతుండైన మహీపతిని సామాద్యుపాయప్రయో
గఫలంబులైన హిరణ్యభూమిమిత్రాదిలాభంబులుంబోలె నోమా
స్వయుండైనకృష్ణునివెనుకొని యరిగెనప్పుడు 257

గీ. నీలలోహితగజదాననీరమిళిత
బర్హిబర్హచూర్ణద్యుతి భాస్వవర్ణ
మహిపరాగంబు లానేమిమగ్నరథవి
తానములచేతఁ బిండీకృతంబు లయ్యె 258

గీ. పాదహత మయ్యెఁ గనకభూపాంసు తతి మ
హాజనశిరంబులను దాఁట దయ్యెఁ; మఱియు
నేపు మీఱ నౌద్ధత్యంబుఁ జూప దయ్యె
గరిమ కనురూప మగు నట్లుగాఁ జలించె 259

సీ. హయములుభూరివల్గాకర్షణంబుల
నధికయత్నంబున నపుడు సాది
లోకంబుచేత నిరుధ్యమానము లయ్యె
సారెసారెకు నగ్రచరణములను
బరువడి నెత్తుచుఁ దెరు వాగి మెల్లనఁ
జనుచున్న గురుమత్తసామజముల
దాఁటి పోవఁగ నిచ్చదలఁచిన కైవడి
నతివేగమున నిల్వకరుగుచుండె

గీ. నధికయత్ననిరుద్ధాశ్వులైన తురగి
గణముచేఁ జూడఁ బడుచు మార్గంబునందుఁ
బాంసుసంక్రీడఁ గావించు బాలకులను
గొనిచనిరి వేగ నిండ్లకు జనను లపుడు 260

గీ. కృష్ణు నకలంకచిత్తు వీక్షించు వేడ్కఁ
బురజనులు వీథివీథికిఁ బఱచి రపుడు;
సారెకటు సంస్తవం బగు జనము లైనఁ
గోరి సాంద్రతరప్రీతిఁ గ్రొత్త సేయు 261

చ. పరగ నఖిజ్ఞుఁడైన మురవైరి పురీవరదత్తనేత్రుఁడై
వరుస నిరంతరోగ్రయదువాహినిచేఁ గడు సంకటస్థితిన్
బరఁగెడు రాజమార్గమున బాగుగ నేగెడు తచ్ఛతాంగమం
దరతరమందమందగమనంబు నెఱుంగక యుండె నత్తఱిన్

చ. జలనిధిమధ్యదేశమునఁ జాతుసువర్ణ విశాలసాలశో
భల సకలాశలం గపిశవర్ణయుతంబులుగా నొనర్చుచున్
బొలుపుగ నప్పురం బలరెఁ బుష్కరభేద మొనర్చి మీఁది కు
జ్జ్వలగతి నిర్గమించిన లసద్బడబానలహేతి కైవడిన్ 263

చ. అరుదుగ భూమిభృద్వరసహస్రకృతాస్పదమై పయోధిపు
ష్కరపరివీతమూర్తి యయి క్రమతరద్యుతిఁ బొల్చు సమ్మహో
పురమును శౌరికిన్ ముదము పుట్టఁగఁ బద్మభవుండు నేర్పుతో
నరయ ధరిత్రి కట్లు ప్రతియాతనగా రచియించె వేడుకన్ 264

గీ. అరయఁ ద్వష్ట్ర నిరంతరాభ్యాసలబ్ధ
శిల్పవిద్యాసముత్కర్షసీమ యైన
యప్పురము దర్పణాచ్ఛతోయధిజలంబు
లందు స్వచ్ఛాయ గతిఁ జూడ నయ్యెనపుడు 265

గీ. శరధిపిత భంగి వరుఁడైన శౌరి కొఱకు
నభినవప్రతిపాదిత యైన యంక
గతపురేందిర నలసదుప కంఠమందుఁ
జారుతరరత్నమాలికల్ సంఘటించె 266

మ. చలదుత్తుంగపయోధిభంగచయచంచత్పాండుశంఖచ్ఛటా
కుల మౌ తత్పురి హేమరత్నవిలసత్కుడ్యాగ్రభిత్త్యాల ము
జ్జ్వలపర్యంతచరోడుచక్ర మగుచున్ భాసిల్లు బర్హిర్ముఖా
చలవప్రంబు క్రియం జెలంగె నిజరుక్సందీపితాశాంత మై 267

మ. పొలు పొందన్ నగరీమహాపణములం బుంజీకృతానంతని
శ్చలశోభాయుతరత్నజాలములఁ జంచత్ప్రీతితో నిత్యమున్
గలయన్ వారి పథాగతాంబువుల నాకర్షించి వారాశి దా
నలువొప్పన్ భువి నాఁటఁగోలెఁ బడసెన్ రత్నాకరఖ్యాతియున్

గీ. సలిలవిస్రావి ఫేనసంఛన్నకాంతి
నవ్యరత్నంబులఁ బయోధినాథుఁ డాత
పమునఁ దడి యార్చుటకుఁబోలెఁ బ్రత్యహంబు
తల్పములయందు భంగహస్తముల నెఱపె 269

మ. అనిశంబున్ జలరాశి భంగి నిచయం బత్యున్నతత్వంబుచేఁ
బనిగాఁ దత్పరిఖాసాలము జయింపన్ దవ్వులం బుట్టి బ
ల్కినుకన్ డాయఁగ వచ్చి తత్క్షణమె మోఘీభూతవాంఛార్థమై
ఘనలజ్జన్ పరి దాఁకి లీన మగు; దీక్షాసిద్ధులే గర్వితుల్?

మ. అనిశంబున్ నగరిప్రవేశజనితవ్యాసక్తిచేఁ బోలెఁ జ
య్యన మేఘం బరుదెంచి తద్వరణకుడ్యోద్ధత్యసంరుద్ధమై
ఘనగర్జార్తరవంబు సల్పుచుఁ గడంకన్ భూరివర్షచ్ఛలం
బునశోకాశ్రులునించుచున్ బఱచుఁదత్ప్రాగ్బాహ్యదేశంబునన్

చ. అలయక తత్పురాంగనలయాకృతులుం దమయాకృతుల్ సము
జ్జ్వలగతి నొక్కలై యునికి చాల సహింప కొకింత భేదముం
గలుగఁగఁ జేయు మంచుఁ గడఁకన్ దను వేఁడిన ధాతసత్కృపన్
గలుగఁగఁ జేసెఁ దన్నగరి కాంతల కట్లు నిమేషచిహ్నముల్

గీ. నిర్మలైందవకరజాలనిహ్నుతాభ్ర
సంస్పృశత్స్ఫాటికోపలసౌధపంక్తు
లెక్కి నిశ లందు నప్పీటి యింతు లొప్పి
రభ్రగతనిర్జరస్త్రీల యంద మొంది 273

ఉ. ఆతతచంద్రకాంతమణిహర్మ్యతలంబుల రాత్రివేళ వి
ఖ్యాతబృహత్పయఃపథనికాయము లెంతయు. సంతతం బథః

పాటలసన్మహాంబుధరవర్గము లయ్యును వారిపూరమున్
స్ఫీతరుచిన్ వహించు నలవేసవి యందును జిత్రవైఖరిన్ 274

చ. పురసతు లాత్మసద్మములఁ బొల్పలరన్ రతివేళ సిగ్గునన్
ఁదరువడి దీపముల్ మలిపి భవ్యగవాక్షపథాగతోజ్జ్వలన్
నిరుపమవాలవాయజమణీమయభిత్తిగతాతునేత్రభీ
కరహరిణాంకదీధితులఁ గన్గొని భీతి వహించి రెంతయున్ 275

చ. అలరు పురాధిరాజమున నంచితభూరిమృదుత్వసంపదల్
గలుగుటఁ జేసి చిత్తరువు వ్రాయ సమర్థులు గాక మ్రోలరా
జిలు బహునిర్మలత్వమునఁ జిత్రకరుల్ ప్రతిబింబితాంగులై
కలయ సజీవచిత్రములుగా నొనరించిరి రత్నభిత్తులన్ 276

మ. చతురత్వంబునఁ దత్పురాంగనలు చంచత్ప్రీతితో రాత్రులం
దతులప్రస్ఫురదోషధీశకరజాలాపహ్నుతస్ఫాటికో
న్నత సౌధాగ్రములెక్కి మిక్కిలి వియన్మధ్యస్థలా దేవతా
సతులుంబోలె వెలుఁగుచుందురు తనుచ్ఛాయల్ బిసాళింపఁగన్

చ. అనుపమ లీల నప్పురము నందు నిశల్ సిలసన్నిశాకరా
శ్మశికరబద్ధభూములగు సౌధములందుఁ బ్రణాళికల్ వినూ
తనరుచిఁ బొల్చి సంతత మధఃకృతవారిద మండలంబు ల
.య్యును నవవారిధారల సముత్సుకతన్ వహియించు నెప్పుడున్

మ. సతతంబున్ శశికాంతనిర్మిత గృహస్తంభంబులందున్ రహిన్
బ్రతిబింబించుటచే సవర్ణ లగుచున్ భాసిల్లు తత్పట్టణ
స్థితచంద్రాస్యల గండభాగములు చర్చింపన్ స్మరా పాండురో
న్నతిసంలక్ష్యములై కనెన్ మణిమయాదర్శోపమానద్యుతిన్

చ. నలువుగ వైభవాధరిత నాకపురంబగు నప్పురంబునన్
లలితశుకాంగనీలమణి రత్నవినిర్మితసద్మదేహళీ

విలసిత రత్నజాల పరివిద్ధలసత్త్రపఘణంబులం దొగిం
జెలువుగ ముగ్ధకామినులు సేయరు గోమయగోముఖంబులన్

మ. అణిమాద్యష్టమహావిభూతిసహితం బై యొప్పు నవ్వీటిలో
గణనాతీత మహాగృహంబులు సమగ్రవ్యాప్తగోపానసీ
క్షణకాలస్థితలంబమానశిఖిపింఛశ్రేణిచేతన్ హరి
న్మణిసచ్ఛాయతృణోరునీవ్రములచేతంబోలె నొప్పెన్ రహిన్

చ. లలితబృహత్తులంబు లతులంబులు చారువితాన శోభితం
బులు నవితానముల్ బహుసమూహవ్యావిచిత్రములున్ సచిత్రముల్
గలయ విశాలముల్ విమలకాంతిసమంచితభూరిశాలముల్
జలనిధిరాట్సుతాభినవసద్మము లప్పురి రాజసద్మముల్ 282

ఉ. శ్రీలఁ జెలంగు వీటిగృహసీమలయందుఁగపోతపాళులన్
జాలుగ నించి నట్టి విలసద్బహుకృత్రిమపత్రిపంక్తులం
బోలఁగఁ జూచి తద్గ్రసనబుద్ధిఁ జలింపక పొంచి యున్న మా
ర్జాలములన్ జనంబులు దలంచిరి కృత్రిమ మంచు నెమ్మదిన్

గీ. అవనిగత లయ్యుఁ బురసతు లానసార
విందములచేతనే శశిఁ గ్రిందుపఱచి
రహహ! సమతీతఖపథంబు లైన సౌధ
శృంగములను వ్యర్థంబుగ నెక్క నేల? 284

గీ. కాంతుతో రమ్యలని పతాకలను బొంది
ప్రియమున వివిక్తలని రక్తివృద్ధిఁ జేసి
విలసితనమద్వలీకలై యలరు వలభు
లాశ్రయించిరి సవధూకులైన యువులు 285

గీ. పరగ నప్రతియత్నపూర్వకసుగంధి
తను భరించిన సతుల వక్త్రములు మధువు

ప్రియజనప్రీతి కొలుకుఁ బ్రాప్తించె వాస
నార్పణ పరస్పరవ్యతిహార మచట 286

చ. అరుదుగ నప్పురీగృహములందు విశాలవిహారవేదికాం
తరగతమత్తవారణవిటంకకులాయశుకాదిపక్షులుం
దలుచుగఁ గామినీరశిక్షృతస్వనముల్ దగనాలకించి జం
ధురతరశిష్యవృత్తిని మనోహరలీల వహించె నెంతయున్ 287

గీ. చాల విహితంబు లయ్యె స్పష్టంబులైన
యువతి కుచమండలములందు ధవళితాంబ
రములు నామంబు వలన నర్థంబువలన
నవని నాకాశసామ్యంబు నధిగమించె 288

గీ. అరయ నత్యాయతము లజిహ్మములు పంక
ములు నసంత్యక్తభూరిసీమలు వినీత
సరణులు సురూపలయ్యెఁ బ్రస్థలనరహిత
జనముచే వీతములు గావు సతత మచట 289

సీ. అను వంద నప్పురంబున నితరేతర
స్పర్ధిపరార్ధ్యరూపలగు పతులఁ
జెలు వొప్ప సృజియించి శ్రీనిర్మితప్రాప్త
వజ్రకీటకృతైకవర్ణవాచ్య
నిబిడమలంబును నేర్పు మీఱఁగఁ బెద్ద
గాలంబునకుధాత గడిగికొనియెఁ;
దలపోయనెద్ది యంతఃకరణంబుచే
ననుదినం బభ్యస్తమయ్యె దాని

గీ. గాంత దీఱంగఁ గల్పవృక్షము లొసంగు
వరుస వర్వీట వసియించు వారి కైశ

వంబు లవి మానసాగోచరంబు లనఁగ
లలితగతి వాక్కులకుఁ జెప్ప నలవి యగునె? 290

చ. సకలకళాధురంధరుఁడు సౌధవళత్వనిజప్రభాచ్ఛటా
వికసితదిఙ్ముఖుండు నతివిశ్రుతకీర్తియు రోహిణీకుమా
రకుఁడగు రాముఁ డాపురవరంబును బాయఁదలంపఁడాగతిన్
బ్రకటముగాఁగఁ దాను విడువం దలపోయఁడు రోహిణీశుఁడున్

గీ. బాణరణనిర్జితేశుఁడై పరగు చక్ర
పాణికి సుతత్వ మొందుటవలన దేహ
ధారి యై చైత్రశరములు దాల్చి భీతి
వదలి మన్మథుఁ డప్పురిఁ బాయ కుండు 292

గీ. శివమరుత్సేవ్యుఁడగు హరిచే నిషేవ్య
మాణయై దీప్తమణిజాలమహితమైన
జలధిలో నుండి సురశైల సంస్థితామ
రావతి నసూయఁ బిల్చు నా రాజధాని 293

గీ. కలితమృద్వంజనశ్యామకాంతియును సు
వృత్తుఁడు త్రిలోక తిలక మౌ విధుఁడు తిలక
మట్లు యహతవర్ణద్యుతి యైన పురికిఁ
జెలువకును బోలె రుచి విశేషింపఁ జేసె 294

వ. ఇట్లనంత వైభవాభిరామ యైనయమ్మహారాజధానినవలోకింపుచు
నఖండతేజోమండలమండితుండైన పుండరీకలోచనుండు వజ్ర
ప్రభోద్భాసిసురాయుధ లక్ష్మియగు దేవసేనయుంబోలెఁ బరుల
చేతదుర్ధర్ష యైనప్రతోళివాశ్రయించిపూర్వాభిముఖంబుగా మెల్ల
నంజనియె నప్పుడు 295

గీ. పరగ హరిదేహమున నుండి ప్రజలు వోలె
శివుని శిరమున నుండి యంబువులు వోలె
ధాతముఖమున నుండి వేదములు వోలె
నప్పురంబున నుండి సైన్యములు వెడలె 296

సీ. అన్యోన్యచారుముఖాగ్రసంగస్థల
ద్వనఖలీనంబులు గలుగునట్లు
శివ్యద్విలోలాశ్వశేఖరంబులచేత
సంపీడితాన్యోన్యజాను లగుచు
వరుసగాఁ బెక్కండ్రు వాజీంద్రవారకుల్
హరి వెన్కఁ బ్రీతితో నరిగి రపుడు
తమముచేఁ బోలెఁ దత్పథము జనంబుచే
నత్యంత సంకటం బగుటవలన

గీ. మిగుల దూరంబు సంత్యక్త మగుచు నుండఁ
జెలఁగి మత్తద్విపంబులచేత భూరి
దీపములచేతఁ బోలె నుద్దీప్తభంగి
నంచితముగ నసంబాధమై వెలిం గె 297

మ. అతివేగంబుననేగు భూరిరథముల్ యత్నంబుతోఁజోదకా
యతరస్మిప్రవజభుగ్నసుందరగళాగ్రానక్తయుగ్యాగ్రశమో
ద్యతవాహంబులచేత హస్తినఖసీమాగ్రంబుపై నుండి స
మ్మతి నానీతము లయ్యె మెల్లన నసంబాధంబుగా ధాత్రికిన్

గీ. అతిబలోర్మ్ములచే వలయములచేతఁ
బోలె నతిహీయమాన సముద్యతప్ర
తోళిభుజ యోటఁ బురికి విధుండు పురము
వెడల ద్వారపతిత్వ మ్మప్రియతనొందె 299

## సముద్ర వర్ణనము

గీ. వనధిపరతీరమున హరిద్వర్ణపత్ర
రాసులుత్కలికాసహస్రప్రతిభ
దావిలోత్కూలనిరుపమశైవలాభ
విపినపంక్తులఁ గాంచె నవ్విశ్వవిభుఁడు 300

చ. జలధితటాధివాసములు శ్యామలకోమలకాంతియుక్తముల్
లలితరమావిలాసములు రమ్యలతావనితాయుతంబు లౌ
విలసితభూరుహంబులను వేడుక మీఱఁగ వేలయందు సొం
పలరఁగఁ జూచె నవ్విభుఁ డనంతనిజాకృతులంబలెన్ రహిన్ 301

సీ. ఆశ్లిష్టభూతలుం డాక్రందితుండును
ఫేనాయమానుండు పృథువిలోల
ఘనభుజాకారభీకరతరంగుండునై
వీఱిఁడి క్రియ నున్న వారిరాశి
నత్యంతతృష్ణచే నబ్ధిపానముఁ జేసి
యభివృద్ధి నొందిన యాత్మదేహ
మందతిరిచ్యమానాంచితశుక్తేందు
రుచులను మౌక్తిక ప్రచయములను

గీ. ఘనము లేయంబువులచేత గర్జ లెసఁగ
మించి ధర యెల్ల నిండ వర్షించె నట్టి
సలిలముల సాగరైకదేశంబునందుఁ
ద్రావు మేఘంబులను జూచె దనుజవైరి 302

వ. మఱియు, నమ్ముకుందుండు మునీంద్రులచేత వేదంబు వలన నర్థంబు సంగ్రహించి రచింపంబడి వేదంబునే యనుసరించిన మన్వాదిస్మృతులం బోలె మేఘంబులచేత సముద్రంబు వలన

జలంబు సంగ్రహించి రచింపంబడి సముద్రంబునే యనుసరించి ప్రవర్తింపుచున్ననదులను దిగంతరానీతనానాద్రవ్యంబుల విక్రయించి మూల్యంబున కంటె ద్విగుణాధికంబైన యుత్తమ లాభంబు నొంది తత్రత్యసారవత్పణ్యద్రవ్యంబు నోడలయందు వహించినసముద్రద్వీపవాసిసాంయాత్రికులవిలోకించె: మఱియును

గీ. జలధిలో నుండి పైకి రాఁదలఁచి ఫణులు
గరుడకేతుధ్వజంబుల కరణి భూరి
నిశ్వసితవాతములచేత నీరరాశి
సలిలముల మీఁది కెగయంగఁ జల్లె నపుడు 304

సీ. ఉత్సంగశయ్యాశయుండు యుగాంతబం
ధుఁడు సమాగతుఁడైన తోయజాతు
వీక్షించి గురుతరప్రీతిప్రసారితా
యత భంగహస్తుఁడై యంబురాశి
తగ నెదుర్కొనిన చందంబునఁ గన నయ్యె
నత్తఱి నుత్సంగితాంబుకణుఁడు
బంధురైలావనాస్ఫాలనసంలబ్ధ
గంధుండునై గంధిగంధవహుఁడు

గీ. వారినిధి వేల యందు దుర్వారభంగి
సకలసైన్యసమేతుఁడై సంభ్రమమునఁ
బోవు మురవైరి నెమ్మేనఁ బొడమినట్టి
చెమట లార్చెను సైన్యంబు ప్రమద మొంద 305

మ. అతులప్రౌఢమురారి సైనికులు సొంపారన్ మహోత్తాలవా
సితతాళీవనసంప్రవృత్తవిచలచ్ఛీతానిలప్రేరణా
ద్భుతసీమంతితకేతకీకనదంభోరాశిమధ్యావనీ
స్థలులం గాంచి చరించి రచ్చట వినోదక్రీడలన్ బల్విడిన్ 306

వ. మఱియు, నాచమూచరులు లవంగకుసుమమాల్యకృతభూషణులును నారికేళఫలాంతర్జలపాయులును నాస్వాదితార్ద్రక్రముకులునై సముద్రునివలన నభ్యాగతప్రతిపత్తి నొంది రదియునుంగాక 307

సీ. అగణితబహువర్ణహయశతాకులమును
ప్రబలిమార్గమందును బ్రమథితోరు
భూభృత్సహస్రంబు పొసఁగ సంతతరమా
సహితంబు నగు హరిసైన్యమునకు
రంగుగా నేకతురంగజన్మంబును
బరగ నేకోర్వీభృత్ప్రమథితంబు
తలపోయఁ జిరవిగతశ్రీకుఁడై యొప్పు
ద్వీపవతీభర్త కేవు మీఱ

గీ. నరసి చూడ మహాంతరం బయ్యెనప్పు
డిత్తెఱంగున నయ్యదుసత్తముండు
వనధివైభవ మెల్లఁ గన్గొనుచు నస్మి
తాననాబ్జుఁడై మెల్లన నరిగి యరిగి * 308

## • రైవతక వర్ణనము •

సీ. పటుతరనీలాశ్మబద్ధనానావర్ణ
గైరికముఖధాతు కలిత మగుట
వలన ఫణారత్నభాసమన్వితముగా
వసుమతి భేదించి పైకి వెడ్గ
మించిన ఫణిరాజమేచకనిశ్వాస
ధూమంబు చందానఁ దోఁచు దాని

* మూలమున తృతీయసర్గ సమాప్తము.

భాసురఘూర్ణితటీసమీపోపరి
దేశంబునందు విస్తీర్ణ మైన

గీ. సంతతోన్నమదభ్ర సంచయముచేత
నర్కమార్గంబు గ్రమ్మఱ నడ్డగింపఁ
బెరిఁగిన సహస్ర శిరమైన వింధ్యనామ
కులకుధర రాజమును బోలె నలరు దాని 309

ఉ. కాంచనవప్రభాజ్నిబిడకాంతిసమూహాఖ్యదుల్లసన్మణి
ప్రాంచదమేయరుక్కలిత మై బలసూదన రత్నమేచక
త్వాంచిత మై ప్రసూనమధురాసవలుబ్ధమధువ్రతావృతా
ఖ్యాంచితవల్లికా సహిత మై కరమొప్పెడు దాని వెండియున్

చ. వరుస సహస్రసంఖ్య గల పాదశిరంబుల చేత భూస్థలిన్
బరగ నభస్స్థలిం దొరసి బాగుగ లోచనయోగ్యదేశసం
భరితదినేశశీతకరమండలముల్ గల చోట నిక్కువం
బరయ హిరణ్యగర్భునిక్రియన్ గననయ్యెడు దానిసెంతయున్

గీ. అంబునిర్గమశుభ్రంబు లగుట జాళి
తోత్తరీయసమద్యుతి నొప్పుఘనము
లొక్కయెడఁ దాల్చి దుర్గాంగయుతవిభక్త 312
భస్మఁ డగు శూలి కైవడి వఱలు దాని

గీ. నిజసతీచటులాలసనిబిడతరమ
దాతిచటులాలసము లైన హంసముఖప
తత్రులకుఁ బంజరీభూతదళవికాసి 313
తోయజచ్ఛత్రముల నీడ సేయు దాని

గీ. స్కంధసంశ్రితపృథునీలకంఠములును
సర్పసంశ్లిష్టతనువులు సంభ్రమద్రి

శాఖితలశాఖుజాగ్రంబు లైన భూరి 314
తరుల బవఁ రుద్రులను బోలెఁ దాల్పు దాని

చ. కలితవిలంబిమేచకవికాసినవోత్పలకర్ణపూరముల్
లలితనవోలపాళి సమలంకృతభాసురసైకతాళము
ల్సలలితసైకతంబులయి లోధ్రకగౌరసతీకపోలభి 315
త్తులగతి నొప్పు శుభ్రతరతోయములుం గల దాని వెండియున్

మందాక్రాంత. రాజీవాళీవళగతచలద్రమ్యభృంగవ్రజం బై
భూజశ్రేణీహృతరవికరోద్భూతసాంద్రాతపం బై
భ్రాజద్దైతేయనికరకృతోపప్లవం బొందకుండన్
నోజం గాంతాలకసవనభుగ్వ్యోషలం దాల్పుదానిన్ 316

క. వితతజలరాశివీచీ
వితతిసమానీతరమ్య వివిధమణిసమా
వృత మైన దాని నల రై
వతకాద్రిని జూచె హరి యవార్యప్రీతిన్ 317

వ. మఱియును 318

సీ. హరికిఁ బ్రియంబుగా నమరసమానీత
బృందారకాచల శృంగవర్ధి
తం బైన యేమహీధరపతి యుచ్ఛ్రాయ
సౌందర్యగుణములు చాటువాక్య
చతురులౌ కవుల కసత్యముల్గావయ్యె
మఱియు శ్రేష్ఠము లతిమానములగు
భూరితర ప్రస్థములచేత నిభృతంబు
లుద్రశ్మములైన రత్నౌఘములను

గీ. బరగ నే మేదినీధ్రంబు వలన జనులు
ప్రకటముగ నాథ్యుఁ డౌ ప్రాపణికుని వలనఁ
బోలె సంతత మార్జించి పొలుపు గాంతు
రెద్ది రోహణ శిఖరికి నద్దియయ్యె 319

వ. మఱియు నౌన్నత్యంబు వలన నత్యాసన్నుం డగుట వలన మిక్కిలిఁ బరితపింపఁ జేయు సూర్యుని ధరించిన దయ్యును నవారవిందధానం బగుటం జేసి యతిరమణీయం బైన యే మహీధరతటంబు నందు నిపీతమకరంద యగుటం జేసి మత్తయై నమత్తామరసయై యొప్పు కుసుమాంతరచంచలచంచరీకసంచయపంక్తిఖేదంబు నొందదయ్యె నదియునుం గాక

పొలుపుగ నే నగంబు పయిఁ బొల్పగు రాజితగండశైల ము
జ్జ్వలదధిరూఢచారువికసత్కుసుమాళిసహస్రియుక్తపే
శలఘనశాఖచే నముచిశాసనభూషిత పృష్ఠభాగ మై
యలరు సుపర్వదంతి క్రియ నద్భుతభంగిఁ జెలంగె నెంతయున్

చ. అరుణవిభావిభిన్నరుచు లైన దినేశతురంగమంబు లే
ధరణిధరంబు మీఁద సముదంచితవంశకరీరనీలసుం
దరతరజాతిరత్నకలితస్ఫురదుచ్ఛ్రితరాగ్ర్యదీధితి
చ్ఛురితములై స్వవర్ణమును పొంపుగఁ గ్రమ్మఱఁ దాల్చెఁ బల్విడిన్

గీ. ఉరుసముత్పతదభ్రిసముజ్ఝితాంబు
సిక్తముగు నవిపన్నగాశేషవృక్ష
వనమును విషానలోద్భూత ఘనవిపత్తి
సంతతము నెందు బాధింపఁ జాలదయ్యె 322

ఉ. పంతముతోడ నే శిఖరి భాస్కరభూరికరాప్తిహవ్యభు
క్కాంతులు గ్రక్కు సూర్యమణికాంతుల ప్రాత్రగుడాక్రయంబుచే

సంతతమున్ ప్రసిద్ధగుణసంక్రమణంబును బోల్పు మీఱ సం
క్రాంతగుణాతిరేకమును గానొనరించె మహాద్భుతంబుగన్

ఉ. ఆవసుధాధరంబు ముదమారఁగ మున్నటు పెక్కుమాఱు లి
చ్ఛావిధి దృష్టమైనను ప్రసన్నత శౌరి కపూర్వవిస్మయం
బావహిలంగఁ జేసెఁ బ్రతియామము నందు నవత్వ మొందుచే
వావిరి రామణీయగుణవైభవ మగు క్తికి లక్షణం బిలన్ 325

ఆ వె. అంత యుక్తికుశలుఁ డైన దారుకుఁడు న
దత్పుతత్రినికరతటులు దాల్చి
నట్ట నగవిలోకనాళ చే నుద్గ్రీవుఁ
డైన శౌరి కిట్టులనుచుఁ బలికె 326

గీ. ఘనపినద్ధదిగంబరాక్రాంతభూరి
శృంగగోతలమూర్ధస్థశిశిరకిరణ
నవ్యకోటి గిరిశసందర్శనమున
నెవ్వని మనంబు భువి విస్మయింపకుండు? 327

గీ. సుభగవితతోర్ధ్వరశ్మిపాళు లగు శశిధ
రోష్ణకరు లుదయాస్తంబు లొందుచుండ
నీయగంబు విలంబిఘంటాయుగపరి
వృతమదావళలీల వహించె, నధిప! 328

గీ. అధిప!లసమానచారునవాంశుక మగు
ధరము సహరితకాంచనస్థలులు దాల్చి
ప్రకటహరితాళనూతనాంశుకుఁడ వైన
నీ పగిది నొప్పు చున్నది నేఁడు కంటె! 329

మ. అనిశం బీ నగరాజసానువలయం బాసక్తితో నున్న యీ
జనముల్ శాంతమలాతిసాంద్రకరసంచారంబుపంపూర్ణ ల

ధిన్నృపస్త్రీముఖతుల్యమై యలరు సంతస్థాంకుఁడౌ పూర్ణచం
ద్రుని పశ్చాద్భవభాగముం గనిరి సంతోషంబు సంధిల్లఁగన్

మ. నలు వొప్పన్ గిరినిమ్నగాఝరులు వానప్రస్థులుంబోలె నొం
పలరన్ బేటల మీఁదనుండి బృహదశ్మాగ్రంబులన్ వ్రాలి ఖ
స్థలికిం గ్రమ్మఱ నుద్గమించి స్మరసంతాపార్తలైనట్టి స్వ
ర్లలనాసుందరగాత్రవల్లులకు నిర్వాణంబుఁ జేసెన్ రహిన్ ౨౩౧

సీ. అమలచరిత్ర! యీయద్రిపై నొకచోటఁ
బ్రశమితచాతకార్తస్వరములు
తటిదాభకాంతకార్తస్వరంబులు నైన
ఘనను లీ జగతినిఁ గప్పుకొనియె;
నొకచోట నుల్లసితోజ్జ్వల చామీక
రములైన యీ సాంద్రరవికరములు
కపిశవర్ణంబులు గల వానిఁగాఁ జేయు
చున్నవి గంటిరే? యుత్సుకమున

గీ. నుచ్ఛ్రితేందుకరావలంబోడుయుతశి
రోధృతాభ్రంబుశ్రద్ధేయరూఢగిరిన
దీప్రవాహోదకవ్యపదేశమగుచుఁ
బడుచు నున్నదియంతట బంధురముగ! ౨౩౨

గీ. ఒకట స్ఫటికతటాంశుభిన్నోదకంబు
లొకట నీలాశ్మరుచివిధురోదకంబు
అగుచు గిరినిమ్నగలు యమునాంబుమిశ్రి
తామరాపగా వైదగ్ధి నాశ్రయించె ౨౩౩

మ. సురశైలేంద్ర సమానవప్రమగుచున్ శోభిల్లు నీశైలమం
దరుదారన్ మణిసానురాగములు దీపాభిస్సమానంబు శై

వరుసం గ్రాలెడు నిర్ఝరీసదృశలో వామేతణల్ రక్తితో
సరసాలాపములన్ మనోహరుల వాంఛన్ దీర్చుచున్నా రొగిన్

ఉ. భూరిసుధాసవర్ణము సముజ్జ్వలకాంచన రాజిరాజితం
బై రహి నొప్పు నీసదమలాంచితరాజత భిత్తి కంటిరే?
చారు విభూతి పాండురిత శంకర సాంద్ర సమున్నతానల
స్ఫారసుదృగ్లలామఘనఫాలవిలాసము నాశ్రయించెడిన్ 335

వ. మఱియు నీశైలరాజం బతి జరఠంబులు సుప్రకామ గురు భారవిడంబిపయోధరోపరుద్ధంబులును శరీరధారులకు సంతత మగమ్య రూపంబులును బరిణత దిక్కరికంబులు నగు తటుల శరింపుచున్న దదియునుం గాక 336

గీ. ఈ నగంబున వహ్నిసమానవర్ణ
చారుసౌవర్ణతటసుమజాలలీన
భృంగతతి భృద్విమేచకీకృతతరువులు
పొగయుఁ బోలెఁ జూపట్టెడు బ్రోలఁగంటె! 337

మ. వికసత్పుష్పచణోరుచంపకలసద్భృంగద్యుతివ్యోమదే
శకషట్కాంచనభిత్తియుక్త మగుటన్ సౌమేరవీసన్నిభం
బకకాంతిం బ్రకటించు నీశిఖరిచే భాసిల్లు నీ భారతం
బకలంకచ్ఛవి నయ్యిలావృతము ఛాయన్ గ్రాలెడుం గంటిరే?

గీ. ఉజ్జ్వలవిచిత్రలోమసంయుక్తవిచలి
తాతతప్రియకంబుల చేత నీధ
రంబుజంగమతాగతరత్నమయని
జాంగములచేతఁ బోలెఁ జెలంగెఁ గంటె! 339

గీ. గాఢసలిలాశయోషిత కలభములు స
మృద్ధనీరేజములతో రమింపుచున్న

వరయఁ గల భావికస్వరానురచయంబు
కామినుల ప్రోలఁ జేసెడు గానరవము 340

చ. తలుచుగ నిమ్మహౌషధులు దైవనియోగమునన్ బృహత్తమః
పరివృతుఁడై వెసం బునరపక్రమణంబునఁ గాలకాంక్షి యౌ
సరసిజపత్రమిత్రునకుఁ జారుపదానభిఘాతమైన వి
స్ఫురితలసత్కళత్రపదమున్ వహియించెనుదంచితోన్నతిన్

సీ. చారువనస్పతిస్కంధనిషణ్ణనూ
త్నప్రవాళోరుహస్తంబులైన
లతలు మధువ్రతవ్రాతావృతములౌట
గాఢలంబితరోచకంబులైన
యురుసుమేక్షణముల నుపలక్షితంబులై
ప్రమదల క్రియఁ జూడఁ బడిరెు నిచట!
నతులకదంబవాసితమైన యిమ్మహా
నగము మీఁదఁ బ్రతిక్షణంబు ఘనవి

గీ. హంగముల నేకలయ మగు నట్లు మధుర
నాదములు సేయు చున్నవి నవ్యఫణితి!
ఘనరయోద్ధూతనవనీపవనుఁడు పవనుఁ
డభ్రము చలింప వినరె సముచితముగ! 342

వ. మఱియు నిమ్మహాశైలంబు ధారణాసమర్థుండైన బ్రాహ్మ
ణుని కరణి నాగమప్రధానులును నిధిమంత్రసాధనవిశేషవిశార
దులు నగు వారిచేత బహుప్రయత్నంబునఁ బ్రకాశింపం బడిన
దాని ననిశ్చితబుద్ధులైన యశాస్త్రజ్ఞులచేత వినియును దుస్సా
ధనం బగు దాని పథంబు నడంచుటకు సమర్థంబైన నిధి
మంత్రగణంబును ధరింపుచున్నది దదియునుం గాక 343

చ. అనిశము చారుబింబసదృశాధరమౌ ప్రియురాలి మోము చుం
బన మొనరించు కిన్నరుని వాజిముఖుండు నుతించెడిన్; బృహ
త్స్తనభరభంగభీరువిలసత్తనుమధ్యను బ్రేయసిన్ రహిన్
బనివడి కౌఁగిలించు హయవక్త్రునిఁ గిన్నరుడున్ నుతించెడిన్

మ. ప్రతతానంతతమాలతాల మగుచున్ రాజిల్లునే యీపురో
గతభాస్వద్వన మొప్పెఁ: సట్టి స్థగితార్కాభీశ్లసద్రశ్మిసం
తతియున్ రంజదనంతతానమగు నీ, దావంబునం దేల తా
ప్రతతుల్చారుఫలప్రసూనయుతముల్ గాకుండు నెవ్వేళలన్

మ. ఘనదంతోజ్జ్వలరత్నచిత్రకటకాక్రాంతంబులై యొప్పు ర
మ్యనగాధిత్యకలందు నిర్మలశిలోద్యన్మేఖలల్ భూరిచా
రునితంబల్ కమనీయకోమలనభోరుగ్గండశైలల్ నితం
బిను లిచ్చో సదృశాధివాసమును నెమ్మిం బొంది రీతింపుఁడీ!

గీ. చటులవిరళవికీర్ణ వజ్రకణమైన
ధౌతరజతోర్విజలదసద్యఃప్రముక్త
బహుచిరస్థాయిబుద్బుదాంభస్సమగ్ర
సామ్యమును బొందుచున్నదీశైలమందు! 347

వ. మఱియు నిమ్మహీధరం బేకాంతంబున సంగమం బగుచుండ
విస్రంభవిహారంబు కాంక్షింపుచున్న వారగుటం జేసి జనసంగంబు
వర్జించి మన్మథునిచేత సంప్రాప్తజ్వరాంగులై కుంఠితనేత్రాం
తలై యున్న యనేక యోషలచేత సేవింపం బడుచున్న
దదియునుంగాక 348

సీ. సంపూర్ణ భూరి కీచకవనస్థలికైక
ఘనవాలవిచ్ఛేదకాతరమతు
లగు చమరీనామమృగములీగిరియందు
మృదువాతగర్భతదీయరంధ్ర

నిర్యత్స్వనత్రుటిత నిబిడ సౌఖ్యము వాయఁ
జాఁచి కైవడి సుచలింప
వయ్యె; నంతస్థమహానీలదళన లా
ఘనవాహ లందు మేఘప్రముక్త

గీ. మచ్ఛమౌక్తికమణియుక్త మగుట విమల
దుగ్ధసంకాశమై యొప్పు తోయ మచటఁ
బరగ శక్రశ్రీవినీలరుగ్వ్యాప్త మగుచు
నమరనీలీరసచ్ఛాయ నధిగమించె 349

వ. మఱియు నిన్నగంబున నన్యోన్యపతుల కంటె సారతరాగమన
మైన యేయువతి స్వప్రాప్తికొఱకు ప్రార్థ్యమానయయ్యును
ప్రియునిం గూడ దయ్యె నట్టి ప్రతికూలయువతియు నేకాంతం
బునం దాప్రియునితోఁ గూడ ననాయతమానం బగు నట్లు
సురతాభిలాషంబు నొందుచున్న దదియునుం గాక 350

చ. నలువుగ నిందుఁ జంద్రకిరణంబు లనేకవిధోల్లసన్మణి
శిలసితభూరిభానుతతి భిన్నము లౌట సహస్రసంఖ్యనిం
పలరఁగ నొందుచుండ నిశలందును భాస్కరుఁడంచు భ్రాంతిచేఁ
గొలఁకుల సంతతస్ఫుటితకోకనదత్వము నొందెఁ గంటివే!

గీ. అంకపరివర్తనోచిత లైన యాత్మ
జాపగలు భర్తనొందుట కగ్రభాగ
మందుఁ జనుచుండఁ బ్రేమచే నద్రిఖగరు
తమున దుఃఖించి నట్లున్న దమలచరిత! 352

గీ. భృంగవిటచుంబనోల్లసద్విటపినమిత
నగవితతి దాల్చి నట్టి యీనగనితంబ
మతులపరిపాకపింగళప్రతతిపతిత
పాంసుపింగళ మగుచుఁ జూపట్టె నిచట! 353

సీ. ఊర్ధ్వదేశంబున నుండి ప్రాగ్దిశను కై
లాసన్నభూముల యందుఁ బడెడు
శృంగారితాయత సింధుర హస్తాభ
మఖిలమణీమయూఖాను విద్ధ
ముఁ ధారమగు జల మూర్ధ్వ ప్రసారిత
హరిధనుస్సుందరం బగుచు నొప్పెఁ;
జెలు వొప్ప నీశైల శిఖర శిఖావళుల్
ప్రవిలసచ్చిత్రకల్పతమాజ

గీ. పుష్పపరిగుంఫితములైన పోల్కి నలరు
మహిత పరిలంబిపింఛదామంబులైన
చారు శిఖి శేఖరంబులు క్షణము చాల్చు
చున్న యవి చూడు మంతట! సన్నహమున 354

క. వినుఁడిట నవధూకులు సుఖు
లనవరత మమంద రాగ తామరసదృశుల్
ఘనరసవన్నవరతిగ్ర
ద్దన సలిపి రమంద రాగ తామరసదృశుల్ 355

చ. పొలుపుగఁ గట్టు పుష్పపటముం దగఁ గప్పి తదంతరభ్రమ
త్కలితకపోతకంఠతులితస్ఫురితాగరుధూమ కాంతిభృ
ల్లలితవినూత్న మేఘపటలంబుల చేత నిజాంగ శావళిం
గల యఁగ ధూప వాసితముగా నొనరించెడు భంగి దోఁచెడిన్ 356

శా. అత్రస్యన్నవరత్నసంభవసమగ్రానోక్యస్యమిత్రోజ్జ్వల
చ్చిత్రాకార మయూఖకల్పితనభస్సీమాగ్రనిర్భిత్తిహృ
చ్చిత్రప్రాపణచిత్రకర్మ మెపుడున్ సిద్ధామరశ్రేణికిన్
జిత్రంబుం గలిగించె నీయచలవిభ్రాజచ్ఛ్రీస్థంబు నీక్షించితే! 357

గీ. వాయుకోణగమై శిఖరనివాసులైన
యలఘుసుఖులకుఁ బుణ్యవంతులకు ముదము
గలుగఁ జేయుచు నీగట్టు జలవియోగ
ధవళఘనపంక్తి యవనికల్ దాల్చెఁ గంటె! ౩౫౮

వ. మఱియు నిమ్మహాశైలంబునందు సమాధినిష్ఠులగు యోగులు మైత్రియుఁ గరుణయు ననుమోదనంబును నుపేక్షయు నను సంజ్ఞలుంగల చతుర్విధచిత్తవృత్తు లెఱింగిన వార లగుటం జేసి క్షీణాంతఃకరణమాలిన్యులై యవిద్యయు నహంకారంబును రాగంబును ద్వేషంబు నభినివేశం బనంబడు పంచవిధక్లేశంబుల నుపసంహరించి సంలబ్ధసాలంబనధ్యాను లగుచుఁ బ్రకృతిపురుషు లిరువుర భిన్నులఁగా నెఱింగి సదసద్వివేకాభావంబునం గలుగు సంసారంబు నిరోధించుటకుఁ గాంక్షించుచున్నవా రగుటం జేసి యిప్పర్వతంబు కేవలభోగదేశమాత్రంబె కాదు ముక్తిక్షేత్రంబై యున్న దదియునుం గాక ౩౫౯

గీ. ఇచట మరకతమణిమయ పృథివియందుఁ
దరువిటపిమధ్యపాతివిస్ఫురితసూక్ష్మ
పాంసుజాలార్క కరములు పటువిభ్రమ
బర్హిగళలక్ష్మి నివహించెఁ బరమపురుష ! ౩౬౦

సీ. అనఘాత్మ! యిచ్చట ఘనమేచకంబయి
యపగతావస్థాన మగుచు మధుర
చటులవీణాగుణస్వనమానము వహించె
నయ్యుపచలితషడంఘ్రిపంక్తి
చేత స్వానమయైన యేతన్వి ప్రియునకు
వశగత గాకుండు వసుధలోన?
నిచ్చట సానువు లెప్పుడు నిశలందుఁ
జంద్రకరాహత చారుచంద్ర

గీ. కాంతనిష్యందనిర్మలకమలవిరచి
తాభిషేకంబులై పవలర్కరత్న
తతిసముద్దీపితాగ్నితప్తంబు లగుచు
గాఢతపముగావించెడు కరణి నలరె 361

ఆ. వె. శ్వసనఘూర్ణమున సంక్షోభ మొందిన
సరసు లిచట హంసజాతలక్ష్మి
నాముకొని యరహితరామలక్ష్మణనాకు
నందనోక్తిసామ్య మొందె నహహ ! 362

క. అతిముదితకలభములచేఁ
బ్రతిదిశ సారెకు నమందభైరవరవమున్
గృతమయ్యెఁ గనకభూరుచు
లతులితచమరులు చెలంగె ననువనమందున్ 363

గీ. కీచకబిలప్రపూర్ణాత్త గీతరవము
మృదితపత్మలరల్లకామేయతనువు
క్రమకస్తూరిగంధి యౌ గాడ్పు కామి
చందమున భూరివిషయసంసక్తుఁడయ్యె 364

గీ. యువజనప్రీతికొఱ కిందు వ్యవహితార్క
మనసిజరతిశ్రమాపనోదనచణంబు
లగు ఘనంబులు దినమును మిగుల రాత్రి
గాఁగఁ జేసెడు గాఢాంధకారకలన 365

చ. అరుదుగ నిందు నీగజవరాశ్రమపుష్పభరావనమ్రసుం
దరకుజమున్ సదానజలదంతిహతం బగుచుండఁ దన్నగో
పరిగతదందశూక మతి బంధురకోపితమై నితాంతభీ
కరవిషవహ్నికీల లదె గ్రక్కుచు నున్నది చూడు మచ్యుతా!

చ. స్మరహరుఁడైన సాంద్రగజచర్మకృతాంబరకృత్యుఁడై తుషా
రరచితమైన శీతసరాజముపై వసియించె సాధ్యకే
తరుఁడయిసెన్ సమస్తజుతుధర్మసుఖప్రదమైన యీమహీ
ధరమును బ్రవంచి మదిఁ దాల్పుఁడు శోభించుక ద్వంద్వదుఃఖమున్

సీ. వితతనూతనశైలవిపినరేఖాశ్యామ
  మధ్యస్ఫటికమణిమయనితంబ
భాములచేత నీ భూధరరాజంబు
  భస్మాంగరాగాత్తపాండిమయుండు
సర్పకోట్పరికర సహితుఁడు నగు త్రిపు
  రాంతకు తనుశోభ ననుకరించె
మఱియు నీగిరియందు మాధవుల్ వికచాంబు
  జశోభయనునట్టి కృష్ణమూర్తి తోరు

గీ. నగవినోదితభూరిదినక్షములను
గనకభూషణజనితోరుకాంతులగుచు
రసవనైతవమధు వాని రతికిఁ ద్రియల
యొడలి వలుపలు హరియింపు చున్నవారు ౨౮౩

సీ. ఘానుండు దర్పణ స్వచ్ఛకాంచనకంద
  రాగ్రవర్తి హృదయ హారిరౌప్య
భిత్తిసంక్రాంతప్రవృద్ధత మోహారి
  ఘనతేజ మూధకందరములఁ
జఱుమరు తరుచుగాఁ బ్రతిఫలింపుచు నుండఁ
  బతులచే నపహృత వసనలైన
యతివల కందరానళిముఖుం డయ్యును
  తెలఁగి ప్రీడితలఁగాఁ జేయుచున్న

గీ. వాఁడు నీరాకఁ గని యద్రి వాత చలిత
జలపటశ్యామలోత్పత ద్విహుల శిఖర
కాండ సంభ్రమకారి మేఘములచేత
నధికభక్తిఁ బ్రత్యుత్థాన మాచరించె * 369

## • రైవతక ప్రవేశము •

మ. నళినాక్షుం డిటు లవ్యళీకములు గాంతాసమ్మితంబుల్ నిజం
బులు నైరాశిలు సూతపుత్రువచనంబుల్ ప్రీతి నాలించి యు
త్కలికం దద్వచనాంతమందు వనరేఖాచేలసంఛాదితో
జ్జ్వలమౌ రైవతకాద్రియందు విహరింపం గోరెఁ జిత్తంబునన్

మ. కనదుత్తు గనభస్స్పృశత్కటశికాకాంతారరేఖాక్త మ
ద్రినిభంబౌ యదుసైన్యసంఘము దగన్ విస్తారసంఛాదితా
వని యాటం బ్రతిశైలలక్ష్మి నను వొప్పన్ దాల్చి దంతావళేం
ద్రనికాశాతులతుంగశృంగగిరి కందం బొప్ప నేగెన్ రహిన్

చ. అమిత చమూసముత్థగుచిరాభ్రవికాసిమహోష్ట్రి కంఠపిం
గము ఁ మహీపరాగమినక్రమకరాప్తి వికాసితాంబరాం
తము లగుటన్ మహాజననిదర్శనసంభవలజ్జ నొంది న
ట్లమరి చెలంగు నట్టి హరి దంగనలన్ వడిఁగప్పె సాంద్రమై

## • గజరథహయాది వర్ణనము •

చ. సురుచిరచారుదేవమణిశోభితముల్ భృశరంధ్రభాగముల్
భరితమహోర్మిజాలములు భవ్యఫలప్రదశుక్తియుక్తముల్
గురుతరరోచమానము లకుంఠితసద్భ్రమపూరితంబులై
వఱలు హయంబు లంబుధులవైఖరి మేదినిఁగప్పె గ్రక్కునన్.

---

*మూలమున చతుర్థ సర్గ సమాప్తము

గీ. మార్గమందు శిలాతతు లుగ్రశ్రేణిని
పరుసగొన కాల్తి సలుపుచు సడలె సికము;
లొట్టియు నిరస్తశారమై పిట్టపడియె;
నొండొరుల నేతఁ జూచి యగారెంపు వెఱచె 374

చ. అతిచటులాగ్రపాద మగు నట్లు వడిం జను చారుచామరాం
చితహయరాజమున్ మనవిశేషసలీలనిమీలితాక్షుఁడై
చతురత మెల్లనం జను గజంబును గాంచె ఘనంబు; సాక్షిలా
పత ననురూపచేష్టమయి సర్వము శ్రీకరంబె కాదొకో? 375

చ. కరి నటు గాంచి భీతి నొకగర్దభ మానన మెత్తి కూయుచుం
గర మరుదందె యంతటను పకాపక నవ్వఁగఁ బేర మెత్తినన్
స్ఫురితచలాసనప్రసృతభూరినికుంబగళద్దుకూల యై 376
పరువడి రాజకాంత ధరపైఁ బడె నత్తఱిఁ దత్తరంబునన్

ఉ. రైవతకాచలాంతికచరద్రథనేమి విఘట్టనోత్థిత
గ్రావసమూహచూర్ణకణ గర్భమహీరజముల్ నితాంతచ
క్రీవదురంచితాంగరుహ కేవలధూమలవర్ణకంబులై
వావిరి నభ్రమార్గమునఁ బర్వెఁ బయోధరమండలాకృతిన్

చ. చటులఖురాభిఘాతభవసాంద్రకృశానుకణోపయుక్తవి
స్ఫుటతరభూసమాయతసముత్థశిలాఫలకాచితంబు లౌ
పటుతరశైలరాణ్ణికటవర్త్మములం బృథువర్ధురాస్యముల్
దటుకున వేయుచున్నగతిఁ దద్దయు నశ్వము లేగె నత్తఱిన్

మ. హయతేజఃప్రతిరోధకాంచితసముత్ఖాలంబనుండుం గళా
శ్రయసంచార విశారదుండు గతిసారజ్ఞుండు నొప్పాదిచే
నియతిన్ శిక్షితమైన జాతిహయమున్ నేర్పొప్పఁగా మండలా
ధ్యయనంబుం బచరించె నిష్ఠురఖలత్పాతాతిచిత్రంబుగన్

మ. బలసంక్షుణ్ణ నగోత్థపాంసుచయముం బ్రాలేయజాలాకృతిన్
మలినం బై గగనాతిశాంసు వగుచున్ శ్యామాసుఁ బ్రక్షుణ్ణపం
క్తుల నెంతేఁ బునరుక్తసాంద్రములుగాఁ దోడ్తోడఁ గావింపుచున్
గలయన్ సర్వహరిన్ముఖంబుల సమగ్రస్ఫూర్తిఁ గప్పెన్ రహిన్

చ. పొలుపుగ మాధవానుచరభూపతులొక్కట వైరులం బడెన్
బలువిడి సింహపోతములఁ బట్టి వధించి యుదీర్ణతేజులై
కలితవనేభమస్తకనిఖాతనఖాగ్రవిముక్తమౌక్తికో
ల్లలితగుహాగృహంబుల నలంకృతులై వసియించి రెంతయున్

మ. వికసద్వ్యాకపంకపింగఫణిభుక్పింఛావచూడాగ్రమున్
వికసత్త్రోటిపుటాగ్రదష్టభుజగప్రేంఖత్పతాకాక్తమౌ
సకగోద్యత్తగకేతుమండమై యభిజ్ఞానంబుగా నేగి భూ
పకులున్ గొందఱు కృష్ణమందిరము ప్రేవన్ జేసి రావాసమున్

చ. జన మతివర్తమానతరుశాఖల నీడఁ బరిత్యజించి చ
య్యన నటుఁ జేరె భావిసమయంబున రాఁగల యట్టి నీడలన్;
మునుగొని వృద్ధినొందఁగల భూరితరాశ్రయ మాశ్రయింప కెం
దును గడు క్షీయమాణమగుతుచ్ఛతరాశ్రయ మాశ్రయింతురే?

ఉ. మున్నుగ నేగి యొక్కఁడొక భూనివాసము నాఁగి యన్యులం
గ్రన్ననఁ జేరకుండఁ బలకన్ నిరసింపుచు దవ్వులన్ వడిన్
బన్నుగ నొందుచోటికటు బాగుగ నేగెడు నాత్మయోధులన్
జెన్నుగఁ జేయి వీచి పిలిచెం బలుమాఱుఁ బ్లుతస్వరంబునన్

చ. అపుడు సుధారసోక్షితములైన తెఱంగున సారెసారెకా
తపపరితప్తసర్వజనతాపము దీఱ్ప వనాగముల్ మరు
చ్చపలచలత్పటాభరణశాఖములై గిరిజాతకల్పపా
దపములఁ గూడి చిత్రఫలదంబులునై విలసిల్లె నెంతయున్ 885

చ. తరమిడి సోఁకి పిల్లు లటు పెల్లు లటం బెడవాఁగ దోలఁగా
నురుతరశక్రదివ్యాసనములనుండి తొలంగి బరిపాటి కాజనుల్
పరువడి డించుచోఁ గళిత భవ్యతరాంకుశులైన రాజసం
వరుల ముఖాగ్ర్యసంపద జనంబు గుణంబు గనెన్ భయేచ్ఛలన్

చ. రథతురగేంద్రదంతిగతరాజపురంధ్రుల డించుచున్ గరం
బధికృతు లాత్మకంధరసమర్పితతన్మృదుబాహువల్లులై
ప్రథితము గాఁగ గాఢపరిరంభణసౌఖ్యము గాంచి పొందరై
రధరకపోలచుంబనసుఖాప్తిని ఘూర్ణితచిత్తసంపదన్ 387

శా. వ్యాకీర్ణస్ఫటికమాల్యహారము జితోద్యద్బ్రహ్మభారంబునై
వీక్షించం బొల్పు నెలంత కేశభరమున్ పీడించెనో సాంద్ర జల్
కేళిన్ ప్రాకుల మీఁదనుండి యుటికెన్ గ్రీడించి; సంఘర్షణీ
లోకంబందు రహిన్ గుణాధికుల నాలోకింపఁగా నేర్తురే? 388

చ. పటుతరరోచమానరుచిభర్మ్మచయాంకుశికంగిశాశముల్
చటుల నిరంతరాయతవిసారిశిఖుల్ ఘనవంశకేతనో
త్కటపరిచుంబితాంబుధరపంక్తులు నైన రథంబు లర్థలిన్
ఘటితనగేంద్రపాదములకై వశిఁజూడఁగ నయ్యె నెంతయున్ 389

సీ. ఛాయాకరంబు లుచ్ఛ్రాయవంతంబులు
నుజ్జ్వితఘూతిశోభోత్కరములు
సలలితబహుళపాటలధాతురాగముల్
విమలతారావళీవిరచనములు
నగు గజంబులచేత నటు మాష్యములచేతఁ
బొలె రాజనివాసభూము లలరె;
నృపకాంత లుత్క్షిప్త విపులకాండపటావ
కాశ లీనాలసగంధవాహ

గీ. చలనశమితాధ్వఖేదసంజనితఘర్మ
తోయులై చారుపల్లవస్తోమరచిత
మంజులాస్తరణోపేత మహితవసన
సదనముల యందు సుఖనిద్ర సలిపి రపుడు ౩౯౦

చ. అతులితసాంద్రఘర్మసలిలార్ద్రి సువర్ణసవర్ణగాత్రసం
గతనవచోళమున్ క్షతనఖక్షతమౌ నటు విచ్చివైచు యా
వతము ప్రకాశమానపృథుహారపయోధర బాహుమూలమై
చతురత విందొనర్చెఁ బెలుచన్ క్షణ మయ్యువనేత్రపంక్తికిన్

వ. మఱియు వణిగ్జనంబు సేనానివేశంబుకంటె మున్నుగా నవ్యగ్రు
లగుచు నేకకాలంబున నుభయపార్శ్వంబులందుఁజాలుగాఁ బట
మంటపంబులు విస్తరింపంజేసి పర్యాప్తక్రయికలోకంబుగల్లు
నట్లుగా నసంఖ్యేయ క్రయ్యపణ్య ద్రవ్యపూర్ణపణ్య ప్రసారణ
స్థానంబులగుపణ్యవీధులు ప్రకాశింపఁ జేసిరి; కొందఱుపురుషులు
ఫలనిమిత్త కృతమహాప్రయత్నులును సముద్యతమృత్పిండదండ
కాష్ఠులునై యొక్కశశంబును వధించుటకుఁ జుట్టుముట్టి యవ
రోధించిన నదియనోకహజాలమధ్యంబున నుండి యతిసాధ్వసంబు
నంబఱచు నెడ వేఱొక్కపురుషుండు వారినందఱిని వారించి దాని
రక్షించి మహోత్కర్షంబు నధిగమించె; నప్పుడు ౩౯౨

మ. జనసందర్శనభీతిచే వసనవేశ్మస్థానమధ్యంబునన్
ఘనశక్తిం బరువెత్తు లేడి శరభృత్కాండఁబుచేఁ జిక్కనొం
దని దయ్యున్ పదనాంతరస్థలలనోద్యత్కర్ణవిభ్రాంతశో
భననేత్రేషుగాఢాహతలక్ష్మయయి నిల్వంజూడదెప్పట్టునన్ ౩౯౩

సీ. వితతలావణ్యనిర్జితదేవవేశ్యలు

ఉచితనర్మప్రబోధకవచనాచమత్కృతుల్
వేశ్యలు సైన్యంబు విడియు నంత
రమ్యావసథములు రచియింపఁగాఁ బఱచి
లలితప్రసూనతల్పము లమర్చి
మార్గఖేదంబును మదిఁ దలపోయక
సింగార మొనరించి చెలువు దాల్చి

గీ. యలసి చనుదెంచు పురుషుల వలచి తెచ్చి
రమణతోడ శైత్యోపచారము లొనర్చి
పరగఁ జిరసన్నివిష్టల కగణి వారి
చిత్తములఁ బ్రీతి రంజిల్లఁ జేసి రపుడు ౨౨౪

గీ. జలముఁ ద్రావి ప్రసంగులు వెట్టి జలజములు ధ
రించి తూండ్లు భుజించి వారించి రఖిల
జనులు శైలసరిత్సంపద నుపభోగ
నిష్ఫలత్వదోషోద్భూతనింద నపుడు ౨౨౫

చ. అతివల నిమ్ననాభిసలిలాశయభిన్నరయంబులుం దదం
చితవిలసద్బృహజ్జఘనసేతునివారితముల్ నదత్స్వనం
భృతజలడుండుకాఖ్యపటువిశ్రుతవాద్యమనోజ్ఞసంచల
త్త్రితకుచవిచ్యుతంబులగు తజ్జలముల్ ప్రవహించె మందతన్

చ. మసలకహస్తికంబులు సముగ్రవిలోలకరాగ్రరంధ్రకో
ల్లసితజలప్రవృష్టి నవిలంఘితభూరిపరిశ్రమాయత
శ్వసితమరున్నిరస్తసువిశాలశిరోభవపుత్రరుగ్మదా
పసరము చేతఁ బోలెఁ గడు వేడుకఁ జల్లుకొనెన్ శరీరమున్

ఉ. ఎయ్యవి పక్షముల్ గలిగి యొప్పున వారిధిలో మునింగె ము
న్నెయ్యవి శక్రవజ్రజాతజృంభితపక్షములై చలింప లే

వయ్యె ధరిత్రి నట్ట గిరులన్ని కొలంకులలోనఁ గ్రుంకఁగాఁ
జయ్యన నేఁగి పీతకుథసంభృతకేతుగజచ్ఛలంబునన్ 398

దంతి జలభంగమునఁ దోఁచు తనదునీడ
గాంచి ప్రతినాగ మెదురుగాఁ గదియ వచ్చు
చున్నదని కిన్కఁచే వేగ నుఱికి నీటఁ
బడియె; ముగ్ధత నది స్వభావంబుగాదె? 399

పరగజరాజముక్తమదవారిసువాసితమైనతోయమున్
జిరగతి సంగ్రహింపఁగఁ ద్యజింపగ లేక నిరంకుశస్థితిన్
సరిదవతార మాఁగి వెలుచన్ జరియింపక యున్న రోషభృ
త్కరిని జనంబు గన్గొనియె దవ్వులరిక్తఘటాగ్రహస్తమై 400

'తరుణీ! చూడుము మ్రోల నాగము భవద్వక్షోజయుగ్మంబు స
త్వరతం గాంచి ప్రతీభకుంభయుగళభ్రాంతిన్ మదోద్వృత్తదు
ర్భరతీర్యగ్రదసంప్రహార మొనరింపన్ వచ్చెడున్ వీడు మీ
తెరు, వంచున్ బ్రియురాలితోడ విటుఁ డెంతేభీతిఁబల్కెన్ వడిన్

తతకరటిప్రరూఢమదతాపగదప్రళమార్థముద్యతా
యతకరశాఖలం గటములందు వికీర్ణము లాగ్రుతిద్రుతో
త్పతనములున్ వికాసి సముదంచితకాశసుమప్రభంబులా
వితతజలంబులొందె ఘనవిశ్రుతపాండురచామరాకృతిన్ 402

పరిగతదానతోయపరవారణమారుత మౌట నీసునన్
శరముఖపూరణంబు నెగఁ జల్లుగజంబులసత్వరస్తట
స్థిరప్రథిమానరుద్ధరదధీక్షచలన్ముసలప్రదేశమై
పరువడినీటిలోఁ బడియె; వైరిగుణఁబు సహింప రెవ్వరున్ 403

కమలములఁ గ్రుంకఁబను దంతికటతటంబు
వదలి వేటొందు కడకేగె భ్రమరగణము;

దానజాయిజలావృతుండై న విద్వ
మానగతికుండు నిలుచునే పూని యచట? 404

మ. వనమధ్యంబునఁ గ్రుంకు దంతి కటమున్ వక్షించి నింగిన్ గృత
స్వనమై విస్తృతవక్షమూల మగుచున్ వక్ష్యాదిసంఘంబు గ్ర
స్ననఖాసిల్లె గుణంబు ద్రవ్యగతమై నెన్ స్వాశ్రయం బట్టి బా
సిన తద్వ్యాపనీలవర్ణము క్రియన్ జీమూతతుల్యద్యుతిన్ 405

చ. ఘనగజ గాత్రలగ్నబహుగైరికధాతుపరాగరాగమున్
ధునిపయిఁ బర్వఁ బద్మికచతోయజగర్భహరిత్వరాగమున్
ఘనకరిమీఁదఁ బర్వఁ జిరకాలము క్రీడ యొనర్చి వస్త్రముల్
మునుకొని మార్చికొన్నక్రియఁబొల్చెనుద త్తటినీ మహేభముల్

చ. ద్విరదములుం బలోపరినివిష్టమదోదకచంద్రకంబులన్
వరుస మహాసరిత్తులకు వారక నేపృథు నేత్రసంపదన్
గరమొనఁగూర్చె దానినె వనంబులఁ బాసి తటంబుఁజేరుచున్
మరల గ్రహించె గాత్రగతమంజునవోత్పలపత్రకంబులన్ 407

చ. వితతశితాంకుశప్రబలభిన్నవిశాలకపోలనిస్సరత్
క్షతరుహమయ్యు రోషమునఁ జయ్యన నన్యగజంబు మీఁదికిన్
జతురత నేగుదంతిని నిషాది మరల్పఁగఁ జాలఁ డయ్యె; మ
ద్ధతి బలవంతుఁ డన్యులకుఁ ధారుణి లోఁబడురే? తలంపఁగన్.

ఉ. సానునయంబుగా నొక నిషాది గజంబును బంధనార్థమై
పూనిక సేవ్యమైన తరుమూలము సేర్చిన నన్యదంతి రా
డ్దానకృతాధివాసమగు దాని భజింపక త్రుంచి వైచె; బల్
మానులు వైరిగంధ లవమాత్రమునైన సహింతురే? భువిన్

ఉ. సంతతశైలకుంజచరసామజరాజకపోలకాషసం
క్రాంతమదోదకం బగుట రమ్యచమూగజభగ్నమైన వృ

ఖాంతమునందుఁ గ్రాలెడులతాంతములన్నియు వాడెఁ దుమ్మొదల్
పంతము మాని నిస్పృహత వచ్చిన త్రోవనె పోయెఁ గ్రమ్మరన్

ఎప్పుడు దంతు లున్నతమహీరుహమూలములన్ వసింపఁ బో
వప్పుడు యంత్రచోదితములై మృదుశాఖల బంధనార్థమై
చెప్పెడి దేమి బల్మి విఱిచెం దమయంతనె తాము; తద్విధం
బొప్పగు గాదె యాత్మహితయుక్తి నెఱుంగుదు రే? మదాంధకుల్

ఉరుకాయంబులు స్థూలమస్తకము లత్యుష్ణాంబుముగ్వక్త్రముల్
స్ఫురదంతఃప్రబలోష్మముల్ ప్రవిలసద్భూభృదాకారమున్ నీలపు
ష్కరజన్మోదరతుల్యకాంతులగునాగశ్రేణులం గొన్నిఁటిన్
వరుసం గట్టిరి కొన్నిటిన్ దవులఁ బోవం దోలి రా సైనికుల్ 412

కటకండూయదిభేంద్రభూరిమదవార్గంధిద్రుమస్కంధసం
ఘటితస్థూలమహేంద్రనీలమణిరేఖాకోమలశ్యామలో
ద్భటభృంగీవలయంబుచే నపుడు ద్రుగ్రీవాభూషణత్వంబుఁ బ్ర
స్ఫుటభంగిన్ రచియింపఁగాఁ బడియె నామోదంబు సంధిల్లఁగన్

చెలఁగినిరస్తపీతము చిక్కక పాఱెడు బాలకంబు ను
జ్జ్వలగజశాస్త్రపద్ధతినిషాదిసుసాంత్వనతర్జనాదులన్
మెలఁపున మెల్లమెల్లన శమింపఁగఁ జేసెఁ గ్రమక్రమంబునన్;
వలనుగ నిశ్చితాత్ములగు వారికి శాస్త్రము సిద్ధి నీయదే? 414

చతురత్వంబున సంతతోచితమహాస్తంభంబు వర్జించె ను
న్నతిమీఱన్ సరసాగ్రహస్తముగుచున్ దానంబు నర్పించె వి
శ్రుతబద్ధాపరశృంఖలంబుల వడిన్ లూనంబు గావించె నీ
గతి దంతావళరాజు పొందె నవిశంకన్ జాల స్వాతంత్ర్యమున్

వెలయంగ గంభీర వేదికరీంద్ర ము

సైనను ముకుళీకృతాక్షమై కబళంబు
గొనకున్న వీక్షించి జనములెల్లఁ
గడుమందుఁడైనను ఘనబలుం డేమిచే
సిన వశంగతుఁడుగాఁడని యెఱింగి
లోకవారణేంద్రముతృణకతఁ బురోనిహి
తేక్షుకాండంబు గ్రహింప కంత

గీ. కర్ణసామజకాంతమైఁ గాంతయిడక
హస్తిపకుఁ డేమిచెప్పిన నాలకింప
దను లటుమూసి యిచ్ఛావిహారయోగ్య
చారువనవాసమహాముసే సంస్మరించు 416

వ. మఱియు సముద్యతకరతలనిహితపిధానపిండఘృతాదినిష్యంచా
ప్లుతభుజుండైన యాధోరణుండు సముత్తుంగాగ్రకాయంబగు
దానిఁగబళగ్రహణంబుకొఱకు నమ్రమత్వంబుగ్రహింపనిదాని మహే
భరాజంబు నతికష్టంబుగా భుజింపంజేసె నప్పుడు శుక్లాంశుకోపర
చితంబులును రశ్మివితతంబులును జంద్రాకారంబులునైన రా
జచూష్యంబులు నిరంతరగజమండలంబులచేతఁ బరివేష్టితంబులై
నీలజీమూతపంక్తిపరివేషంబునొందిన వాని తెఱంగునం జూపట్టె
నదియునుం గాక 417

చ. అతిగమనోతమార్గగతియయ్యును జాలగతోరుమార్గమై
వితతబలోదయోల్లసితఫేనవికారజలానుసారసం
ప్రతిపరిలత్వ్యపల్యయనవర్ధ్రిపదంబయి పొల్చువాజి సం
తతి నటు వేల్లవార్ధము వసంపడి త్రిప్పిరి సాదులొయ్యనన్

చ. పరువడి బాహ్లికాశ్వము స్వభావమునం బ్రణతోత్తమాంగమై
కర మరుదార మూర్కొనిన ఘ్రాణవిరోకమరుత్సమృద్ధసూ
క్ష్మరజము తన్మనోజ్ఞతమ సంగసుఖానుభవోత్సుకోర్మినుం
దరపులకాంకురత్వముమ దాల్చిన భంగిఁ జెలంగె నత్తఱిన్ 419

శా. రాజత్కాంచనభూమిభాగములఁ బల్మాఱుం బ్రచారించి వి
భ్రాజత్కంపితగాత్రమౌట వితతోర్ధ్వవ్యాప్తరోమాళియై
వాజీంద్రంబు శిఖాకణారుణరుచివ్యాకీర్ణపాంసూల్లస
త్తేజశ్శేషము చేతఁ బోలె మిగులన్ దీపించెఁ జిత్రంబుగన్ 420

మ. పురుపస్థాన సముద్యతాగ్రతనువై పూర్వాచలేంద్రంబుపైఁ
గర మర్థోదితమైన భానుని తురంగశ్రేష్ఠముం బోలు సుం
దరశ్రీస్పృశకివక్త్రరజ్జుధరణ స్థైర్యోరుపాణిద్వయాం
తరుఁడౌ వల్లభపాలు మీఱుట కళత్తంబయ్యె నొక్కింతయున్

చ. చెలువుగ నొక్క వీథి యఖిమేచనసాంద్రతరార్ద్రగాత్రమై
నలువుగ శ్రీసమతమున నాకనివాసిజనంబుచే బలెన్
బలుమఱు ఔప్పవేయని జనంబులచేత నిరీక్ష్యమాణమై
జలనిధిఁ బుట్టి వచ్చు ఘన శక్రహయాకృతినొప్పె నెంతయున్

చ. హరితతృణంబు మేయు నపు డంచితభంగి గళాగ్రలోలసుం
దరనవకింకిణీకకలనాదవిమిశ్రహయేంద్రదంతబ
ర్బురనినదంబు సంభ్రమసముత్థితమై పరివీతనిద్రమౌ
నరవర పాళిచే నటు వినంబడియెన్ గడు హృద్యవైఖరిన్

చ. తరమిడి యొక్కతేజి కడుదర్పమునం జలియించి త్రాళ్ళతో
నురువడిఁ గీలముం బెఱికి యుద్ధతిఁబాఱినఁజూచి బల్విడిన్
మఱియొక తేజి యత్నపర మానవ దుర్గ్రహమై తురంగియం
చఱిముఱి వెంటఁబారి వెస నాకుల మందఁగఁజేసె మందురన్

వ. మఱియును శిష్టాశిథిలోత్తరవతీమందావైహాయస్యాది చతు
ర్దశవల్గాప్రభేదవిశారదుండును షడ్విధప్రేరణాభిజ్ఞుండునైన
యొక్కవాహకుం డవ్యాకులంబును సజ్జీకృతంబును హయచతు
ష్కాఖ్యగతివిశేషంబునందుముఖసంస్థానవిశేషాదివిశేషణవిశిష్టంబు

నైన జాత్యశ్వంబును యుద్ధాభ్యస్తతర కాలవిధేయక్రియాయా
పంబులును నసంకీర్ణరూపంబులునగు నాస్కందిత ధౌరిత కరే
చిత వల్గిత ప్లుత సంజ్ఞలుంగల పంచధారలును లక్ష్యమధ్యాదిక్షా
భిధాన త్రివిధమార్గంబులును బరిచయంబు సేయించుటకు స
కౌమాన్నతవిషమాంబుకీర్ణకుద్దానతాగ్రతృణవీరుదాఢ్య స్థానప్రకీ
ర్ణోపలసంప్రకీర్ణ పారోన్నోన్నత సంజ్ఞలంగల నవభూములయందు
సంచరింపం జేసె నప్పుడు 425

చ. మునుకొని భక్షణార్థము విముక్తములై కటకంబుఁ జుట్టి పె
ల్చనఁ దృణమున్ భుజించుచు విశాలపటకుయరజ్జుపాశ ద్రుం
చినఁ బరిచారకుల్ గినుకచే నదలింపఁగఁ జారె నశ్వముల్
ఘనపదపాశభేదన చలచ్చరణంబులు గల్గునట్లుగన్ 426

సీ. పరగ సముత్తీర్ణబాహ్యాభ్యూర్ణఘుషయ్యు
భూరిబల్బజతృణపూర్తివలన
నతిదుస్సహంబైన యాతుకం బగముల
క్రింద లోమంథక మంద సంచ
లద్గురుపాస్నమై లక్షింప ముకుళీకృ
తాలసాతులు గల్గునట్లు ప్రీతి
నివసించె మఱియుఁ గొన్నివృషంబు లఱుచుచుఁ
గలితమృత్పిండ శేఖరితకోటు

గీ. లగుటఁ గోట్యంతరగతాంకుర దైన యర్థ
కమలవైరిని గేరు శృంగములచేత
పంతతోచ్ఛృంగితాన్యవృషంబు లగుచుఁ
దటిని తీరంబు గోరాడె దర్ప మెసఁగ 427

మ. తగ నూర్జస్వలమైనయొక్క వృష ముద్యచ్ఛక్తిచే మాంసలో
పగతాభీకపరోతసంచయములం బల్మాఱు నిర్జించి జ

నృగతానూనజయోద్ధురాయతవిషాణోగ్రంబులుం గల్గున
ట్లు గజారివ్రజమై తమిం జనియె గోలోకంబు వెంటన్ రహిన్

మ. సముదగ్రాసన మాయితావ్యథమహోచ్చగ్రీవమై చూడనొ
ప్పుమహోష్ట్రివ్రజమగ్రచుంబ్యభినవప్రోద్యద్ధ్వనాస్వాదవం
తము లౌ మంజులపల్లవప్రచయముల్ దత్పర్వతాధిత్యకా
ద్రుమజాలంబుల మీఁదనుండి తిగిచెన్ లోలోష్ఠముల్ గల్గఁగన్

గీ. మఱియు నొక యుష్ట్రి ముచితనింబచ్ఛదప్ర
విష్టమృదులాగ్రమపత్రంబు వెడలఁగ్రక్కె
మున్నుగఱపఁబడుమ్లేచ్ఛముఖహామిశ్ర
గళగతమహీసుపర్ణ్వసిఁ గ్రక్కినట్లు 430

ఆ.వె. బయలనున్న భృత్యపాళిత రాజుల
వార్తలెఱుఁగఁ బల్కు పాఠకులును
విపులఫణితిఁ బ్రకటితపదార్థమౌనట్లు
పాడి రవసరప్రబంధతతుల 431

ఉ. ఉన్నతధాతురాగ విపులోచ్ఛ్రితవస్త్రికుటీరయుక్తమై
పన్నగ నంజనాభగజభాసితమై ఘనసాంధ్యరాగసం
భిన్నపయోదకర్బురిత విశ్రుతచారునభంబుకై వడిన్
సన్నుత లీల నొప్పె హరిసద్మము భూరిమహోహరాకృతిన్

మ. విలసత్సైన్యపినద్ధమై కుధర మొప్పెన్ దంతిభగ్నద్రుమా
వళిశబ్దంబులఁ గృష్ణ! నీవు నలువొప్పన్ బర్వతోద్ధర్త వం
చిలఁ బ్రఖ్యాతి వహించినాఁడ విపుడిట్లేలా ననుం గిన్క నా
కులపాటొందఁగఁజేసె? దంచు వెసనాక్రోశించు చందంబునన్ *

---

*మూలమున ౫వ సర్గ సమాప్తము.

## ఆశ్వాసాంతము

ఉ. సౌరమహీంద్రధీర! సురసన్నుత శౌర్యవిహార! వార్ధిగం
భీర! మదోద్ధతారిగణభేదనదక్షభుజప్రచార! గో
త్రారికుమారమార! ఋతురాజమనోజ్ఞశరీర! సద్యశః
పూరితలోకవార! గుణపుంజవిభూషణ! మంజుభాషణా! 484

క. నారాయణాంశభవ! సుగు
ణారామవసంత! వితరణామరభూజా!
సూరిజనస్తుతమదనా
కారా! గోపాలకృష్ణకరుణాధారా! 485

మాలిని. పరహితసుచరిత్రా! పండితస్తోత్రపాత్రా!
తరణిసదృశతేజా! దండితద్విట్సమాజా!
పరిచితబహువిద్యా! భవ్యసౌందర్యహృద్యా!
నిరుపమగుణజాలా! నిత్యకళ్యాణశీలా! 486

(గద్య)

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధ విద్యాసాంద్ర
గోపినాథ వేంకట కవీంద్ర ప్రణీతంబైన
శిశుపాలవధ మహాకావ్యంబు
నందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము.
శ్రీకృష్ణ.

# శ్రీరస్తు

# శిశుపాలవధ మహాకావ్యము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరాధారమణీశా
పారకృపాలబ్ధరాజ్యవైభవ! జగతీ
హారాయమాణకీర్తివి
హారా! గోపాలకృష్ణయాచనరేంద్రా! 1

### • షడృతుసేవ •

వ. అవధరింపు మవ్వలికథ యెట్లనిన నిట్లు సేనానివేశనంబు గావిం
చిన యనంతరంబ 2

గీ. ధరముపయిఁ గ్రీడ సలుపంగఁ దలఁచు సాధు
హితకరునిఁ గృష్ణు సేవింప ఋతుసమూహ
మేకకాలంబువందె స్వీకృతయథాస్వ
వృతుఫలపుష్పమగుచు వావిర్భవించె 3

### ( వసంతము )

గీ. నవపలాశ పలాశవనంబు మఱియుఁ
బటుపరాగ పరాగతపంకజంబు
మృదులతాంత లతాంతమై మెఱయు కుసుమ
సురభి సురభిని గృష్ణుఁడు చూచె నపుడు 4

గీ. విలుకాని కనికరమై జలజముఖుల
మొలకలి చెమ్మట లార్చుచు నుత్పలములు
తరళత వహింప సరసుల తనుతరంగ
విసరము చలింప వాయువు విసరె నపుడు 5

గీ. లలితకేసరవత్స్తబకసంకలిత మకుట
సుందరాశ్రయయశోలబ్ధగుణము లైన
భృంగి యందలి మలినిమ కృష్ణయువతి
జన నయనతారకాస్ఫూర్తి ననుకరించె 6

చ. సలలిత హేమవర్ణనవచంపకమధ్యగతారుణప్రభా
విలసదశోకపుష్పము విభిన్నవియోగవతీ విశాలహృ
త్కలితమనోజబాణశిఖగాఢశిఖాకపిశీకృతస్ఫుటో
జ్జ్వలపిశితంబు చందమున వారికిఁ జూడఁగ నయ్యె నెంతయున్

క. సురసాల రజఃకణములు
స్మరవహ్నితుషాగ్నిచూర్ణసమతఁ గనినవై
ఖరి వెసఁ బాంథజనులపైఁ
బరిపతితములై యొనర్చె బరితాపంబున్ 8

క. పతులఁబయిఁ గుపితలైన యు
వతుల యలుక దీర్ప మరుఁడు వంపె నన మధు
వ్రతపాళి వెడలె వకుళ
క్షితిజసుమ మరందపానకృతనిస్వనమై 9

చ. గురుతరమత్సరచ్ఛిదురకోమలవాక్స్వరపుష్టకాంతచే
గిలికొని చెంగటన్ ప్రియసఖీసదృశం బగునట్లు పథ్యమున్
గర ముపదిష్టలై సురతకాంతమెయిన్ ప్రియులైన వారికిన్
వరుస నయూవితం బయిన వర్ష మొసంగిరి కామినీమణుల్

గీ. పరఁగ నళులచే నపవాదకరులచేతఁ
బోలెఁ బథికులు మృగముల లీల మధుర
వల్లకీస్వరజిద్గీత వైభవమున
నలరి స్మృతిభూవశంగతలైరి యక్షులు 11

చ. చెలువుగనొక్కయిందుముఖ చేఁ గుసుమాపచయార్థమింపు సొం
పలర రసాతిరేకముస నట్లవలంబిత మయ్యు సంభ్రమం
బొలయ వనాగమున్ వళత నొందని చాట వృథోన్నతాకృతిన్
జెలఁగి యసత్యపుం స్తవముఁనఁ జెన్నువహింపకయుండె న త్తఱిన్

వ. మఱియు నొక్కపురుషుండు స్వయంగ్రహాశ్లేష సుఖంబు కోఱకుఁ
బ్రియురాలి నళిపాతవ్యాజంబున భర్త్సింపుచు నిట్లనియె.

సీ. స్తనయుగ్మభరవిజిత స్తబకానమ
త్పృథుత్వగ్రవల్లి విరాగిమైన
యీ మధువ్రతకులం బెలమిఁ బరాగవం
తములైన నవపంకజములు విడిచి
మునుకొని నీ కభిముఖముగాఁ జరియింపు
చున్నది సమ్మోదయుక్తమగుచు
భవదీయసురభినిశ్వసితమందును సుధా
రమణీయమధురాధరంబు నందుఁ

గీ. దృష్ణ నొందిన యీచంచరీకనిచయ
మునకు నాకును బోలె సౌమనసగంధ
రసము లాత్మకు సంతోష మొసఁగఁ జాల
వయ్యె నేమని చెప్పదు? నంబుజాక్షి! 14

గీ. అనుచు నిబ్భంగిఁ జతురోక్తు లాడు ప్రియుని
గురుభుజోన్నమనోరువక్షోజ యగుచు

క. అని యిటు బంధువితతి చె
ప్పిన బంధువచనములచేత వెలఁదుక బయలన్
దనపతి కంఠస్వరమున్
విని యమృతము చేతఁ బోలె నిర్వృతినొందెన్ 22

క. మధుబోధితవాసంతీ
మధుమేధిత మేధమైన మధుకరరవళ్ళ
న్మధుర మధువ్రత భామిని
మధురంబుగ గాన మపుడు మానుగఁ జేసెన్ 23

క. అరుణితసకలాద్రివనో
త్కరమై పథికజనతాపకరమై వికచ
స్ఫురదురుకింశుకసంహతి
యరుదార వహించె దవవహుతాశనశోభన్ 24

( గ్రీష్మము )

గీ. పరగ నెప్పుడు శైరీషపాంసురుచులు
హరితురంగమలోమతుల్యత వహించె
నట్టి శుచికాల మువగతం బయ్యె మల్లి
కలకుఁ జిరగంధ మొసఁగుచు లలితఫణితి 25

గీ. స్వరమణీశ్వసితోపమ సాంద్రదళిత
కోమలనితాంతపాటలకుట్మలంబు
మన్మథోచ్ఛలితాళియై యొప్పు గాత్రు
హాలయ మదలౌల్యమొందెఁ గాముకజనంబు 26

గీ. చంచలాక్షులు తక్షణస్నపనజలతు
షారశ్ళృత్కుచములు ప్రియుజనముల వక్ష

మందమందోర్మికి వెన్నెల నంచితముగ
సరసచందనకేళులప్రల్ జల్లిరప్పుడు. 27

(వర్షము)

గీ. ప్రస్ఫురదధీరతటిదసిభాసమాన
మహితోదగ్రపయోధరయైన జలధ
రాళి యనుపేక్షితాత్మీయవేళ యగుచు
నద్రిశిఖు వల్లభునిఁబోలె నతిక్రమించె. 28

క. జగతి నభోమాసంబున
గగనమునఁబై దంతిసంగాఢకాలాభ్రములిం
పుగనొని యానన యే ప్రియుఁ
డగు నేకరసుం భజింపఁ దలఁపడు బుద్ధిన్. 29

క. ధృతశక్రచాపవలయాం
చితఘనరుచి వివిధమణిరచితకుండలభా
తతివశితాంశుక మగు శ్రీ
పతి గాత్రము ననుకరించె భాసురకేళిన్. 30

గీ. ఘనసమీరణచలితమేఘములచేత
క్షణికలక్షితవ్యవహితచపల చపల
విటపములచేఁ దమాలపృథ్వీజద్యుతిశ్రీ
గగనపాదపమంజరి కరణి నలరె. 31

చ. స్ఫుటతరవాతసంచలితభూరిఘనంబులచేత నింగి సం
తత క్షణలక్షితవ్యవహితస్ఫుటచంచల యొప్పె నత్తటిన్
జటుల సమీరణోచ్చలితశాఖలచేతఁ దమాలసన్నిభో
త్కట గగనావనీరుహవికాసితమంజరిఁబోలె వ్యాప్తమై. 32

గీ. పథికయువతియొకతె ప్రాణసంశయ మొంది
సనయనోదకాళి సంభ్రమమున న
విధురబంధు వగుచు వీక్షించె నంబుద
పాళి నపుడు కరమబంధురముగ. 33

గీ. విదళకందళకంపనావిష్కృతుండు
కామినీమానహరణుండు ఘనపవనుఁడు
క్షితిని వనములు కంపింపఁజేసె ననఁగఁ
దెలఁగి విరహులఁ గంపింపఁజేయు టరుదె? 34

గీ. పటుతరాత్మీయనినదసంపదలచేతఁ
గృతసమార్జనమర్దళతతినినాద
జయమగు ఘనాళి వీక్షించి సమ్మదమునఁ
గలవిలాపకలాపిసంఘము నటించె 35

చ. అతులకదంబపుష్పకరజారుణితాంబరముల్ దుషారసం
గతములు కందళీకుసుమగంధయుతంబులునైన వాయువుల్
జతురత నూత్నమూత్నముగఁ జంచలనేత్రల మీఁదసారెకం
చితగతి రాగమున్ గలుగఁజేసెను గాముకమానసంబులన్. 36

గీ. వారిధరములు ప్రవిరళప్రథమబిందు
శమితతాపం బపోధరజంబు గంధ
వంత మగు రైవతాచలప్రాంగణమును
మానినీగతి యోగ్యంబుగా నొనర్చె. 37

క. కరిరథధవళస్ఫురదళి
వరమృగరుచికైతకంబు వారిదకషణో
త్కరపతితకృశశిఖైందవ
సుషుచిరఖండంబు పగిదిఁ జూడఁగనయ్యెన్. 38

వ. అంత దురితనాశన కీర్తనుండును రథావయవాయుధుండు నగు కృష్ణుండు తిరోహితతిగ్మమయూఖంబును బత్త్రిసంఘంబు కొలఁకుల గులాయనిలాయిత్వసంపాదకంబును ప్రాచ్యాది దిగ్వివేకశూన్యంబునగు ప్రావృట్కాలం బతీతం బగుచుండ నీలోత్పలనేత్రయు విస్రస్తనవశాంబరసాదృశ్యయోగ్యవేషయునై రైవతకపర్వతోత్సంగగత యైన ప్రియురాలి చందంబున నంగం బగుచున్న శరత్తు నవలోకించె నక్కాలంబునందు

## (శ ర త్తు)

చ. శరకరుఁ డాత్మభానువులఁ బ్వారిసై శశమంబు మించు దు
ష్కరమగు మేఘబృందమయగాఢతమంబును వెంట బల్విడి
న్సరసులయందుఁ గాఱ్కొనిన సైంద్రతమంబును బోవఁజేసెఁ; గు
ర్వర మహనీయకీర్తులగు వారికిఁ గల్గరు శత్రు లెక్కడన్. 46

గీ. 'కాలమె బలాబలంబులు గలుగఁజేయుఁ
బ్రాణులకు' నంచుఁ బలికెడు భంగి హంస
రవము రమణీయతాస్ఫూర్తి రహి వహించెఁ
గఠిననాదమయూరంబు గలుగునట్లు. 47

గీ. విశదపక్షవిధ్వనివిజితనాద
శిఖితనూరుహచయ మీర్ష్యఁ జేతఁ బోలె
విరిసి ధరఁ ద్రావాలె; మానినియై వెలయువాని
కరిభవపరాభవము దుస్సహంబుగాదె? 48

చ. ప్రతివనమందు సాంద్రశరరాగజపాకుసుమాధరోల్లస
ద్వితతవనావళీమదవతీవదనంబున భాసురేఖగా
ప్రతిఫలవిభ్రమంబులగు బాణదళావళు లప్పుడెంతయుం
జితలలితోత్పలద్యుతివిశేషములై యలరెన్ వగంబునన్. 49

సీ. కనకభంగపిశంగ ఘనపలాశములు ప
రాగశోణితకేసరంబులైన
యసనవృక్షములు ప్రియావమానిత మాని
నీమణి పటుకోపనిరసనంబు
లగుటచే ధాత్రి నన్వర్థనామములయ్యె
బాలాతపారుణపంకజంబు
మదహాటలాంగనావదనాబ్జరుచి నను
కరణంబుఁజేసిన కారణమున

గీ. నెవ్వని మనంబు హరియింప దిపమునందుఁ
గలమగోప్త్రి తదీరితగానము విని
పిలిలాక్షమై సస్యంబు మేసవ మఱచి
యున్న మృగతతి నదలింప దుత్సుకమున. 50

చ. గురుశరసప్తపర్ణతరుగుచ్ఛ సుగంధి మధువ్రతవ్రజో
చ్చరిత సుగీతనాదములు సంతతగంబులునైన వాయువుల్
'విరళమదంబు వ్యాకులిత విష్టపమై తగునూర్జదంతి చె
చ్చెరఁ జను దెంచుచున్న'దని చెప్పెడు కైవడి వీచె నంతటన్.

వ. మఱియు యాదవు లొక్కయెడ విగతమేఘావరణంబు లగుట
వలనఁ గోశోద్ధృతాసిలతాసితంబులై యొక్కయెడ శుభ్ర
మేఘచ్ఛన్నంబు లగుటం జేసి పురుహూతగజాజినకూర్పాసకంబు
లైన వాని చందంబున నందంబులై యొప్పు దిక్కుల నవలో
కించిరి మఱియును. 52

క. శరదంగనమరుదుత్థిత
సరసిజకేసరరజంబు శౌరి సతులపైఁ
బరిహాసార్థము జల్లెడు
తెఱఁగున నెల్లెడలఁ బటుగతిన్ వెదజల్లెన్. 53

గీ. అంగణముఖరైన శుకపంక్తి హరితకాంతి
గాంగ నమరులు మింటిపైఁ గట్టినట్టి
హరితపత్రమయంబు శక్రబద్ధ
కిసలమగు తోరణము భంగి నెసఁగె నపుడు. 54

క. శరదంతారవిబుమ్ముఖయును
దరదబ్జాక్షియును హంసనవళిమహాసం
బరయు నగు నా శరత్తును
హరి ముదికను బోలెఁ జూచె నతిరమ్యముగన్. 55

(హేమంతము)

వ. ఇట్లు శరత్కాలంబు ప్రవర్తించిన యనంతరంబ మహాగజ
ప్రమాణంబులైన తరంగిణుల హిమోపేతంబులుగాఁ జేయుచు
హేమంతకాల సంజాతమారుతంబు ప్రోషితభర్తృకలగు యువ
తుల నేత్రంబులకు నశను సంతాపకారిణియగు సలిలసంతతి
నొసంగ హేమంతకాలంబు సంప్రాప్తంబయ్యె నక్కాలంబు
నందు. 56

సీ. అనిలుండు గ్రీష్మాదియందు వియోగికిఁ
జెలిమీఁటి తలఁపు గలుగఁ జేయు
టది మిక్కిల నయుక్త మహహా! హేమంతమం
దుపగతతుహినుఁడై యుంటఁ జేసి
స్మృతసయౌవనసోష్మవితతవక్షోరుహాలం
డగు వియోగిని జంప నలవి యగును
మఱియు నేయంగన మగనితోఁ గూడక
పొలయంకగై కొని తొలఁగి యుండె.

గీ. నట్టి యంగన హేమంతమందుఁ బూర్వ
మగణితుండైన ప్రియునె స్మితాస్య యగుచుఁ

[illegible]వియ సేతెంచి కౌఁగిట గారవించి
యలిగి చనకుండ సర్మోక్తులాడుచుండు. 57

గీ. ఆవరణశూన్యమౌట హిమానిలమున
దూషితంబైన యధరవిద్రుమవ్రణంబు
సీత్కృతంబులచే దంతసితవిభాప
టావృతంబైన పగిది సౌఖ్యంబునొందె. 58

గీ. పేశలంబౌట హిమవాత పీడిత వ్ర
ణాంగనాధర శేఖరావ్యక్తమధుర
రమ్యసీత్కృతస్ఫురితోరురదమరిచి
మయపటాచ్ఛాదితంబైన మాడ్కినలరె. 59

క. ధృతహిమకణమారుతతరు
లతికాంగుళితర్జనోజ్జ్వల విలాసము లి
ష్టతనువుల పరిరంభణ సుఖ
సతతాన్వితమైన చెలి కసహ్యములయ్యెన్ 60

సీ. స్మరసంప్రచోదిత సహజానురాగంబు
ప్రకటింపఁ జేయుటవలన మిగులఁ
గార్శ్యభూత స్వేదకలన నత్యంతోప
కారియౌ హేమంత కాలమైనఁ
ప్రస్విన్నగాత్రలై పడఁతులు ప్రియులను
జెలువుమీఱ రమింపఁజేసి రపుడు
మదవికాసిషడంఘ్రిమధురనాదాహిత
హుంకారులై శిశిరోరుపవనుఁ

గీ. డనువనంబులయందుఁ బ్రియంగులతలఁ
జాలఁ బుష్పింపఁ జేయుచు సంతతంబు

పతుల నెడఁబాసియున్న యువతుల సతుల
విడిచి యున్న వియోగుల వెగడు పఱచె. 61

(శిశిరము)

గీ. మాఘమాసమందు మంచుగత స్త్రియై
పేశి హిమము నడఁపఁగాలుఁ డయ్యెఁ
బరులు వృద్ధినొంద బలవంతు డైనట్టి
గాలవశతఁ జసి గ్లానిఁ జెందు. 62

గీ. తుభితసైన్యపరాగపిశంగవర్ణ
మగుట లోధ్రరజము చైత్రయాత్రికోటు
నభిషేణ యిషుండైన యతను నెఱుఁగఁ
జెప్పుకై వడి దిక్కులఁ గప్పుకొనియె. 63

చ. 'కర ముపభోగ్యమౌ శిశిరకాలము పోయిన వెన్క శీతసం
హారమగు మత్కుచోష్ణమున కవ్వల నేమిఫలం?' బటంచు సుం
దరులు సిరస్తకోపలయి తప్పక వేదమయంతఁదామె దు
ర్భరమదనజ్వరార్తులగు భర్తలఁ గౌఁగిటఁ జేర్చి రత్తఱిన్. 64

చ. ఫలితసుగంధబంధురలవంగములందుఁ బ్రసూనపత్రతా
ళులగు మధువ్రతంబులు విలోలరజోమలినీకృతం బులై
మలయుచు నుండ బ్రేమఁగని మంజులకుందలతల్ దరస్మితం
బులఁ బరిహాసముల్ సలుపుపోలికఁ బూడఁగనయ్యె నయ్యెడన్.

* రైవతకము – ఋతుశోభ *

(వసంతము)

వ. మఱియు నత్యంతసురభిసంతానకంబు ప్రసూనసంపద తనతర
త్వంబున ఖండింపంబడినయట్లుండె వసంతానకంబైన తరుణ
పరభృతంబు కాముకుల రాగవివర్ధనంబు కొఱకు మధు

రంబుగాఁ బంచమస్వరంబుగావించె మిక్కిలి నిష్టమధువాసరన యగుటం జేసి బంభరశ్రేణి యుంగనామాననిరాపకుళలంబును మధువాసరసారంబు నగు చూతంబును బరిత్యజింప నోపకుండె.

సీ. అతులప్రభావని యగు వసంతేందిర
"సః లజగజ్జయచతురమదన
వీరసైన్యము నందుఁ జితతజిత్వరకేతు
వైజయంతులు గూర్చ వలయు" ననుచు
విసువక కదళులు విస్తరింపఁగఁ జేసె
నసతియా స్మరనిమిత్తానురాగ
రూపసాంద్రతమిస్రలోకబాంధవ మండ
లంబు వరించె నలాతసరణి

గీ. తారరవమైన కోయిల చారుఫణితిఁ
బంచమశ్రుతినంతటఁ బలుకుచుండఁ
బవటియందును యువతు లవశ్యలైన
ప్రియుల వశ్యులఁగాఁ జేసి పెనఁగి రపుడు. 67

(గ్రీష్మము)

చ. కమలవిహారశీతలము గావున సుజ్జ్వలమైన గాత్రమున్
సముచితభంగిఁదాల్చి యతిసాంద్రరుచిన్ వెలువొందు చంచలా
క్రమమునఁ జూడనొప్పి యనురాగరసం బది వెల్లిఁగొల్పగా
రమణుని యంకపీఠమున రమ్యగతిన్ విలసిల్లె నత్తఱిన్. 68

(వర్షము)

చ. ఘనభవవారిలాభమది గల్గుచునుండ మయూరముల్ ముదం
బుననటియించె నేఱులు సముద్ధతిఁబాఱె షడంఘ్రిదంపతుల్

పనిఁబడి సాంధ్యదీపరుచిపాటలఘనాశిసంబంధుర
ప్రణుతశిలీంధ్రపుష్పసమూహ గర్భితోరుయుగ రెంచె నత్తటిన్. 69

రైవతకాద్రిచెంగటిధరాతలమందు లసన్మరాళికా
ఘనావృతపుష్పితాగ్రకుటజావనిజంబుల పరిపూరసం
భావితనీలమేఘచయభాసితమైన నభంబుఁ జూచి బ
ర్హావళి గీతనాదసన్మృదంగస్ఫుటమైన నటించె నేతయున్. 70

(శ ర త్తు)

సీ. మఱయుఁ గాముకులగు మనుప లత్యున్నతి
కాశమై తగు శరత్కాలమందు
విహితమన్మథసుఖావిర్భావముల యందు
భృతతర్షులైన సెక్తిప్రియుల దర్శ
సమయంబునకుఁ బొందిసంకోచ మెడఁబాసి
కడువేడ్క సురతసౌఖ్యంబు గనిరి
రసమానచారుసారససమయంబున
నఖినద్ధమైన వరాంగనోరు

గీ. కుచకలశసంభవోదకప్రచయ మపుడు
మహితమౌక్తికహారాయమాణమగుచు
రాగరసమున ఘనసరిరంభరుచిని
నింపుసొంపార నెపుడు భేదంపదయ్యె. 71

సీ. వినుతింప నేతన్వి విపినమధ్యంబునఁ
బృథుసారసాంగనామధురకాకు
నినదంబు విని కామనిభుఁడైన దయితుపై
రమణతో సంజాతరాగయయ్యె
నట్టి లీలావతియైన వరారోహ
ప్రేమతోఁ గనకమున ప్రియునిఁగలసి

యేకాంతసీమయందే క్రీడసలుపదు
కమనీయమగు శరత్కాలమందుఁ

గీ. గొలఁకులన్నియు సంగంబు కలఁక దేఱ
నూర్మికాదోలికలహంస లూఁగిసాగఁ
బండువెన్నెల జగతిపై మెండుకొనియె
నలినవనములఁ దేంట్లు గానంబుఁ జేసె. 72

## (హేమంతము)

చ. రతిపసవాసవోల్లసితరంజితమున్ రసహాసవంత ము
ద్యతయువమానసోషితముసైన వరోరుచయంబు చేత సం
తతము గృహీతకేశసురతక్రియయందటు తృప్తినొందియే
చతురులు నిద్రవోవుదురు సంతతహైమనరాత్రులందిలన్. 73

## (శిశిరము)

గీ. అసకలామలమంజుల కిసలలీల
చేత విస్మయమొందినరీతి నలరు
నళుల లవలీలయావలికలరవంబు
మిక్కుటంబుగఁ గావించె బెక్కుమాళ్లు. 74

వ. మఱియుఁ బ్రసూనవిసర కృతభారంబున వృక్షంబులకు నమ్రత్వం
బును ఝంఝరపరిషజ్ఝంకారనాదంబుల కవిరామంబులును సంపా
దించునట్టి ఋతుగణంబు సానువులయందు ధరియించియున్న
యారైవతకాచలంబుమీఁద విహరించుటకుఁ గృష్ణుండు మత్త
మయూరకేకారవంబుల చేతఁ బ్రేరితుండైనవానియట్ల గిరివిహార
కౌతూహలియయ్యె. * 75

* మూలమునందు 6వసర్గ సమాప్తము.

చ. సరసిజలోచనుం డపుడు శైలమునందు ఋతుప్రతానసం
భరితవనాంతలక్ష్మిని క్రమంబుగఁ గన్గొన నిర్గమించెఁ: సు
స్థిరముగ సేవఁజేయఁ జనుదెంచినవారి ప్రయాసమెల్ల స
త్పురుషులయందు నిష్ఫలతఁ బొందమనె యెన్నఁటికైన నుర్వరన్

• వనవిహార వర్ణనము •

ప్రభాతవృత్తము. వివిధసుమావళి పుష్పవనాళిలో యా
దవులు సతీసహితంబుగాఁ జరింపం
గవిసిరి యవ్విధిగా నిచో సుమాస్త్రో
గ్రవిశిఖవిద్ధులుగా రె? యొంటిఁజన్నన్ 77

తరల. గరిమతో సమయోచితంబుగఁ గాంతిమోసులు వెచ్చఁగా
గిరితలప్డు స్వభావసుందరగాత్రలై కడుహృద్యలై
ధరణిపైఁ జరణంబు లుంచిరి తప్పకప్పుడె వారిపైఁ
దరతరంబు పదంబుఁ బెట్టె నితాంతవిభ్రమసంపదల్. 78

గీ. లలితగతులందు నఖరుచిరచితశక్ర
చాపరేఖ గలుగునట్లు సంభ్రమమునఁ
గలిత కలకంకణధ్వనుల్ సెలఁగ వీచు
బాహులత జాఱెఁ దన్నితంబముల మీఁద. 79

మాలిని. అతిశయపరిణాహంబై విచిత్రప్రకాశాం
కితఘనమణిభాస్వత్కింకిణీకాంచితంబై
చతురతఁ గలకాంచీసత్కలాపంబు రమ్యో
న్నతజఘనమునందున్ నాదమున్ విస్తరించెన్. 80

క. నిరుపమనితంబబింబా
త్యురుభారనిపీడ్యమానయోషిత్పదముల్
సురుచిరలాక్షాచ్ఛలమునఁ
జరణన్యాసములయందు స్వరసము నించెన్. 81

వ. మఱియు నొక్కసఖి కుపితయైన యొక్కనాయికను ప్రియ
వచనంబుల ననునయింపుచు నిట్లనియె. 82

చ. "రయమున నేను పోయి సుకరంబుగ నిప్పుడె మాటలాడి నీ
ప్రియునిటఁ దెత్తుఁ జూడు" మని వేగఁ బ్రతిజ్ఞ యొనర్చి వచ్చితిన్
దయయుఁ బ్రియంబు దక్షిణత ధైర్యము గల్గిన గౌరి వీవు మ
త్ప్రియసఖి! నాదువాక్యమును రిత్త యొనర్పకుమమ్మ కోమలీ!

చ. సరసిజనేత్ర! నీమత మసాధ్యము పిన్నటనాఁటనుండి నే
నెఱుఁగనిదానఁ గాను పరు లెవ్వరు దీర్పఁగ లేరు నాపయిన్
దఱసిన ప్రేమచేత జవదాఁటవు నావచనం బటంచు నే
గరువముఁ బూనియుందుఁ జెలికత్తెల మధ్యమునందు మానినీ!

మత్తకోకిల. ఏను చెప్పినమాట నీ విప్పు డెంత లేదని చేయఁగాఁ
బూనవేనియు నీకు నాకిఁకఁ బొందు దెప్పుడు భాషణం
బైన నేమిగొ అంత నాకని గాత్మ నెంచితివేని య
ట్లైన శత్రుల వాంఛితంబు రయంబునన్ ఫలియింపదే? 85

వసంతతిలకావృత్తము. మానంబు కల్మి నిటు మాటలు పల్కవేనిన్
మేనన్ వసింపవు సుమీ! యిఁక జీవితంబుల్
కానిమ్ము కోపమునఁ గాంతునిఁ గూడకున్నన్
బ్రాణావనార్థమయినం బ్రియుఁ గూడరాదే? 86

చ. అనియిటు పల్కి యాసఖి తదంఘ్రులపైఁ బడి లేవకుండినన్
వనిత ప్రియాపరాధభవబంధురకోపకషాయితాక్షియై
సను విన మత్సఖీకృతప్రణామనిరోధముచేతఁ బోలెఁ జ
య్యనఁ బొలయల్కమాని యతియత్నమునన్ గరుణించె వల్లభున్

వ. మఱియు నొక్కసఖి పురోభాగంబున శీఘ్రగమనంబునం బోవు
నొక్కపురుషునిం గని యిట్లనియె. 88

గీ. రమణివెన్కఁజిక్కె రాజాల కీవు ముం
గలఁ జనంగఁదగునె? కడురయమునఁ
గటికుచోరుభారగగమచే నెలనాగ
లలసగమన లగుట దెలియవొక్కొ? 89

క. అనియిటు సఖి పలికిన విని
వనితామణి తన్నుఁ గలయవచ్చిన దాఁకన్
దవయడుగు లెన్నికొను చా
డ్పున మెల్లన నడుగులిడుచుఁ బోవుచునుండెన్. 90

వ. మఱియు నొక్కయువతి ముంగలంబోవు ప్రియతమునింగూడు
టకు శీఘ్రానుధావనంబు ప్రార్థింపుచున్న సఖి కిట్లనియె. 91

తరువోజ. కలికి! నాకిటు స్వయంగమనలాఘవము
గలుగుట నీకది ఘనమయ్యెనేని
పలుక కిప్పుడెయయ్యవస్థను బొందఁ
గలదాన నని పల్కి కడువేగమునను
బలుచెలితోడఁ గోపవ్యాజమునన
యెలమితో నొక్కనాయిక శీఘ్రపాద
తలపాతమగునట్లు తప్పక పఱచి
చెలువునితోడఁ జెచ్చెరఁ గూడుకొనియె. 92

చ. తనవిభుపార్శ్వభాగమునఁ దద్దయు వేడుకవచ్చు భామినీ
ఘనపులకాంకితైకతరకాంచనకుంభసమస్తనంబు చ
య్యనఁ బతివక్షమందు ఘటితాఘటితంబగుచున్ మనోజ్ఞకాం
చనమయకందుకంబుక్రియఁ జారుతరద్యుతినొప్పెనత్తరిన్.

సీ. పడఁతి యొక్కతె దృఢపరిరబ్ధభూరి బా
హాస్తనమై పరిహృష్ట లోమ

పంక్తులై తగు భర్తృవామబాహువుచేత
సాంద్రంబుగాఁ బరిష్వక్తయగుచుఁ
దనదు దక్షిణకరం బనువొందఁ బతియంస
భాగంబుపై నిడి బాగుమీఱ
మొలనూలి ఘంటలు మ్రోయ నితంబమం
డలమునఁ బ్రియకటి తాడనంబు

గీ. సేయుచును హారవల్లులు చిక్కువడఁగ
రెండవ కుచంబు లొమ్మున వెండిమూపు
రములు ఘల్లన సవ్యపాదము చలింపఁ
గంతుమంధరయై ప్రియుఁగదిసి నడిచె. 94

వ. మఱియుఁ గొందఱయంగనల గతివిశేషంబు లెట్టివనిన. 95

చ. వెలఁదియొకర్తు భర్తృభుజపీఠమునన్ దనపాణిపల్లవం
బులు గదియింపుచున్ గఠినభూరిపయోధరచూచుకంబులన్
సొలఁగక పృష్ఠభాగము ప్రతోదమొనర్చుచు మందమందతో
జ్జ్వలగమనంబునన్ జనియెఁ జారుసలీలవిలాససంపదన్ 96

గీ. అలఘు పీవరసక్థియు నతివిశాల
గిరిసమనితంబభారప్రఖిన్నయైన
భూరిజఘనము నతికష్టముగ వహించెఁ
బ్రియసమాశ్రితబాహయై వెలఁదియొకతె. 97

పుష్పితావృత్తము.

పురుషుఁడొకఁ డుపాన్తితిన్ బ్రమోలఁ గతుద్వయాం
తరనిహితహస్తుఁడై తత్కుచాగ్రాహుఁడై
సురుచిరనిజోష్ఠాంచచుంబితోద్గండుఁడై
చరణములు ద్రొక్కాడన్ జాన వెన్కన్ జనెన్. 98

స్రగ్ధరావృత్తము
కాంతారత్నంబు వేడ్కన్ గతిపయసఖులం గాంతతోఁ గూడి యొంటన్
గాంతారోర్విం జరింపం గడువడిఁ జనినన్ గాంచి తద్భర్త వెంటన్
గంతుక్రీడాక్షుణ్ణోరఃకలితరుచిరలాక్షారసార్ద్రాంఘ్రిరేఖా
కాంతంబై యొప్పు దానిన్ ఘనసతిపదమున్ గాంచి యాఁ జాడ నేగెన్.

సీ. స్ఫురదనంగరసౌఘపూర్ణ నాభిహ్రద
పరివాహకృతరోమపంక్తులైన
లలన లెవ్వరు సవిలాసయానరవిత
హంసకభూషలై యరిగి రట్టి
సతులాపగాతీరగతలయి జనమనో
లక్ష్యవేదనచటులప్రసూన
శరధనుర్జ్యానాద శంకను బుట్టించు
శ్రుతిహితసారసరుతము వినిరి

గీ. యుత్సుకాళులు మాధవ యువతిజనులఁ
బిలిచి నటువలె గానంబు సలిపెఁ గాన
నాళి పల్లవాంగుళులచే నభినయించి
యాడి నటులుండె గానంబు ననుసరించి. 100

చ. కుసుమసుగంధియై విపినకుంజమహీజనిరుద్ధవేగుఁడై
యసమజలాశయప్రచలితాచ్ఛతరంగజలార్ద్రుఁడై వన
శ్వసనుఁడు సంచలద్భ్రమరపక్షవిఘట్టనసంభవోల్లస
త్ప్రసవరజంబు కామినులపై వెదఁజల్లుచు వీచె నత్తఱిన్. 101

క. వనమారుతానుగమనం
బునఁ దుమ్మెద లనుభవించె ముదితల ముఖవా
సనలుఁ మహాత్ముల వెంటన్
జనినఁ బురస్థములు గావె సంపద లెందున్. 102

## • పుష్పాపచయము •

సీ. శౌరియువతికరాబ్జసంసర్గసంప
ప్రాప్తసౌమనస్యంబులై యలరు విరులు
పార్థమంగ నాఁటనుండియు నవనితలము
నందు సుమనోభిధానంబు నధిగమించె. 103

చ. ఉరువడి నాభిముఖ్యముగ నుద్ధతిఁ జెంది విరుల్ దెమల్పఁగాఁ
దిరముగఁ బోఁచి పైకిఁ జను దెంచు వరోరుకరాగ్రరాజిచే
వరుస గుణప్రకర్షమునఁ బల్లవపాళిబలాత్కృతంబుగాఁ
బరగ నఖంబులం గదిమి తుంగఁపుఁ నొంది సమత్సరంబుగన్. 104

చ. తతమకరందపాన ముదిత భ్రమరాంచిత భూరిశాఖలన్
జతురతఁ గంకణధ్వనులు సాంద్రముగాఁ జెలఁగన్ గరద్వయో
ద్ధతిఁ గదలించు రూపజితదైవతసుందరియైన కాంతపై
హితమతిఁ బుష్పవృష్టిఁ గురియించె మహీజము సంతసంబునన్.

గీ. సతతరసరాగవంతమై చారుకరరు
హతతిప్రాప్తసంస్తవంబై యదయతఁ
దరుణిచే ఖండితంబైన తరుణ పల్ల
వంబు మిక్కిలి మలమల వాడఁజూచె. 106

వ. ఒక్కతనుమధ్య ప్రియునికభిముఖంబుగా వికసితకుసుమవిసరసం
గ్రహార్థంబు సముద్యతబాహులతయై వినూతన నఖక్షతమండన
సుందరంబైన కక్షభాగంబు సందర్శింపంజేయుచు సారెసారెకు
సవ్యకరంబునఁ బిహితంబైన సూక్ష్మోత్తరీయంబుచేతఁ బీనపయో
ధరావరణంబు తిరోహితంబు గావించె; మఱియునొక్కసుందరి
యగ్రపుష్పగ్రహణార్థంబు శరీరోన్నమన విశ్లిష్టవళులచేతఁ
జూడందగిన వళిత్రయాంతరాళపాండుర రేఖా కృతవర్ణోత్కర్ష

నీలరోమరాజియు విపులతరోర్ధ్వముఖలోచనయు స్వభావకృశంబైన మధ్యంబును సాగసారె కతికృశత్వంబు నొందించునట్టిదియు సమగ్రకుచోన్నతానతనిర్భర వక్షస్స్థలబలాత్కారవిశ్లిష్టసూక్ష్మోత్తరీయబంధయు నంతర్లీయమానశాతోదరోచ్ఛ్వసద్దుకూలస్ఫుటతరపరిదృశ్యమానగంభీరనాభిమధ్యాంతరాళయు నై యలరె నొక్కయువతి వనాభ్యంతరప్రదేశంబునందుఁ దిరోహితుండై యభిముఖావస్థితుండై యున్న వల్లభు నెఱింగియు నెఱుంగనిదాని యట్ల సలీలంబగునట్లు వృక్షాగ్రంబునం గల సుమంబులు గోయు నెపంబున నిజాంగప్రదర్శనార్థంబు కాలవిడంబనంబు గావించి విడంబనాంతరంబ ప్రియుండు సఖీజనంబులు నీ వల్లభుం డిచ్చట నున్నవాఁడని యెఱింగించిన నదరిపడి యెంతయవివేకినైతి నని వంచనోక్తులు పలుకుచుఁ బుష్పగ్రహణనివర్తితకుసుమవ్యాప్త వృక్షాగ్రపాణియుఁ బ్రతిపదంబునందు సంయమితసూక్ష్మవస్త్రాచ్ఛాదిత శరీరయు భర్తృదర్శనసంభూతసాధ్వసస మ్మోదసంకరయు మీనకేతనాచార్య శత్రణోపదిష్టా నిర్వ్యాచ్యకిలికించితంబును రాగంబున భజియింపుచున్నది గావున ససంభ్రమ సస్మిత వక్త్రకాంతియునై లజ్జావనతవదనయై యధీరత్వంబున నొక్కింత వ్యవధానంబు గోరుచున్నదాని యట్ల ప్రియునికొఱకు నిజాభిప్రాయంబు ప్రకాశింపం జేయుచుఁ ద్రపాగుణంబువలన దయితునిమనంబు హరింప; కాంతల త్రపావిభూషణలగుట లోకప్రసిద్ధంబై యుండు.

గీ. వరగ నఖపదలిపులు విశావిశార్ద
ములను బులకితాంగనిధేయములు నవాచ్య
ములునగు ననంగలేఖ లింపలరఁ బ్రియులు
వరుసఁ బల్లవముల మీఁద వ్రాసి రపుడు. 108

చ. అరుదుగ నొక్కనాయిక రయంబునఁ గృత్రిమరోషయై "సఖి!
గుఱుతుగఁ బూలదండ సిగఁ గూర్పఁగ నేరవు,లేదు చాలు నిం
కరుగు"మటంచుఁబల్కి పతి కప్పుడు తానె కృతోరువాంఛయై
మురువుగఁజుట్టె పూల భుజగూలరుచుల్ సెలఁగన్ శిరంబునన్.

చ. ఘనకచ! చూడు నీకెదురుగా మధుపావళి వచ్చుచున్న దా
ననమును వాంచివాఙ్నియమనం బొనరించుచు నూరకున్న మ
ద్యనిబిడగంధబంధురముఖాబ్జముపై వెసఁ్రవాల కవ్వలం
బను నటు(వాలె నేని పెలుచం గడుబాధ యొనర్పు భామినీ!

పంచపాదిగీతము నెలఁత! సరజసమకరంద నిర్భరప్ర
భూతభూరుహప్రసవవిభూతులందు
వాంఛమాని యమృతపాఖ్యవాంఛచేత
మధుపరాజంబు నీదగు నధరమును భ
జింప వచ్చుచునున్నది యింపుఖఱ. 111

క. అని యిటు సఖి పలికిన నది
విని కన్నులుమూసి వనిత ద్విగుణితఘనలో
చనపక్ష్మమాలయై పె
ల్చనఁ బతి యంకంబుఁజేరె షట్పదభీతిన్. 112

చ. ఒనరఁగ బల్మిమై పురుషుఁ డొక్కనవోఢ ముఖంబు నెత్తి చుం
బన మొనరింప దానిఁ బరిపాటిగఁ గన్గొని తత్క్షణంబ నూ
తనమృదుపల్లవగ్రహణ తత్పరయాచతురాళిచేత గ్ర
ద్దనఁ బెఱవారిచే నవిదితంబగు నట్లొనరింపఁగాఁబడెన్. 113

సీ. సవతియొక్కతె లతాజాలంబు చాటునఁ
బొంచి యుండగ వల్లభుండు దయిత
యాస్యపాన మొనర్చె నటుదాని నధరఖం
డన భవవ్యథచేతఁ దగఁ జలించు

కరకంకణధ్వనోత్కరముచే వివృతంబు
గావించె; మఱియొక్క కాంత మ్రోల
వృక్షరాజముఁ బ్రాఁకి విలసిల్లు ఘనలతా
చేష్టితంబును జూచి చెలఁగి దాని

గీ. నభినయింపుచు బుజుగతి నాశ్రయించి
వరుని చాపల దోషంబు పరిగణింప
కంఘ్రి మంజీరములు మ్రోయ హస్తయుగము
సాఁచి కౌఁగిటఁ గదియించె సంభ్రమమున. 114

గీ. వనితయొకతె యున్నతగుచ్ఛవాంఛచేత
సలలితంబుగ సహచరాంసంబుమీఁద
సవ్యకరమిడి కరికుంభసదృశకుచయు
గంబుచేఁ బ్రియువక్షంబు గప్పెనపుడు. 115

గీ. కజములందున్న పువ్వులు గోయఁబోయి
లలితపాదాగ్రదుస్థితి వలన నొకతె
నిబిడకుచకుంభభరమున నిలువలేక
పార్శ్వమున నున్న ప్రియునిపై వ్రాలె నపుడు. 116

చ. విరులవె కోసి యిమ్మనుచు వేడుకఁ బ్రార్థన సేయుదాని దు
స్తరకరికుంభసన్నిభకుచంబులు గల్గినదాని ముగ్ధసుం
దరిని బరిష్వజించు తమి, దత్పతి మోదముతోడ "నంగనా!
గుఱుతుగ నీవె గోయు"మని కోమలినెత్తె భుజద్వయంబునన్.

గీ. అరయు మిదిగ్రాహ్య మిదిగ్రాహ్య మనుచుఁ దావి
విరులొసఁగి సారెసారెకు మరులుకొలిపి
ప్రియుఁడు సఖిఁ దోడుకొని యేగె విజనమునకు
మరుఁడు త్వరసేయు జనులను సురతమునకు. 118

వ. మఱియు నొక్కప్రగల్భనాయిక యేకాంతదేశంబునకు నిజవల్లభుని బలాత్కారంబుగా నాకర్షించి తత్సమీపదేశంబున సపత్నీజనంబు నవలోకించి లాఘవభయంబున నపసర్తుకామయయ్యె నప్పుడు దానివల్లభుండు విడువకున్న నది స్వయంగ్రహలాఘవవతిరోధానంబువలనను వల్లభవాల్లభ్య ప్రకాశనంబువలనను నతిగౌరవంబు నొంది యొప్పె మఱియునొక్క ఖండితనాయిక రాత్రి సమయంబున సపత్నీ గృహంబునకుం జనియెననెడు రోషంబున వల్లభు నొక్కపదంబైనం జలింపకుండం బుష్పమాలికచేత బంధించిన నతండు భయంబువలన జలించుటకు సమర్థుండుగాక బద్ధుండైయుండి నబలాకృతమాలికాబంధంబైనను బ్రియుతములైన యౌవనపురుషుల శక్తి హరించు టది యుక్తంబె కదా యని పలికెః వెండియు వేఱొక్క ఖండితనాయికయపరాధకారియైన నిజకాంతుండు పల్లవదానంబునం బ్రసాదంబువడయ వచ్చిన నతని భర్త్సింపుచు నిట్లనియె

చ. వలవదు నీవు మాకిపుడు పల్లవదాన మొసఁగ మేము యోగ్యులమె? ప్రియార్హ యైనమఱియొక్క తెయున్నదిదానియింటికట్లలవుసఁబోయి దానికిడు మాస్యము ముద్దిడు రతి సేయుఁ బో పొలుపుగఁబల్లవద్వయికిఁ బొందొడఁగూడుట యుక్తమేకదా!

గీ. వినుము మత్కర్ణము.లు జనవిదితతావ
కాప్రియోక్తులఁ బూర్ణంబులయ్యె నింకఁ
గితవ భూరుహపల్లవోత్కీర్ణకర్ణ
పూరములు వీనులకు వృథాభూషణములు, 121

ఆ.వె. సవతి యింటనుండి సారెకునళినాద
హసితమైనదాని యట్లనున్న

కళికఁ దెచ్చి మాకు గరిమ నిచ్చెద వేటి?
కిదియె కలహాసునకు మొదలు గాదె? 122

క. అని రోషకషాయితలో
చనయై విభు మోముఁ జూచి శ్రవణార్పితనూ
తనరమ్యపద్మకేసర
కనదుత్పలదళముచేఁ దగన్ ప్రహరించెన్. 123

క. ప్రియుఁడు ముఖమారుతంబునఁ
బ్రియైకదృగ్గతరజంబు వెసఁ బోనూఁదన్
రయమున సపత్ని నయన
ద్వయ మప్పుడు నిండె రోషపాంసుచ్ఛటలన్. 124

గీ. ప్రియుఁడు మఱచిన సవతిని బేరుకొనుచుఁ
బుష్పమున వ్రేయనది దాఁకి మూర్ఛపోయెఁ;
గావున సపత్నినామంబు కామినులకు
ధరణిలో నభిచార మంత్రంబు గాదె? 125

చ. వరుఁ డనురక్తిఁ గర్ణముల వారక నించిన పుష్పగుచ్ఛముల్
కరములఘుత్వమొందియును గ్రక్కునఁ జాలభరంబులయ్యెబల్
తఱుచగఁ దానె యంగమునఁ దాల్చిన కాంచనభూషణంబులున్
బరువని తోఁచకుండెను; సపత్నికమూల్యములైన నేమగున్?

చ. తలఁప విలాసినీశ్రుతిగతస్ఫుటితోత్పల "మేను నీ లస
చ్చలితవిశాలనేత్రరుచిసంపదచే జితనైతిఁ జూడు" మం
చొలసిన లజ్జచేత శిరమొక్కటవంచి తదీయకర్ణమం
దళికృతభూరిఝుంకృతుల నాసఖితో మొఱపెట్టె నత్తఱిన్. 127

గీ. అపగతసుమంబులగు తీఁగె లవల విడిచి
యళులు నవమాల్యభూషితలైన యువతు

లందుఁ జేరెను; భువి పులినాత్మకులకుఁ
బరిచయం బప్రధానస్ఫు పరగుఁగాదె? 128

శిథిలశిరోరుహకలాపభారసమున్నతాంసభాగంబులు నతిదీర్ఘ పక్ష్మభారనయనముఖారవిందంబులును బరిచితనాయకపరిచుంబ నాభియోగవిగతకుంకుమరేణువు లగుటంజేసి యత్యంతనైర్మ ల్యంబువలనఁ బ్రతిఫలిత తుషారమరీచిరశ్మిజాలంబులచేత నతి లోహితమృదు కపోలభాగంబులును శ్రమసమాప్తసుకుమారచే ష్టలు గలుగుటంజేసి మృదుతరతనుతరబాహులతలును సరససాం ద్రకిసలయానురంజితంబు లగుటంజేసి పునరుక్తరక్తకాంతి విభ్రాజిత హస్తకమలంబులును మదనసానురాగంబు గలుగు నట్లు దయితవక్షస్స్థలంబుచేత వ్యతిహార సంక్రమితానులేప రంజనాతిశయభేదసంపదితరేతరనిపణ్ణవక్షోజయుగళంబులును బృథురతవక్షోరుహ భారనమ్రంబులయ్యును వెండియు వనవిహా రపరిశ్రమజనితానతంబులైన శరీరంబులునసభ్యస్త పాదసంచార కార్కశ్యనిస్సహత్వ ధారణకలభహస్తోరుసక్థి ప్రదేశంబులునుజిర మహీగమనాపగతనూతనలాక్షారాగంబులు గలవయ్యును సౌకుమార్యంబువలనఁ దద్గమనంబుచేతనె వెండియు వితీర్ణరా గంబులై పరస్పరభృశనివేశవశంబువలన నతిప్రయత్నసంచల చ్చరణోత్పలంబులును గలిగి సమ్యగుప్తధర్మ విశేషోపలక్షిత లైన యువతులచేత సారెసారెకు నిట్లు విభ్రమానుషంగంబు వలన నితాంతకాంతత్వంబు నధిగమింపఁబడియె; యువతులు స్వభావంబుచేతనె కోమలాంగులగుటంజేసి యలసలై యుందురు చిరకాలంబు వనవిహారప్రయాసంబు ననుభవించుటంజేసి మిక్కిలి నలసలైయుండు టదియేమిచిత్రంబు? మఱియును. 129

సీ. అతివల ఘర్మతోయంబులు మొదల ను
జ్జ్వలరమ్యకుచమండలములందు
గొప్పముత్తియముల చొప్పునఁ జెల్లి
కఠినవక్షోరుహాగ్రముల మీఁదఁ
బదపడి వ్రాలి తప్పక శతశకలంబు
లయ్యెఁ; యౌవన సముద్గతలైన
వెలఁదుల చన్గవ విపులతమయ్యెను
నవిరళఘనపులకాంకురములు

గీ. గలిగి విలసిల్లె; నవిరతఘనసుమరావ
చాయఖేదంబుచేఁ బ్రియ చారుకఁర
దత్తభుజలతయై పయోధరయుగమునఁ
బ్రియుని వక్షంబు గప్పుచు వ్రేలె నొకతె 130

సుగంధివృత్తము

ఇంతి యొర్తు భర్తృమోల నింపుమీఱ నిల్చి బల్
వింతగాఁ గుచంబులెత్తి వెల్లితోరుబాహులై
పంత మొప్పఁగా శరీరభంగ మాచరించి త
చ్ఛాంతివాయఁ గౌఁగిలించె సంతసంబుమీఱఁగాన్. 131

క. తరుణుఁడు నవోఢముగ్ధను
బరిచితి లేకునికి నెంతవలదన్నను నే
మఱియుండఁ బట్టి బలిమిన్
బరిరంభణ మాచరించెఁ బటుమోహమునన్. 132

గీ. వితతహిమసమఘర్మాంబుబిందువులను
దుడువఁ బోవు నెపంబున ధూర్తుఁడొకఁడు
చెలఁగి నూత్నోఢసతిని వంచించి కుచక
లశకిశోరకములనంటె లఘుతరముగ. 133

సీ. నారీసరిద్ఘర్మపూరంబు జఘనప్ర
దేశంబులందు నుద్రేకమొంది
సక్థివక్షముల భుజాకచ్ఛరుహాల నా
క్రమణంబు గావించి ఘనస్తనీర
నాభి హ్రదంబులు నయముగాఁ బూరించి
తతపయోధరబృహత్తటులు దాఁటి
పటురోమరంధ్రకూపంబులునిండించి
కటతటీభూమిభాగముల నొందెఁ.

గీ. ప్రియకర స్పర్శనంబున స్వేదతోయ
మధికమయ్యె నమ్లానశోభాఢ్యలైన
సతులు విపినాంతవిహరణశ్రమమువాయఁ
దనువులు జలార్ద్రముగఁజేయఁ దలఁచిరపుడు. * 134

• జలవిహార వర్ణనము •

చ. అలఘుతర స్తనంబులు వరాభరణధ్వనితంబులున్ రజ
శ్చలననిమీలితాక్షివనజంబులునైన నితాంతకాంతకాం
తల గణముల్ ధరిత్రిఁ జరణంబులు మెట్టఁగనెత్తలేకగా
సిలుచునతిప్రయత్నమునఁజేరె మనోజ్ఞసరోవరం బొగిన్. 135

చ. సమముగఁ గాంత లందఱును జాల్గొనిపోవుచునుండ వారి యుం
సములు వినమ్రతన్ గడువిశాలముగల్గియుఁ దద్బృహన్నితం
బముల పరస్పరాధికవిమర్దముచే విపులాధ్వభాగమ
క్రమగమనంబు సేయుటకు సంకటమయ్యెనతిప్రయత్నతన్.

చ. అవిరళవృక్షజాలశిశిరావనియందటు పోవుచుండ న
య్యువతులఁగాంచుచేతఁబలె నుష్ణమయూఖుఁడు సారెసారెకున్
బవనరయాహతోరువిటపంబుల సందున సాధ్వసంబునన్
దవిలి నిజోరుభానువులఁ దత్వరతన్ స్పృశియించె నెంతయున్.

*మూలమున 7వసర్గ సమాప్తము.

చ. నిరుపమవక్త్రపద్మమున నిర్జితుడై హిమధాముఁడత్తఱిన్
బరువడి సేవఁ జేయుటకు వచ్చి ఖరాంశుకరాశితాంగుఁడై
వెలువడి యేగు భామినికి వేగసితాతపవారణత్వమున్
వరుస భరింపుచుం బ్రియమొనర్చెఁ దదీయకటాక్షకాంతులై.

చ. ఒక ప్రియురాలి మౌళిపయి నుత్సుకతం దనయుత్తరీయమున్
బ్రకటముగాఁగ హస్తములఁబట్టి వెసన్ బయిఁగెత్తిపట్టు నా
యకమణిచే నిరస్తనిబిడాతపయైన వెలంది సాతప
త్రకలగువారికన్న వితతంబుగ సౌఖ్యమునొందె నత్తఱిన్.

సీ. తనమనోహరునిహస్తముఁబట్టుకొని యేగు
వెలఁది సర్వాంగముల్ ప్రియకరాభి
మర్శనజనితాసమానసుఖంబున
నుపచయ గరిమచే నొప్పుచుండ
నతిసుఖపారవశ్యమున నీవిగ్రంధి
వదలి వే మొలనున్న వలువజాఱ
మఱియు హంసాంగనల్ మందంబుగాఁబోవు
నతివలఁగని విస్మయంబునొంది

గీ. లజ్జచేత నిజోరులీలాగతులను
జూప కూరకయుండె; నీక్షోణి యందుఁ
బరజితగుణం బెఱింగి యెవ్వాఁడు సిగ్గు
లేక స్వగుణంబు నావిష్కరింప జేయు? 140

మ. సముదంచత్పృథులాతిరమ్యకటిపశ్చాద్భాగముల్ చారుశో
భముతో యాదవభామినీకటిపురోభాగంబులన్ ధూతగ
ర్వమహోద్యత్పులినంబులై నదులు వైలక్ష్యంబునన్ భూరి వి
భ్రమదశ్మస్థలనాభిలోలగతులన్ బాఱెన్ సమగ్రంబుగన్.

గీ. సలిలరయనున్నశుక్తికోశప్రముక్త
చారుమౌక్తికకృతిరుచిసైకతముల
విరళవిగళితహారసుందరములైన
లలిత నిజతల్పములయట్లఁ దలఁచిరపుడు. 142

చ. శ్రమజనితం బనింద్యమును సాంద్రమనోజ్ఞసుగంధబంధువౌ
ప్రమదలవక్త్రమారుతము గ్రక్కున మూర్కొని చంచరీకముల్
గ్రమమునఁ గానఁ బ్రసవరాజిపయిం దమిగూర్చవయ్యెఁ వి
భ్రమత విశేషకామియగుప్రాణి గణించునె పూర్వసంస్థితిన్?

చ. సమయ మెఱింగి వేడ్క నొకజార శిఖండిని గూడియుండఁ ద
త్ప్రమద వనోర్వి నుండి వెసవచ్చినఁ గన్గొని సాధ్వసంబునం
గ్రమమున నాత్మపింఛములఁ గప్పుమయూరము గాంచి భామినుల్
రమణులయందు లేదని తలంచిరి యార్జవ మించు నెమ్మదిన్.

మ. అతిసంతోషవిధాయికంసరిపుకాంతాలాపసంపత్తిర
స్కృతమాధుర్యనినాదమైన సితపత్త్రిశ్రేణి నీరేజసం
తతులందున్ వెనడాఁగి యుండె; నది యుక్తంబేకదా! వైరిని
ర్జితుఁడెవ్వాఁడు తదగ్రభాగమున వర్తింపం దలంచున్ మదిన్.

సీ. చక్రవాకాంగన శంకలేక ప్రియుండు
చుంబనంబొనరింపఁ జూచి ముగ్ధ
యగుటచే మీఁది కార్యములైన సీత్కార
ముఖకామచేష్టితంబులు నెఱుంగ
కున్నఁ గన్గొని యదుయోషలు తమయంతఁ
బ్రియుల ముంగలనిల్చి విధృతహస్త
లగుచు నుత్తరకృత్యమైన సీత్కారాది
కంబు గావించిరి కౌతుకమున

సీ. నపుడు పద్మిని నవకంజమర్ఘ్య మిచ్చి
హంసరుతముల స్వాగతం బడిగి ఫేన
హాసరైఖ భంగకరముల నాదరమునఁ
బాద్యమొసఁగిన యట్లుండె భామినులకు 146

వ మఱియు నమ్ముగ్ధసుందరులు పాణిపల్లవంబులచేత రాగంబు
వలనఁ గద్గతలక్ష్మిని నిత్యనివాసంబైన యరవిందంబులనుండనీక
నిష్కాసంబు గావించి లక్ష్మినియతసాపత్న్యంబు వ్యక్తంబుఁజేసి
రంత నయ్యంగనలు సలిలప్రవేశంబు గావించుటకు భయభ్రాంత
చిత్తలై ప్రియకరావలంబనంబుఁజేసి యతిప్రయత్నంబునఁ
బ్రవేశించునంతలోనఁ దత్కాసారజలంబు సంక్రాంతప్రతిబింబ
లగుటంజేసి యాత్మసక్యంబున నతిశీఘ్రంబుగా నయ్యువతుల
నంతఃప్రవేశంబుగావించుకొన్నదానియట్ల ప్రకాశించె మఱియుఁ
గామినులు కాముకుని మనంబునుంబోలె లోతెఱుంగక మొదల
జలంబుప్రవేశించుటకు భయంబునొంది పదంపడి గమనంబుచేత
నగాధత్వంబెఱింగి పదంపడి రాగంబుచేత నభ్యంతరంబు ప్రవే
శించి సరాగంబైన యంగంబుచేత రంజిల్లఁజేసి రంత. 147

ఆ.వె కుంభికుంభసదృశకుచతాడనంబునఁ
గలుషమొందియున్న జలమునందు
నుండలేక చక్రయుగమేగె; నుద్వృత్తుఁ
డగుల కెవ్వఁడగు సుఖావహుండు? 148

ఆ.వె, శీతభీతి నొక్కచెలి నీరునొరక త
త్కూలమందు నొంటి గూరుచున్న
దానిభర్త నీటిలోనుండి దోయిట
జలముఁ బట్టి మీఁదఁ జల్లె నపుడు. 149

గీ. ధవునితోఁగూడఁబిగ్గున భువనమందు
మునుఁగుటకునిచ్ఛగింపని ముగుదఁబట్టి

సఖులు బలసంతసముగ లాగఁ జలితనేత్ర
యగుచు భర్తను గౌఁగిటనడుముకొనియె. 150

గీ. కంరదఘ్నజలస్థిత కాంతుఁజూచి
తనకు నఁతియలోతని తలఁచి యొక్క
యబల మౌర్ఖ్యంబుచేఁ బతి కభిముఖముగఁ
జనియె జలములో నత్యంతసాహసమున. 151

సీ. తరలాక్షి చే సరోవరమది నాభిప
ర్యంతంబు నవగాధమగుచునుండ
సలిలచాపల్యంబువలనఁ బుట్టిన యూర్మి
కయములు బృహదురోజద్వయంబు
నారూఢమై యొప్పె; నది యుక్తమేకదా!
చర్చింప లబ్ధసంస్పర్శులకును
బుడమి మర్యాదయెక్కడిది? లోలోర్మితో
యములందు రాజీవ మంచితముగ.

గీ "మానినీముఖరుచులచే నేనొకండ
సరయ నజితంబనై తిఁ దదక్షి రుచుల
నిర్జితములయ్యె మేచకనీరజంబు"
అనుచు నళినాదముల గానమాచరించె
నిబిడతరతరంగముల మీఁద నృత్యమాడె. 152

చ. చలశఫరీవిఘట్టితలసన్మృదుపీవరసక్థియైన చం
చలశఫరాక్షి భీతిగొని చారువిలాసభరంబు నొందె; నీ
యిలపయిఁగామినుల్ తగిన హేతువులేక నె విభ్రమంబులున్
సలుపుదు రేమిచెప్పనగుఁజాలినబీజము గల్గియుండఁగఁజా? 153

వ. మఱియు సమాకృష్టకాంచన గుచ్ఛచ్ఛవికరికచ్ఛరుహాలచేతఁ
బరివృతప్లవమానవిలోలాయత శాఖాపక్షసముల్లసదోర్లీషిద్ధనస్త

నగండశైలసంక్షోభిత సరోవరమహార్ణవసలిలంబై యొప్పె; నగా
ధంబయ్యును గ్రీడార్థంబు కామినీజఘట్టనచలనప్రాపితవికసితసరో
జాననజలాశయంబు మర్యాదాలంఘనంబు గావించినట్లుండె
నొకయువతి వితతచలితశిఖాంగుళీకంబును శోభావంతంబునైన
కేశకలాపంబు సమీపంబున జలాంతర్నిమగ్నుండైన వల్లభునిఁబరి
గ్రహించుటకుం బలె వితతతరంగసమూహంబులచేత నంతటఁ
బ్రసార్యమాణం బగుచుఁ బ్రకాశించె; క్షాళితాంగనాహరిద్రా
లేపనకచకలితతోయంబై యమునాసరస్వతీజలమిశ్రితగంగాజ
లంబు కైవడి నొప్పుచుండె; మఱియును. 154

చ. ప్రియకసుమాతిహృద్యమగు ప్రేయసి గాత్రము నీటిలోమునిం
గియుఁ గడునిర్మలత్వమునఁ గేవలకాంతి బహిష్కరించెఁ ద
ద్దయుఁదగనాక్రమించియును దజ్జలపూరము యుక్తులన్ దిర
స్క్రియ నొనరింపఁజాల దిది సిద్ధము కేవలయుక్తమేకదా!

ఉ. దూరమునందుఁ దోఁచు నొకతొయ్యలివక్త్రముఁజూచి పంకజం
బా రమణీమనోజ్ఞముఖమా యది యంచిటు సంశయించి దు
ర్వారబకావళీసహచరత్వము లేమి విలాసిపుంగవుం
డారసి నిశ్చయించె హృదయంబున నాననమంచు నేర్పునన్ 156

సీ. ధృతకనకోజ్జ్వలక్రీడాంబుయంత్రముల్
ఘనపటీరాదిసుగంధివస్తు
వులును బృథుస్తనకలశసంగికుసుంభ
దివ్యాంబరములు మాధ్వీకరసము
ప్రాణనాథుల సమీపత్వంబు మొగలగు
జలకేళికోచితసాధనంబు
లన్నియు నొడఁగూడె; నంత మరుచ్చలి
తాంబరలగుచు నయ్యబ్జముఖులు.

ఆ.వె. గురునితంబభారగరిమచే మెల్లన
నురుతటాంతభూమిఁ బడి లేచి
భయముఁ దెల్పునట్టి బాధు ప్రియుల తోడఁ
గూడ నీటఁబడిరి కోర్కె మీఱ. 157

వ. అప్పుడు కొందఱుముగ్ధాంగనలు ముఖసేచనాదికపటాచరణంబు లెఱుంగనివారగుటంజేసి ప్రియులతోఁ గూడఁ బందెంబువైచి కరపుష్కరప్రేరితజలంబులునొండొరులపై జల్లుకొనుచుంగొంత దడవు క్రీడించిరి మఱియును. 158

ఆ.వె. హరదృగగ్నిదగ్ధుఁడగుమన్మథబలాధి
రాజ్యలక్ష్మియైన రమణివదన
శశికిఁ బాణికలశజలములచే నభి
షేకమాచరించెఁ జెలువుఁడొకఁడు. 159

గీ. అతనుసంతాపదుర్బల యగుటఁజేసి
కర మతిప్రయత్నమున నెత్తి కాంతు మీఁద
జలముఁజల్లుచో వలయంబు జాఱిపడియె
భూరిలావణ్యశేషంబుఁ బోలె నపుడు. 160

సీ. మన్మథపరవశమానసయై యొక్క
తరలాక్షి తనచూపు తరుణుమీఁదఁ
జేర్చి తద్దృష్టివిశేషంబుచేతన
సఖ్యంబుఁజూపుచు సంభ్రమమున
సఖి శిక్షావ్యాజచతురతమూర్తి మ
త్ప్రణయరసంబుచే బలె జలంబు
చేతఁ బూర్ణాంజలిఁజేసి యాయౌవన
పురుషునిఁ బ్రార్థించెఁ బొలుపు మీఱ

గీ. మోద మొందిన యొక శ్యామ ముఖము ప్రియక
రాంబువులచేత సేచితం బగుచు నుండ
నది సహింపని సవతియాస్యం బనల్ప
ఘర్మజలములసిక్తమై కాన నయ్యె. 161

గీ. యువకరోత్క్షిప్త జలసిక్తయువతికుచయు
గంబు గనుఁగొని సవతిముఖంబువలనఁ
గనులఁ గాఱెడు బాష్పపూరంబు చేతఁ
దన యురోజద్వయంబును దడిపికొనియె. 162

గీ. వదనరుచివిస్తరించు నేవారి చేతఁ
బ్రియను సేచనమొనరించెఁ బ్రియుఁడు చంద్ర
ధవళమైన యవ్వారిచేతనె సపత్ని
కధిక కాలుష్యమొనరించె నప్పు డచట. 163

వ. మఱియు విపక్షానురాగాంధీకృతనయనుండైన ప్రియుని చేత విపక్షనామగ్రహణపూర్వకంబుగా సఖిముఖంబుగా సముత్క్షిప్తంబై శరీరంబునం బడుచు స్వభావమందంబయ్యును హృదయవిదారణంబుగావించు సలిలాళనివిపక్షనామశ్రవణ సంజాతరోషయైన నాయికచేతఁ దీక్ష్ణయోగంబువలన సహింపంబడదయ్యె మఱియును 164

చ. ప్రియుఁ డొకకాంత వక్షమునఁ బ్రీతిమెయిన్ సలిలంబుఁ జల్లినన్
రయమునఁ దజ్జలంబు కఠిన స్తనమండలి సోఁకి శీర్ణమై
దయ చెలఁగంగ బిందువులు దానిమనోగతతాప మెల్లఁ ద
ద్దయుఁ గొనిపోయి సంభ్రమత దానిసపత్నికొసంగె నత్తఱిన్

సీ. కాంతుండు కౌఁగిటఁ గదియించు తఱి వాని
యురమునమండి యత్తరుణి వక్ష

మందు లగ్నంబైన యంగరాగంబుతో
యముచేత నసహ్యాతంబగుచునుండ
సంతసించియు దానిసవతివక్షంబునఁ
గ్రాలు నఖక్షతుల్ గాంచి మఱలఁ
దపియించె; మఱియొక్కదయితుచే సఖి సమ
క్షమునందు భ్రమగొని సవతిపేరఁ

పంచపాదిగీతము. బిలువఁబడినది గావున విగళితాన
నాబ్జకాంతియై వ్రీడానతాస్య యగుచు
నున్న సవతి నంతర్ధాన మొందఁజేయు
టకు జలంబును లోచనోదకము వలన
వృద్ధి నొందింపఁగలఁచె నదెంతచలమొ? 163

చ. మఱియుఁ బ్రియుండునొక్కతుణమాత్రమునుందరఁదత్సపత్నిపై
శరములఁజల్లి పిమ్మటఁ బ్రసన్నమతిన్ దనమీఁదఁ జల్లినన్
గరమురుకోపకాళిమముఖంబును గ్రక్కునఁ నావరించె దృ
క్పరిగళదంజనాంబు వపవాదము నొందె నదెంతచిత్రమో?

చ. కనకవిభూషణావళులు. గ్రక్కునఁ దాల్పనశక్తమౌటచే
ననుచరకంకణీకృతనవాంబురుహోచ్ఛమృణాళసూత్రమ
య్యనను బ్రతికామినీసముదితోరుకటాక్షకృతోరుభారమై
వనరుహనేత్రదోర్యుగమవార్యగురుత్వమునొందె నత్తఱిన్

చ. అనవరతంబు పుష్కరవిహార మొనర్చుటఁ జేసి కామినీ
జనమణి కింకిణీకలితచారుసువర్ణవిశాలమేఖలల్
ధ్వనియొనరింప వయ్యె; సజలస్ఫురితోరుగుణంబు గల్గినన్
బనిఁబడి యెందునైన ఘనవాక్పటిమం బది గల్గనేర్చునే?

చ. సరసవిలోలవీచికలఁ జారుపటంబులు సంగ్రహించినన్
దరుణులు తన్నితంబములు తప్పక చూచుచు నుండ సిగ్గునన్

శిరములు వాంచి యున్న యల చెల్వలఁ జూచి తరంగహ స్తభా
స్వరగళవ స్త్రదానమునఁ బద్మనిమానము గాదె వేడ్కతోన్

చ. గురుజఘనస్థలాభిహతకోమలవ క్త్రరుచిచ్ఛటాజిత
స్ఫురితసరోరుహాంబులగు సుందరవ క్త్రల యంగరాగముల్
బిరబిర లోలతన్ దగి హరించినదాట జలాశయంబు భా
స్వరతరగంధమై సకలుషంబయి చూడఁగనయ్యెనయ్యెడన్

మ. వనజాతం బది నీటిలో మునుఁగుటల్ వర్ణింపనే నింతకున్
మును దూరంబున నుండియున్ బరిమళస్ఫూర్తిన్ వరస్త్రీల యా
ననసాదృశ్యము నొంది యుంటి నిపు డందంబొప్పఁగా డగ్గఱన్
ఘనతన్ నిర్జితనైతి నంచుఁ బలుకన్కన్ లజ్జచేతన్ జుమీ!

వ. మఱియు జలావగాహక్రీడావిశీతంబులును వికసితయసూధికా
పిశంగంబులును హిరణ్మయంబులునగు యాదవాంగనాకల్పంబు
లచేత బాడబానలజ్వాలాఖండంబులచేతంబోలె నజ్జలాశయంబు
శోభింపం బడియె; మఱియును 173

సీ. "అరయ నేతన్మదీయచ్ఛాయయే చాలు
నిత్యంబు భామినీనేత్రములకు
నెడలేని సౌందర్య మిచ్చుట కీయంజ
నంబుచే నేమి కార్యంబు దలఁప?"
నని యెంచి నిజగుణవ్యాప్తిశోధాన
సాభ్యసూయాచ్ఛతోయములచేతఁ
గరము నిశ్శేషంబుగా నంజనంబులు
ధౌతంబులయ్యె నందముగ మఱియు

గీ. సలిలపూరంబుచే హరిచందనంబు
ధౌతమైన నాపాండుర స్తనయుగంబు

వలనఁ గృతపరభాగయా లలితహార
యష్టి సౌహార్దమున లూనమయ్యె నపుడు 174

వ. మఱియు సమగ్రామృతగుణధారిణియు వికచోజ్జ్వలారవిందా వతంసయు సదయితరమణీనిషేవ్యమాణయునైన పుష్కరిణి యువతిజననేత్రంబులకు సురయుంబోలె నారుణ్యంబొసంగె; మఱియు మజ్జనంబుగావించువరారోహాల విశాలస్వచ్ఛసలిలబిందు చిత్రంబులైన కుచకుంభంబులు భిన్నసూత్రముక్తాహారఘుటికలచేత గుణవదాశ్రయాపేక్షచేత నంతటనుపాశ్రితంబులైన చందంబునం బ్రకాశించె; మఱియు సరసిజలంబులు వధూజనశ్రవణ పతితంబులైన నీలోత్పలంబులు తమయందుఁబొడమినవైనను నిజతరంగంబులచేఁ దటంబులకు నిష్కాసంబు గావించె, స్వసంభవుండైనను గొంతకాలంబున్నతస్థానగతుండై యుండి పదంపడి పతితుండైనవాఁడు నిర్లేపులకుఁబరిత్యాజ్యుండగు టది యుక్తంబే కదా! మఱియుఁ దోయపూరంబుచే నంగనల ధౌతలాక్షారసంబైన దంతాధరంబు దంతక్షతులచేతఁ బ్రక్షాళితాంగరాగంబైన శరీరంబు ప్రత్యగ్రనఖక్షతంబులచేత నలంకరింపఁ బడియె; నది యుచితంబుగాదె? సజ్జనులగువారిని సదాశ్రితులగువారలు విభవాపాయకాలంబునందు శోభావైభవంబులచేతఁ బ్రకాశింపం జేయుదురుగదా! మఱియును 175

ఉ. క్షాళితపత్రపంక్తియగు కాంతల మోములఁదోయపూరసం
చాలనలంబమానవిలసన్మృదుకేసరమిశ్రపింజరో
ద్వేలితమధ్యభాగలగు విశ్రుతమేచకహృద్యసుందరా
గ్రాలకమంజరుల్ సహృదలౌట రచించెను బత్రరేఖలన్ 176

సీ. అంభోధిజలముచే యదువులయంగరా
గము వక్షములనుండి కడఁగఁబడియె

ఘనకేశములయందుఁ గల్గు శేఖరములు
హరియింపఁ బడియె నేత్రాంచలంబు
లందున్న మదరుచి హరియింపఁ బడద య్యె
నది యుక్తమే కదా! యవని నాత్మ
వంతుల చతుర్భవప్రియం బన్యుల
చేత నలంఘ్యమై చెలఁగుఁగాదె?

గీ. మఱియు నయ్యాదవుల మేనవఱలు నంగ
రాగము హరించె హృద్గతరాగ మందె
కదలకుండె; ధీరాంతరంగత్వమొందు
నట్టివారికిఁ బరులచే హాని గలదె? 177

గీ. చారుడిండీర మఱుతకు హారమయ్యెఁ
జారుపటమయ్యెఁ గటికట్టు శైవలంబు
చెక్కులకుఁ బత్రరచనయై చెలఁగె; నదియె
జలము లిట్లు కాంతలకుఁ భూషణము లొసఁగె 178

చ. ఒలపుగ నంగనాగములనుండి రయంబున సిగ్గుచేబలెన్
నిరుపమ హేమహారములు నీటమునుంగుట భుక్తమాల్యముల్
పరువడి సిగ్గులేమి సలిలంబులపైఁబడి తేలియాడుటల్
పరగలఘుత్వమొందియును బాయరుథార్ష్ట్యముతుచ్ఛు లుర్వరన్

చ. శరములచేతఁ బత్రరుచిసంతతి జాళితమయ్యె మాల్యముల్
పరువడిఁ జేలరాగము నిరస్తములయ్యె వరాంగరాగమున్
బరిహృతమయ్యె నన్నియిటువ్యర్థములయ్యె నటంచుఁదాపియై
సరసిజబాణుఁ డంగనలఁ జారులఁగా నొనరించె నత్తఱిన్ 180

గీ. ఉదకములచేత శీతార్తి నొంది నట్లు
వలె సుశీతలవాతసంచల వసనము

యౌవనోష్ణత్వమొందిన యబ్జముఖుల
స్తనతటంబుల యందు సంసక్తమయ్యె 181

వ. ఇట్లు జలక్రీడగావించి యనంతరంబ గాత్రసంపర్కంబువలన సంసక్తసమధికరక్తంబై మూర్తిమంతంబైన లావణ్యసారంబు నుంబోలె నొప్పుసరోజలంబు స్రవింపుచుండఁ జంచలాభంగతరంగరంగస్థానలీలానర్తనకుశలవసనాంచలంబుల చేత నుపలక్షితంబులగు నారీసమూహంబు లమ్మహాహ్రదంబు వెలువడి రప్పుడు సౌందర్యాతిశయంబున సురాంగనలకైన నద్భుతంబుఁబుట్టింపుచు నవారవిందహస్తయై మోహ్రిల జలంబు నిర్గమించివచ్చు నొక్కయువతిని మధ్యమానమహార్ణవంబువలన నప్పుడుప్రాదుర్భవించి వచ్చు నిందిరాదేవిం బోలె నిరీక్షించి కృష్ణుండు సముద్రమథనంబును సంస్మరించె; మఱియు నూరుప్రదేశాంతర్గానార్ద్రంబతిస్నిగ్ధంబైన యేదుకూలంబాచ్ఛాదితం బయ్యె జలసేకంబువలన సంసక్తంబైన యద్దుకూలంబును విమలతరాంగనాపీవరసక్థులు బహిర్గతస్వకీయకాంతిచేత నాచ్ఛాదించె నవ్వరారోహలు కటితటంబులం దేవస్త్రంబులుధరించి రాశరత్కాల మేఘచ్ఛాయగల వసనంబులు కామినీనివసనానందంబున దరహాసంబు గావించినట్లుండె; విడిచివైచిన యంబరంబులు గళజ్జలంబులగుటంజేసి స్థూలాశ్రుపాతనంబున రోదనంబుగావించినట్లుండె; మఱియునరసత్వంబువలన నధికసంసక్తినొందిన వగుటంజేసి మిక్కిలి బహుప్రకారంబుల నిష్కాసితంబులయ్యును నూతన రక్తకంబుల చేత యువతుల సుందరాంగంబులనుండి యతిప్రయత్నంబున విశ్లేషితంబులయ్యె మఱియును 182

సీ. లలన యొక్కతె యంస విలుళితకేశయై
తోయార్ద్రితమువుమ దుడిచికొనియె

నటులైనఁ దన మోల నంతికంబునఁ బ్రియుఁ
గని వెండి స్వేదోదకంబు గత
నార్ద్రిమా లెఱుఁగక యత్తన్వి దానెన్ని
మాఱులు దుడిచిన నారదయ్యె;
మఱియొక్క వనిత సీమంతంబు కరముల
దిద్దుచుండుటఁజేసి సుద్ది గలిగి

గీ. చాల నాలక్ష్యకుచబాహుమూల యగుచుఁ
బరగ నఖిలాపవంతుఁడౌ భర్త చేత
వేడుకలు మీఱ సారెకుఁ జూడఁబడియె;
విషయములయందుఁ గామికి విరతి గలదె? 183

మ. ధవళాంభఃపరిధౌతగాత్రము లసత్తాంబూలరాగోష్ఠమున్
నవసూక్ష్మాచ్ఛవివిక్తచేలము రహిన్ నారీమణిశ్రేణి క
ట్లవియే చాలు నలంకరించుటకు బంచాస్త్రోరులీలావిలో
లవిభావోజ్జ్వలుఁడైన వల్లభుఁడు గల్గన్ సొమ్ము లింకేటికిన్? 184

వ. ఇట్లు సరసి మజ్జనవిధౌతమానినీమానులును నతిశయశోభావం
తులును నతివిమలాంగకాంతులునైన యాదవులనవలోకించి
యుష్ణాంశుండు వారియట్ల నపరవారాశిపూరంబునందుఁ బ్రవే
శించుటకు నిశ్చయించెననంత. 185

## సూర్యాస్తమయ వర్ణనము

గీ. తపనుఁ డాత్మీయ తేజోభితాపజనిత
వైభవంబు సహింపనివాఁడు పోలె
నబ్ధిసలిలంబులోఁ గ్రుంక నాత్మఁ దలఁచి
యస్తశైల మారోహింప నరిగె నపుడు 186

* మూలమున 8వ సర్గసమాప్తము.

మ. స్మరలీలోత్సుకయైన యొక్కసతి చంచత్ప్రీతితో నాత్మమం
దిరమందుండి గవాక్షమధ్యగతదృష్టిన్ వేగ నస్తాద్రిశా
స్వరమధ్యాంచిత హస్తమాత్ర మవకాశంబున్నదంచున్ ప్రపం
తరమానంబు గణింపుచుండెఁ దపనాస్తప్రాప్తిఁగాంక్షింపుచున్

చ. పరిణతి నొందినందున విభావరిహీనప్రకాశయుక్తమై
స్ఫురితవిపాండురాభ్రశిరమున్ వహియించి యనుష్ణగాత్రమై
మఱియు సనాతపంబగుట మందదివాకరబింబనేత్రమై
యరుదుగ నత్తఱిన్ శిథిలమైకననయ్యె దినంబు చూడఁగన్

చ. ఉరునవకుంకుమారుణపయోధరయై స్వకరావసక్తభా
స్వరరుచిరాంబరాఢ్యయయి బంధురరాగసమేతయైన య
వ్వరుణదిశాంబుజాక్షిమణిపై నతిసక్తిని బొంది భానుఁడున్
గర మనురక్తుఁడయ్యె నధికద్యుతినెల్లనడంచి ప్రీతితోన్ 189

చ. అలరు దినాంతశీతలతరానిలలోలితనూత్నవల్లికాం
గళియగుటన్ నివాసమునకున్ వెస నంగుళిసంజ్ఞచేఁ దగం
బిలుచుచునున్నదాని క్రియఁ బెంపగు శాఖికిఁ బక్షిసంఘముల్
మరలఁగ నుత్తరంబిడిన మాడ్కిఁ జెలంగెఁ దదారవంబులన్

గీ. అరయసంధ్యాసమీపమం దబ్జసఖుని
గరము లప్పుడె శైలశృంగఁబుఁ జేరె;
సజ్జనులు నాశకాలమాసన్నమైన
నున్నతస్థానమున నుండు టుచిత మెగద? 191

గీ. జగతి దైవంబు ప్రతికూలమగుచు నుండ
సాధనములెన్నియుండిన సఫల మగునె?
కరసహస్రమున్నఁ బతనకాలమందు
నూఁతగొనఁగనే పోశి కొక్కటైన? 192

క. అతులజపాసుమగుచ్ఛ
ద్యుతియగు రవి యస్తమాన మొందుచునుండన్
దతదిగ్వలయము కురువిం
దతతిగతనుమధ్యమైన నలువున నొప్పెన్ 193

గీ. తప్తకనకాభమగు రవితనువు సలిల
మందు నర్ధనిమగ్నమై యలరె నప్పు
డజునిఖిన్నభూరిబ్రహ్మాండకైక
ఖండము విధంబున మనోజ్ఞకాంతి యగుచు 194

చ. నిరుపమరాగవంతుఁడును నేత్రసుఖప్రదదేహధారియున్
బరగ నతోపకారియును ఖావిశమిత్రుఁడు నైనసూర్యునిన్
వరవసుహీనుఁ డౌటవలనన్ వియదాలయసీమనుండి బల్
వెరపునఁ బాశిదిగ్గణిక వెళ్ళఁడఁ జేసె గతాభిలాషయై 195

వ. మఱియుఁబద్మిని యినుండు గ్రుంకునంతకు సంకుచద్దళంబులచేత నర్ధనిమీలితనేత్రయైయుండి యస్తమయానంతరంబునఁ బ్రాంతర్ని ర్గతమధువస్థూల బాష్పజలంబులు నించుచుఁ గమలలోచనంబులు ముకుళింపం జేసె; నస్తమయానంతరంబున నంతరిక్షం బించుక నేపలత్యనక్షత్రంబై యదృష్టశశాంకమండలంబై యుండి పదం పడి యర్ధాస్తమయంబగుటవలనఁ బ్రశాంతసంతాపంబై యను దిశాంధకారంబై ప్రకాశించె; గుణహీనుం డగువానికి నిర్దోష త్వంబె గుణంబగు మఱియును 196

గీ. విపులరుచిధాముఁడగు భర్త తపనుఁ డట్ల
నపగతుం డగుచుండ నవ్విపులరుచులు
చిచ్చులోఁజేరె నటుప్రవేశింపవేని
పరభవంబున నాథుండు భర్త యగునె? 197

మ. జనసందోహకృశప్రణామయును జంచచ్చారుకౌసుంభర
మ్యనితాంతారుణకాంతియుక్తయగుసాయంసంధ్యమున్ శాతశా
బనిగా నుజ్ఝితమైన దేహమగుటన్ వర్జింపఁడయ్యెన్ జగ
జ్జనవంద్యత్వనిజాతివశ్మమహిమన్ ఱచ్చింపఁగా నేటికిన్? 198

సీ. అప్పుడు సాంద్రసాంధ్యాంశుచ్ఛటారుణి
తం బౌట విరహోత్థితదళితహృదయ
సంజాతశోణితస్నపితమై నటు వోలె
గ్రక్కునఁ జక్రవాకద్వయంబు
జోడ్వీడి వేఱ్వేఱ నుఱ్ఱుక్కుచుఁ బఱచె నె
య్యది జలంబుఁ బుట్టె నట్టి పద్మ
మనిశంబు లక్ష్మికి నాలయంబై యుండు
ననుట ప్రసిద్ధ మస్యబ్జమునకు

గీ. హీనదశ వచ్చినప్పుడు దాని విడిచె
నది కృతఘ్నత్వ మగుఁ గాదె? యవనిలోనఁ
గరము చపలుర కీ కృతఘ్నత్వబుద్ధి
గలుగు టది యొక్క చోద్యమే? తలఁచిచూడ 199

గీ. "అకట! మిత్రునితోఁగూడనరిగె దివస
మేను మిక్కిలి సబల నిం దెటుల నుందు?"
నమచు రవి విరహంబున నతనితోడఁ
జనియె నన్నట్లు వెంటనెచనియె సంధ్య 200

• రాత్రికాల వర్ణనము •

చ. వనరుహమిత్రకేసరి స్వవర్ష్మము తోయధినీటఁదోఁపఁ గ
న్గొని ప్రతిసింహ మంచుఁ గడుకోపముచే వెస దానిపైకి నే
గినక్రియ నీటిలోనమునిఁగెన్ వెనుకన్ బటుదంతిసంఘముల్
పనిఁబడి నిర్గమించిన తెఱంగున దిక్కులనిండెఁ జీకటుల్ 201

గీ. నిబిడపంకరుచుల నొగడు చీఁకటిగుంపు
కొండగుహాలలోన నుండి వెలికి
నరుగుదెంచె నొక్కొ? మఱియు బాహ్యంబున
నుండి చొచ్చెనొక్కొ? కొండగుహల 202

గీ. ఉరుతమంబు క్రిందను డీ మీఁదికి వృద్ధి
నొందెనొక్కొ? మీఁదనుండి క్రింది
కట్లు జాఱెనొక్కొ? యటుగాక యడ్డంబు
దిరిగివచ్చెనొక్కొ? తెలియరాదు 203

గీ. మిన్నుమన్ను నిండ మెఱసిచీకటి గ్రమ్మఁ
గన్ను పొడుచుకొన్నఁ గానరాక
యున్నవేళ యోష లొగి రసాంజనమునఁ
నెఱిఁగి రపుడు ప్రియుల యింటితెరువు 204

చ. అరుదుగ గాఢసంతమస మప్పుడు కాంతలకున్ ప్రియానుసం
సరణము సందుఁగల్గు రతిసౌఖ్య మవశ్య మటంచునాత్మలో
నరసి పదాశ్రయం బొసఁగ దయ్యెఁ గుచద్వయమప్పు నీలయో
గరుచిరరోమరాజి పథకంప మొనర్పకయుండె నెంతయున్

గీ. పవలు రవిరుచిచే నెద్ది ప్రబలదయ్యె
నట్టి గ్రహగణ మతితమోవ్యాప్తమిని
బొంది మిగులఁ బ్రకాశించెఁ; బుడమిలోన
నల్పు లధికులు గారె? నీచాశ్రయమున 206

వ. మఱియుఁ బటీరకుంకుమాద్యనులేపనంబులును గుసుమమాల్యంబులును భర్తలయందుఁ బొలయల్కఁ బూనియున్న యువతులును ద్వీపజ్వాలలు నివియన్నియు నాప్రదోషకాలంబు చేతఁ గృతప్రసుప్తమన్మథోద్దీపనంబు గలుగున శ్లోకకాలంబునఁ బ్రబోధితంబులయ్యె; మఱియును 207

## చంద్రోదయ వర్ణనము

చ. ధరణితలాభినిస్సృతపృదాకుకులేంద్రఫణాసహస్రసం
భరితమణీరుచిప్రతతిభంగి సుధాకరదీప్తిజాలముల్
దిరముగఁ బాకశాసనుని దిగ్వలయంబు నలంకరించె ను
ర్వర నటు పద్మముల్ విరహవంపఁగఁ గల్వలు చెల్వొందఁగన్

సీ. విమలప్రభాసమన్వితము పూర్వాచల
వ్యవహితశశిబింబమైన వాస
వాశాముఖంబు ప్రకాశదంతంబయి
భాసుర సవిలాసహాసమైన
దాని చందమున సుందరముగాఁ బ్రకాశించె
నగ్రభాగంబున నమృతభాను
భానూపలద్యుతంబై నెఱఁ బరిమంద
విదళితతిమిరౌఘ వితతచారు

గీ. జటలఁ గలిగియు గగనంబు సర్వమంగ
ళాధిపతిమూర్తి యనిపల్కుటదియు సత్య
మనుచు జనములచే నిశ్చితార్థమయ్యె
భువనపతి కంబరం బొక్క మూర్తి గాదె 209

చ. నవఘనకౌముదీసుమపినద్ధతమఃకబరీభృదింద్రది
గ్యువతి విశాలఫాలతటరమ్యమనోహరచంద్రఖండమున్
సవరణమీఱఁ బొందు మృదుచందనపుష్కరసిక్తమైన య
ట్లవిరళకాంతియై వెలసె నంచితవైఖరి నద్భుతంబుగన్ 210

క మొదలఁ గళామాత్రుండై
పదపడి యర్ధమయి పిదపఁ బరిపూర్ణుండై
విధుఁ డొప్పె; నెంత శోభా
స్పదుఁడైనను వృద్ధినొందు జగతిఁ గ్రమమునన్ 211

గీ. వికచపాండుసరోజయు గ్విమల విధుఁడు
మొదల మేల్కొల్పె నంతఁ రాజపుత్రిముఖసు
ధాంశుఁడునుబోలె పరికల్పమైన యట్టి
యుదధిలోనుండి మీఁదికి నుదితుఁడయ్యె 212

ఆ. వె. వితతలక్ష్మణానుగతరమ్యగాత్రుఁడై
బలసి చుట్టుముట్టుపక్షుల గొలువ
జలధి నుత్తరించి శశిరామభద్రుండు
ప్రబలతిమిరదనుజరాశిఁ దునిమె 213

ఆ. వె. శశివణిగ్వరుండు సతతంబు ముగ్ధత
నామి గగనవిపణియందుఁ జేరి
యుడుగణేంద్రుకళల నుపచయము నొందించు
కుతుకమును భజించెఁ జతురుఁడగుచు 214

గీ. రాత్రి కుపలయనాథు నలంకరించె
రాతిరి నలంకరించెఁ దా శశిధుండు
ఘనులచరిత మన్యోన్యోపకారవంత
మగుచు నవిలంబితక్రమమై తనర్చు 215

గీ. అర్కపాదాభినిహతయై యశిరుతములఁ
బవలు రోదన మొనరించు పగిదినున్న
కుముదినీసతి శశికరాగ్రములచేత
నపుడపుడు సంస్పృశింపుచు నాశ్వసించె 216

గీ. విభుని మ్రోల సతులు విధురశ్మిగళదంబు
కణహిమాంశుమణివికారప్రతిమ
నతనుఘర్మసిక్త యగుసపత్ని యటంచు
భ్రాంతినొండకసరి భయముగదుర 217

సీ. అరయ నోషధిపతి యమృతరసస్రావ
కరముల నంగనాగాత్రములను
బరిమార్జనముఁ జేసి పరితాప మొనరించు
ఘనమానవిషమును శత్పణమె దించె
నధికప్రకాశితాశాంతరసాంకురు
గ్నికరంబు విమలమానినీకపోల
ములయందు వెసఁ బ్రతిఫలనంబునొందె స
మంచితభంగి వ్యాపించె నపుడు

గీ. సితరుచిప్రహూర్మిభుజసమాశ్లిష్ట భూరి
వేలయైనను గడలి క్షోభింపఁ జేసె
ననఁగ మన్మథగతసారయదుర్గణమును
క్షోభ మొందించె ననుటెంతచోద్య మహహ! 218

వ. అంత మదనుం డేకాకి యగుటం జేసి యసామర్థ్యంబున గృహాంతరంబులయందు సుప్తుండై యుండి గవాక్షవివరప్రవిష్టంబులగుటం జేసి స్ఫటికఖండసంకాశంబులైన చంద్రికిరణంబు లవలంబించి లేచి చంద్రోదయంబు కంటెమున్న గాఢసంతమసంబుచేత నలక్షితబాణలక్ష్యుండై యుండి శీతకరుం డుదితుండై దిశలు ప్రకాశింపం జేయుచుండ నప్పుడు నిజకార్ముకం బాకర్షించె.

చ. ప్రసవధనుర్ధనుశ్చ్యుతరమ్యశిలీముఖజాలముల్ శశాం
కసురుచిమండలోదయవికాసము నొందుచునుండఁగా సము
ల్లసితనవాసితోత్పలకలాపములందును బంకజాతిమా
నసములయందు నొక్కతటి నల్వుగఁ జేరె రొదల్సెలంగఁగన్

గీ. దిఙ్ముఖంబుల కత్యంత తేజ మొసఁగి
నరసరతి కాకులత్వ మొసంగి యత్రి

వీక్షణోత్సవాపరపరిపూర్ణవిధుఁడు కామ
దేవున కొసఁగె నధికప్రదీపనంబు 221

వ. ఇట్లు చంద్రుం డుదయించి సాంద్రచంద్రికాజాలధవళీకృతదిశాముఖుండై వెలుంగుచుండ నక్కాలంబునందుఁ బ్రమత్తంబైన సమస్తకార్యం బుపకారకంబుగాఁ దలఁచి యప్పు డంగనలు ప్రియతమాగమనంబు నిశ్చయించి నైపథ్యంబు గావింపం దొడంగి రెట్లనిన

## • అంగనల నైపథ్యము •

క. తరుణీకుచతటములు గురు
తరైకహారమును సమానిధంబుగఁ దాల్చెన్
ధర సంహతత్వజనిరం
తరాళత భజింప నవ్విధంబె ఘటించున్ 223

గీ. తరుణి కదళీప్రకాండోరుతరువు మొదలఁ
జారుజఘనస్థలీపరిసరమునందు
సాంద్రతర మేఖలోరుపాశంబుచేతఁ
గంతుదంతావళంబును గట్టివైచె 224

గీ. సతుల కెమ్మోవులందు లాక్షాద్రవంబు
తతకపోలములందు లోధ్రకరజంబు
కనులఁగాటుక విశదశంఖమున నిడిన
పాల కరణి నభిన్నమై చాల నొప్పె 225

సీ. చలదుజ్జ్వలాధరదళయుతంబులు వికస
ద్దశనాంశుకేసరభరములు
ప్రకటితగండఫలకములైన ముఖాంబు
జములచే నొప్పిరి రమణు లప్పు
డధికునిచే జితుండైనవాఁడు విదేశ
గతుఁడయి చనునట్లు గాక కుశలుఁ

డైయుండెనేని నయ్యబ్ధిశాయిఁ బగ బ్రాశ్ర
యించి తత్కృపను జేపించునట్లు
ప్రతిమాచ్ఛలమున నిర్మలకపోలములైన
యింతులముఖ మాశ్రయించె విధుఁడు

గీ. గరిమ నెయ్యది నిజభర్గ్నపితమధ్య
మగుట నితరాంగములు వోలె సతికృశత్వ
మొందదయ్యె దత్కటిసతరోరుకుచము
లందుఁ గామాస్త్రములు ప్రతిహతములయ్యె 226

వ. మఱియు నక్కామినులు విశేషవిశారదలయ్యును బ్రియతముం డైన నాయకుండు శయనమందిరంబులకువచ్చుచుండఁ బ్రియాగమన సంభ్రమాతిరేకంబున వారిమనంబు ముంగలనున్న మనోహరంబు లైన సువసనాంగరాగసుమనోవిభూషణంబులలో నిది మనకు ధరింప నర్హంబని నిర్ణయింపంజాలక తడఁబడుచుండె ; మఱి యొక్కయంగన యాలింగనసుఖవిచ్ఛేదభీరుత్వంబున నంగరాగ మాత్రవ్యవధానంబైన సహింపంజాలక తనశరీరంబునం దనులేప నంబు సేయకుండె నీ యనవలేపంబు ప్రియసంగమంబునందు మిక్కిలి యుక్తంబై యుండు ; మఱియును 227

గీ. కలిత నిజపాణిపల్లవస్థగితములయి
ఘ్రాణరంధ్రంబులకు వెగఁ బ్రాఁకునట్టి
శ్వసితములచేత వదనవాసనగ్రహించి
ప్రమద యొక్కతె యానందభరితయయ్యె 228

గీ. విష్ణుపదముచే సఖిచేత విధృతమైన
చారుపరిపూర్ణమండలచంద్రునందు
విమలదర్పణమందు నవ్వెలఁదులాస్య
శోభ నటు సారెసారెకుఁ జూచిరపుడు 229

వ. మఱియు నప్పు డొక్క విరహోత్కంఠితయైన విలాసవతి కపోలార్పణంబు కొఱకుఁ బ్రతిబింబీభూత పాణిపల్లవార్పితకపోలతలంబైన నిజబాహువు జానుభాగంబున నునిచి కాలక్షేపార్థంబు కంఠపరివర్తిషడ్జాదిస్వరవిహీనంబయిన గానం బవ్యక్తమధురంబగు నట్లొనరింపుచు నుద్గ్రీవయై ప్రియునిరాక కెదురుచూచుచుండె నప్పు డత్యంత కామమోహితంబైన యువతిజనం బనురాగవ్యంజనచతురలును మధురవచశ్చమత్కారలును రమ్యస్వరూపలును బ్రియచిత్తసమాకర్షణసమర్థలునైన దూతికలను నేత్రంబులం బోలెఁ బ్రియుల యొద్దకుం బనిచి రంతఁ బ్రియులకడకుం బోవ సమకట్టియున్న దూతికలతో నాయికలు వేఱ్వేర నిట్లనిరి 230

## • ప్రణయ సందేశములు •

సీ. దయితుఁడు నామీఁద దయ దప్పకుండున
ట్లాగి లాఘవము నొందకుండునట్లు
నేర్పుతో నాదు సందేశంబు దెల్పి చ
య్యన నిందుఁ దోడి తెమ్మనియె నొకతె
యపరాధకారియైనట్టి కాంతుని ధిక్క
రించి క్రమ్మర నేనె మంచిగోరి
యనుసరణము సేయుటది కడులాఘవం
బైనను సాధ్వి కట్లనఁగరాదు

ఆ. వె. విభుని యలుకదీర్చి వెండియు నతనితోఁ
గూడియుండు టదియె కువలయాక్షి!
సతికి ధర్మమీవు చయ్యనఁజని వేగఁ
బతిని దెమ్మటంచుఁ బలికె నొకతె 231

ఆ. వె. మనసు దాఁచనేల? మగువ వల్లభునితోఁ
జర్పసేయు నంత సాహసంబు

లేదు నాకు వేఁగ ప్రియునిఁ దోడ్కొనిరమ్ము
పొమ్మటంచు నొక్కబోటి పలికె 232

చ. చెలియరొ! నీవు మత్ప్రియుని చెంతకుఁబోయి తదీయదోషమున్
బలుమలు లెక్కపెట్టక ఘనంబుగఁ దోడ్కొని రమ్ము నేరముల్
దొలఁగక యింతయున్ మనమెఱుంగనియట్టులనుండ మీవు నే
ర్పలరఁగఁబొమ్మటంచు నయమారఁగనొక్కతెఁ బంపెదూతికన్

చ. మఱియొకబాల చాలనభిమానముచే నిజభర్తయొద్ద కీ
వరుగు మటంచుఁ జెప్పి తను నంపకయున్న సఖీలలామ గ్ర
చ్ఛలఁ బ్రియుపాలికేగెఁ దనయంత నెమిత్రులు మిత్రకార్యమున్
వెరవునఁ జెప్పకున్న నెరవేర్చి కృతార్థులుగారె? ధారుణిన్ 234

ఉ. స్థిరముగ నొక్క వాచికముఁ జెప్పమటం చల దూతి వేఁడినన్
బరువడి లజ్జ నుత్తరముఁ బల్కక నాయిక యూరకుండి దు
ర్భరతరపంచబాణశితబాణకృశీకృతమైన గాత్రమున్
గఱుతుగఁ జూపెఁ బైఁటచెఱఁగున్ దొలఁగించి నతాననాబ్జయై

వ. ఇట్లు దూతికలు నాయికలచేతఁ బ్రేషితలై ప్రియులకడకుం జని యకుటిలచిత్తులగువారి సుహృదర్థంబైన చేష్టితంబు స్వభావవిపరీతంబైనను బ్రకాశించుం గావునఁ బురుషులవోలె సప్రగల్భంబులును బ్రతిభాగర్భంబులునగు వాక్యంబుల నిట్లని రందొక్క దూతిక యొక్కప్రియునింబ్రార్థింపుచు నిట్లనియె 236

గీ. వసుధ మద్రూపకీర్తి నెవ్వఁడు హరించె
నట్టి పురుషున కనురక్తయయ్యె ననుచుఁ
బొసఁగ నీమీఁది మచ్చరంబున మరుండు
నీదుప్రియ నేచుచున్నాఁడు నెనరులేక 237

చ. యుపతి భవద్గుణాళి విన సూత్సుకయై యిటు సారెసారెకున్
శ్రవణము నంగుళీముఖమునన్ బరిఘట్టన మాచరించు న
య్యవిరళఘట్టనంబు భవదంచితసద్గుణపూగపూరిత
శ్రవణము తృప్తిలేమి మరలన్ వినగోరుటచేతనే కదా! 238

సీ. అలఘుతరోష్ణత నధిగమించిన యూర్పు
సెగలచే నెండిన నాగువమోవి
నాగవల్లీదళరాగరసం బది
సరసత్వ మొందిపెఁ జాలదగ్న్యోఁ
గమలాక్షి నీరంధ్రకరికబ్బుహొత్కృచ
మండలావరణ ముద్దండవృత్తి
విడళించె నటు గాన మదనశరంబులు
నిశితత్వ మొందుట నిశ్చయంబు

గీ. కుసుమశరుఁడు నిర్దయుఁడయి కుసుమసాయ
కముల ననిశంబు తాపంబు గలుగఁజేసెఁ
గావున భవత్ప్రియాంగనాంగంబు మిగులఁ
గుసుమములకంటె సత్యాంత కోమలంబు 239

గీ. ఒసర నపకృతిచే నువయుక్తమైన
సర్వ మమృతమైనను సువిషత్వమొందు
నమృతము స్రవించు శశిరుచు లహహా! నీదు
విరహమున నేర్చెఁదొడఁగెను వెలఁది నిపుడు 240

క. అనియిటు దూతిక పలికిన
విని యవ్వాక్యములు నమ్మెఁ బ్రియుఁడటు; మును నే
మనసెఱిఁగి యున్నవానికి
ననుమానము లేక యతుకు టరుదే మాటల్ 241

## • ప్రియతమాగమనము •

వ అప్పుడు ప్రియు . . . లు చంద్రోదయంబుకంటె ముస్న ప్రస్థానమార్గా భిజ్ఞత్వంబు నొందియుండి పడి పడి నిశాకరుండుదితుండగుచుండ లబ్ధపదచిహ్నులగుటంజేసి దయితలచేతసమాకృష్టంబైన మనంబునకు ననివృష్టులైనయాశనపురుషులు ప్రియురాండ్ర యిండ్లకుంజని రంత 242

## • కామినీకాముక విలాసము •

చ. వరుఁ డరుదేర నప్పుడొక భామిని గ్రక్కునలేచి సంభ్రమ
స్ఫురితవిశాలనేత్రయయి సొంపుగఁ గన్గొనుచుండ శ్రావణా
భరణనవోత్పలంబు శ్రుతిభాగమువీడి ధరిత్రిపైఁ బడెన్
గిరమణినాగముల్ సెలఁగఁ గంతుఁడు ద్రోపుడు వడ్డచాడ్పునన్

చ. తరుణుఁ డొకండు శీఘ్రమునఁ దప్పక వచ్చుచునుండఁ జెచ్చెరన్
సరభసమొప్పు లేచి విలసత్సముదగ్రకుచద్వయంబునం
బిఱుసున మింటికిన్ బ్లగయ మీటుటకున్ గమకించుదాని సుం
దరి నపు డడ్డగించె వితతంబుగఁ గౌఁగిటఁ బట్టి బల్మిచేన్ 244

ఆ. వె. వెనుకడాఁగియున్న ప్రియవల్లభుని ప్రతి
బింబభారవహనవిధురమైన
యద్దమును వెలంది యతికష్టముగఁ దాల్చె
వడఁకుచేత జాఱిపడకయుండ 245

క. వదలక ప్రియుండు కౌఁగిటఁ
గదియించిన వానితోమ్మొ కఠినకుచములన్
విదళింపుచు మొలగజ్జెలు
పదములఁ నందియలు మొరయఁ బరిరంభించెన్ 246

ఆ. వె. ప్రియుఁడు రాఁగ వేగఁ బిరివిడిచి లేచి
చానయొకతె చీర జాఱిపోవ
హస్తరుద్ధనీవి యయ్యె క్షణదృష్టోరు
కదళి గలుగునట్లు గప్పికొనియె 247

గీ. ప్రియుఁడు చప్పుడు గాకుండ వెనుకనొదిగి
యతులను మూయ నితఁడెవ్వఁ డనుచు నడుగు
చెలులకు నవోఢ సిగ్గుచేఁ జెప్పలేక
మేనఁబొడమిన పులకలు గానుపించె 248

చ. ప్రియుని సమక్షమందును ప్రవేపితమై పృథులోరుసాదమై
రయమున లజ్జచే నతివిలక్షణమై ప్రతిపత్తిమూఢమై
పిరియ మిగురింపఁ జేయు నొకప్రేయసిదేహము వక్త్రరక్తిచే
నయనవిలోలతం దెలిపె నవ్యతరాదర సంభ్రమంబునన్ 249

ఉ. ఇంతులు కాంతు లిట్లు తమయిండ్లకు వచ్చినఁజూచి యాత్మలో
సంతసమంది వారియుపచారవిధానమునందు భూరిది
గ్దంతికరోపమోరుయుగ గాఢభరాలసయాన లయ్యెన
త్యంతగతిప్రచారముల నర్మిలి నొందిరి ప్రేమ నెంతయున్

వ. మఱియుమనోహరోచ్చలితభ్రూయుగంబును నయనచేష్టావిశేషం
బును హస్తాభినయసహిత చతురవచనంబునుయువతికి స్వభావసిద్ధం
బైనను నిపుణాచార్యునిచేత సభ్యాసితంబగుటం జేసి ప్రథితంబైన
నాట్యవిలాసంబునుం బోని విలాసంబు గలదియై యొప్పె; నప్పు
డొకనాయిక సపత్నీనామంబునఁ దన్నుఁబిలుచు వల్లభునితో
సోపాలంభంబుగా నిట్లనియె 251

సీ. నలుడ! నీకు సహస్ర నయనముల్ గలిగింపఁ
డది సృష్టికర్తకు ననుచితంబు

సరయ మద్విషయమం దది ప్రస్ఫుటం బయ్యె
నిటు గోత్రభేదివై యొసఁగు నట్టి
నీచేత నింద్రత నిజముగాఁ బ్రకటీకృ
తం బయ్యె నిఁక వేయి తలఁప నేల?
విను మతి గతనైన నసుఁ జూడ కిపుడు హ్యా
గ్గతయైన సతి నెట్లు గాంచి తహహా!

ఆ వె. యనుచుఁ బల్కి యల్క నవ్వలఁజనఁజూచు
నట్టి సతిని దృష్టి ననునయించి
కాంచి ఘంట లపుడు ఘల్లని మ్రోయంగఁ
గదియఁ దిగిచి ప్రియుఁడు కౌఁగిలించె 252

చ. మఱియునొకండు కోపమున మానినిపల్కినమాటకల్గి చె
చ్చెరఁ జనఁ గృత్రిమతుతముఁజేసె వరోరుప్రమోల నుండి బం
ధురకృపచేత వల్లభుఁడు "తుమ్ముఁగబోవగ రా" దటంచుఁ దా
మరలెను బోవ కిర్వురు సమాసులు గారె కృతానురాగతన్

ఆ.వె. ప్రియునిఁ జూచినంతఁ బ్రేయసి నీవిబం
ధంబు వదలె హ్రీగుణంబుచేత
వదనళశిని వంచె వల్లభాలోకన
మాత్రమునఁ దొలంగె మాన మపుడు 254

ఉ. అచ్చుపడంగ మన్మథశరాగతతాపము యౌవనోష్మమున్
హెచ్చుగ వల్లభుండు దను నెంచకఁజేసిన నేరమిట్టి ము
చ్చిచ్చునఁ జాలఁ దప్తమయి చెన్నువహించినఁ దత్కుచోరుభా
రోచ్చయ మీపదుష్ణ మిడ దొవ్వుగఁ గౌఁగిటఁజేర్చు వేళలన్

చ. స్మరగురుయౌవనోష్మముల సాంద్రతరోష్ణతనొందియున్న సుం
దరకుచకుంభయుగ్మమును దాల్చి మనోజ్ఞముఖంబుచేత నీ

స్థిర విహారిందు వేశ్యఁ గనుదెంచిన యుర్వశి పోలె నొప్పె నా
సరసిజపత్త్రలోచనకు సాటియె మేనక రూపసంపదన్ 256

• మధుపాన వర్ణనము •

వ. ఇత్తెఱంగున సప్పు డుపశమితలోకాంతరాయంబులైన శశాంక కిరణంబులు కామినీకాముకులకు దూతికల కరణి నన్యోన్యసం ఘటనంబు గావించుటకు సమర్థంబు లయ్యె; నాసన్నాహితసీత్కా రాదిమదనాతిరేకవికారంబులైన మద్యంబులు లజ్జా ప్రత్యూహ నివారణకుశలంబులై యవన్నెలంతలకు సురతకార్యంబులం దా చార్యత్వంబు వహించె. * పానగోష్ఠిప్రస్తావానంతరంబున ధావన తాళనాది సంస్కృతంబులును స్వభావసంస్కారసౌరభ్యయుక్తం బులును సముత్పన్నంబు లగునవారిరుహంబులును నవయవసుయోజి తంబులును గామినీవదనంబులు యౌవనపురుషులకు సురాపాన భాజనత్వంబు ప్రాపించె నప్పుడు 257

చ. సతతము సోపచార ముపశాంత విచారము చిత్తకాంక్షణీ
యతమము సానుతర్ష మగుని ట్లనుతర్షపదంబునన్ సము
న్నతగతినున్న సత్తమును దాల్చిన ప్రేమను ప్రాణనాథుల
ప్రతిమ సుధారసంబు వలెఁ బానమొనర్పఁగఁ జేసి రింతులన్

సీ. అనుపమాక్రాంత కాంతానన ప్రతిబింబ
మగుటచేఁ గన్నుల కతిసుఖంబు
లలితరసాలపల్లవగంధి యగుటచే
ననిశంబు నాసిక కధికసుఖము
సౌరభాగతసముజ్జ్వలభృంగరవముచే
శ్రవణంబులకును నిర్భర సుఖంబు

* మూలమున 9వ సర్గ సమాప్తము.

గురుతరమాధుర్యగుణయుక్త మగుటచే
రసనకు మిక్కిలి రమ్యసుఖము

పదపడి సుశీతలత్వంబు వఱలుచునికిఁ
జర్మమున కెప్పు డంచిత స్పర్శసుఖముఁ
నిచ్చుచుఁ దదాసవంబు పంచేంద్రియముల
నధికసంతుష్టినొందించె నద్భుతముగ 259

మఱియు నున్మదభ్రమదళి మద్యసురభి
పుల్లలోచనకామినీముఖము మద్య
పూర్ణచషకంబు గనుఁగొని మొదల నెచట
వాలుదు నటంచు సంశయాక్రాంతమయ్యె 260

భరితవారుణియగు పానపాత్రమందు
బింబితంబైన యువతిముఖంబు కమల
మనిభ్రమించి తుమ్మెద వేగ నచట వ్రాలెఁ;
భ్రమణశీలికిఁ గలదె? తత్త్వప్రచింత 261

ప్రియురాలొసఁగిన మద్యము
పియుఁడే నతిమధుర మనుచుఁ బీతంబయ్యెన్
రయమున నచేతనములగు
ప్రియకాంచనమకుటరుచులు పీతంబగుచోన్ 262

తరుణి మొదల ద్రావఁ దన్మధురోష్ఠర
సంబు మద్యమందు సంక్రమించె
నదియు భుక్తపూర్వమైనను బ్రియతముఁ
డన్యమద్యమనుచు నారగించె 263

అధికమాధుర్యమొందిన మధురసములు
కాముకుల రమ్యవికచవక్త్రములచేతఁ

జెలువుమీఱ ఘ్రాణంబులచేతఁ గ్రోలువ
తావి యేకకాలమునఁ బీతంబు లయ్యె 264

గీ. మఱియు సుపదంశకాంతియౌ సరుఁడు మధుస
మాన మధురాధరంబు నట్లానుచుండ
యావకం బపగతమయ్యె నప్పుడు దంత
పీడచే వెండి రాగాభివృద్ధి నొందె 265

వ. మఱియు సమదనంబగునట్లు మదకారి ప్రేయసీవదన పానపరుం
డైనకాముకునకు సకృదాస్వాదితమద్యంబె వైపరీత్యంబున
నొక్కక్షణం బుపదంశస్థానంబునందయ్యె మధుపానాసక్తచిత్తు
లైనవారల కధరాస్వాదం బుపదంశం బగు; మఱియును

గీ. మద్యపానంబుచేఁ గడు మధురము అగు
కామినీకాముకుల సువక్త్రముల చేతఁ
జషకనిహితోత్పలం బళిస్వానరుదిత
మైనక్రియ లజ్జచేఁ గ్రిందికరిగె నప్పుడు 267

వ. మఱియుఁ బ్రదివార మధుపానసముత్కటమదోద్బుద్ధసంస్కార
ప్రతిభావితప్రగల్భమతులైన కామినుల ప్రతికూలవాక్య ప్ర
యోగరమణీయంబై మొదల లజ్జచేత సూచితంబులై ప్రస్తుత
మదాతిరేకంబునఁ బ్రకాశితంబులైన గ్రామ్యావయవచేష్టాప్రల
పితంబులు గల పరిహాసంబు ప్రవృత్తం బయ్యె నప్పుడు 268

ఆ.వె. చెలఁగి తరుణమదముచేఁ గామినిఁ బోలెఁ
బరఁగ ముగ్ధయువతి వాక్చతురిమ
హృద్యహాసమస్యగ్రృగ్ధికాగవిశేష
ములు కృతంబు లయ్యె లలితఫణితి 269

సీ. అరయ నాగస్వారి యగు పతివిషయము
దంగీకృతోరుధైర్యంబు కలుష
మతికోపదీప్తంబునగు కామినుల హృద
యము ఘనమద్యవారములచేత
ద్రావితంబయి కడు ధౌతమై శమితమై
... మధిమ ... బం...
మందు చెప్పఁడునిండు నైన సద్వస్తు
తత్వమున హృద్యంబైన తద్విలాస

ఆ.వె. మా ప్రకాశమయ్యె నది పానవశమున
ధాతులీనమైన తన్మనోర్థ
మొకరంద్రాదియైన యుపసర్గచేఁబోలె
నతిప్రకాశమయ్యె నద్భుతముగ 270

గీ. అరయ నస్పష్టపదవాక్య మంగనిగళి
తాంబరస్రగ్విభూషలయుం దుపేక్ష
తూఁగుట యకారణంబుగా నేగటయును
రమణుల మదోత్థబహువికారములు దెలిపె 271

గీ. మద్యపానంబుచేఁ బరిమండలజ్జ
యగుట నర్ధనిమీలితాయతసునేత్ర
యై నవోఢయు శిర మించుకంత వంచి
కాంతు నీక్షించెఁ దిర్యగీక్షణముచేత 272

చ. ప్రియిమున మద్యపాన మొనరింపక మున్ను సఖీనియుక్తయై
రయమున భర్తముంగల విలాసముఁ జూపుచు నుండునట్టి త
త్ప్రియ సురఁగ్రోలినందున వివేకములేచేఁ గడుముగ్ధయయ్యెఁ ద
ద్దయు నిల నెల్లవారును మదంబున నొందరొకో స్వభావమున్

శా. ప్రాల్ఘ్యంబుఁ గాంతుఁడై ప్రియుఁడు సంప్రాప్తప్రక్రియం బొల్లఁచే
రాగం బుష్కలమై హృదంతరమునన్ ప్రచ్ఛన్నమై యుండె నా
రాగం బిప్పుడు మద్యపానమున సంరంభోత్థితంబై రహిన్
బాగొప్పన్ వెలికుద్గమించె రయమొప్ప న్నేత్రమార్గంబులన్

వ. మొదలఁ దమయంతియుఁ దామును సమాగతులై యగణితప్రతియాతులైన వల్లభుల గ్రమ్మరఁ దమయంతం జామె యనుసరింప నిశ్చయించిన మానినుల మనంబు పశ్చాత్తాపంబు నొందుచుండ నప్పుడు సరసంబుకతి స్వయంగమనావసరంబు ప్రాపింపంబడియె మఱియును 275

ఆర్యాగీతి. మఁడ మోహితాత్మయగు నొక
మధుపతి యుపలంధిరైన మత్పతి నిఁకన్
గదియ నని మధువు విడిచెను;
మదికిఁ బ్రియంబగునె సుఖముః మానము కన్నన్ 276

చామరవృత్తము. సరోజలోచనల్ నితాంత సప్రసాద మంచు ని
ర్భరంబునన్ భుజించి నట్టి రమ్యమద్య మప్పుడే
కరంబు సత్ఫలంబొసంగెఁగా దె హ్రీవిమోహమున్
హరించె భర్తృసంగసౌఖ్య మప్పుడిచ్చె స్త్రీలకున్ 277

గీ. కాంతుఁ డొసఁగి నట్టి గండూష సరకంబు
గ్రోలి "యహహా! యెంత రుచ్య" మనుచుఁ
బ్రమద మొందినందువలన భామినులకుఁ
బ్రమద లనెడు పేరు ప్రబల మయ్యె 278

గీ. పొసఁగ నన్యోన్యమేళనంబున నుపాత్త
గంధగుణ మౌట ముదితపుష్పంధయమయి
సరకగంధంబు ప్రమదాస్యచషకగంధ
మేకమై సుస్థితను బొందె నింపుమీఱ 279

ఉ. కోపము గుంప శక్తము నకుంఠితవైఖరిఁ బుష్పసాయకో
ద్దీపనమున్ నితాంతముగ దృగ్ద్వయరాగరసప్రకాశమున్
ప్రాపితకామ ప్రియులు భావసురంజనమౌ మదంబుచేఁ
బాహ్యముగ భర్తచేత నటి భామలు రంజితలైరి యత్తఱిన్

సీ. సఖి సమక్షం బౌట సరసనిగూఢచుం
బనదక్షుఁడైన భామిని మనోహ
రాధరం బప్పుడు శీధుపానవిధాన
రమణీయయౌవకరాగ మయ్యెఁ
రమణుచేఁ దాంబూల రాగరసంబున
నింపుగా మరల రంజింపఁ బడియె
మధుమయ సత్ప్రాణము సుస్ఫురింపఁజేయఁ
ప్రియుఁ డర్థినిచ్చిన పృథుమదంబు

గీ. ప్రేయసియును మదిరాక్షి మద్యంబు విడిచెఁ
ద్రావకుండియు పీడించి నానాసవాళి
మత్తరైయుండె; సుర్వాలుఁ జిత్తసుఖము
భూరిమదహేతు వగుచు నొప్పారుఁ గాదె 251

క. మను కోపితయగుటఁ బ్రియుఁడు
వినయంబున నెంత దన్నుఁ వేఁడిన విన దా
వనిత విరహమునఁ బ్రియునిం
దనయంతనె వేఁడె మధుమదంబున లఘువై 252

గీ. ముకుళితాక్షులు కుంఠితవికటవచన
లైన యువతుల లజ్జాపహరణ మంగ
పాదమును జేయు మద్యమకాంతిచేతఁ
బోలెఁ దాఁ జేసెఁ దద్గుణస్ఫూర్తి నప్పుడు 253

చ. చెలువలు మద్యసేవనముసేయక మున్ ప్రతిబింబచంద్రుఁ డ
య్యలఘుకపోలభిత్తికలయందు విభిన్నత నొందకుండె న
వ్వల మధుపానజారుణిమపాటలితద్యుతిగండభిత్తులం
దలరఁగ లోధ్రచూర్ణతిలకాకృతఁ దాల్చె విచిత్రవైఖరిన్

వ. మఱియు విలాసాతిశయపోషకంబులైన తచ్ఛరీరంబులు దృప్త
కుచకుంభతటీపరస్పరపీడాకరంబులై మదంబున ఘూర్ణిల్లుచుండె
నప్పుడు 235

గీ పరగ మత్తతనొందుటవలన సారె
సారెకును రోషసంతోషసహితలైన
యింతులందును గార్శ్యకం బెక్కఁబెట్టె
నెక్కుడించెను గ్రమముగాఁ జక్కనయ్యె 236

గీ. అన్యసతిఁగూడె నీభర్త యని భ్రమించి
నెలఁత కరమల్గి వల్లభు నిగ్రహించెఁ
బిదప నిజ మెఱింగియు నల్క విడువదయ్యె
వాఁడిగలదాని కిది స్వభావంబు గాదె 237

చ. రమణులమ్రోలఁ గాముకుల రమ్యతరాయతహాసభూషితా
స్యములు వికాసమొందెఁ బులకాంకితమయ్యె శరీరమంతయున్
గ్రమమున మానసంబు సుకరంబుగ నార్ద్రత నొందె నేత్రయు
గ్మమున సరోషరాగరుచిఁ గ్రక్కునఁ బూసెను మద్యసేవచేన్

గీ. తరుణుల శరీరములను సౌందర్యగరిమ
దాని నవయౌవనంబును దాని మదన
సంపదయు దాని వల్లభసంగమంబు
దాని మధ్యంబు భూషించెఁ దరతరముగ 239

గీ. పరుస సుప్రతియత్నస్వభావరమ్య
తనువు ప్రేమ యత్ప్రతిమోన్నత విలాస
మలఘుతరచాటువాక్య మయ్యంగనలకుఁ
బతి పిషంగుకార్మణత్వసంపదను బొందె 290

గీ. మఱియు లావణికంబును మానవంచ
నజ్ఞమగు ప్రియురాలి యాననము చేత
నలఘుతరమైన ప్రియుహృదయంబు లీల
నవలఁ దులనుంచి విక్రీత మయ్యెనప్డు 291

• బాహ్యాభ్యంతర సురతవర్ణనము •

గీ. అతిసుఖస్పర్శమై విశదాతికాంతి
కలితమై సురతార్థంబుకల్పితమయి
సన్నుతిని గన్నయట్టి తచ్ఛయనము పయిఁ
బతులపై నొక్కపరి వ్రాలె సతులదృష్టి 292

గీ. రాగతరళంబు లయ్యెను రమణు మీఁదఁ
దివిరి తిర్యక్ప్రసారులు దీర్ఘదర్శు
లైన యువతుల నేత్రంబు లహరు శ్రుతిగు
ణాన్వితశ్రవణము దాఁట వయ్యె నహహ! 293

సీ. మఱియు నొకర్తు సంభాషణేచ్ఛావతి
యయ్యెను బలుక నోరాడ దయ్యెఁ
బ్రియుని వీక్షించు కోరిక గలదయ్యె న
ట్లభిముఖి గాదయ్యె నంగసంగ
కాంక్ష గల్గియు నాయకస్పర్శనంబునఁ
గంపితవతి యయ్యెఁ గడు భయమున

సటీవ యొకర్తు కుచాంశుకాగ్రక్షణం
ఆన ప్రియుఁ దిగదీసె బోలాడ్పు మీఱ

గీ. ప్రాణనాథుని దృఙ్మార్గ మడ్డగించి
నటునవలెఁ దదీయవక్షంబు నాత్మపక్ష
మందుఁ గదియించి కుచయుగ్మ మంచితముగఁ
గప్పి మనసారఁ బిగియారఁ గౌఁగిలించె 294

పంచపాదగీతము : అంశుకంబు హరించిన యపుడు పతిఁ
దాను భుజస్వస్తికాఖ్యబంధంబు చేతఁ
దిరోహితముగ్ధకచాగ్రయై వెస నొక్క
చెలిమి మెయి భిన్నవలయంబు గలుగునట్లు
గాఢపరిరబ్ధయయ్యెను గాంతుఁ దిఱ 295

గీ. ప్రణయకలహంబుఁ బాసి యౌవనపురుషులు
నొంటిఁ బరిరబ్ధయువతులై యుంటఁ జూచి
యతనుఁడు స్వయత్నము ఫలించె ననుచు నగుచు
మిగులఁగార్ముకారోపితాశుగము డించె 296

సుగంధివృత్తము ఒప్పుగా సపత్ని చూచుచుండ భర్త ప్రేయసిన్
గొప్పగాఁగవుంగిలింపఁ గోకజాతిబోయె నా
చొప్పెఱుంగదయ్యె నప్డు చూచి మధ్యభాగమే
గప్పెఁబో తనంతఁదానె ఘర్మసిక్త మౌటచేన్ 297

హయప్రచారరగడ (ప్రాసయతి)

సవతి చూచుచుండ నొక్క యువతి కుచయుగంబు చేత
వాడి మెఱసి పతి యురంబు పీడసేయుచుండ గాంచి
దళితమైన సవతిహృదయ మెలమిఁ దన్మయత్వ మొందెఁ;
గలితదీపితస్మరుండు గలుగునట్లు పతియురంబు
విడువ కటు పరిష్వజింపఁ బడుచునుండ నారువుతైన

సౌయ్యలుల కుచంబులొందవయ్యెను పరిమండలతను;
బాగుమీఱఁ దమ్ముఁ బ్రీతిఁ గౌఁగిలించు పతుల హృదయ
మందుఁ జొరఁదలంచి రపుడు మాఁదఁగాన అధికప్రేమ
నెంత వెఱ్ఱులైరి యహహా! సంతతంబు గోరి పతుల
స్వాంతమున వసించియుండు టింతు లెఱుఁగరైరి మదిని;
బరగఁ బ్రేమవలనఁ బ్రియుఁడు కఱవు దీఱఁ గౌఁగిలింపు
చున్నవాఁడు గాన సతుల సన్నతాంగ మపుడు చాల
స్నేహపూర్ణమగుచు లోన మోహ మతిశయించి ద్రవత
నొందె నందువలన సతుల యందమైన మేనిచేత
వసనము ద్రవింపఁ జేసి పొసఁగ సౌఖ్యతృప్తి నించె
గంగుమీఱ నిష్టభర్తృ సంగమోత్థ విపులహర్ష
మంతరంగమందు నిలువ కెంతపైకి నిర్గమించి
వికసనంబునొంది లోమనికర మెల్ల నిండి చెలఁగెఁ
బతికరప్రసారణమున నతిశయముగ సంగజాత
విపులపులకరాజిచేత నపుడు సిక్త మయ్యెఁ దనువు
అవిరళపులకోదయమునఁ గవిలి యుచ్ఛ్వసితములైన
సంధి నీవికములచేత బంధమోక్ష మొందఁబడియె
నవయవములు వెసఁ గరములఁ దవిడి తవిడి కళలు రేఁపి
యువతిమదన మందిరమున ద్రవము గలుగఁ జేయ నతను
మత్తయగుచుఁ బాన్పుమీఁద నత్తమిల్లి సిగ్గుచేత
లోచనములు సగము మూసి చూచి చూడనటులనుండె 298

గీ. సరసపరిరంభమందు లజ్జాభరాన
తంబయి సమర్పితాధరదళమునైన
వదన కమలంబు పతి కొప్పఁ బట్టి యెత్తి
యక్షు లటు మూసి చుంబన మాచరించె 299

గీ. పరగఁ బల్లవోపమితి సపక్షమైన
యధరబింబంబు వల్లభుఁ డానుచుండఁ

దియుణె సవ్యథమైనట్లు తారలోల
వలఁ గరమున [illegible] జిత గ్లపసి యొనర్చె 300

సీ. అధిక విరహోష్మసంతప్త మగుట వలన
కాగి మకురంబు సల్పరాగమైన
యధరపల్లవమును వీడి సార్ద్రిమైన
నసిత యశ్రుయుగంబు చుంబన మొనర్చె 301

వ. పరిజనరహితం బగుట వలన నతివివిక్తంబై కేవలాభిరతదంపతీప్రవేశనార్హంబై విశాలంబై యున్న యొక్క క్రీడామందిరంబుఁ గేవల లక్ష్మీమాత్రసహాయుండైన విష్ణునిచేత సేవితంబైన యుగాంత పయోనిధికి సామ్యం బగు దానిఁ బ్రవేశించి రంత

గీ. ఊరుమూలంబుపై హస్త ముంచఁ బోవ
మానవతి గాన సిగ్గున మునిని కన్ను
లొకకరంబున మూసి వేఱొకకరమున
సభిముఖ పతిహస్తంబు నడ్డపెట్టె 303

క. గురుతరకుచద్వయంబున
నిరావృతములైన యట్టి నెలఁతల యురముల్
సురతాభిలాషవత్ప్రియ
కరముల గ్రహియింపఁబడియె ఘనరాగమునన్ 304

చ. చెలువుగ ఘర్మవారికణసిక్తము లౌట మృదుత్వసంపదల్
గలిగి వినమ్రభావమునఁ గ్రాలు ప్రియోరుల సన్నఖాగ్రముల్
పలుమఱు భామినీ కఠినభవ్యకుచాగ్రములందుఁ గాంతు లిం
పలరఁగ నించె నప్పు డసమగ్రపదంబు లతిప్రయత్నతన్ 305

చ. సముదితయౌవనోష్మకుచశైలశిఖాగ్ర వితీర్ణఘర్మతో
యములగు నూత్నయౌవనుల హస్తతలంబులచేత నుచ్ఛ్వస

త్కమలమనోహరంబులగు కాంతల నాభిసరోవరంబులం
దమితరసంబునన్ బతిపటు సురయోగ్ర సమగ్ర విలాసగుణస్థల్ 306

చ. అరయఁ దరంగతుల్యవళు లంచిత వైఖరి సంస్మరించు గం
భీరతరముద్రికాంచిత తరస్ఫురదంగుళిహస్తపం
క్కారములు గల్గునట్టి పిఱుదుల్ కాంతల సుస్తనోరుమ
ట్లరుదుగ ముష్టిమేయమని యాత్మ నెఱింగి గిరీన్ సుఖాతిచేన్

క. ఘననాభిప్రాంతమున ఘ
జ్జనమాడి పటంబు కొంగు సతి సడలించన్
గొన నీవి విడువఁబోయినఁ
దనపతి కర మడ్డగించెఁ దన కరమున లేచెన్ 308

పంచపాది గీతము.

ప్రియకర నివారణవ్యగ్రప్రేయసీకర
సక్తమును మేఖలా గుణయుక్తము తత
తంతువును గృహరతిమహాభ్యంతరంబు
సైన వసనంబు స్వేచ్ఛావిహారబాధ
కమునఁ గామికజాంతిని గలుగఁజేసె 309

చ. పడఁతి యధోంశుకంబు విడువం గమకించెడు భర్తపాణికిన్
విడువకు మంచు నడ్డమిడు ప్రేయసిబాహులకున్ నిరంతరం
బడఁగక కల్గు పోరు గని యుజ్జ్వలహస్తగ కంకణంబులున్
గడువడిఁ గాంచి బద్ధమణి ఘంటకలున్ రొదఁ జేసె నత్తఱిన్

చ. వెసఁగి విభుండు కోకముడి విచ్చిన భామిని మానవిత్తగా
వునఁ బ్రియవల్లభున్ వెస గవుంగిటఁ జేరిచి భ్రూయుగంబుపై
ననుపమసూక్ష్మలోమనిచయంబులచేఁ బటుకోప హర్షముల్
గనుపడఁజేసె సాంద్రపులకంబులచే నొకసారి వేడుకన్ 311

సీ. పతికరాగ్రము నీవిబంధంబు రయమున
లంఘించి యూరుమూలము స్పృశింప
సతిసుఖపారవశ్యమున సద్యనిమీలితాక్షి యై
యొకతన్వి యంచితముగ
రక్తవైణికహత రంజితోద్ధత తంత్రి
మండలక్వణితసమానచారు
మణితంబు గావించె మధురంబుగా రతి
గళనిస్వనంబులు గలుగు నటుల

గీ. నాయతాంగుళిపతికరం బధిక కార్శ్యశ్రీ
శాలియగు నాతి మధ్యదేశంబునందుఁ
జూడ నతిరిక్తమై పృథుశ్రోణియందు
నఖలపాణితలస్పర్శమై తనర్చె 312

గీ. సక్థి సంస్పర్శతృష్ణాతిశయము చేతఁ
జలితనిజహస్తులైన కాంతుల నఖములు
కదళికాండోపమానోరుపదములందు
నిపుణముగఁ జారురేఖలు నించె నపుడు 313

గీ. సక్థిమూలవిలోలలోచనునిఁ బ్రియుని
రమణి కర్ణావతంసపుష్పముల వ్రేసె
వ్రేయ నవి మేనఁబడి రతివిభున కపుడు
ప్రసవశరుఁ డను పేరు సార్థకముఁ జేసె 314

సీ. రాజాస్య లుద్వృత్తరతిరాగయుత లయ్యు
రమణులయందు ధైర్యంబుఁ జేసి
రంగంబు ప్రియులకు నర్పించియును జాల
వక్రత్వ మొనరించి నాక్రమమునఁ
బటుతర సురతసంబంధి ధార్ష్ట్యము గల

బాలపుష్ప క్రీడకాలంబు గనిగి
గరిమ గాంగ హలాంతుకంబులును ధై
ర్యాదులు సహజంబు లంగనలకు

గీ. వనిత యనిరోధితప్రియవాంఛగలుగు
నట్లు పాణి నివారణం బాచరించెఁ
దవిలి పరిహాసగర్భ భర్త్సనముఁ జేసెఁ
గపట రుదితంబుఁ జేసె సుఖంబునందు 215

ఆ.వె. సిగ్గుచేత సిగ్గ చేత నిషేధోక్తిఁ
బలుకఁ గూరకున్న బాలికలకుఁ
బతులు సేయుక్రీడ ప్రతికూల మనుకూల
మయ్యెఁ గష్టసుఖద మగుటవలన 216

ఆ.వె. సురతవేళ సతుల కరయ భర్తలయందు
ధార్ష్ట్య మబలలందు దయితతముఁ
కదయతయును గల్గు నివిరెం డితరకాల
మందు వైపరీత్య మొందియుండు 217

చ. నెలఁతలదేహమందు శయనించిన యవ్విషమేషుఁ డుత్తటన్
జలమున బాహుపీడన కచగ్రహణంబులచేత సంతతో
జ్జ్వలనఖదంతకక్షతల జయ్యన మేల్కని జాడ్యహీనుఁడై
యెలమి రమింపఁ జేసెఁ దగ నిర్భరనాత్మవిచేష్టితంబులన్ 218

వ. మఱియు నొక్కకాముకుండు వస్త్రాపకర్షణసమయంబున గామిని
చేత సమాశ్లిష్టుండై వ్యగ్రకరుండగుచు దుకూలంబు నాకర్షింపం
గడంగి నిరంతరస్తనతిరోహితనేత్రుండగుటం జేసి యంతకుమున్నె
విగళితంబైన వస్త్రంబు నెఱుంగఁ డయ్యె నప్పుడు 219

ఆ.వె. "తరుణికుచముచేతఁ దాడితమైతి నిం
కెచట నాకు నుండ నేటి?" కనుచుఁ
ద్రుటితహారయష్టి ప్రియునెద మౌక్తిక
వృష్టిఁ గురిసెఁ బుష్పవృష్టికరణి 320

గీ. స్నిగ్ధవాక్యంబు దీనోక్తి సీత్కృతంబు
మణితము నిషేధవచనంబు మఱియు భూష
ణారవంబులు వాత్స్యాయనాదిరచిత
మైన స్మరశాస్త్రపదార్థ మధిగమించె 321

గీ. నిభృతమేకంబు విచ్ఛేదనిరతమైన
సతులమణితం బవిచ్ఛేదచారుమధుర
బహుళతరకాంచినూపురధ్వనులచేత
సతతముగాక వినవయ్యె నద్భుతముగ 322

వ. అప్పుడు రతిసంభ్రమంబువలన ధరణీతలంబునం బాతితంబైన కాంచీదామం బీదృశంబైన నిజఘనంబున కుపరిసురతంబులందు ముహుర్ముహురుత్పతనపాటవం బెట్లుగలిగె ననివిస్మితంబైన జఘనమహత్వంబు దర్శింపం జేయుచున్నదానిఁబోలె నొప్పె మఱియును

సీ. విగతచిత్రకచిత్రవిపులకపోలంబులం
దార్ద్రనఖపదవ్యాపనములె
చిత్రరూపములయ్యెఁ జెలఁగి విచ్యుతకుసు
మాలకాగ్రములందు నంచితముగ
శ్రమవారికణములె సుమవితానములయ్యె
మఱియుఁ గామినులు రమణులకొఱకుఁ
గ్రమత నేయేచేష్టితము ప్రియంబైయుండు
నింపుగా నదియుఁ గావించి రప్పు

గీ. ఉచితముగ వేషభాషల నుత్సుకత్వ
మునను రాగంబువలనను మోహమునను
లలితగతులచే నానుకూల్యంబు వలనఁ
జెలుల హృదయంబు రంజింపజేసిరపుడు 324

చ. తెమలి కామినుల్ దనివిదీఱ సమోపరతిక్రియల్ సమ
గ్రముగ నొనర్చి సొక్కి తనులగ్నశ్రమాంబుకణార్ద్రచేలలై
శ్రమమునఁ దత్కుచోరుయుగసాంద్రభరంబు సహింపలేక సం
భ్రమమునఁ గొప్ప లంసములపై నటియింపఁజరించిరత్తటిన్

గీ. రతిసమయమందు మిగులదూరగత మైన
వ్రీడ సురతాంతమందుఁ దద్విరహ మార్వ
లేని ప్రియసఖిచందాన మానితముగఁ
గ్రమ్మఱఁ బ్రవేశ మొసరించెఁ గాంతలందు 326

గీ. పరగ లజ్జాస్ఖలితనేత్ర పాతములను
సంభ్రమాకుగ్ర్నపీతవిశాలపటపి
సద్ధగాత్రంబులగు మైథునక్రియాంత
ములు క్షణముచూడఁదగియుండెఁ బోలుపుమీఱ 327

గీ. యువతి మొలచీరగట్టుచో నొక్కతొడను
గ్రమ్ముటకె కాని కటిచుట్టు రాకయున్నఁ
బతి కరంబునఁజిక్కిన పైఁటచెఱఁగు
లాగికొని నవ్వుచును గట్టె బాగుమీఱ 328

సీ. ప్రవిమృష్టచందనరచనంబు విభ్రష్ట
మండనంబును ద్వ్యక్తమాల్యమునగు
నుపభోగ మకరాధయుక్తమైనటువలెఁ
దనయంతఁదానె యవ్వనితలకును

స్వాపబాధనివృత్తికై మంచనంబయ్యె
రతిసంభ్రమంబునఁ బతిత హేమ
కాంచియైన వరోరుఘనితంబమునందుఁ
గడునఖక్షతరేఖ కాంచియయ్యె

తే. వనితలయురోజ పీఠిపైఁ బతితరాభి
మర్దనచ్ఛేదగతముక్త మౌక్తికంబు
లతిలఘువులయ్యె గుణశేషహారయష్టి
తలఁప మిక్కిలిశ్లాఘ్యమై యడరెనపుడు 329

మ. కలయం గాంచి పాటలోరుదళనాంకం బచ్ఛగండస్థలం
బుల వైజాత్యగుణంబుచేత బేదమయి వైముఖ్యంబుఁ బ్రాపించె ను
జ్జ్వలదోష్ఠంబునఁ బుల్లవర్ణము ఘటన్ సౌముఖ్యముం జెంది మి
క్కిలి రాగాతిశయత్వమొంది యలరెన్ గేళీక్రియాంతంబునన్

గీ. ప్రథమసురతాంతమున నిజపతులు విశ్ర
మార్థమే యుపగూహనం బర్థి నొసఁగి
రది యె యుదితమన్మథమయి యంగనలకు
వెసఁ బునారతి కవకాశ మొసఁగెనపుడు 331

చ. అనిశము క్రీడనాభిరతయైన లతాంగికి సౌఖ్యదంబుల
య్యనుగతమోహములై క్షణదయొక్కటెగాదటు మర్త్యమన్మథుల్
మునుకొని పల్లవప్రసవభూషితతల్పతలంబులందుఁ జ
య్యనఁ బవళింప నొక్కక్షణమైన నొసంగ రదెంతచిత్రమో

వ. మఱియు మిక్కిలి నఖలూనంబయ్యును సముజ్జ్వలత్వంబున న
నూనంబగుటం జేసి శ్రమంబునఁ బ్రియులచిత్తంబు వికారంబునొం
దింపని వరారోహలగాత్రంబు యాదవులకు రాగవృద్ధి గొంత
వడకుండం జేసె; నిట్లు మదనుల చేత సభివ్యంజితరాగులు సవిచ్ఛిన్న

# శ్రీ ర స్తు

# శిశుపాలవధ మహాకావ్యము

## తృతీయాశ్వాసము

క. శ్రీ పద్మనాయక కాస్త్రయ
దీపక! ఫణిరాజతుల్య దృఢతరభుజసం
స్థాపిత ధరణీభార! ర
మాపతి చరణాంబురుహసమర్పితహృదయా ! 1

### • ప్రభాత వర్ణనము •

వ. అవధరింపు మవ్వలికథ యెట్లనిన. 2

సీ. చతురత నభికృత శ్రావకసుస్నిగ్ధ
కంఠులై యొప్పు మాగధులు వచ్చి
సమధిక శ్రుతులైన షడ్జస్వరంబును
బంచమస్వరము ప్రభాతకాల
మందు నిషిద్ధంబులౌటచే వర్జించి
తత వేణువీణామృదంగతాళ
కలితంబుగఁ బ్రభాతకాల ముచ్చైస్స్వర
ఘనరాగమున మాదవునకుఁ దెల్పి

గీ. రతనురతితాంతనయనద్వయంబు మూసి
మూయక యమున్నె గురుతరమురజరవము
కల్యసమయంబు దెలుపుచు గంత భావి
విరహసూచకమగునట్లు వేగ మ్రోసె. 3

మ. భవదీయోజ్జ్వలశైశవంబునఁబదప్రతిష్ఠ స్తమైపోయి వే
గ వియన్మార్గమునన్ భ్రమించు శకటక్రవ్యాదుచందంబునన్
దివిపై నల్పశరీరుఁడైన ధ్రువుపై దేవర్షిరాణ్మండలం
బు వికాసస్థితిఁదక్కి యొప్పెడు నిశాభోగాంతముం దెల్పుచున్

చ. మెలపునయామపాలకుఁడు మేల్కొనియుండిస్వపాల్యయామమున్
బొలుపుగఁబుచ్చి తానిదురవోవ ననంతరయామపాలకుం
బిలుచుచు లెమ్ము లెమ్మనుచుఁబేర్కొన, వాఁడతినిద్రచే రహిన్
బలుమఱు నర్ధవాక్యములుపల్కుచు మేల్కొనకుండె నత్తఱిన్.

చ; లలనబృహన్నితంబవిపులత్వనిరుద్ధమనోజ్ఞశయ్యపై
“నలువుగఁ బవ్వళించుటకు నట్లవకాశములేకయున్న నే
యలవున నిద్రఁబోనడఁతు?” నంచటు సారెకు మన్మథక్రియా
కలన నతిప్రయాసముగఁగాంతుఁడు పుచ్చెను రాత్రిశేషమున్ 6

చ. క్షణశయితప్రబుద్ధులు రసాపతులున్ గవిశేఖరుల్ పర
క్షణదలయందు మేల్కొని వికాసితసంతతధీప్రచారులై
ప్రణుతికినెక్కు వార్ధిసమరాజ్యసుకార్యములందున్ బ్రతి
క్షణము ప్రయోగకల్పనలు సాధుగతిన్ దలపోసిరెంతయున్. 7

ఉ. ఉర్వీతలంబునందు శయనోత్థితమౌట మదాంబుపంకిలా
ఖర్వశరీరమైన యొక గంధగజంబును యంత నేర్పుతో
గర్వమడంచుచున్ వెనుకకాళ్లఁదగిల్చిన శృంఖలధ్వనుల్
పర్వఁగనొండుప్రక్కనవలన్ శయనింపఁగఁజేసె నెంతయున్. 8

చ. అతిలఘుహస్తగోపులు సమాహితమంథకదండమై సము
ద్ధతబహులనాదయుక్తమయి తద్దయునొప్పు దధిప్రకాండమం
దతులజలంబునందు సుర లబ్ధినిఁబోలెను వెన్నఁదీయఁగాఁ
జతురతవార్ధిదింబలెఁ బ్రసన్నతఁద్రచ్చిరి కుంభిమద్ధతిన్. 9

గీ. మగని ప్రార్థన వినక తా మొగము ద్రిప్పి
కూర్కినట్లుండి యటు కోడికూతను విని
లేచి నిద్రచే ముకుళితలోచనయయి
కనని యట్లుగ బిగియారఁ గౌఁగిలించె 10

చ. అనుగత వేణువల్లకిరవై కతనొంది సమగ్రతాలమై
యనుపమబోధసాధనమునై కలమై యవిగర్హితంబునై
ఘనముగనొప్పు గీతమును గాయకులుం దగఁ బాడుచుండఁగాఁ
బనిఁబడి యాలకింపుచు నృపాలకు లున్నిదురించి రింపుగన్. 11

మ. నలువొప్పన్ హయరాజి మున్ గళితకర్ణగ్రీవముల్ గల్గున
ట్లెలమిం గన్నులు మూసి జానుయుగళంబింపొందఁ బై కెత్తి సొం
పలరన్ గొంచెము గూర్కి లేచి చపలోష్ఠాగ్రంబునై వేడ్క ముం
గలిఘాసంబు గ్రసించె బ్రస్ఫురదుదగ్రప్రోథముం గల్గఁగన్. 12

మ "మును మత్సంగతిచేఁ బ్రవృద్ధరుచియై పొల్పొందిచంద్రుండు పె
ల్పనఁ బ్రాప్తోదయుఁడయ్యె నేఁడపగతోసంబంధముం జేసి నం
దునఁ బాతిత్యమునొందె నిట్లగుట నెందుం జూడ నర్హుండుగా"
దనుచున్ బ్రాచిహసించెనో యనగఁ దూర్పుచ్ఛుత్వ మొందె న్రహిన్

మ. సరసన్ భర్తలు సుప్తులైన వెనుకన్ సంసుప్తలై వారు గ్ర
మ్మర మేల్కాంచక మున్నె మేల్కొని యుషామారణ్నమల్ భీతిన
త్తటి నస్పందశరీరలై సురతఖేదప్రాప్తనిద్రాసుఖో
త్కరులౌ కాంతులఁ గౌఁగిటన్విడరు నిద్రాభంగమంచు న్రహిన్

వ. మఱియు నప్పుడు శశాంకుండు సంధ్యాసమయరాగంబుచేత
లోహితావయవంబులై పరిపక్వరాజీవకందచ్ఛేదశుభ్రంబులైన
నిజమయూఖంబులచేతఁ గుంకుమంబుచేత నీషద్భగ్ననిజధావ
ళ్యంబులైన సరసచందనరేణువులచేతఁబోలెఁ బశ్చిమాశ నలంక
రించె; మఱియును. 5

సీ. రమణీయకుముదషండము ముకుళీకృత
పత్రమై క్షీణశోభనువహించెఁ
గమలషండంబు వికాసితదళమయి
పరివర్ధమానశోభను ధరించె
నవ్యక్తమధురమౌనట్లు తుమ్మెదలచే
నుపగీతమైన యయ్యుభయమపుడు
సమరూపదశనొందెఁ నబ్జారికిరణ సం
దోహంబనూరుచేఁ దుల్యరుచిని

గీ. బరగఁ బ్రాపించి రయమునఁ జిరపరిచిత
వ్రీడ నటువచ్చినట్లున్న వృత్రవైరి
దిక్సతీవక్త్రమునకు సద్దీపితావ
కుంఠనపటంబు క్రియఁ గప్పెఁ గోర్కు లలర. 16

చ. అనిశరతిప్రయాసజనితాతిపరిశ్రమనిస్సహాంగనా
తనువున శాంతినొందిన తతస్స్మరపావకునట్లు వెండి మె
ల్లన నవమాలతీసుమపరాగకరీషరజంబుచేఁ బ్రభం
జనుఁడొగిఁగుళ్లగించి వెలుచన్ జ్వలియింపఁగఁజేసె నత్తఱిన్ 17

చ. ప్రకటితపద్మబాంధవవిభాపరిహీణనిజౌజమైన దీ
పకళిక రాగవంతులగువారి రతిక్రమమెల్ల నర్థిఁ ద
క్కక యటు సర్వరాత్రమును గన్నులుమూయక చూచినందునన్
నికట సనిద్రమైన గృహనేత్రముకైవడి నుండె నత్తఱిన్. 18

సీ. మఱియు మోదానంగమాద్యత్సుయౌవనో
న్నతకామినీమనోనాథసురత
సంరంభసంభవశ్రమజాతఘర్మని
వారణచణుఁడు ప్రభాతకాల
పవనుఁడు వికసితపద్మగంధముల నె
భృంగపాళికల మోహింపఁజేసి
మంజులసురభిత మకరందములు వెదఁ
జల్లుచు వీచెను సంభ్రమమునఁ.

గీ. గౌరి యీ రాత్రి శశి కాంతుఁ గూడి యుండి
శ్వసనసుగంధియై యిప్పుడింపెసఁగఁ దత్క
రాంగరాగవిమిశ్రాంబరాంతమును వ
హించి రయమునఁ జనుచున్న దేవుమీఱ. 19

చ. విలుళితనేత్రతారకలు విశ్రుతసుప్తినిశాంతమేచకో
త్పలనయనల్ వికాసరహితస్ఫురదాస్య సుధాంశుబింబలున్
జలితశిరోజపాశలయి చయ్యన వారవధూమణుల్ నిశల్
వెలయఁగ రాజవేశ్మముల వెల్వడి రప్పుడు సంభ్రమంబునన్. 20

చ. అతిరుచిరైన చంద్రుఁడు నవాసితకంజవనీరమాసము
న్నతపరిహాసవైఖరులఁ దప్పక రాతిరి యెల్లఁ బుచ్చి యం
చితముగ గ్రస్తహస్తుఁడయి చెచ్చెర నిద్ధరపోఁ జలంచి ర
మ్యతరసితాంగమస్తక ధరాంకమునం దగఁ జేర్చె నత్తఱిన్. 21

గీ. రాత్రివేళ సత్వరపరిరంభసంభ్ర
మంబున నపాస్తమైన రామాపటంబు
తత్ప్రభునితంబలోలనేత్రఁ జెలుతుఁడైన
పతి యొసఁగఁడయ్యెఁ గ్రమ్మఱఁ బత్నికపుడు. 22

గీ. "అకట! నిశపోయెఁ గుముదిని ముకుళితాత్మ
యయ్యెఁ దారకల్ నశియించె" నని మిత్రియుఁడ
శత్రుఁడగు శశి దుఃఖించి భ్రష్టశోభుఁ
డై కృశతనొందెనో యన నప్పుడుదయె. 23

గీ. ఎంతలో రవి గనుపట్టఁడంతలోన
నరుణుఁడు తమంబునంతయు నపహరించె;
మునుకొని ప్రతాపవంతుల మ్రోలనున్న
యతఁడును రిపుప్రహర్తయై యలరుఁగాదె.? 24

గీ. విరహాఖిన్నమౌ కోకంబు విగతతిమిర
సుగుసత్రమం జూచి పక్షంబు లటు విదిర్చి
సంతలోఁ దత్ప్రియాంగనయైన కోక
రసుని చనుదెంచెఁ దటినితీరము సనుండి. 25

వ. మఱియు రాత్రి కాలంబున యువతులును బుష్పమాల్యంబులును సంతుష్టయువమనస్కులై యుపభోగంబుకొఱకు సంపాదితంబులైన వలయవసనాది భూషణంబులచేత భూషితంబులై యుభయంబు తుల్యకాంతిని వహించియుండియుఁ బ్రభాత కాలంబగుటయు యువతులు వల్లభాలింగనంబుల చే విమృదితంబులై నిష్ప్రభత్వంబునొందిన మాల్యంబులం బరిత్యజించిరప్పుడు. 26

సీ. ప్రతివసమందుఁ జలితమలౌఘుండు
విక్షిప్తవల్లికావిస్తరుండు
కంపితాశేషవృక్షప్రసూనుండునై
యెచ్చోట నిలువంగ నింపులేక
శ్వసనుండు కామినీప్రసవసంఘర్షణో
ద్గంధినిశాంతభాగముల నిలిచె;
నఖచిహ్నావళులందు నాధిసంధులయందు
దంతక్షతముల నొక్కింతసేపు

ఆ. వె. విద్యమానమగుట నద్యఃప్రదృశ్యమై
భోగనీవశాంగరాగ మప్పు
డతిరహఃకృతంబులైనను సురుచిర
సురతవిలసితముల నెఱుఁగఁజెప్పె. 27

చ. మఱియుఁ బ్రభాతకాల పరిమందవిభాయుతుఁడౌట దృష్టివి
స్ఫురితకళంకుఁడైన యలసోముఁడు ప్రోషితపత్రపంక్తులై
పరిగతభోగలక్ష్ములయి పక్ష్మళరోత్కటనికార్శనంబులై
వఱలు సతీకపోలముల భర్త్సితుఁడైన క్రియం జెలంగెడిన్. 28

కలహమందు వికీర్ణఘనకఙాపణముల
సంపూర్ణమైన వేశ్మంబులందు
విఫల ప్రయత్నులై వెస వయస్యలు దను
మోపహాస మొనర్పఁ గాంచి రపుడు;
విలసనశీలుఁడై వెలయు నొక్క ప్రియుండు
తనమేని సఖరదంతక్షతంబు

గీ. లన్యసతికృతములయ్యె నని తలంచి
కోపము ననున్న సతిఁజూచి "కువలయాక్షి!
యివియు నీచేఁ గృతములయ్యె నెఱుఁగవేల?"
యనుచు లజ్జితయగుదాని ననునయించె. 85

వ. మఱియు నొక్క ప్రియుండు కృతగురుతరహారచ్ఛేదంబగునట్లు గాఢాలింగనంబుగావించి శిథిలీకృతాంగుండై ప్రయాణంబున కామంత్రణంబు ప్రార్థించిన నప్పు డయ్యువతి వక్షోజయుగ్మంబు పరిగళితప్రత్యగ్రస్థూలమౌక్తికబాష్పంబు బిందువులు గలుగునట్లుగా రోదనంబు గావించినట్లుండె; మఱియు నొక్క ముగ్ధాంగన పగటియందు నిజవయస్యలచేత విదితంబైన రాత్రికాలస్వచేష్టితంబంతయు మదమూఢనైన యేను ప్రియుని మ్రోల ననేకప్రకారంబుల నొడివితిఁ బ్రౌఢకాంతవలెఁ బ్రియుని ప్రియవచనంబుల నాలించితి నెంతవెఱ్ఱినైతి నని లజ్జానమ్రవదనయైయుండె నప్పుడు

చ. అనుపమరక్తపంకజదళావళిముగ్ధకరాగ్రపాదయై
ఘనతరచంచరీకచయకజ్జలపూర్ణనవోత్పలాక్షియై
వినుతపతత్రిరావముల వేమొఱవెట్టుచుఁ బూర్వసంధ్య చ
య్యన నటురాత్రి వెంటఁజనె నప్పుడు బాలకుమారిచాడ్పునన్.

వ. మఱియు సాహితాగ్నుల ప్రతిగృహంబులందు నక్షతజ్యోతులైనయాహవనీయంబు శాస్త్రోక్తప్రకారంబున యథాయోగంబుగాఁ బఠితస్వరంబులుగల యధ్వర్యుప్రభృతి ఋత్విగ్వరులచేతఁ

బ్రవో వాజాద్యగ్నిసమింధనీబుక్కు లనుసరించి కృతసురసరిత్తా
ఘువిధ్వంసనం బగునట్లు దేవతోద్దేశంబు ద్రవ్యత్యాగంబు నావిశ్వేసం
బాస్వాదితంబయ్యె నుఱియుఁ బ్రక్రాంతజపాగ్నిహోత్రంబులై తపస్వి
జనంబుల యోష్ఠప్రభవంబులైన యుపూపధ్మానీయవర్ణంబుల
చేత నావృతంబై పదంపడి నిరోష్ఠ్యవర్ణంబులచేత నర్శనీయం
బగుటం జేసి యుద్గతాంకురదశనంబైన నముఖంబు ప్రకాశనంబు
నందును ఘటితవిఘటితంబైన సుగంధిసుమకోశలక్ష్మీసామ్యంబు
నధిగమించె; మఱియును 38

• సూర్యోదయ వర్ణనము •

గీ. వజ్రిదిశయందు నవహేమ వర్ణభాను
దీప్తిపుంజంబు జలధి భేదించివచ్చు
కృతజగద్దాహన రంభవితతమైన
బాడబానల శిఖభంగిఁ జూడనయ్యె 39

సీ. ఘనరజ్జుసంకాశ కరములఁ గుంభంబు
మాడ్కి సమాకృష్యమాణ మగుచుఁ
గృతచంచలవిహంగవితతశబ్దములైన
యాశలచే జలరాశి నడుమ
నుండి దివాకరుం డుత్తారితుం డయ్యె
రమణీయముగఁ దోయరాశిలోఁ
నిశ యంతమగ్నుఁడై నిలిచియుండఁగఁ జేసి
యౌర్వాగ్నిశిఖల నధికతప్తుఁ

గీ. డయ్యెఁ గాఁబోలుఁ! గాకున్న నంబువులను
వెడలి చనుదెంచినప్పుడు వితతవహ్ని
కలితఖదిరకాష్ఠాంగారగౌరగాత్ర
మెత్తెలంగున గలిగెఁ దినేశ్వరునకు 40

క్షణముపయినున్న రవి నవకరచయములఁ
బ్రాక్కుధర మొక్కటియెకాదు బంధుజీవ
కుసుమకృతశేఖరముఁ దాల్చి యొసఁగుటరయఁ
దరణిరుచిచేత నట్లయ్యె ధరములెల్ల 41

అలయక బాలసూర్యుఁ డుదయాద్రిశిఖాంగణమందునాడుచున్
జెలువుగఁ జారుపద్మినులచే ససరోరుహావక్త్రహాసమున్
గలుగఁగ వీక్షితుండగుచుఁ గప్రముఖగధ్వనిఁ జేరఁబిల్చు న
ట్లలరు నభోంకమందు నిహితాగ్రకరుండయి యొప్పె లీలతోన్

పరువడి భానురా జుదయపర్వతపీఠము నందొకింత సే
పరుదుగనుండి భూతలము నందటుపాదము లుంచి సజ్జనో
త్కరరచితప్రణామములు గైకొని వారి బహూకరించి చె
చ్చెర భువనంబుఁజూచుటకుఁ జెల్వుగనుత్థితుఁ డయ్యె నయ్యెడన్

మఱియుసదులు బాలాతపచ్ఛురితంబులగుటం జేసి పరిపక్వసురా
భంబై యుభయతీరనిరుద్ధంబైన సలిలంబును సూర్యకిరణ సా
యకదళితఘనతిమిరదిశాగజఘటాశోణితంబునుంబోలె వహించి
ప్రకాశించె గవాక్షవివరంబుల గృహాభ్యంతరంబులు ప్రవేశించిన
తరుణతరుణికిరణంబులు ప్రాతఃకాలంబునఁగాంతల బరిత్యజించి
యిండ్లకుంబోవఁదలంచిన పురుషులయందుఁ గుపితుండై మన్మ
థుండు ప్రయోగించిన వహ్నిసంతప్త నారాచంబులుం బోలె వె
లుంగుచుండె. మఱియు రాత్రియందు యువతులచేతఁ బీతమై
రేయరిక్తంబైన కాంచన పాత్రంబు ప్రాతఃకాలంబున గోరోచ
నారుణంబైన భానుతేజంబున సంక్రాంతాభ్యంతరం బగుచు
నిప్పటికిని దొల్లింటి చందంబున మద్యపూర్ణంబైన దానిపోలికఁ
బ్రకాశించె; మఱియును. 44

నలువుగ రాత్రియందుళయనంబున నించిన శుభ్రకాంతి సం
కలితప్రియోత్తరీయ మది కంజసఖోప్రవిమిశ్రమౌటచే

బలుమరు రక్తవర్ణమయి భాసిలుచుండఁగ నాత్మచేలమం
చెలమి భ్రమించి కైకొనిన యింతిని గన్గొని నవ్వి రంగనల్ 45

చ. వరరజతాద్రిభంగిఁ జెలువంబగుసౌధము రాత్రి చంద్రికా
స్ఫురితములై లసత్స్ఫటిక సుందరరోచుల నొప్పియుండి సు
స్థిరమృదుభాస్కరాంశువులచే నరుణీకృతమై దినంబు నం
దలుచుగఁ జాజుఁ బూసిన విధంబునఁ జూడఁగ నయ్యె హృద్యమై

సీ. నాయకు డొక్కఁడు నలినాక్షి సరసన
క్షతకాంతరలగ్నచవిమోచ
నము సేయుచుండఁ గ్రన్నన సీత్కృతులచేత
నావిష్కృతములైన యచ్ఛదంత
ములయందు నటు ప్రతిఫలితంబులైన నూ
తనభానుకరములు వినుతభంగి
ఘనపద్మరాగానుకారంబు గావించెఁ;
రమణాంగసంగసంక్రామితంబు

గీ. కోకనదకాంతియైన కుంకుమముచేత
గనకనికషోపలస్థరేఖయును బోలెఁ
గడు లలితమైన యువతుల గాత్ర మెంద
యందు లబ్ధవర్ణోత్కర్షమై వెలింగె 47

గీ. జలజవనకాంత మాలోకశత్రుభీత
మైన కరలోచనసహస్ర మధిగమించె
వరగ నభ్రాంతవృత్తియౌ హరిహరిక్రియ
నఖిలబాధకవృత్రసంహారి యయ్యె 49

చ. ఇరులనడంపఁబూని యుదయించినసూర్యుని చేత డస్సినీ
యరుచిరతారకానికరమంతయు వేగ నపాస్తమయ్యెఁ బో;
యరివధకాంక్షయా జనన కర్తిఁ దదాశ్రయణాత్తలక్ష్ములై
వరలెడు వార లెందఱు విపత్తులుగారె? తలంచిచూడఁగన్ 49

ఆ. వె. ఉష్ణకరుఁడు క్రోల నున్నచంద్రాంశుక
గౌరరజితభిత్తి కటకమందు
సంక్రమించుచుండ శైలగుహాంతర
తమమునెల్ల నణఁచె దక్షిణంబ 50

ఆ. వె భానురుచులు నిండ్లబయలనుండియు సద
నాంతరస్థ తిమిర మణఁచివైచెఁ
నది జిగీషురుచి కనల్పతేజమున ని
సర్గ మఖలరిపులఁ జంప ఁ రయ 51

వ. మఱియు నొకండు తొలుతఁ బదభ్రష్టుండై పదంపడి లబ్ధపదుండై పూర్వబద్ధులైన స్వబ దువులఁ గాని కారాగారకవాటం బుద్ఘాటించి విడిపించుకైవడి సూర్యుండు తనయభివృద్ధికొఱకు స్వకీయంబైన ధామంబునొంది యతిమాత్రరసలౌల్య బువలనఁ గమలంబునందుఁ జిరబంధనంబు ప్రాపించిన షట్పదంబులకు సత్వరుండై దళకవాటదళనంబుఁ జేసి బంధమోక్షంబు గావించె మఱియును 52

సీ. సహస్రాంశుఁడప్పుడు సమకాలమునఁ దుల్య
సంఖ్యాంశువులచేత సరిసహస్ర
సంఖ్యాతదళములఁ సమ్మదంబున భేద
మొనరించి షట్పద ధ్వనులచేత
సత్కృతయగుదాని జలరుహాగర్భగృ
హంబున వసియించియలరుదాని
లక్ష్మిసాదరమున లక్షించినటుండెఁ
బ్రత్యూషమున రాగవంతుడగుచు

గీ. భానుఁడు కరాగ్రముల సితభాను నదయుఁ
డగుచుఁబీడించి ఘననిస్సృతాంబుకుప్ర
కాంతినిర్వాప మంబుజాభ్యంతరముల
నిలిపినట్లుండె స్నేహంబువలన నపుడు 53

పంచపాదిగీతము. విశదితాశేషలోకుండు దళితతో(ప్ర

గాత్రుఁడగు హేళి రెండవ కన్నుపోలె
వికసనం బొందుచుండ ద్యోవీధి విగళి
తాంశుసితకరతనువుచే వ్యంగితైక
నయనరైనట్లు చూపట్టె నయనములకు 54

చ. కుముదవనంబు మోడ్చె నవకోమలమయ్యె సరోజషండమున్
బ్రమదము వీడెఁ గౌశికము గ్రాలె ముదంబునఁ జక్రమిథ్రినీ
రమణుఁడు మీఱెఁ జందురుని రమ్యతరద్యుతి జాఱె; దుష్టదై
వము వివిధప్రకారములఁ బ్రాణులకిచ్చుఁ గదా విచిత్రవైచిత్ర్యముల్

ఉ. చండకరుండు దిక్పతిని సామియయుంబోలె [illegible]ణంబు బ్రోష్యుఁడై
యుండియుఁబూర్వమార్గమున నొంగ్యసనింటికి రాఁగఁజూచియుం
దుండఁగలేక భీతిగొని యొప్పఁ[illegible]షారుఁడు వోలెఁ జంద్రుఁడుం
గండుదొలంగిపాఱె నటు గ్రక్కునఁబశ్చిమమార్గగామియై 56

వ. మఱియు నఖలతారాలోకంబు విలయంబు నొందించి సర్వాతి
శాయిమహిముండును ధృతిసానురాగలక్ష్మియునై నసూర్యుండు
విష్ణుండునుంబోలె రాత్రి కల్పావసానంబున గగనమహార్ణవంబు
నధిష్ఠించి యుండె; మఱియుఁ గృహాళులలోకప్రబోధుండు నవ
ధూతాంధకారోదయుండునైన సూర్యు[illegible]మహాగుణగరిష్ఠుండ
య్యును వినాశితకుముది తారకా[illegible]యుఁ గృతకామి వియో
గుండునయ్యును బహుతరగుణసద్భావంబువలన లోకాంగీకృత
స్వల్పదోషుం డగుటంజేసి కృతార్థుల[illegible] సుప్రభాతుం డగుం
గాక యని యాశీర్వదించిరి* 57

* మూలమున 11 వ సర్గసమాప్తము

## ప్రాభాతిక ప్రస్థాన వర్ణనము

చ. ఇనుఁ డుదయించునంతట మహాభరథాశ్వనిషాది మేదినీం
ద్రనికరమచ్యుతాలయముద్వారముఁ ద్రోలఁ బ్రయాణకాలయో
గ్యనిరుపమానవేషరచనార్థ మొకించుక సేపు జాగొన
ర్చిన హరిరాక గోరుచు విశేషమతిన్ గనుపట్టె నంతలోన్ 58

వ. సర్వాలంకారభూషితుండై కృష్ణుండు 59

గీ. కాంచనోజ్జ్వలరుచియు స్వచ్ఛము సుపత్ర
మధికజవజితనాగంబునైన తార్క్ష్యు
మెక్కి మింటనుబోలె మహీతలంబు
నం దనుద్ఘాతసుఖమార్గమందుఁ జనియె 60

సీ. శ్రీశ్రితవక్షు లంచితకరస్థితచక్ర
కలితులు ద్విజరాజకాంతు లరయ
సత్యాసురక్తులు సాంద్రనరకజిష్ణు
లగు భూపతులు వినయాదిసుగుణ
ములచేత హరిఁ గూడి పోలుపొంద నరిగిరి;
రవణీయశుచిసతారములు మౌక్తి
కములగు పటమంటపములచేఁ దులకుము
చాకరంబులచేత నంచితముగఁ

గీ. బరగ నుపలక్షితంబయి విరహవేద
నాతిపరితప్తనారీకమై కుముద్వ
తుల ప్రభాతంబు యదుసైన్యముల ఘనప్ర
యాణ మన్యోన్యసదృశమై యలరె నపుడు 61

ఉ. ఉన్నమితాంగమౌట రథపోద్ధతి మింటికి నుద్గమించున
ట్లున్న మహామహీధరము నొప్పున నొప్పగు సామజంబు బల్
మన్నన స్వానమత్పదసమర్పిత పాదుని యంతృవర్యునిన్
బన్నుగ నాత్మమస్తకముపైఁ దగఁజేర్చుకొనెన్ రయంబునన్

వ. మఱియుఁ శాణితలాంగసంఘట్టన పరిశాణ్యాజితోద్వేగం బగుటం
జేసి ప్రకాశమానశరీరంబులగు జాత్యశ్వంబుల నాశ్వికులు సంద
ర్శనలాఘవోత్పతనకర్ములై పల్యాణకోట్యవలగ్న ముఖరజ్జుసహి
తైకహస్తులగుచు నారోహించిరి ఉపరిభాగస్థితుండైన నిషాది
దూరపథంబు వోవుటకు శీఘ్రంబున నెంతలోన దూరమార్గగమ
నౌపయికంబైన యాసనవిశేషంబు రచింపకుండె నంతలోనఁ
దీర్ఘవంబున లేచి దుస్సహవేగంబులగుచుఁ గరభంబులు విశృం
ఖలత్వంబునం బరువెత్తె; సుఖమనాకాంతియు సుసారథియు
నైన యొక్కరథి గండోజ్జ్వలయు నుజ్జ్వలన్నాభిచక్రప్రత్య
గ్రోదర శ్రీవిరాజితయు నవిదురయుక్తైన శకటిని యువతిం
బోలె సన్నద్ధంబు గావించె శీఘ్రంబున లేచిపోవం గమకించునట్టి
రథాణంబు పురోభాగంబున బలాత్కారంబుగా నిగృహీతంబై
భారయుక్తయంత్రకంబు నిక్షిప్యమాణం బగుచుండ నత్యంత
భారంబున సర్ధోద్గారస్వరగ్రీవిచుమందాదిగ్రాసంబున విషమ
స్వగం బగుచు నిజనామంబు సార్థకంబు గావించె 63

మ. అనువొందన్ ముకుదాటి చేతమధృశంబయ్యున్ విషాణద్వయిన్
దనుఁ గంపింపఁగఁ జేయుచున్ వెస సశూత్కారానుకంపత్రికం
బున మ్రోయంగడు దుర్బలోక్షము జనంబుల్ పృష్ఠభాగంబు మీఁ
దనిడన్ గోణి భరింపదయ్యెఁ గడుఁ జిత్రస్ఫూర్తి శోభిల్లఁగన్

మ. వివిధావిష్కృతసామజస్వర సముద్వేలంబు సాహస్రమా
ర్గపరిష్ఠంబు మహాదురధ్వయనమున్ గాంధర్వ భూయిష్ఠతా
తిశిలోక్యం బతులప్రభావ మగుచున్ దెల్పొందు సేనామహా
ర్ణవ మొప్పెన్ బటుసామవేదసమతం బ్రాపించె దుష్పారమై

మ. ప్రతినాగేంద్రముతోడ యుద్ధమొనరింపం బోవు నాగేంద్రము
ద్గతకుంభాంకుశమున్ ద్యజించి నిశితాగ్రంబైన యస్త్రాంకుశం
బతివేగంబునఁ దాల్చి యంత్రవరుచే వాచావముల్ మీఱఁగా
నతికష్టంబుగ విల్పోఁగంపితశిరంబై యూర్ధ్వదంతాగ్రమై

మ. జలజాతాప్తు ప్రయాణవేళ విలసత్సమ్మూర్ఛదుచ్ఛృంఖలో
జ్జ్వలశంఖాదిక నాదమైన పటహస్వానంబు గంభీరమై
దళితాశాతలమై మహీభృదురుపత్వ్రశేణులన్ బల్విడిన్
జలితస్వాంతులఁ జేసె సర్వజలధుల్ సంక్షోభముం బొందఁగన్

చ. గురుతరదిక్చయంబునకుఁ గుంకుమచూర్ణవిలేపనద్యుతిన్
బరువడినిచ్చుచున్ స్ఫురిత భాస్కరశోభయుఁ గల్గి ముద్గభు
గ్వరఖురఘాతరైవత పర్వత ప్రాంతసువర్ణభూములన్
వరుస జనించినట్టి పృథుపాంసుచయం బెగసెన్ ఖవీథికిన్ 68

గీ. లలితగంభీర రథమండలస్వనములఁ
దాద్భృశంబైన కరిబృంహితము దిరస్క
రింపఁబడియె నారెంటిని గ్రిందుపఱచె
నశ్వాకార హేషాధ్వను లధికమగుచు 69

గీ. పరగ నంతికాగతయైన కరిణిఁగూడఁ
జనఁదలఁచె ధూతసృణియయి సస్పృణితిర్య
గురుశిరముదాల్చి చటులాగ్రకరము సాఁచి
కదియనేగె స్థూలోచ్ఛ్రయగతుల గజము 70

గీ. అవని నంటియంటకయుండ నడుగులిడుచుఁ
జారుచామరయుతములై సైన్యవాజు
లిప్పటికి సపక్షంబులై యొసఁగుచున్న
వనుచు నీక్షింపఁబడుచుండె సద్భుతముగ 71

వ. మఱియు సముత్థితభుజాకంధరంబులును జంచలకర్ణచామరంబు
లును సమాకులఘుర్ఘరస్వరంబులును నైన యుష్ట్రంబులు విశాలం
బైన మార్గదేశంబును ద్రుతచరణనిక్షేపంబుగలుగునట్లు తత్క్షణంబ
చూర్ణీకృతంబుగాఁ జేయుచుండెనియె మార్గంబునందు సారథిచేతఁ
ద్రాపార్థంబు కృతకాతనాదంబుగలుగునట్లు శీఘ్రంబునఁ బ్రచోది

తంబై వేసరయుక్తంబైన శకటంబు నిజచక్రదారోత్థితసాంద్రమహీపరాగచయాక్రాంతభయంబువలన నతిరయంబునఁ బోవుచుండెఁ గంచుకిభయంబున నగ్రభాగంబునం బోవుచున్నవారగుటవలనఁ బరావర్తితముఖులైన సకలచమూచరపురుషులచేత క్షణంబు సమీక్షితముఖసరోజలైన యంతఃపురకాంతలు తురంగాధిరూఢలై తురంగవల్గనంబువలన నుల్లలితబృహత్తరకుచపరివలకూర్పాసకంబు గలుగునట్లు రయంబునం జనిరి.

మ. అరయస్ ముందరఁ జక్రనేమి దళితంబై వెంబడిన్ భూరికుం
జరపాదాక్రమితోన్నతస్థలమునై సంచారభగ్నోన్నతాం
తరశూన్యం బగునట్లు పూరితమహోదగ్రోన్నిమ్నభాగంబునై
ధరయొప్పెన్ హలభృత్సమీకృతమహీస్థానంబుచందంబునన్

చ. చెలఁగి యశిక్షితంబగుటచేఁ బయికెల్గయుంగ దాఁకఁబై
నిలువఁగలేక సాది యవనింబడఁ బల్యయనంబు జాఱి భా
రలఘుతనొంది చెచ్చెర నురంబుఁ బ్రేలఁగఁ జాలు గుల్మమున్
వలనుగఁ జూచి యచ్చటి జనం బిహిహీ యని నవ్వి రత్తఱిన్ 74

సీ. సకలమహీభృదస్ఖలితోరుయమునాది
తటినుల స్వమహిమోత్కటముచేతఁ
గప్పుచు మూఁడుమార్గంబు
జనుటచే గంగయు త్రిపథగాఖ్య
ప్రసిద్ధిగాంచె యనేకమార్గంబుల నేగఁ
దద్వాహిని బహుళవిధ ధ్వనులు చెలఁగ
దంతావళోరుకూత్కారభీతములైన
కరభంబులు నియంత కడురయమున

గీ. వ్యగ్రుఁడై చేతివగ్గంబువదల మీఁద
నుండఁజాలక యవరోధయువతులుర్విఁ
బడిన లఘుగతి భువిదాఁటి పటురయమునఁ
బఱచి శకటసమూహంబు విఱుగఁద్రొక్కె 75

అరయఁ బ్రస్తాంగసంధిగతాక్షపాట
వంబగు రథంబు శకలీకృతంబు గాఁగఁ
దక్షవైద్యులకైతను తత్క్షణంబ
గలిపె లంఘనపూర్వకక్రమము దెలియ 76

స్థానసంసక్తశకటంబు సాంద్రభార
భంగసంక్షోభదారితభాండగళిత
మద్యవిప్లావితోన్నతమార్గ మగుచు
నుండ శోకించె సార్థవాహుండు చూచి 77

నిరుపమభేరికారవవినిందితఘూర్ణితగుహాముఖంబు భూ
ధరనిభదంతిరాజవిజితస్ఫురితోపలమున్ ధ్వజాంశుకో
త్కరపరివర్తితోచ్చలితకందళికాన్వితమైన శైలమున్
గుఱుతుగ సైన్యముల్ వెనుకకుం బనిచెం గడుదూరమౌటచేన్

ఘనవనదంతిరాజమదగంధవహాధిక దుర్ధరంబులై
యనుపమకోపభంజితమహాతరుశాఖములై మదోత్కటం
బునఁ బరిఘించు దుష్టగజపుంజములన్ గడునేర్పుతో నిషా
ది నిచయమధ్యముం దొలఁగదీసి వెసన్ నడిపించె నుద్ధతిన్ 79

ఘనవైజయంతికావనరాజిరమ్యముల్
శైలప్రతిచ్ఛందసామజములు
సతతవిసర్పితజనతాతరంగిణీ
శతములు నగు చమూతతులచేత
బహుభూమితలములు ప్రచ్ఛాదితము లయ్యెఁ
జారుమృగీవిలోచనసమాన
లలనావిలోకనంబులఁ జూచి కృష్ణసా
రంబులు ఘటికాద్వయంబు నచట

గీ. వీఁకమృగినేత్రశంక చేఁబోక నిలిచి
యుండి పదపడి నానావిధోన్నతోరు
విభ్రమ వికారములు నిరూపించి తెలిసి
సంభ్రమంబునఁ గడువడిఁ జనియెనపుడు 80

గీ. హరులు సాదులచే దృఢకర గృహీత
కళములయి మెల్లమెల్లనఁ గష్టతరపు
గాలఁ నిమ్నభూములుడిగ్గి వేగమడర
ముత్తరించె ఖురధ్వను లుప్పతిల్ల 81

శా. ఆరూఢుండయి వెన్కవచ్చు జనమున్ వ్యాప్తిం బ్రతీక్షించు దో
స్సారోదంచిత సాదిచేత మిగులన్ సంస్థాపితంబయ్యుఁదా
వేరంబున్ బిచుమందపత్రములు భక్షించె న్వడిం బోయి; స
చ్చారిత్రంబును దాత్యమున్ జగతిలో సద్భోగఫలంబె కదా! 82

మ. హరిసైన్యంబు ప్రతాపదీపితములై ప్రాప్త ప్రమోదంబులై
యిరుపార్శ్వంబులఁగూడి సక్రమతనుల్ హేలాగతిన్ వచ్చు ని
ర్ఘరనానావనిరాట్సమూహములచే బహ్వాతపత్రాఢ్యమై
కరమర్థిం గననయ్యెఁ జూడ్కులకు నేకచ్ఛత్రమైనట్లుగాన్ 83

గీ. వెంటవచ్చుకరటి ఘంటాధ్వనులు విని
యదరుచేత వ్యాకులాంగనులగు
సైన్యచరులు భారసంచయంబులతోడఁ
ద్రోవవిడిచి యొడు త్రోవఁజనిరి 84

వ. అప్పుడు స్తుతిపాఠకులు తేజస్వివర్ణోజ్జ్వలవృత్తశాలియు సుప్ర
సాదియు నళ్యక్తగోత్రసంవిదుండునగు మురారిగుణంబుల
నధికరించి పద్యంబులఁజదువుచుఁ బురోభాగంబునఁ జనుచుండిరి
మఱియుఁ గల్పాంతక్షుభితంబై సముద్రంబు సలిలంబుచేత నిమ
జ్జితాశేషభూగోళంబై వేలాలంఘనరూపమర్యాద నతిక్రమించె

మాధవుండు ప్రచలితుండయ్యె నపరిమితసైన్యంబులచేత నిశ్శేషంబుగా నాక్రాంతమహీతలుండయ్యును గ్రామాదికంబును బరిత్యజింపుచు మర్యాదాపాలనంబు గావించె మఱియుఁ బటోలీపుష్పగుచ్ఛసచ్ఛాయ ముఖోపలక్షితలును వికసితవిపులబాణపుష్పసమానలోచనలగు గ్రామ్యకాంతలు వల్లికాతిరోహితగాత్రలగుటం జేసి చక్షుర్గోచరులచేత నలక్షితలై కృష్ణుండు గ్రామంబతిక్రమించు నందాఁకఁ గంటకశాఖావరణోపరితనావకాశంబునందు విలోకింపుచుండిరి మఱియు గోష్ఠప్రదేశంబులందు గోష్ఠీకృతమండలాకారోపవేశనులై ప్వాట్టహాసపరినాద సహితంబగునట్లుగా శీఘ్రంబున లేచి కాపిశాయనపానోచ్ఛ్రితులై నిజనామసంకీర్తనప్రవర్తితచిత్తులైన ఘోషజనుల విలోకింపుచుం జనియె నంత

సీ. అరయ నేకాంత మౌగ్ధ్యంబున నజ్ఞాన
విభ్రమంబులు సతివిస్మృతములు
సులలితాలస పక్ష్మములును సకృద్దర్శ
నంబుస నతికృతార్థంబు లయ్యె
నక్షులచేఁ గృష్ణు నటు సారెసారెకు
వీక్షించుచును వల్లవీజనంబు
తనివి నొందకయుండెఁ దమవామపాద సం
సక్తవత్సముల వాత్సల్య గరిమ

గీ. బహ్వతో మూరుకొను గోవిశేషములను
జారుదోహన పాత్రను జానుయుగ్మ
మధ్యమందిడి క్షీర సంపాతరవము
సెలఁగఁ బితికెడు జనుల వీక్షించె విభుఁడు 86

చ. పొరగ నిదానహస్తుఁడయి పాల్పితుకం జనుదెంచు దోగ్ధ ముం
దర వెస శాలుద్రావుటకుఁ దప్పక వచ్చెడు లేఁతదూడ న
త్తఱిఁగని హుంకరింపుచు ముదంబున నావులలోననుండి సు
స్థిరముగ దూడపాలికరుదెంచు గవిం గనెఁ గృష్ణుఁ డయ్యెడన్ 87

చ. చిలుకలు బ్రాలఁదోలుటకుఁ జెచ్చెర నేగెడునంతలో మృగం
బులు నొకవంక సస్యముల మోసులు మేయఁగ వానిఁదోలుచున్
బలుమఱు నక్కడిక్కడికి వచ్చుచుఁ బోవుచుఁ గూఁకలేయుచున్
గలయఁగ జుట్టునుం దిరుగు కాంతలఁ గన్గొనె శౌరి నవ్వుచున్

చ. చిరగతి శాలిరక్షణము సేయు మృగాక్షులగీతనాదముల్
సరసత నాలకించి ఘనసమ్మదపూరితచేతనంబులై
పరువడి నిల్చి మేఁతలకుఁ బాసి నిమీలితలోచనంబులై
కరమరుదారఁ జొక్కెడుమృగంబులఁ జూచె రమేశుఁ డయ్యెడన్

మ. అతులానూపసమీపమందు ఘనహేలాంచచ్చలద్యోషిశాం
చితపాదారుణపంకజస్ఖలితమంజీరాతిమాధుర్యనా
దతిరస్కారి మరాళికాముకనుకరీధ్వానంబు శ్రీనాథుఁడా
శ్రితమందారుని మానసంబును హరించెన్ గగ్ణమార్గంబులన్

గీ. హరియు దవ్వులఁ జనుచుండ నప్పుడుచ్చ
గతము నస్ఖలితంబును గౌరవంబు
నైన సేనాపరాగంబు నవనిభృత్తు 91
లటు శిరంబులఁ దాల్చిరి యాజ్ఞ యట్ల

గీ. జనము కుబ్జనగంబుల సమపథమున
నెక్కు ; హరిసేనయు మహామహీధ్రములకు
సుగమపథముల యట్ల బల్ సుఖతరముగఁ
బెక్కుత్రోవల నెక్కె నక్షీతమగుచు 92

సీ. గంధగజము లున్ముఖంబులై దంతాగ్ర
ఘట్టితాభ్రంబులు గలుగునట్లు
కలితశిరశ్ఛినకటతటప్లావిత
మదజలనదిపూర్యమాణకర్ణ

ఖిలములు గెలుగుచు శైలమి మహామహీ
ధరము లారోహించె మఱియు గండ
గళదంబు కళికమై ఘనతుల్యకాంతియై
యలరు నాగంబుచే నఖిల జనులు

గీ. పథమునందు నిరోధింపఁ బడిరి గాని
యధికతరమైన యగముచే నడ్డగింపఁ
బడక యుండిరి గావునఁ బథము నందు
నగము కన్నను నాగ మత్యధికమయ్యె 93

మ. కరు లాత్మీయ కరప్రవృద్ధ బహుళ క్ష్మాజంబుతో దిక్కులన్
గర మొప్పన్ నిజపృష్ఠకేతనవనాక్రాంతంబులౌ నట్లుగాఁ
జరణక్షేపణ పిండితాద్రివరపృష్ఠక్ష్మాప్రదేశంబులన్
స్థిరకాయాచలదుర్గమంబులుగఁ జేసెన్ భూరిసత్వంబునన్

క. హరి గిరుల నధిష్ఠించిన
కరులను పత్యకలనుండి ఘనపరితికూల
స్ఫురదనిలాఘాతంబునఁ
బరువడిఁ బై కెగయు శిలల భంగిన్ గాంచెన్ 95

మ. అను వొందన్ గుధరాధిరోహణ సదాభ్యాసంబుచే నుద్ధుర
స్తనలై యామలకీవనాంతరములన్ సంచారముల్ సల్పు నూ
తన హేలాంచితవిభ్రమాతులఁ గిరాతస్త్రీల వీక్షించె వ
ర్వనజాతుండు తదీయ విభ్రమములన్ వాక్రుచ్చి వర్ణింపుచున్

గీ. గణుతిసేయక నేత్రముల్ క్షణమువిచ్చి
మరలనిద్రింపఁదలచు కేసరి సమీప
శరణిఁజను సైన్యముఁ జూచి వెఱవ కవని
సార్థకముఁ జేసె మృగరాజ శబ్దమపుడు 97

గీ. హస్తిమార్గిత పలమార్గయదు ంబు
ధ్వజసముచ్ఛేదనిర్ఘాతతరులు జ
మూహారుద్ధనదీ వేనులును నగుచు
దారికెదురైన గిరులన్ని దాటి యరిగె 98

గీ. కరికట నిఘట్టనంబునఁ దరువులూఁగ
గడ్డములఖ గి గొమ్మలఁ గ్రాలు సెరల
నిరవుకొనియున్న సరఘుల సెగయఁజొఁప
నవియు ఝుమ్మని మ్రోయుచు నరిగెనపుడు 99

గీ. ఉపచితనగంబు తొల్లింటి యొ లిభంగి
సామజాంతకుచేత నాశంబునొంద
నొందు తనువును బోలె వేటొం తరువు
తుణములోఁగప్పు లాశ్మల రణిఁ 100

గీ. హరిబలము లొక్క చోటఁ బ్రవహ్యంబు కట లొ
నుద్ధతములు ప్రకాశంబు లొకట గహ్వ
రంబులొకట నపేతసామ్యంబు లొకట
గుపులైననురు లంఘించె గిరులనపుడు 101

వ. మఱియు నను క్రకుందుం డపథంబులైనను సముంతతవ్యాప్తసర్వ
పథీనంబైన నిజసైన్యంబుచేత సలిలంబుచేత యుగపదఖిలసేనా
ప్రవేశంబు వలనఁ బహ్యాభ్యంత్రాత్మ్యున్నతతీరంబులైన నదుల
నప్రతీపనామంబు గలవానిఁ జేసె మఱియు 102

గీ. దంతులు జలంబులోఁ జొచ్చునంతలోన
వాజులు ఖురోత్థితోరుధూళ్యావరపాత
రయవికీర్ణనీరంధ్రఖురజము చేత
మ సలిలంబు బురద గావించెనపుడు 103

చ. అరయఁగఁ గ్రీడసేయుటకునై క్షతభూరినితంబభూములై
యరుదుగ నాత్త సమ్మదములై కరతోలితభూరిశైవలాం
బరములునై మహేభములు మానుగ వార్ధిని జేరఁబోవు ని
ర్భరజలరాశిపత్నులకుఁ బంకము గల్గఁగఁ జేసె నత్తరిన్. 104

మ. గుములై ఘూరివిషాణకోటులఁ దరుల్ గోరాడి తన్మృత్తుచే
తనొగిన్ బల్విడిఁ బూర్వవాహినులు నిండఁ బూడ్చి తద్ధాత్రితో
సమముం జేసి గజంబులు నిజకటస్రావభృద్ధళద్దాన నీ
రములన్ నూత్ననదుల్ సృజించి భువిఁ జాలం జేసెఁ జిత్రంబుగన్.

గీ. కామినీముఖరుచిజిత కమలములు మ
హాతపత్త్ర ప్రభాజిత హంసములగు
నదులతీతశిలాసామ్యనాగబలక
దంబములచేత దూరీకృతంబులయ్యె. 106

గీ. అనుపమానాంజనసవర్ణతనువు లున్న
తములగు గజేంద్రములు సుధాధవళితోరు
విపులసౌధపురంబుల విప్రకృష్ట
దేశమును బొందె దీపితదిశములగుచు. 107

ఉ. ద్వారకఁ బాసివచ్చునెడఁ దద్విరహంబు సహింపలేక సొం
పారఁగ నప్పురీరమ రయంబునఁ గృష్ణునిముంగలన్ ముదం
బారఁగవచ్చిన ట్లలరె నమ్మురవైరి నివాసముల్ రహిన్
వారక సౌధశోభగల భవ్యమనోజ్ఞపటాంబరంబులన్. 108

గీ. కరిఘటాఘర్షణోద్భూత గంధదాన
సలిలసంసిక్తఘనతరుస్కంధవాసి
మధుపములు సైన్యదంతి వర్షత్ప్రమాణ
మనువుఁ జెప్పె స్వారవముల వనచరులకు. 109

వ. మఱియు నాయకకరిఘటాతిరస్కృతాట్టాలకం బైన యాచమూ
సందోహంబు మహోన్నత పటకుటీప జితోదగ్రగృహంబులైన
పట్టణంబుల నతిక్రమించి చనియెం జమూకదంబకంబు చేత నూర్ధ్వ
క్షిప్తంబగుటం జేసి సూర్యకిరణంబుల నెలం బ్రతప్తంబైన దాని
కరణి సమాహ్లాదక సౌగంధిక మారుతకంపిత యమునాజలంబు
నందు మహీపరాగంబు పురోభాగంబునం బడియెను 110

## • యమునానది వర్ణనము •

గీ. ఖరకరుని పుత్రియయ్యును గాలు చెలియ
లయ్యును వినీలయయ్యు శీతాంశులగుచు
జీవనామల జలముల చేత యమున
సకలపాపంబులు హరింప శక్తయయ్యె. 111

సీ. మిహికౌఘసంకాశమేఘంబు లార్ద్రంబు
హానీలతటుల చందనసంఘృష్ట
వర్ణకాళిందీప్రవాహజలము ద్రావి
తన్నీల జలరంజితంబు లగుచు
నాతుణంబున విభిన్నాంజనవర్ణత
నధిగమించిన భంగి నలరె మఱియు
సరగ నిర్వంకలం జలదరిత్రములచేం
బదములచేం గోలె బంధురముగ

గీ. నడుచు సువిశాలనౌ సాధనముల చేత
రయకవప్రకాంతి చేత నేత్రములు మఱియు
నంగనల చేత నాలింగితాంగు లగుచు
జనము లయ్యేఱు దాంటిరి సంభ్రమమున 112

వ. మఱియు గంగానది సాగరంబునకుం ... చేసని వేదప్రమాణంబె
కాని ప్రత్యక్షంబుగాదు యమునానదియె నిజజలంబు చేత సము

ద్రంబునుంబూరించె నట్లుగా దేని గంగాసలిలంబుపగిది సముద్రో
దకంబు శుద్ధస్ఫటిక సంకాశంబై యుండు నట్లుండక జలధిజలంబు
గంగాసంబంధిజలప్రవాహానర్థిశశంఖు కంఠసమానవర్ణంబై యుం
డుటవలన యమున చేఁబూరింపంబడె ననుటకుసందియంబులేదు.

గీ. మదగజేంద్రంబు లంసప్రసూనసలిల
మరిమొదలఁశిగ్గి నిజమదవనముచేత
నంతకంతకు మిక్కుటంబైన యామ
నాంబువుల నుత్తరించె నత్యద్భుతముగ. 114

చ. అతుల తమాలనీలసలిలాయతభూరికళిందకన్యయు
ద్ధృతబహుసాధనోర్మ్యుల రయంబున మేదినినాక్రమింప నా
యితపడవచ్చు తద్బలనదీశరయోద్ధతి నడ్డగించె ను
ద్ధతి నటువేలమాడ్కి వితతంబుగ నవ్వలనిచ్చె మార్గమున్. 115

గీ. అధికదుస్తరమైన పద్మాప్తసుతను
ఘనప్రతిజ్ఞను బోలె వేగమున దాఁటి
యుమములు శృంగలేఖతాత్యురుతటములు
గలుగునటు మోరలెత్తి రంకెలునిగుడ్చె 116

వ. మఱియు స్పష్టధ్వానంబుగలుగునట్లు చలద్ఘోణోపలక్షితోర్ధ్వ
ముఖంబులును మున్నిమిశకర్ణంబులు గలుగున ట్లూర్ధ్వప్రసారిత
నిశ్చలకంధరంబులైన హయంబులు పురోభాగంబునఁ దటదత్త
లోచనంబులై ప్రసారితవిశిష్టవాలధులుగలుగునట్లు నమ్మహానది
నుత్తరించె; నుత్తరించుచున్నయోగవభూపాలసైన్యంబులచేత సీమంతి
క్రియమాణమహిషవిషాణమేచకప్రభయు సిందూరిత గజశేఖ
రాన్వితయునైన యమ్మహానది ధరిత్రీకాయతవేణియుంబోలెఁ
బ్రకాశించె; మఱియుఁగోదలుజనంబులు నావ్యంబైన జలంబున
బ్రతిహతశీఘ్రగమనంబులు నన్నుజ్జితవైఖ్యాంబులు నపాకృత

మహోన్నతగురుతరతరంగంబు లగుటంజేసి యపరతరంగంబులుం బోలె నుపస్థితంబులైన బాహువులచేత నుత్తరించిరి మఱియుఁ బ్రియవల్లభుం డగుకృష్ణుని వరూధినిమహోక్ష శృంగాఘాతఁ విదళిత మహాకూలయు నదూభూతమదవిషాణి గురుచరణాకృష్ట జలగ్రాహయు బృహద్రథవ్యాకులితపుష్కరయునైన యమునానది నప్పు డుత్తరించి సుఖంబుగాఁ జనిరొఁ* నదనరతరంబ

• శ్రీకృష్ణపాండవ సమాగమ వర్ణనము •

సీ. కడువేడ్కఁ ద్వారక విడిచిన దాదిగా
హరి నిజసైన్యసమన్వితముగ
నిచ్చోటవిడిసె నేఁడిచ్చోటు వెలువడె
నని దినదినవార్త లరయుచున్న
వాఁడు గావున మహీవరుఁడు ధర్మసుతుండు
కమలలోచనుఁ డట్లు యమునదాఁటి
వచ్చుచున్నాఁడను భవ్యవార్తను విని
సంలబ్ధసాంద్రహర్షంబువలన

గీ. వర్ధితశరీరుఁడై తనవారినెల్ల
నాక్షణమె పిల్వనంపించి యనిలనంద
నార్జునాదిసహోదరు లనుగమింప
నెదురుగావచ్చె మంత్రులు హితులు గొలువ. 118

వ. మఱియుఁ గృష్ణాగమన సంతోష ప్రవృత్త కౌరవసేనాతూర్య ఘోషబధిరీకృత కర్ణేంద్రియంబైన శ్రోతృజనంబునకుఁ గథకుల చేత స్పష్టాలాపములయందుఁ బ్రబ్రాంతాభిధేయశేషం బుపరత వాద్యఘోషంబైన యనంతరంబ హాస్తసంకేతంబుచేత సంపాదితంబయ్యె శీఘ్రపరివర్తితకనకచక్రనేములగుటంజేసి వేగవ

* మూలమున 12వ సర్గ సమాప్తము.

న్మారుతాకంపితపరస్పరోపమమహీరేణుకేతనవసనంబులైన రాజ
సంబంధిరథంబు లంతటఁ బాదమాత్రంబైన యవకాశంబు లేకుండ
నిండె. 119

ఉ. హరిఖురఘట్టితావను లుదంచితపాణితలాభిఘాతభా
స్వరపణవాఖ్యవాద్యములభంగి ద్రుతంబుగ మ్రోసె వెంబడిన్
గర మురువారివాహపటుగర్జితవారణనాదహృష్ట వి
స్ఫురిత కలాపబర్హు లటు ముంగల నృత్యముఁ జేసె నర్తకిన్.

చ. వనరుహనేత్రు సైన్యములు పాండవసైన్యములున్ బరస్పరం
బనుపమమిత్రభావమున నైక్యమునొంది చరింపుచుండఁగాఁ
బనిఁబడి గుంపులై యుభయపక్షగజంబు లొకింతసేపు చ
య్యనఁ గలహంబొనర్చెన; మదాంధులకుం గలవే వివేకముల్?

ఉ. అవ్వల ధర్మపుత్త్రుఁడు మహారథమెక్కి మనోజ్ఞమూర్తియై
దవ్వులవచ్చు కృష్ణుఁగని తానురథంబటు డిగ్గునంతలో
నవ్వుచు నమ్మహాత్ముఁడు ఘనంబుగ రాజనుగౌరవంబు లో
నివ్వటిలంగఁ దానె కడునేర్పునడిగ్గెరథంబు మున్నుగన్. 122

తరల. అపుడు శౌరి పురాణపూరుషుఁ డగ్రవంద్యుఁడు సర్వవి
ష్టపనమస్కృతుఁ డయ్యుగౌరవసంభృతాత్ముకుఁడై రహిన్
విపులకుంబడి మేనయత్తకు బిడ్డఁడౌ యమసూతికిన్
విపుల హారము భూమినోఁకఁగ వేడ్క మ్రొక్కె రయంబునన్.

గీ. మహితమకుటాంశురంజితక్ష్మాతలంబు
హరిశిరము సోఁకునంతలో యమసుతుండు
క్రమ ముపేక్షింప కటువంగి కడురయమునఁ
ప్రీతి భుజపంజరమునఁ బరిగ్రహించె. 124

గీ. గురుకవాటవిస్తీర్ణమౌ హరియురంబు
యమసుతతనూరమందపర్యాప్తమయ్యె

సైన దీర్ఘదోర్యుగమున నంచితముగ
గాఢతరముగ రయమునఁ గౌఁగిలించె. 125

గీ. నాభికమలంబు విడిచి క్రన్నన నురంబు
నందు నిత్యంబు వసియించు నట్టి లక్ష్మి
పృథివిపతి నిర్దయాశ్లేషపీడనమున
నచటనుండక హరిముఖ మాశ్రయించె. 126

చ. బలినటుగట్టువేళ ఛలవామనుఁడై ప్రతిపత్తి సేయుచో
వలనుగనత్తఱిన్ వినయవామనుఁడైన హరిన్ యుధిష్ఠిరుం
డలయక బాహువీర్యవిజితామర భూజ సుమంబుచేత సు
జ్జ్వలతరకీర్తిచే బలె సువాసితశీర్షమునందు మూర్కొనెన్. 127

సీ. వృష్ణివల్లభుఁడు ప్రాగ్విశ్లేషితుండైన
వాఁడైన నాశ్లేషభవసుఖాను
భవసంతతోద్గత పటులోమకూపమై
యలరు కౌంతేయుని యంగ లతిక
వికసత్కదంబక నికురుంబ చారుత్వ
ముసు బాయదయ్యె సమ్మోదమెసఁగ
ఘనవీర్యనిర్జిత దనుజ సమూహుండు
నతిహృష్టమానసుం డఖిలలోక

గీ. సంస్తవోచితుఁడగు శౌరి సమ్మద ప్ర
ఫుల్లనేత్రుల వినయనమ్రుల సమీర
ణాత్మజాదుల ధర్మజునను జులను య
థోచితంబుగ సానందయుతులఁ జేసె. 128

వ. అప్పుడు సమానతేజస్కులును శిలాకఠినులును విశాలవక్షుదీర్ఘ
తరబాహులునగు వసుధాపతులను మహీపతు లేకకాలంబునం
గూడుకొని కులిశహతంబుకంటె ముందున్న మహీధరంబులు మహీ
ధరంబులంబోలెఁబరస్పరాలింగనంబులు గావించిరి మఱియును.

తే.వె. కరటికుంభసదృశ కఠినేతరేతర
స్తనభరాతిదూరదారితోద
రలును పుల్లగండఫలకలునగు కౌర
వులును గుకురసతులు గలసికొనిరి. 130

క. కరిణి హయరథ పదాతులు
పరువడి నొండొరులుఁగలసి బంధురభంగిన్
బరమోత్సవమునఁ జనియెను
కరీంద్రములు చనియె వారిఁగలయక యొంటిన్. 131

## • ఇంద్రప్రస్థాభిముఖ ప్రయాణము •

ఆ.వె. అరద మెక్కెఁ డనుచు సలధర్మజుఁడు వల్క
హరి కిరీటద త్తహస్తుఁడగుచు
నరద మెక్కె ధనవహస్తావలంబిరైయె
యింద్రుఁడంబుదంబు నెక్కినట్లు. 132

వ. అప్పుడింద్రప్రస్థాభిముఖుండై చను శ్రీకృష్ణునకు లోకేశ్వరుండగు ధర్మరాజు కరగృహీతప్రతోదుండై తొల్లి త్రిపురాభిముఖుండై రథం బెక్కి చను శంకరునకు బ్రహ్మయుంబోలె సారథ్యంబు గావించె మఱియును. 133

చ. హరితనుజాల రంధ్రకలితాబ్జలసత్కిరణోత్కరాకృతిన్
వఱలుప్రకీర్ణకం బపుడు వారిధిగంధవహుండు భూరిఫే
నరుచిరపుంజముంబలె ఘనంబుగ మారుతనందనుండు నా
సరసిజనేత్రుపార్శ్వమున సమ్మదమొప్పఁగ వీచె నత్తఱిన్. 134

చ. అలఘుతరోడు పాండురుచియొప్పఁ గళిందసుతాప్రవాహదోపరి
స్థలగతహంసమండలవు లొప్పుననొప్పెడు నాతపత్రమున్
బలరిపునందనుం డపుడుపట్టెఁ దమాలసుమాభవర్ణుఁడై
యలఘు యదుప్రవీరునకు నంచితభంగి ముదంబెలర్పగన్. 135

ఉ. మారుతపుత్ర శక్రసుత మధ్యమునం జెలువారు చక్రి సొం
పారఁగ భాస్కరేతరగ్రహాంతరవాస సమాశ్రితంబునై
హారిరుచిస్ఫురద్గురు గురాభిధ మొందివెలుంగు పూర్ణకం
జారివిధంబునన్ వెలసె నతులకుం గడువిందొనర్చుచున్. 136

చ. యమనియమంబులున్ యతినయంబున యంబుజనాథినాథునిన్
గ్రమమునఁబద్మబాంధవుఁడు గంధవహుండు జిగీషునిం బలెన్
బ్రమద మెలర్ప మాధవుని పార్శ్వములందును బృష్ఠభాగమం
దమలిన భక్తిమైఁ జనిరి యశ్వినుతుల్ రచితానుసారులై. 137

చ. అకపటసంభ్రమప్రకటితాధికభక్తులు భూరిసమ్మదా
త్మకు లవినీత శిశుకుల మానుషచర్యలు పాండురాజపు
త్రకు లసురారిపైన వితథంబగు భక్తి నొకర్చి రప్పు డా
ద్దికపడి శిష్యవర్యు లుపదేష్టపయింబలె నంచితంబుగన్. 138

## ఇంద్రప్రస్థప్రవేశము

వ. ఇట్లుభయసైన్యంబులు గంగా యమునా ప్రవాహంబులుంబోలె నొండొంటిం గూడుకొని యన్యోన్యమైత్రిం బ్రకటింపుచు నేకగ్రీవంబుగాఁజనిరయె నప్పుడుప్రతివాదితాంబరవివానంబులుగలుగునట్లుగా మంగళదుందుభులు మ్రోసె నంత దనుజాంతకుండు యుధిష్ఠిరమఖావలోకన కౌతుకాతిరేకంబున సర్వదేశంబులనుండి చనుదెంచిన మహిపతుల సైన్యంబులచేతఁ బురబాహ్యదేశంబులయందు నిర్మితంబులైన నికేతనంబులచేతనునైరిసేనావరుధ్యమానంబై వైరిసేనావేష్ట్యమానంబైన చానిపోలికనొప్పుచున్న యింద్రప్రస్థపురంబు నవలోకించె మఱియుఁ బ్రతిశబ్దపూరిత దిగంతరాళంబైన సేనాసముద్రంబు తుషారాచల గుహాముఖోన్ముఖసురనదీప్రవాహంబు కరణిఁ బురద్వారంబు గదియనడిచె లోక సంరక్షణార్థంబున నభ్యర్థ్యగృహీత శరీరసంభవంబుగల యప్పురాణపురుషుండు ప్రవిభక్త ప్రత్యగ్రగోపుర ద్వారంబులుగల

యప్పురంబు పంచేంద్రియ సమానులైన ధర్మనందనాది పంచ
పాండవులతోఁగూడఁ బ్రవేశించె మఱియును. 139

చ. పౌరనయనాగ్నిఁ గ్రాఁగని సుమాస్త్రసమద్యుతిరూపసంపదన్
వఱలెడు పూరుషుల్ మఱియు వారక మున్నటు రాజయక్ష్మరో
గరహితపూర్ణచంద్రనిభకాంతియుతోజ్జ్వలవక్త్రసంపదన్
బరగెడు కామినుల్ గలిగి భాసిలు నప్పురిఁ జొచ్చిరందఱున్.

• పౌరనారీచేష్టా వర్ణనము •

చ. భేరిపటహాదివాద్యనినదార్భటులన్ విహితోపహూతలై
పురితరుణీమణుల్ కుతుకము దొరసేయఁగ సద్మకృత్యముల్
మఱచి మురారిఁ జూచుటకు మక్కువతోనటు వీధివీథికిన్
గరమరుదారవచ్చిరి ముఖద్యుతి వెన్నెలగాయుచుండఁగన్.

చ. మలయుచు వేడ్క నర్ధకృతమండనలై కరరుద్ధనీవులై
గళితమనోజ్ఞచేలలయి గ్రాలు వెలందులఁ జూచి సౌధపం
క్తులు పటహప్రతిధ్వనులఁ దోరముగాఁ బ్రకటాట్టహాసన్ము
సపినలిక్షైవడిం దనరెఁ జారుతరంబుగ సర్వవీథులన్. 142

చ. తత్తరపాటుతో రశన తప్పక వక్షమునందు మంజుభా
స్వత్తరకర్ణపూరములు వారక కేశములందుఁ గంచుకం
బుత్తలపాటుతో నడుము నొప్పుమెయిన్ మొలచీర చన్నులం
దత్తటి గుండలంబులటు హస్తములం ధరియించి రంగనల్.

చ. వెలఁదియొకర్తు కృష్ణముఖవీక్షణరాగవశంబునం బదం
బులనటుయావకద్రవముఁ బూయుచు నొక్కటిఁ బూయ కంతలో
బొలుపుగ శంకరార్ధతను బొందిన గౌరియుఁబోలె మార్గమున్
దెలుపుగ యావకైకపదచిత్రితధాత్రిని జేసె నత్తఱిన్. 144

చ. లలితవిశాలమధ్యశిఖరస్ఖలితధ్వనితోరు మేఖలా
కుల లగుపౌరకామినులు గొబ్బునఁ గాంచనతుంగసంక్రమం
బుల నిరువంకలన్ శిఖలు పొల్పెసఁగం గయిదండలీయఁగాఁ
గలయఁగ నెక్కి రంఘ్రికటకస్వనముల్ సరసిం జెలంగఁగన్. 145

మ. హరిసందర్శనజాతకౌతుకమునన్ స్త్రీమోఘ్యలద్విత్రమం
దిరకుడ్యస్థ గవాక్షముఖ్య విలసన్నేత్రప్రభాశ్రీచయం
దరవక్త్రాంబురుహంబు జూపఁబడియెన్ వత్సాప్యవక్షోభృద్గుహాం
తరరంధ్రోదరమధ్యగై వనసముత్పన్నాబ్జపుంజాకృతిన్. 146

ఉ. కాంచనసౌధవీథిపయిఁ గ్రాలుచు గంధవహోద్ధతాంచ చే
లాంచలలైన యొక్కనగరాంగనపై, హరి పచ్చుచుండఁ బ
ర్యంచితలీల నన్నగర మాయత కేతుకృతోచ్చశోభమై
మించినమాడ్కిఁ శోభిలె సమృద్ధపటీరజలావసిక్తమై. 147

చ. అరుదుగ నప్పురీరమణు లప్పుడు మేడలమీఁద నుండి సు
స్థిరకరపంకజాంజలుల నేఁగుసుమోపహితంబు లాజముల్
స్ఫురదురుశుక్తిసంపుటవిముక్త ముక్తాఫలచారుమౌక్తికో
త్కరములువోలె శౌరిపయిఁ జల్లిరి సంభ్రమముంబునన్. 148

చ. లలితహిమప్రముక్తశశిరమ్యతరుండు సుధాంశుఁడున్ ద్విజా
వళికధికప్రియుండును వివర్ధితముఖ్యగుణుండున్ బ్రసాదితో
జ్జ్వలసురుఁడైన యప్పురుషుఁడు సంభ్రమతన్ బ్రమదాబ్జనాళికిన్
జెలువుగ సంతతోత్సవము చేసె మహోత్తరు లుత్సహింపగన్. 149

గీ. మఱి స్వదాహకుఁడగు శూలి గిరిసుతాభ
యమునఁ జేరాంగనలఁ జూడఁడనుచు నమ్మి
యభయమునఁ బంచశరుని చే నాక్రమింపఁ
బడిన సుదతులఁ జూచె శ్రీపతి తనంబు. 150

గీ. పరగఁ గల్పాంతమందు నెవ్వాఁడు కుక్షి
చేత భువనంబులన్ని గ్రసించె నట్టి
హరిని పురకాంత మదవిహ్వలైక లోచ
నాంచలంబుల గ్రసియించె నప్పు డహహ! 151

ఆ వె. శౌరి మ్రోల నొక్క సతి యధికోన్నత
కఠినకుచయు నీలకంఠమధుర
వలయనాద మగుచుఁ జలదంగుళుల చేత
ఘట్టనంబుఁ జేసెఁ గర్ణబిలము. 152

సీ. పరిపాటలాంభోజ సురుచిరంబును న
కృచ్ఛంచలాంగుళీ కిసలయంబు
నగు పాణి వేగొక్క యజ్ఞాతి ఘనశిరః
కంపంబు సేయుచుఁ గంజనేత్రు
ననుదీర్ఘ వర్ణంబు నవిదితార్థంబుగా
నాహ్వాన మొనరించె నంచితముగ
వరనలినాంతికోపహితపల్లవకాంతి
కలితైకపాణిచేఁ గ్రమముఖులు.

గీ. గప్పుకొని యొక్క సుందరి క్రమతరక
రాంగుళీరంధ్రవిస్రుతవ్యాప్తధవళ
దంతకాంతులు గలుగున ట్లంతికస్థుఁ
డైన శౌరిని జూచె సహాస్యదరమున 153

చ. హరిముఖవీక్షణంబున సమాదర విస్మయ సంభ్రమంబునన్
స్థిరతరనేత్రయై యొకచెల్వ సుఖంబున విస్మృతాంగయై
పరిగళదుజ్జ్వలాంశుకము భాసురనీలనిబద్ధకంకణ
ప్రరుచిరరోమరాజియగు పాణితలంబునఁ గప్పె సిగ్గునన్ 154

చ. ఘననిజ సౌరభభ్రమణకారితబంభరపఙ్క్తిప్రభం
జనరయనాశితక్రమజసాంద్రజలం బనిమేషదృష్టియా

చ. లలితవిశాలమధ్యశిఖరస్ఖలితధ్వనితోరు మేఖలా
కుల లగుపౌరకామినులు గొబ్బునఁ గాంచనతుంగసంక్రమం
బుల నిరువంకలన్ సఖులు పొల్పెసఁగం గయిదండ లీయఁగాఁ
గలయఁగ నెక్కి రంఘ్రికటకస్వనముల్సరవిం జెలంగఁగన్. 145

మ. హరిసందర్శనజాతకౌతుకమునన్ హైమోజ్జ్వలచ్చిత్రమం
దిరకుడ్యస్థగవాక్షమార్గ విలసన్నీరజపత్రాక్షిసుం
దరవక్త్రాంబురుహంబు జూడఁబడియెన్ దత్పూర్వభూభృద్గుహాం
తరరంధ్రోదరమధ్యగైఁ జపసముద్యత్పూర్ణబింబాకృతిన్. 146

ఉ. కాంచనసౌధవీధిపయిఁ గ్రాలుచు గంధవహావధూతచే
లాంచలయైన యొక్కనగరాంగనచే, హరి వచ్చుచుండ న
త్యంచితలీల నన్నగర మాయతకేతుకృతోరుశోభయై
మించినమాడ్కి శోభిలె సమృద్ధపటీరజలావసిక్తమై. 147

చ. అరుదుగ నప్పురీరమణు లప్పుడు మేడలమీఁద నుండి సు
స్థిరకరపంకజాంజలుల చేఁగుసుమోపచితాచ్ఛలాజముల్
స్ఫురదురుశుక్తిసంపుటవిముక్తమనోహరచారుమౌక్తికో
త్కరములువోలె శౌరిపయిఁ దప్పక చల్లిరి సంభ్రమంబునన్. 148

చ. లలితహిమప్రముక్తశశిరమ్యతరుండు సపద్ముఁడున్ ద్విజా
వళికధికప్రియుండును వివర్ధితమన్మథుఁడున్ బ్రసాదితో
జ్జ్వలసురుఁడైన యవ్విభుఁడు సంభ్రమతన్ బ్రమదాజనాళికిన్
జెలువుగ సంతతోత్సవము జేసె మహత్తరు లుత్సహింపగన్. 149

గీ. మఱి స్వదాహకుఁడగు శూలి గిరిసుతాభ
యమునఁ బౌరాంగనలఁ జూడఁడంచు నమ్మ
యభయమునఁ బంచశరునిచే నాక్రమింపఁ
బడిన సుదతులఁ జూచె శ్రీపతి క్షణంబు. 150

గీ. పరగఁ గల్పాంతమందు నెవ్వాఁడు కుక్షి
చేత భువనంబులన్ని గ్రసించె నట్టి
హరిని పురకాంత మదవిహ్వలైకలోచ
నాంచలంబున గ్రసియించె నప్పు డహహ! 151

ఆ వె. శౌరి మ్రోల నొక్కసతి యధికోన్నత
కఠినకుచయు నీలకంఠమధుర
వలయనాద యగుచుఁ జలదంగుళుల చేత
ఘట్టనంబుఁ జేసెఁ గర్ణబిలము. 152

సీ. పరిపాటలాంభోజ సురుచిరంబును నస
కృచ్ఛంచలాంగుళీ కిసలయఁబు
నగు పాణిచే నొక్క యబ్జాక్షి ఘనశిరః
కంపంబు సేయుచుఁ గంజనేత్రు
ననుదీర్ణవర్ణంబు నవిదితార్థంబుగా
నాహ్వాన మొనరించె నంచితముగ
వరనలినాంతికోపహితపల్లవకాంతి
కలితైకపాణిచేఁ గ్రమముఖులు.

గీ. గప్పుకొని యొక్కసుందరి క్రమతరక
రాంగుళీరంధ్రవిస్రుతవ్యాప్తధవళ
దంతకాంతులు గలుగున ట్లంతికస్థుఁ
డైన శౌరిని జూచె నత్యాదరమున 153

చ. హరిముఖవీక్షణంబున సమాదర విస్మయ సంభ్రమంబునన్
స్థిరతరనేత్రయైన యొకచెల్వ సుఖంబున విస్మృతాంగయై
పరిగళదుజ్జ్వలాంశుకము భాసురనీలనిబద్ధకంకణ
ప్రరుచిరరోమరాజియగు పాణితలంబునఁ గప్పె సిగ్గునన్ 154

చ. ఘననిజ సౌరభభ్రమణకారితబంభరపంక్తి ప్రభం
జనధయవాశిత శ్రీముఖసాంద్రజలం జనిమేషదృష్టియా

ననుపమసుందరాంగమున నంగనయోర్తు దరస్మితాస్యయై
దనరు పురాధిదేవత విధంబునఁజూచె హరిన్ ముదంబునన్ 155

సీ. అకట! కృష్ణుఁడు మనయక్షులు తృప్తినొం
దకమున్నె దృష్టిపథంబు దాఁటి
పోవుచున్నాఁడని పురకాంత లెంతయు
వగనొంది రనిశంబు పాయక హరి
నీక్షించువారికే తృప్తి లేదని యెఱుం
గరు వారి కేలాగుఁగలుగు తృప్తి?
హరి దూరముననేగ నమ్మహామహులమీఁది
ప్రాలినచూడ్కులు క్రమ్మఱించి.

గీ. రంతెగాని యత్యాశతో నరుగుమాన
సంబు మఱలింపఁజాలక సద్మకృత్య
ములు మఱచి చిత్రనిర్మిత లలితరత్న
పుత్రికలుపోలె నుండిరి చిత్రభంగి. 156

చ. అలఘుతరప్రసారిత ద్రుగంజలిపీతమనోజ్ఞ మాధవో
జ్జ్వలరసపూర నిర్భర లసన్మదమందశరీర యుక్తలై
తొలఁగి చనంగఁ బాదములు తొట్రుపడంగ నతిప్రయత్నతన్
మెలఁకువఁ జేసి యంగనలు మెల్లన నిండ్లకుఁ బోయి రంతటన్

• యుధిష్ఠిర సభాగృహ వర్ణనము •

వ. ప్రత్యగ్ర గంధవాసితోదకవిరజీకృతంబులును సాంద్రాగరు ధూ
పధూమకృత రేణువిభ్రమంబులును సముచ్ఛ్రితోన్నతధ్వజ స్తంభ
విలంబిపటపతాకంబులునగు పురవీథు లతిక్రమించి తొల్లి ఖాండవ
దాహంబునందు ధనంజయునిచేత మోచితుండైన మయుండు
ప్రత్యుపకారార్థంబు తనచేతనె బిందుసరోవరంబునందు నిక్షి
ప్తంబైన వృషపర్వ గృహనిర్మాణావశిష్టమణికీలాకలాపంబుచేతఁ

దిరస్కృతేంద్రసద్మసంపదం బగునట్లుగా నిర్మించి ధర్మరాజున
కొసంగిన సభాసదనంబు డాయం జనియె. 158

గీ. పరగ నేసభయందు నభ్రంకషాచ్ఛ
రాజితస్ఫాటికాగారరమ్యరుచులు
చేరి చంద్రుండు క్రమ్మర క్షీరవార్ధి
గర్భవాసంబుఁ జేసిన కరణి నలరె. 159

గీ. అరయ నేసభాసదనంబులందు నీల
మణివిభాహారితీకృతమధ్య పద్మ
రాగరచితావనులు భృగురామ పితృస
మూహ తృప్తికృజ్జలములఁ బోలెఁదాల్చె 160

గీ. ఎచట స్ఫటికాశ్మసంఘాత రచితములయి
నిశలఁ జంద్రికైకత నొందినెగడు కతన
మఱియు నిరులందును గరావమర్శగమ్య
దవసథంబులు జనముచే దాటబడియె 161

గీ. ప్రోలవిశదాశ్మగృహములఁ బోలఁజూచి
కౌముదీభ్రాంతి నవలికిఁ గడచిపోయి
వెనుక హస్తావమర్శనంబున నెఱింగి
జనము లతికష్టముగఁ జొచ్చి చనుచునుండ్రు. 162

సీ. ఏసభాగృహములం దేపార నిశయందుఁ
బద్మినీభామినీ పరిభవస్ఫు
టాపరాధములైన యబ్జాంశువులనంగ
సన్నిద్రనీలాశ్మ పంచ ఝములు
పటుగౌరవమునను పాంశుతాడనమాచ
రించె నేసభయందు నంచితముగ
నభినవసంగంబు తొంట సాంద్రత్రపా
భరపరాఙ్ముఖులయ్యు భాసురముగ

గీ. సదన రత్నభిత్తికలందు సంక్రమించి
నట్టి ప్రతిబింబములయందు నగ్రభాగ
ముందు నెదురుగాఁ జనుదెంచు సతివ లప్రము
సుఖులకు ముదంబొసంగిరి సురుచిరముగ. 163

చ. అరుదుగ నెందు నూత్నహరితాశ్మవినిర్మిత వేశ్మపంక్తులన్
హరితతృణాంకురంబులంచు నమితాస్యములై రసనాగ్రలగ్నభా
సుర కిరణాంకురంబులగుచున్ గబళంబు గ్రసింపుచున్నవై
ఖరిఁ గనుపట్టు పెంచిన మృగంబులఁ జూచె జనంబు సొంపుగన్

గీ. అరయ నెద్దానినెంగట నాలవాల
భృతజలాదర్శ బింబిత పృథుతరాశ్మ
తనువుచే సపలాశసంతతి సమూల
సంతతిని జూచినట్లుండె శాఖ్మారుహాములు 165

గీ. మఱియు సురగేంద్రమూర్ధజమణి సమీప
మందు మహురున్నతాంభోధరారవముల
చేతఁ దత్ప్రాంగణోర్వి లుద్భూతవాల
వాయజమణిస్థలాంకురచ్ఛాయసలరె 166

చ. అలవుగ నెందు గూఢసలిలాశయముంగని ధార్తరాష్ట్రుఁడున్
స్థలమను భ్రాంతిచేత డిగి తత్సలిలార్ద్రశరీరుఁడైన నిం
పలరఁగ వాయునందనుఁడు హాసముఁ జేసినఁ దద్రవంబునన్
గలగిరి రాజులెల్ల లయకాలమువచ్చె నటంచు భీతులై 167

ఆ.వె. మఱియు నెచట నిశితకరవాలకోమల
స్ఫురిత శక్రనీలభూములందుఁ
దెలుపువారులేక జలమను భ్రాంతిచే
మొలవటంబు జనులు ముడిచికొనిరి 168

అప్పు డమలాంశుపుంజరుచిరాంగులు నేత్రసుఖప్రదుల్ రమా
ధిప యమజుల్ రథంబుల నతిప్రియులై సభకున్ముఖంబుగా
విపులరుచుల్ శశాంకుఁడు కవిప్రవరుం డుదయాద్రినుండి మిం
టిపయికి నుద్గమించుటకు డిగ్గిన కైవడి డిగ్గి రింపుగన్ 169

ఇట్లు రథావతరణంబుఁ జేసి మాధవుండు ధర్మనందనుండు మార్గం బుఁజూపుచు నగ్రభాగంబునం బోవుచుండఁ బ్రభాపటలవ్యాప్తి చేత నదృశ్యరత్నమయకుడ్యంబై బహురత్నప్రభాపుంజంబుచేత నవిభావితద్వారంబై యొప్పు తత్సభాసదనంబు మెల్లనం బ్రవేశించి యేమందిరం బ్రభంకపరత్నప్రభాసమూహంబుచేత దేవతామందిరంబుల నెల్లఁ బరిహసింపుచున్న దానియట్ల నలరు నట్టి నూతన హిరణ్యమయేష్టకా రచితంబైన యమ్మహాసదనంబు విలోకించి యుదయశిఖరి శిఖరయుగప్రత్ప్రకాశమాన దివాకర పూర్ణచంద్రుల యభూతపూర్వశోభ నధిగమించి ధర్మనందనకృష్ణులు సముజ్వలదీప్తివిపులసింహాసనంబులమీఁదఁ సుఖాసీనులై రనంతరంబ రాజకులంబునకు సకలదుఃఖాపకారియగు యదునందనుండగు కృష్ణునిచేత నిదాఘసంతప్తంబైన యంగంబు వాయువుచేతం బోలె సాగరజలంబు శశిచేతంబోలె మిక్కిలిసుఖంబుచేత నానందింపబడియె విలాసయుక్తలాసిక విలాసినీజనం బనవద్యవంశాది వాద్య గీత సమకాలత్వ ద్రుతవిలంబితాది వాద్యమానానువర్తియు నవగీతం బయ్యు నవగీతత్వంబు ధరించినదై స్ఫుట సాత్వికాంగివాచికంబును మధురంబునైన నృత్యంబు గావించె మఱియు నాధర్మనందనుండు శ్రీకృష్ణుండు సభాప్రవేశనంబు గావింపుచు నుండ నమ్మహానగరంబునందుఁ బ్రసిద్ధవసంతాద్యతిరిక్తకాలంబునందును మహోత్సవంబునాజ్ఞాపించెఁగృష్ణాగమన సముత్కటానందుఁడైన ధర్మనందనుని నగరంబు సంతతోత్సవంబై శీఘ్రంబున విస్మృతంబయ్యె నప్పుడు సకలనామప్రపంచాభిజ్ఞుండైన కృష్ణుండు బాలకులు మొదలుగ బంధుజనారోగ్యం

బును బ్రాహ్మణులఁ గుశలంబును రాజుల ననామయంబు నడిగె మహాసంపద నధిగమించియు నిరహంకారుండగు సుజనుం డొకానొకప్పు డైనను గర్తవ్యకార్యంబు మఱువఁడు గదా! యిట్లు సర్వజనంబుల కుశలం బరసిన కృష్ణుండును యుధిష్ఠిరుం డును బరస్పరంబు మనుష్యలోకంబు నందు దుర్లభంబైన రసో త్కర్షంబు నొంది రతిస్నిగ్ధత్వంబున ననుతుణంబు ప్రతివాక్యం బపూర్వత్వంబును ధరించె బహుళశిశుపాలజరాసంధాదివధకార్య చింతారూపామృతంబు లాస్వాదింపు చుండిరి. * 170

ఉ. అప్పుడు సాధువాది నృపుఁ డధ్వరకర్మమునందు మానసం
బొప్పుగఁజేర్చి సాంద్రసుఖయోగకృతాస్య ప్రసాదదృష్టిచేఁ
గప్పినస్నేహభావము దగన్ బ్రకటంబుగ జేయుచున్ రహిన్
దప్పక వాగ్విశారదునిఁ దామరసేక్షణుఁ జూచి యిట్లనున్ 171

• యాగరక్షణకు ధర్మజుఁడు శ్రీకృష్ణు నర్థించుట •

సీ. అనఘాత్మ! నీకంటె నన్యుఁడే పురుషుండు
ప్రీడ నొందకయుండు వినుతుఁడగుచు?
వినుతించువాఁడును ప్రీడితుం డగుచుండు
మన కిర్వురకు నట్టి మాటలేదు
ఈ వసంతగుణుండ వే నాత్మబంధుండ
స్తుత్యుఁడ వీ వేను స్తుతికరుండ
నవనిలో భవదన్యుఁ డగువాఁ డసత్యస్త
వంబులచేఁ జాలఁ బ్రమద మొందు

గీ. నట్టి యనృతస్తవంబులు ప్రాణులకును
సులభము లనంతకల్యాణ లలిత గుణుఁడ
వైన నీయందు సత్యంబు లగుచునుండు
నెఱిఁగి వినుతింప నెవ్వారి తరము? మధీశ! 172

---

* మూలమున 13వ సర్గసమాప్తము

గీ. పరగ సర్వాపగుణజాలవర్జితుండ
వైన నీయందు నిఖిలకల్యాణసుగుణ
సంపదలు చేరియున్నవి; సతతము నిను
బొగడువాఁడు మిథ్యావాది యగునె? కృష్ణ! 173

మ. అనఘా! భారతఖండమంతయును మత్స్వాధీనమై యుండుటల్
ఘనతన్ సర్వ సుపర్వసంపదలు విఖ్యాతోరుసౌభాగ్యముల్
విను నైశ్వర్యము జిత్వరానుజులు భూవిఖ్యాతియుంగల్గుటల్
దనరం దావక సత్కృపాకలనఁగాదా? పద్మపత్రేక్షణా! 174

చ. నలువుగ ధర్మరాజనెడు నామముగల్గుట నాకు మీకృపా
బలముననేఁగాదె? మూలతను బ్రాపుగ మీరిపు డొంద నేను సొం
పెలయఁగ ధర్మవృత్తత వహించెద నేను మఖంబు సేయఁగాఁ
దలఁచితి నీవు తద్భరము దాల్చి కృపామతి నుద్ధరింపవే? 175

శా. సంభారంబులు గూర్చి యాజకుల నోజన్ బిల్వనంపించి యా
రంభం బొప్ప మఖంబు సేయుటకు మీ రాకం బ్రతీక్షింపు చి
ట్లంభోజేక్షణ! యున్నవాఁడ నిటు ధాన్యంబర్థిఁ దూర్పెత్త సం
రంభం బొప్పఁగఁగర్షకుం డనిలుఁ జేరంగోరు చందంబునన్ 176

మ. ప్రమదం బొప్పఁగ నీవు సంగతుఁడవై పాలింపుచుండన్ మదీ
యమఖం బించుక విఘ్నదోషములు లేకంతంబుఁ బ్రాపించు దు
ర్దమసూర్యుం డుదయించి భాసిలుచునుండన్ వాసరశ్రీని నీ
తమ మెవ్వాఁడు హరింపశక్తుఁడగు? నో కంజాత పత్రేక్షణా!

సీ. మహిలోన రాజు ధర్మంబు దప్పక యుండఁ
 జెలఁగి విత్తంబు నార్జింప వలయు
నార్జితవిత్తంబు నధిక యత్నంబున
 రక్షింపవలయును రక్షితార్థ

మెలమితోఁ బాత్రభూతులయందు వినియోగ
మొనరింప వలయు నిట్లునికి లెస్స
యజ్ఞంబనంగ నన్యం బొండుగలదె? య
జ్ఞస్వరూపివి నీవె కావె? యధిప!

గీ. యగ్నిముఖమున హవ్యంబు నవనిదేవ
తాస్యములఁ నన్నముభుజించి యజ్ఞఫలము
కృప దలర్పంగఁ గర్తకు నిచ్చుదాత
వీవె గావె? మహాత్మ! నిన్నెన్నఁదరమె? 178

ఆ.వె. అనఘ! నీవు మున్ను యాగంబు గావించి
యవభృథోక్షితుండ వైన వెనుక
నీదుశాసనమున నెమ్మితో రాజసూ
యాధ్వరం బొనర్తు నంచితముగ 179

వ. అని యిట్లు యుధిష్ఠిరుండు విన్నవించిన విని యమ్ముకుందుండు సర్వమహీపతులు వినుచుండ దశనాంశువ్యాజహారంబుచేత శబలాకార శరీరంబుధరించి యతని కిట్లనియె. 180

• శ్రీకృష్ణుఁడు యాగభారము స్వీకరించుట •

సీ. జననాథ! నీదు తేజం బదె నిజనీతి
మహిమచే సకలభూమండలాది
పతులను సాధించి వశ్యులఁగా జేసె
నింక నెవ్వనిచేత నేమి గుణము?
తగఁబథ్యవృత్తిచేతనె రోగము నశింప
నెలమి వైద్యునిచేత నేమి గుణము?
అరిజయ ఘూరతరాది గుణముల కు
ద్ధతక్షత్రియుండవై తనరు నీదు

గీ. ప్రోల నెవ్వాఁడు రాజార్హ ముఖ్యసవన
మర్థిఁ గావింపఁగా శక్తుఁ డవనినుద్ధ
రింప విష్ణు వారాహ మూర్తికిని దక్క
నన్యునకు శక్యమగునె? రాజన్యవర్య! 181

వ. రాజేంద్రా! యే నతిదుష్కరంబైన భవదీయ నియోగంబునందు వ్యవస్థితుండఁగావున నెద్దిపంచినఁ జేయఁగలవాఁడ వలసిన కార్యంబులందు నన్ను నియోగింపుము ధనంజయుండు నీకెట్టివాఁడగు నేనట్టి వాఁడ నగుదు నరనారాయణ స్వరూపుల మగుటం జేసి యే మిరువుర మేక రూపంబెగాని భిన్నంబుగాదు; భవదీయ యాగంబు నిర్విఘ్నంబుగా సమాప్తి నొందించెద మమిత్రుం డెవ్వాండైన విరోధించెనేని వాని శిరంబు మదీయ చక్రాయుధంబున ఖండించెద నీవు నిస్సంశయంబుగా యాగదీక్ష వహింపు మని పలికిన నమ్మధుసూదనుని వాక్యంబాలకించి ధర్మాత్మజుండు దేవా! నీవు క్షేమంకరుండ వగుచుండఁ గొఱంత యేది నాకు? సర్వసంపదలు సుస్థిరంబులయ్యె భవత్సహాయసంపత్తిచేత సంతుష్టుండనై తీవ్రగతుకర్మంబుగావించుట కుద్యుక్తుండనై తిననిపలికెనంత.

## • రాజసూయ యాగవర్ణనము •

గీ. ధవళకర శోభితాస్యుఁడై దర్శనమున
తుపిత కామ విగ్రహుఁడయి సలిలవిప్లు
తాంగుఁడై ధర్మనందనుం డష్టమూర్తి
మూర్తి విధమున రాజిల్లెఁ బొలుపుమీఱ 183

వ. అప్పుడు 184

సీ. చెలువొప్పఁ గ్రియలు తాఁ జేయక సాంఖ్యశా
స్త్రోక్తాత్మసామ్యంబు నొందినట్టి
యవనీశ్వరుని యంతరంగంబు నందటు
బుద్ధియందును బోలెఁ బొసఁగ యాజ

కుఁడు వృత్తిభాజియై యడరఁ దదుపలంభ
కలనచేఁ గర్తృత్వగరిమఁగాంచి
సకలమీమాంసాది శాస్త్ర విశారదుల్
సవనయాజకు లపశబ్దములును

గీ. స్ఖలనదోషంబు లెవ్వియుఁ గలుగకుండ
మంత్రవర్ణ బలాహూయ మానవాస
వాదిసురుల నుద్దేశించి యగ్నియందు
వేల్చి రాజ్య పురోడాశవిసరములను 185

గీ. ఘటితదర్భవికార యోక్త్రియగు ధర్మ
పత్నివీక్షిత హవ్యంబు ప్రణయనాది
సత్కృతంబైన శిఖి యందు శాస్త్రఫణితి
హోమమొనరించి రపుడు కల్పేక్షకంగి 186

వ. మఱియు నమ్మహాయజ్ఞకర్మంబునం దూహాకుశలులగు ప్రయోక్తలు వేదంబునందుఁ బ్రథమాది సకలసుబంత విభక్తుల చేతను దిగంత విభక్తులచేతను లింగంబులచేతను శీఘ్రు నిగదితంబుగాని కర్మాంత వేదవాక్యంబును బలుకుచు సందేహోత్పాదనంబు కొఱకు సాదృశ్యంబు ధరించినవియుఁ బ్రకృతికర్మత్వంబు నుద్దేశించి యత్యంతవిలక్షణ ఫలప్రదంబులునగు సమాసంబులు ప్రసక్తంబులగుచుండ శబ్దశాస్త్రవిదులగు ఋత్విజులు తత్తత్సమాసవిహితస్వరవశంబుచేత నీస్వరంబు నీసమాసంబు నీవిగ్రహంబని యన్యతరపక్షావధారణంబు గావించిరి. ప్రకాశమానంబైన లోలజ్వాలారసనాశతప్రభామండలంబుచేత హసింపుచున్నవాని యట్లున్న పావకుండు వషట్కారంబుచేత వ్యక్తంబైన పరిశుద్ధ ప్రభూతాజ్యంబు పెక్కుమాఱ్లు నాస్వాదించె. 187

సీ. మఱియు నుత్పవనాది మంత్రపూత హవిస్సు
భుజియించు శిఖ కతిస్ఫురితరూప
వృద్ధినొందిన తనువే మహాజిష్ఠత్వ
మొందిన యదిఁ గాదు యొప్పుమీఱఁ
బరగ సువ్యక్తార్థ వర్ణసంపదఁదాల్చి
యవనిలోన హవిర్భు గాఖ్యగలిగెఁ
స్వాహావికోష్ణ సంస్పర్శంబుదాల్చిన
యనలుఁ డాజ్యాదికంబును దహించె

గీ. ననుట చిత్రంబుగాదు హవ్యప్రభూత
సౌరభంబు నాఘ్రాణించు సర్వజనుల
మూర్తివంతంబు గానట్టి పూర్వపాప
సంచయంబుల నెల్ల భస్మంబుసేయు 188

చ. అనలునికేతనంబు రయ మారఁగ నవ్వు డధఃకృతాభ్రమై
యనువుగ ధూమ్రపంక్తి నిఖిలాశలుగప్పఁగ సాంద్రభంగిన
జ్జనపతి యజ్ఞవైభవము సన్నుతిసేయుచు భాగముల్ గొనన్
మునుకొని వేల్పులం బిలువఁబోవు తెఱంగున బోయె మింటికిన్

మ. జితపాథోనిధి దేవదానవ వరక్షిప్తోరు వా నౌషధీ
లతికానిస్రుతసారమౌ నమృత మాలస్యంబు గాకుండ న
ప్రతిమామోదముతో భుజించి యమరుల్ తద్దివ్యపీయూష మే
సతతంబున్ మదిఁగోరుచుండు రతితృష్ణన్ రాజసూయంబునన్

మ. అరయం దత్క్రతువందు యాజకులచే నాహూతులై బల్భిడిన్
బురుహూతాదిక నిర్జరేంద్రు లనిశంబున్ వచ్చుచుండంగఁ ద
త్తరుణుల్ ప్రోషితనాథలౌట సురమందారప్రసగాబద్ధ సుం
దరధమ్మిల్లలు గాకయుండిరి రహిన్ దద్యాగకాలంబునన్

గీ. అమ్మఖమునందు సురులు హవ్యంబు నర్థిఁ
బ్రాశనముజేసి దీర్ఘామరత్వమొంది

రధిక దుర్జయులైన పూర్వామరులను
సంగరమునందు వధియింప శక్తులైరి 192

చ. అలయక నమ్మహాక్రతువునందు నొకింత క్రియాపచారమున్
గలుగదు సర్వసాధన నికాయసమృద్ధియుఁ గల్గియుండు నొం
పలరఁగ రాజసంపదలు యాజకవర్యుల బుద్ధిసంపదల్
మెలఁకువతోఁ బరస్పరము మించిచెలంగె సమగ్రవైఖరిన్ 193

ఉ. దక్షుఁడు ధర్మపుత్రుఁడు వదాన్యశిరోమణి యధ్వరక్రియా
ధ్యక్షులఁ బంక్తిపావనుల యాజకులన్ మఖసద్గణార్హులన్
బక్షివరాశ్వనాజ్ఞఁగొని పంక్తులు దీర్చి సమగ్రభక్తితో
దక్షిణలిచ్చె శాస్త్రగదితం బగుభంగి యథాక్రమంబునన్ 194

గీ. వెలఁగి సత్క్రియాలబ్ధ సంసిద్ధులైన
యఖిలబ్రాహ్మణక్షేత్రంబులందు భావి
శ్రీ విధఫలదంబులగు ధనబీజములను
సలిలపూర్వకముగఁ జల్లె జనవిభుండు 195

గీ. నృపుఁడు వేదికయందు మహీసురులకు
దక్షిణలొసంగి పూతుఁడై తనరు టది వి
చిత్రమా ? దక్షిణలు గొనిఁ క్షితిదివిజులు
దళితపాపులై రది విచిత్రంబుగాక 196

చ. బలరిపుతుల్యశాసనుఁడు పార్థివశేఖరుఁ డప్పు డాత్మహ
స్తలిఖితనామలక్ష్మయుతశాసనపత్రములన్ లిఖించి సొం
పలరఁగ యాగకాలమున నావిధుభాస్కరతారకంబుగా
వెలయ భుజింపు డంచు ద్విజవృద్ధులకిచ్చె ననేకభూములన్ 197

వ. మఱియు నా ధర్మనందనుండు శుద్ధంబును శ్రుతివిరోధ రహిత
శాస్త్రధారణంబును బ్రహ్మతేజంబున దేదీప్యమానంబును సాగె

సారెకు వాచ్యమానంబునగు బ్రాహ్మణసమూహంబును విభక్తి
పరిణామంబుచేత నకలంకంబులును దివ్యాక్షర రూపంబులు
నశాస్త్రధారణంబులును ఒట్టి సూత్రాదికంబుచేత శోభమానం
బులును ద్విజగణంబులచేత వ్యాఖ్యాయమానంబు ననంకీర్ణా
క్షరంబులునైన పుస్తకస్థ శాస్త్రంబులతోఁగూడఁ దద్దాన
శాలంబున నాకర్ణింపుచు 198

చ. అనిశమ వారితాధియును నాశ్రమధర్మవిధిజ్ఞుఁడైన య
జ్ఞనపతి తన్మహోత్సవము సమ్మతిఁజూడఁగవచ్చి యాగద
ర్శనజనితప్రమోదమునఁ గ్రాలు ద్విజన్ముల కశ్రమంబునన్
ధనమణిభూషణాంబర వితానము లిచ్చె యథోచితంబునన్ 199

గీ. మఱియు భూరిసారము మృగ్యమాణమెద్ది
దుర్లభంబెద్ది యట్టి వస్తువు లుపాయ
నములుగొని రాజులు తదంగణంబునందు
గాచికొనియుంద రవసరాకాంతు లగుచు 200

చ. పనిఁబడి యొక్కభూవరుఁ డుపాయన మిచ్చిన యర్థజాతమే
యనువుగ భూరిదక్షిణకు యాజకదక్షిణ కర్థికోటికిన్
దనియఁగఁజాలె ధర్మజుఁడు త్యాగవిశారదుఁడౌచు నుండ స
ర్వనృపవితీర్ణభూరిధనరాసులు నంతయు మయ్యె నయ్యెడన్ 201

చ నరవిభుఁ డయ్యుపాయనధనంబది యర్థులకిచ్చి మోదియై
వఱలె నృపాలకుల్ దమయుపాయనవిత్తము లర్థిసాత్కృతి
స్ఫురణము నొందినందునఁ బ్రమోదము తక్కినయర్థమిండ్లలోఁ
బరగ నపార్థకంబగుటఁ జాటిలు దుఃఖము నొందిరత్తఱిన్ 202

సీ. అల్పీకృతారాతియగు ధర్మతనయుండు
శిష్యభూతుండైన క్షితితలేంద్రు
హావపఃశురతక్షణాద్యల్పకార్యము లందు
నియమింపఁ దక్కిన నృపతు లతని

వీక్షించి యితఁడెంత నృపతి కాప్తుండయ్యె
సవనకర్మంబుల జాడ లెఱిఁగి
యతికృతార్థుండయ్యె నని గౌరవించిరి;
యాదికోలోద్ధృతులైరి హిరణ్మ

గీ. యాక్షముఖ దైత్య కంపిత యైనధరణి
తనదువాక్కున నిడికొన్న ధర్మజుండు
కలన నిర్జితులైన రాజులకు వారి
వారిభూములు గ్రమ్మర వారి కొసఁగె 203

చ. కనదురుసత్త్వసంపదవికారి మనస్కుఁడు ధర్మరాజనం
దనుఁడు మహాహవంబున నుదగ్రతనిశ్చయబుద్ధితోడఁజ
య్యనఁ జనుదెంచి నట్టి బహుయాచక శత్రులవల్ల నెప్పుడున్
ఘన మతియై పరాఙ్ముఖుఁడు గాక వెలింగె సమగ్రశక్తిచేన్ 204

సీ. ధన కాంక్షియై యర్థి జనుదేరఁ గని వాని
నాదరింపక పంపు టరయ లేదు
ఇంతకుమున్ను నీకిచ్చితిఁ గ్రమ్మర
నేలవచ్చితి వన్న జోలిలేదు
ఎంత సేపిచ్చిన నిచ్చుటోపికగాని
యిసుమంతయైనను విసుకు లేదు
వేఁడినదానికి ద్విగుణమిచ్చుటెగాని
కొంచెమిచ్చుట లే దొకించుకైన

గీ. జగతి "సద్యోదదాతీతి చతుర" యనెడు
న్యాయ మది దప్పకుండంగ నడిగి నపుడె
యాపనము సేయ కర్థుల కర్థమిచ్చె
ధర్మజునివంటి దాత యిద్ధరణిఁ గలఁడె 205

ఆ.వె. దానశౌండుఁడైన ధర్మజుం డర్థివి
ద్యావిహీనుఁడైన నతని విడువ

కర్థమొసఁగె మేఘుఁడంతట వర్షించి
ధరణినూషరమునఁ గురియకున్నె? 206

చ. అనఘుఁడు రాజు సద్గుణములందుఁ బ్రియత్వము లేనివాఁడు గాఁ
డనిశము తద్గుణాంతరము నాత్మ నెఱుంగనివాఁడు గాఁడు త్యా
గనిరతుఁడౌట వీఁడు గుణగణ్యుఁడు వీఁడగుణుం డటంచు నె
మ్మనమున నెంచ కర్థులకు మానుగనిచ్చె ధనం బశేషమున్ 207

చ. పనిఁబడి యవ్వనీపకులు ప్రార్థనలేకనె చూచినప్పుడే
ధనము మణుల్ యథేష్టముగఁ దప్పక కైకొని రప్డు దీయ తా
మను వచనంబు దాతముఖమందున యాచకవక్త్రమందుఁ దా
వినఁబడదయ్యె నవ్విభుని విత్తవిసర్జనమందు నెంతయున్ 208

సీ. వందిమాగధసూత వైణిక వాంశిక
వాదుల కర్హసంభావనంబు
బధిరాంధమూకుల కధికధనంబును
భోజనార్థుల కిష్టభోజనంబు
నామయార్తులకు దివ్యరసాయనంబును
బ్రసవించుసతులకుఁ బథ్యములును
బీదసాదలకును బెంపుగా విత్తంబు
గణికాదులకును బుష్కల ధనంబు

గీ. నడిగి యడగకమున్నె తా నరసి యరసి
చాలనిప్పించి యందఱ సత్కరించె
నాగతజనంబులం దొక్కఁడైనఁగాని
కష్టపడకుండ నందఱు తుష్టులైరి 209

సీ. బహువిధసంస్కృతప్రాకృతంబులఁ గృత
పాత్రసంకరములు భావసిద్ధి
సహితంబులైన భోజనములచే నాట
కములచేఁ బోలె నఖండరసము

ననుభవించి జనంబు ననుపమానందంబు
భరియించె నిబ్భంగిఁ బార్థివుండు
నమ్మహారాజసూయాధ్వరమందు దు
ష్టాత్ముల శిక్షించునట్టి హరిని

గీ. రక్షకునిఁ జేసి సంతత మద్భుతంబు
లైన దానంబు హోమంబు యజనములును
గడమపడకుండ దోషంబు స్ఖలనములును
గలుగకుండ నిర్వర్తించెఁ గౌతుకమున 210

గీ. జగతి యాజులకెల్ల నీ శౌరి యొకఁడె
సత్సఖుం డని తెలిపెడు సరణి దేవ
యజనభూమి చషాలతుల్యాంగుళీయ
యూపమంగుళినట్లు సొంపొంద దాల్చె 211

• అర్ఘ్యదానార్హుఁ డెవరని ధర్మజుఁ డడుగుట •

ఆ.వె. ధర్మతనయుఁ డిట్లు తత్క్రతువంతయు
సాంగముగ నొనర్చి యర్ఘ్య దాన
మెవరికిత్తు ననుచు నింపుతో నడిగిన
సభ వినంగఁ బలికె శాంతనవుఁడు 212

• భీష్ముఁడు శ్రీకృష్ణుఁడే యర్హుండని తెలుపుట •

వ. నరేంద్రా! గుణదోషకోవిదుండవైన నీవు కర్తవ్య కార్యంబులందుఁ బరోపదేశాపేక్షలేకయె నీయంతనీవె యెఱుంగుదువైనను గురుని యనుమతి వడసి కాని కార్యంబు సేయకుండుటది సదాచార పరిపాటి గావున నన్నడుగుట కది కారణంబు నా యెఱింగినంతఁ జెప్పెద. స్నాతకుండును గురువు నిష్టబంధుండును యాజకుండును జామాతాదిసంబంధిజనంబును ధార్మికుండైన భూపతియు నీ యార్వురు పూజార్హులగుదురని పెద్ద

లగువారు పలుకుదు రప్పుడీ యాఱ్వు రిచ్చటనె కూడియున్న వారు-ప్రతాపవంతులును మంత్రశక్తి వినివారితాపదులును బరలోక శత్రుజన జయశీలురునగు బ్రహ్మముఖంబునఁ బుట్టిన బ్రాహ్మణులును రాజులును నీయజ్ఞంబు నలంకరింపుచున్నవారు గుణాఢ్యులైన పూర్వోక్తస్నాతకాదులు వేఱ్వేఱ నకృత్రిమం బైన సత్కారంబు నధిగమించుటకు యోగ్యులైనను నతిగుణ వంతుఁడైన వాఁ డియ్యాఱ్వురలో నగ్రపూజార్హుం డగుటది విధిసమ్మతం బట్టివాఁ డియ్యాఱ్వురలోన నెవ్వండని యడిగితివేని చెప్పెద సర్వగుణబంధుండును సర్వ పూర్వదేవవినాశకరుండు నగు శ్రీకృష్ణుండు ప్రథమపూజ కర్హుం డని నామనంబునకుఁ దోఁచుచున్న దది యెట్లనిన వినుము 213

## ♦ శ్రీకృష్ణ స్తుతి ♦

సీ. అవనీశ! ప్రహ్వీకృతాఖిలదైత్యదా
నవుఁడైన యీ యదునందనుండు
మనుజమాత్రుం డని మది విచారించితో
సర్వాంతరాత్ముండు సర్వభూత
విభుఁడు సర్వాతీతుఁ డభవుఁ డవ్యయుఁడు స
ర్వేశ్వరుం డితఁడని యెఱుఁగు మీవు!
సనకాది యోగు లీఘను నద్వితీయుఁడు
పరమాత్ముఁ డజుఁడని ప్రస్తుతింతు

గీ. రరయ ధ్యేయుఁడయ్యును బుద్ధి కందఁ డనుచు
స్తుత్యుఁడయ్యును వాగతీతుం డటంచుఁ
బరగ సేవ్యుఁడయ్యును దూరవర్తి యనుచుఁ
బల్కు వేదంబులును సురవరులు మునులు 214

చ. వితతరజోగుణంబుగొని వేధయునై జగముల్ సృజించు స
మ్మతి నటు సత్త్వముంగొని సమస్తజగంబులఁ బ్రోచు విష్ణువై

యతులత మోగుణంబున లయం బొనరించు గిరీశమూర్తివై
తత త్రిగుణావలంబమున దైవిధము నొందు నితండు భూవరా!

వ మఱియు నిమ్మహాత్ముని సర్వజ్ఞునిఁగా ననాది నిధనుండయ్యు బ్రాణుల ననుగ్రహీతు కాముండై భూభార నివారణార్థంబు మానుషవిగ్రహంబు ధరించినవానిఁగాఁ గ్లేశ కర్మ ఫల భోగ వివర్జితుండైన పరమపురుషునిగా పెద్దలు జెప్పుదురు. భక్తవత్సలుండైన యీకృష్ణునం దనురాగవంతులైన జనంబులు నిరంతర ధ్యాన క్షీణపాపు లగుచు ననుభూయమానంబైన సంసార క్లేశనాటకాభినయ విధినిర్వహణంబు బ్రకాశింతురు. మూఢులగు వారు గ్రామ్య భావంబు విడిచి మోక్షార్థులై పునరావృత్తి భావంబు కొఱకు దుష్ప్రాపుండు నద్వితీయుండు స్వతంత్రుఁడు నగుయీకృష్ణుని ధ్యానమార్గనిష్ఠంబైన మనంబుచేత ధ్యానంబు సేయుచుండుదురు. 216

చ. పొలుపుగఁ బ్రాణికోటులకుఁ బుట్టువు చావును గల్గఁజేయుచున్
నలువుగఁ దాను పుట్టువును నాశము లేక యపాయమొంద క
ట్లలరు నధోజగంబు కమఠాకృతిచేతఁ ద్రివిక్రమాకృతిన్
నలువ జగంబు నిండిన యనంతున కేను నమస్కరించెదన్ 217

వ. మఱియు సృజతి సంహృతి శాస్తి లను ధాతువు లీ భగవంతుని విషయంబునం దన్యయోగవ్యవచ్ఛిన్నంబు లగునట్లుగాఁ గర్తృకారక వాచకంబులైన ప్రత్యయంబులను ధరించుచున్నవి యొకానొకప్పుడైనఁ గర్మార్థ విహితంబులైన ప్రత్యయంబుల ధరింప వింక నేమనిన స్తౌతి యను ధాతువు విపరీతకారంబై కర్మప్రత్యయాంతంబై యగుచున్నది గాని కర్తృప్రత్యయాంతంబు గానేరదు 218

సీ. మొదల నీ భగవంతుఁ డుదకంబుల సృజించి
యందు నాత్మీయ వీర్యంబు నునిచె
నది హిరణ్మయమైన యండమై విలసిల్లె
నందుఁ జతుర్ముఖుం డవతరించి
సకలజగంబుల సమ్మతి సృజియించె
నింతటికిని మూల మివ్విభుండె
క్షీరవారాశిలో శేషాహిశయ్యపై
యోగనిద్రారతి నున్నవానిఁ

గీ. దొడరి మధు కైటభాఖ్యులు దుష్టచిత్తు
లాదిరాక్షసు లిద్ద రత్యాగ్రహమున
నైద్రసుఖభంగ మొనరింప రౌద్రభంగి
సమయఁ జేసెను దల్పకీటములఁబోలె 219

గీ. శ్రవణసుఖగానకోవిద బ్రహ్మభృంగ
గర్భమై యే విభునినాభి కమల మార
మానసేందు నికటమందు నలరె నమ్మ
హోత్తముఁ డితండె సుమ్ము ధరాధినాథ! 220

చ. జగ దతివృద్ధుఁడయ్యును బ్రసన్నశి బాలకుఁడై యకృత్రిమో
పగతచరిత్రుఁడయ్యు నతిబంధుర మాయికుఁడై యజుండనా
నెఁడియు రామకృష్ణముఖ నిర్మల జన్మగుఁడై వినీతధ
న్యగరిమఁ దాల్చియుండియు ననాదియునై యితఁ డొప్పుభూవరా!

చ. పొలుపుగ స్థూలనాసికవపుర్ధరుఁ డీహరి స్కంధధూననో
చ్ఛలితసటావకీర్ణఘనసార రవార్ప్లుతమైన మేదినిన్
వెలయ ననావృతత్వగున వేగ జలోద్ధృతయైనదాని య
ట్లలవడఁ జూచె నొక్కఁడణ మద్భుతమై ఖరి నంచితంబుగన్

చ. అతిబలశాలియైన యితఁ డద్భుతవైఖరి దివ్యభూరిసిం
హాతనువుఁదాల్చి వజ్రముఖ రాయుధకోటి కభేద్యమై సము
ద్ధత రణకండువై యలరు దైత్యవరేణ్యుని ఘోరవక్షము
గ్రత విదళించెఁగోమలనఖంబుల నీకథ వింటివే కదా! 223

మ. విను మెవ్వాని కరాగ్రఘట్టితహరిద్విట్కాంతదంతావళా
స్యన్నృసింహాకృతి సన్నఖంబులు నదీశాభంగరంగత్తరం
గనటచ్ఛుక్తులు బోలె ఘూరితగదిగ్గంధేభకుంభస్థమా
తనముక్తాఫలరాజిగర్భితసు మోదంబొప్పఁ దాల్చెన్ రహిన్ 224

సీ. అనఘ! స్వయంజాతుఁ డవర జాఖిలలోకుఁ
డైన యీహరి సముదగ్రదీప్తి
జిత విరోచనుఁడయి చెలఁగు విరోచన
పుత్రునివలన నీ భువనములను
బ్రాపింపఁదలచిన పాకశాసనునకు
నవరజుండై పుట్టె నంచితముగ
నీ వామనుఁడు ధాత్రి నెంతగై కొనఁజాలు
నని దానవులు నవ్వ నంతలోన

గీ. నంఘ్రివిక్షేపమున దివ మాక్రమించి
పొసఁగ శశిసూర్యమండలములను దాఁటి
మూఁడు పదములఁ ద్రుటిలోన ముజ్జగంబు
లాక్రమించె నీమహానీయుఁ డద్భుతముగ 225

సీ. గగనంబు లంఘించి నగముఖంగి గరీయ
మైన మహోచ్ఛ్రదివ్యాంఘ్రిచేతఁ
గ్రాంతకంధరుఁడైన గతిదుర్బలుండైన
బలి దానవునకు సుబద్ధుఁడయ్యె

నింద్రనీలచ్ఛాయ నెసఁగు తదూరువు
కడ దీర్ఘమై దూరగతమునగుచు
వ్యోమంబు దాఁటి తమూర్ధ్వముఖంబుగాఁ
జనుచుండ స్వర్ణదీ స్పర్ధచేత

గీ. దానిపఁయిఁకఁదగ్గమించి యందముగఁ జాఱు
జాను కనయాప్రవాహంబు భాతిసురలు
గాంచి యచ్చెరువంది రిక్కరణి దేవ
హితముఁ జేసిన ధన్యాత్ముఁ డితఁడె సుమ్ము! 226

వ. మఱియు నమృతవిభాగకాలంబున శిరశ్ఛేదంబు చేత బద్ధవైరుం
డైన సైంహికేయుం డీహరి కపకృతి సేయ సమర్థుండుగాక యతి
రమ్యంబైన తదీయవదనంబుతో సాదృశ్యంబునొందిన శశాంకు
నిప్పటికి బాధింపుచున్నాఁడు. అనపాయస్వరూపకుం డగుటం జేసి
యప్రతిహతస్మరణశక్తిగల యీకృష్ణుం డుపదేశపరంపరావగ
మంబువలన నధ్యయన విచ్ఛేదంబునొందిన వేదంబులను గ్రమ్మరఁ
బ్రతివర్తింపంజేయుటకు నత్రిగోత్రంబునందు దత్తాత్రేయనామ
కుండై జనియించె మఱియు నితండు పరశురామావతారంబు
నొంది యర్జునకాంతారంబును వినాశితప్రచురపత్ర సంపత్తిగలు
గునట్లుగా విలూన భూరిబాహుశాఖంబుగా సముజ్ఝితచ్ఛాయం
బుగా నొనరించె మఱియు నివ్వాసుదేవుండు రామనామంబున
దశరథునకుఁ బుత్రుండై జన్మించి విధ్వంసిత దృప్త దశాననంబైన
లంకను దేజంబు చేత నధికవిభీషణంబుగా నొనరించె నిప్పు
డింద్రశత్రువులైన రాక్షసుల సంహరించుటకు విరించిచేతఁ
బ్రార్థితుండై వసుదేవనామకుండైన కశ్యపునకుఁ గృష్ణాభిధా
నంబుననవతరించె నిమ్మహాత్ముని చరిత్రంబులు లోకపవిత్రంబులు
ధవళతాలవిత్రంబులై యుండు నిమ్మహానుభావుని ప్రభావంబు
గొంతయెఱింగించెద వినుము. 227

చ. అనిమిషలోకవల్లభుఁ డనంత జగత్పతియైన యీనవా
ఙ్జనిభ విలోచనుండు సురపంక్తులచేతను వల్లవాళిచే
త "నుదధిద్రచ్చ నిన్ విడిచి తాతరో! మేము సహింపఁజాల"మం
చనిశము ప్రీతిచే గదితుఁ డైన విభుండు నృపాలశేఖరా! 228

గీ. కడిమి రిపులచే ననవాప్త గంధ మగుచుఁ
జాయచే విజితామరశ్రమము నగుచు
వెలయు పారిజాతంబు నివ్విభుఁడు దేవ
విభుని దర్పంబుతోఁగూడఁ బెల్లగించె 229

గీ. విమలఫాలంబుచే శంభు విభ్రమంబు
గన్న చైద్యుని మూఁడవకన్ను చండ
మారుతస్పర్శమున దీప మారిన క్రియ
నీ హరి స్పర్శనంబున హీనమయ్యె 230

గీ. వరుణుఁ గోలత్వమును వల్లవత్వమొంది
యనఘుఁ డీ శౌరి దంష్ట్రిభుజాగ్రమెత్తి
యంబుసంకట నిర్మగ్నమైనదానిఁ
క్షేమ గోమండలము నుద్ధరించె నధిప! 231

• ధర్మజుడు శ్రీకృష్ణున కర్ఘ్యదాన మిచ్చుట •

వ. ఇట్టి యనంతమహిమోన్నతుండైన యీకృష్ణుండు పరోక్షంబున యాగశీలురచేతఁ బూజింపం బడుచుండు నీ పురోభాగంబునఁ బ్రత్యక్షంబుగా సుఖాసీనుండై యున్నవాఁడు గావున నీ వతి ధన్యుండవైతి విమ్మహాత్మున కర్ఘ్యంబొసంగి యెంత కాలంబు నీవంశంబుండు నంతకాలంబు వనంబు లందు సాధువాదంబు నొందు మని పలికిన భీష్ముని వచనంబు విని సామ్రాజ్య శ్రీధురంధరుండైన యుధిష్ఠిరుండు సమస్త రాజసమక్షంబున శ్రీకృష్ణున కర్ఘ్యదానంబు గావించిన నమ్మహాత్ముం డనర్ఘుండయ్యె*నంత.

*మూలమున 14వసర్గ సమాప్తము.

## • శిశుపాల సంక్షోభ వర్ణనము •

క. నరనాథవిరచితంబగు
హరిపూజను జూచి చైద్యుఁ డసహిష్ణుండై
నెఱి గనలెను; బరశుభ మ
త్సరి గాదొకో? మాని మానసంబు ధరిత్రిన్ 233

ఆ.వె. శౌరియందు మొదల సక్రోధుఁడగు చేది
నాథుఁ గృష్ణపూజనమునఁ గినుక
తీవ్ర మగుచుఁ గ్రమ్మె దేహిని సమదోష
కాల మైనజ్వరము గ్రమ్మినట్లు 234

ఉ. కెంపున నందుఁ గల్గు నరదేవవరేణ్యగణంబు నెల్లఁ ద
ర్జింపుచునున్నవానిపగిది శీఘ్రమునన్ భువనత్రయంబు గం
పింపఁగఁ జేయునట్టి యతిభీషణక్రోధరసోల్లసచ్ఛిరః
కంపముఁ జేసె మౌళిగత కాంచనరత్నరుచుల్ చలింపఁగన్ 235

చ. ఘనతర కోపవేగమునఁ గన్నుల నశ్రుకణంబు లొల్కఁ గ్రో
ధనిబిడసోష్మవార్గలదుదగ్రకపోలతలుండు స్వేదతో
యనికరబిందుదంతురకరాగ్రుఁడునై శిశుపాలుఁ డత్తఱిన్
తనరె సభాంతరంబునఁ ద్రిధాపరిభిన్నగజంబు చాడ్పునన్ 236

మ. పరిభూతాఖిలరాజలోకుఁ డగుచున్ భాసిల్లు చైద్యుండు దు
స్తరక్రోధోత్థితఘర్మలిప్తతనువుం దత్సద్మమధ్యంబునన్
శరబిందుచ్యుతి గల్గునట్లుగ వడిన్ ఘూర్ణించె సంరంభియై
గురుపాథోధిసముత్థితాదిమ మహాక్రోడంబు చందంబునన్ 237

వ. మఱియు సుసంహాస పర్వతశిఖరసంకాశకఠినాంసమండలుండైన
యాశిశుపాలుండు క్రోధాతిశయంబున విగాహితకంపం బగు
స్తంభంబును స్వనకంపిత సభాసదనంబు గలుగునట్లుగా నాశ్లేష
ణంబు గావించె నప్పుడు కమనీయకేయూరద్యుతిపిశంగితంబైన

చైద్యుని బాహువుండంబు క్రోధవహ్ని జ్వాలాజాలపరీతంబైన దానియట్ల ప్రకాశించె నప్పుడు గురుతరకటిలభ్రూభంగ భీషణీకృతలలాటంబైన చైద్యునివదనంబు గ్రమ్మరవమూఁడవనేత్రంబుచేతఁ గృతసంసర్గంబైనదానిపగిది నతిభయంకరంబై చూపట్టె మఱియుఁజైద్యునిలోచనం బతిరక్తభావంబునొంది సాహసంబు నందుఁ గృతనిశ్చయంబై యగణితభయంబై సమీపమునందున్న ఖడ్గలతను బ్రియసఖంబోలె నవలంబించె మఱియుఁ మహోన్నత శైలశిలాకర్కశంబైన స్వకీయసక్థిప్రదేశంబునఁ బ్రసారితాంగుళి పాణితలంబుచేత నతిభీతచపలపలాయమానజనాకర్ణిత భయంకరనాదంబు గలుగునట్లు తారంబుగాఁబ్రహరించె నిట్లు చైద్యుని చేతమిక్కిలిఁగ్రోధంబు గావింపంబడియె వికారగుప్తిగలదయ్యును జిత్తంబు విశేషంబుగా షట్ప్రియంబును బ్రాపించి వికారంబు నొందుటయేమిచిత్రం ? బివ్విధంబున నాచైద్యుండు మొదలఁ బూర్వోక్తశిరః ప్రకంపనాది గాత్రారంభవికారకృత ముకుళ బంధంబును భావికలహాఫలయోగంబునైన కోపప్రసవంబు వక్ష్యమాణవాక్యంబుచేత వికాసంబునొందింపుచు నిర్భీకుండై సజల జలదగర్జితగంభీరస్వరుండై యాసభాస్థానంబునందుఁ బ్రతిధ్వనులు సెలంగ నత్యంతరోషవశంబున నతిపరుషస్ఫుటతరాక్షరంబు గలవాక్యంబున నిట్లనియె. 238

• ధర్మజనింద •

చ. నరవర పార్థ ! నీవు నరనాథులచేత నపూజ్యు మానుఁడా
మురపరిపంథి కర్షమతి ముఖ్యు మటంచు నొసంగి తక్కటా !
స్థిర మతిఁజుట్టమంచు నిటుచేసితి వంతియెకాని పాత్రమం
చెఱిఁగి యొనర్ప లేవయితి వీతఁడు యోగ్యుఁడె? యగ్రపూజకున్

ఆ. వె. రాజగుణములేని దామానుజుండు రా
జార్హపూజగొనఁగ నర్హుఁ డగునె ?

రాజశిఖులు చుట్టు రాజిల్లుచుండ హ
వ్యంబుఁ గొనఁగఁ గుక్క కర్హమగునె? 240

ఆ. వె. అనృతవాక్య మాడ వని నీవు పటహవా
ద్యముల మ్రోయఁబడితి వవని నింద్యుఁ
డైన శౌరి కిప్పు డర్ఘ్య మిచ్చుటఁ జేసి
యదియుఁ గార్యకలన ననృతమయ్యె 241

చ. నృపతి యధర్మరాజ వగుని కెటు ధారుణి ధర్మరాజనాఁ
గపటవుఁ బేరుగల్గె నటుగల్గుట యుక్త మదెట్టులన్నఁ గ్రూ
రపు కుజవాసరంబునకు గ్రక్కున మంగళవార నామమున్
నిపుణతఁ గల్గలేదె? మఱి నీకును నట్టులఁ గల్గె నామమున్ 242

శా. కుంతీనందనులార! యీ హరియె మీకుం బూజ్యుఁడౌనేని బల్
సంతోషంబు మఖచ్ఛలంబునఁ దిరస్కారార్థమాహూతమై
పంతం బొప్పఁగ వచ్చినట్టి నృపతివ్రాతంబు సిగ్గేది మీ
పొంతన్ నిల్వఁగ నేమి కార్య మిచటం బోవచ్చు వారిండ్లకున్

గీ. బాలిశులు గాన మీరు గోపాలకునకు
నగ్రపూజ యొనర్చితి రన్ని దెలిసి
తలయు మూఁతియు నెరిసి శంతనుతనూజు
డిట్టి గుణహీన దుర్బోధ మెట్లు చేసె? 244

## • భీష్మనింద •

వ. అని పలికి భీష్ముని దిక్కు మొగంబై 245

గీ. అరయ నగ్రపూజకు యోగ్యు లాఱ్వు రనుచుఁ
బలికి తీ వందుఁ గృష్ణుఁ డెవ్వాఁడు చెప్పు?
మితని వైతాళికునిభంగి నుతి యొనర్చి
నందువలన నింద్యుండ వీ వాపగాజ! 246

గీ. అతిజరుఁడవు చపలుండవై నీవు
విశ్రుతోర్వీభృద్గుణమును విడిచి నీచు
సందు నిటు నిత్యనిరతుండ వగుటఁ జేసి
నిమ్నగానందనుఁడవౌట నిక్కమయ్యె 247

వ. ఇట్లు భీష్ముని నిందించి పదంపడి కృష్ణు నుద్దేశించి 248

• శ్రీకృష్ణనింద •

చ. అగునగు రాజయోగ్యమగు నర్హణ మీవు పరిగ్రహింపఁగాఁ
దగదది యేను జెప్పవల దాభువిరాజునుగానొ నే నఁటం
బోగి భవదీయచిత్తమున ఁయోజనసేయుము సేయ వేని నీ
కగు బహురాజగర్హణ మనర్థము వాటిలు నిక్కమచ్యుతా !

చ. ప్రథితముగా సరణ్యమున బాలురఁగుఁడుకఁ దేనెటీగలన్
శిథిలముజేసి యమ్మధువు చెచ్చెర సారెకుఁ ద్రావిసందునన్
మధురిపు నామముం గలిగె మాసక నీకిపు డంతెగాక య
య్యధమ మధున్ వడిం దునిమినందునఁ గాదటు పేరు గల్గుటల్

సీ. అల్పబలుఁడవు ముచుకుంద తల్పరక్ష
ణుఁడవు మాగధక్షీణవీర్యుఁడవు నైన
నీకు బలదేవ సాహాయ్య నియతి గాదె
సబలతాసిద్ధి గలుగుట జాల్మవర్య ! 251

ఆ.వె. శత్రుసైన్యభీతి సంభ్రాంత నిజసైన్య
మాజిఁ బ్రోవఁజాల నట్టి నీవు
చక్రధరుఁ డటంచు జనులు పేర్కొన నీర
థాంగ మిటులఁ దాల్చితౌర ! నీవు 252

ఆ వె మును యయాతిశాపమున రాజ్యలక్ష్మికిఁ
బతివి గావు నీవు బంధునిహిత

నామపదను వార్థినందినిఁ గైకొంట
శ్రీపతిత్వ సంజ్ఞ చెల్లె నీకు 253

గీ. విమతు నెదిరించి రణము గావింప శక్తి
లేకయుండియు మింట నస్తోకపదముఁ
జూపి నందున విక్రమశాలి వనుచుఁ
బ్రస్తుతికి నెక్కి తిది యొక్క పౌరుషంబె? 254

గీ. మున్ను మేదిని నెత్తితి వన్నమాట
నిజము కల్లయొ నేరము నిశ్చయింపఁ
బ్రస్తుతంబు ప్రత్యక్షకార్యంబు గాదు
భూమిధరుఁడను పేరెట్లు పొందితీవు? 255

వ. మఱియు నీవు సర్వమహీపతులచేత నవధూతుండ వయ్యును క్షణకాలంబు క్రాంత కరతల ధృతస్వల్ప శైలుండ వగుచు మహీతలంబునందుఁ దులితమహీధరుం డని పలుకం బడితి విదియు ధన్యత్వం బింతియె కాని మాయట్టి బలవదరాతి తోలనంబు వలనఁ గలిగినది కాదు పాపాచారపరుండ వగుటం జేసి దుర్బుద్ధి వైననీవు ఫలకాలంబునందు దారుణంబైన నరకంబును జయింపం జాలక నరకవిజయి యను ప్రసిద్ధికొఱకు భూపుత్రుండైన నరకుని జయించితి విది లోకప్రతారణ మాత్రపరంబె గాని పరలోకశ్రద్ధ గాదు నీవు గుణహీనుండవు సకలదోషరాశియైన యీ నీ శరీరంబు సకలశౌర్యాది గుణవర్జితం బగుచునుండ సత్త్వాది గుణత్రయ పరిత్యాగప్రయాసంబును వ్యర్థంబుగా నేల యధిగమించెదవు నీ వసమీక్ష్యకారివి నిరస్తగుణుండ వైన నీయందుఁ బరిహాసకరంబైన యీపూజనం బపగతకేశం బయిన శిరంబునందుఁ గంకతికయుం బోలె మిక్కిలి యసంగతంబై యున్నదని కృష్ణుని నిందించి పదంపడి యచ్చటున్న రాజుల నందఱం జూచి వారలకు రోషోత్పాదనంబు సేయుచు నిట్లనియె

• శిశుపాలుడు తక్కినరాజుల నుద్రేకపరచుట •

ఉ. ఓ యవనీంద్రులార! వినుఁడుగ్రమృగంబులఁ బోలుమిమ్ముఁ గాం
తేయు లనాదరించి కడుతెంపునఁ గుక్కకుఁ బోలె శౌరికిన్
బాయక పూజఁ జేసి రిది పార్థివముఖ్యులకుం బరాభవం
బీ యతినింద్యపూజను సహింతురె? మానము గల్గు భూపతుల్

క. హతపుణ్యుండగు కృష్ణుఁడు
హతవృషభుం డగుట గోఘ్నుఁ డశుచితనువు స
మ్మతి నంటరాదు రాజో
చిత మానము గొనఁగ నెట్లు చెల్లు నితనికిన్ 258

క. చనుఁబా లిచ్చిన భామిని
జననీసమ యండ్రు బుధులు స్తన్యముఁ గొని పూ
తనఁ జంపె నిర్దయుండై
యనయము స్త్రీమాతృహంత యగు నితఁడుర్విన్ 259

వ. మఱియుఁ జపలుండగు కృష్ణుండు శకట మర్దనంబును యమళార్జున భంజనంబును గోవర్ధన ధారణంబును వాత్యాసుర విదారణంబు మొదలగు వేయే కర్మంబులఁ జేసె నాయా కర్మంబుల చేత ధీరచిత్తులగువారికి విస్మయంబేల కలుగకయుండు నది యటుంగాక యుగ్రసేనతనయుండైన కంసుని పసులంగాచుచు నసుకరంబైన స్వామివధం బాపాదించె నది పరమాత్మభూతం బితండు నరపశు వగుటకు సందియంబేమని యిట్లు శాంతవైరి బలభరుండు నసహిష్ణుండు నగు శిశుపాలుండు నిష్ఠురంబగునట్లుగా దుర్వాక్యంబులు పలికి యప్పుడు నరకపుత్రునితోఁ గూడ దత్తంబైన పరస్పరకరతాడనంబు గలుగునట్లు తారంబుగాఁ గృష్ణదోషోద్ఘాటన సమ్మోదంబున నట్టహాసంబు గావించె. 260

## • శ్రీకృష్ణుని మౌనము •

సీ. పరుషంబులగు శిశుపాలుని మాటలు
విని వాసుదేవుండు తన ప్రతిజ్ఞ
కటు హానిఁ గల్గునో యను భయంబునఁ గుపి
తుఁడు గాఁడు సత్యసంధుని మనంబు
చలియింపఁ జేయ నేజనులకు శక్యంబు?
యాదవవీరు లత్యాగ్రహంబు
గలిగియు విభుచిత్తగతి విచారించి చై
ద్యుని మీఁదఁ గవయక యూరకుండి

గీ. రపుఁడు; శౌరి యలంఘ్యాత్మ లపితపాశ
బద్ధుఁడై వాని తొల్లింటి పాపవాక్య
శతము నటు ద్రోచిపుచ్చి తత్సమయనింద
నోక్తు లన్నియు లెక్కింపుచుండె నపుడు 261

క. కృపణుఁడగు చైద్యు తొల్లిటి
యపరాధములను దలంపఁడయ్యె రమేశుం;
డుపకారములనె తలపుదు
రపకారము లను దలంప రార్యులు ధాత్రిన్ 262

## • భీష్ముని అధిక్షేపము •

క. మందాకినితనయుండు స్వ
నిందన మెన్నక రమేశు నిందనమునకున్
డెందమునఁ గనలి వాత
స్పందనజలరాశి రవము చాడ్పునఁ బలికెన్ 263

చ. గుఱుతుగ సర్వలోకములకున్ విభుఁడున్ గడుపూజ్యుఁడైన యి
మ్మురపరిపంథి యీసభను బూజ్యుఁడు గాఁడని యెవ్వఁడుద్ధతిన్
వెఱవక పల్కు నట్టి యవివేకి శిరంబు పయిన్ సభాసదుల్
వరుస నుతింప నా యెడమపాదముఁ బెట్టెద నేఁడు చూడుఁడీ!

• శిశుపాలపక్షసంక్షోభము •

చ. అని యిటు జాహ్నవీతనయుఁ డాడిన తద్వచనార్థ మప్పుడే
యనుభవ మైనయట్లు కలుషాకులమానసులై "యితండు తా
మనల గణింపకిట్లు దురహంకృతి నింతటిమాటఁ బల్కెనే?"
యని పటురోషసంక్షుభితులై రల చేదిప పక్ష భూపతుల్ 265

సీ. అతుల కోపారుణీకృత మౌటచే నీల
తారకానుమితోరు తామ్రనయన
మైన బాణాసురు నాననంబు సకలంకు
వగు సూర్యబింబంబు పగిది లోక
భీకరం బగుచు దీపించె వికాసిత
రక్తశిరోగ్ర నేత్ర ప్రసూన
దీప్రుఁడై నిజకాంతి దీప్యమానుండయి
యర్యమారుణ దేహుఁ డగుచుఁ జాల

గీ. వెలుఁగు ద్రుముఁ డనునామంబు గలుగురాజు
రెండవ విషద్రుమంబు పోలిక నలరుచు
జనులు భీతిల్లఁ దత్సభాసదన మందుఁ
జూడఁ బడుచుఁ జరించెఁ బ్రస్ఫురణలీల 266

గీ. తగ ననిర్వాణవైరాగ్ని యగుట మిగుల
నంతరార్ద్రిత విడిచి కోపానిలమున
విహతమై పొగలొందిన వేణుధారి
చే జ్వలితమయ్యె వృషంబు చేతఁ బోలె 267

గీ. ఉత్తరముఁ జెప్ప నోరెత్త నుత్తమౌజు
రాహువదన కరాళమై క్రాలు ముఖము
ఁ దృఢోద్ఘన దంతమై తక్షణంబ
గ్రస్తశశధర మైనట్లు గానవయ్యె 268

వ. మఱియు స్వభావకోపనుం డగుటం జేసి ముఖరాగాది చిహ్నంబులచేత నిరంతరంబు కుపితుండైన వానిరూపంబు పగిదిఁ జూపట్టు రూపంబుచేతఁ బరిపంథిలోచన భీషణుండైన దంతవక్త్రుని యత్యుచ్చాట్టహాసంబు వజ్రాహతశైలతటధ్వని భంగిఁ గ్రుద్ధుండైన వానిఁగా సూచింపంజేసె నతిరౌద్రంబైన క్రోధం బాకస్మికంబుగా రయంబునం జనుదెంచి రాజమండలం బాశ్రయించె మఱియు రుక్మి యనువాని హృదయంబునందు రుక్మిణీహరణకాలంబునం జనియించిన సంతాపవహ్ని భీష్మవాక్యశ్రవణంబున నభివృద్ధినొంది యధికంబుగాఁ బ్రజ్వలించె సుబలుం డనురాజు శిథిలీకృతమహామహీధరబంధనయుఁ గీరంబునందు భూకంపంబు వలనఁ జలితజలరాశిసలిలయు నత్యంత భారంబువలన నమ్రీకృతఫణిఫణామండలయు నైనభూమిని గోపావేశంబునఁ జరణతాడనంబుఁ గావించెఁ జక్రపాణిపూజనంబుచేత రాజులు కుపితులగుచుండ నాహుకి యనురాజు యుద్ధలాభంబు గలిగెఁగదా యని మానంబున మిక్కిలిసంతోషంబునొందెఁ గాలయవనుని వదనంబు జగంబు మ్రింగ నప్పళించినట్లు వివృతంబగుటవలన నతి వికృతంబై యతికోపంబునఁ బ్రతిబద్ధవచనంబై యతిరౌద్రంబై యొప్పె సమస్త రాజుల వధించుటకుఁ బ్రసారితంబైన దీర్ఘబాహువు పరిఘంబుచేత సత్వరంబుగాఁ బదచలనంబు గావించు వసునామ రాజుచేత నుత్థానవేగంబువలన దుర్నిమిత్తసూచకంబుగా స్వకీయాంబరంబు స్ఖలితంబయ్యె 289

సీ. అప్పు డిప్పగిది ఘోరాకార రాజమం
డలము కందర్ప సైన్యంబు పగిది
నవికృతచిత్తుఁడౌ హరి బోధిసత్వుని
యగ్రభాగంబున నతిభయంక
రత్వంబుఁ బ్రాపించె రమణ నసభ్యస్త
సాధ్వసు లగుటచే సంగరార్థు
లైన సభాస్థిత మానవనాథులు
శిశుపాలు నకుఁ బ్రీతి సేయఁబూని

గీ. కనకమయచారు కోటీర ఘటితరమ్య
సాంద్రమణిరత్న కిరణ సంచలితభిత్తి
కలిత నూతన స్ఫటికోరు కాంతులగుచు
నొండొరులఁ బిల్చుకొని లేచి రుగ్రులగుచు 270

గీ. స్ఫురితలోచన సుమచలాధర దళములు
కంపిత భుజాగ్రశాఖలు గలుగునట్లు
చలిత రోచులచేతఁ దత్సవన మప్పుడు
మారుతోద్ధూత వన విభ్రమంబునొందె 271

గీ. భూరిగర్వావధీరిత భువనులైన
చైద్యపక్షావనీంద్రులు శౌరిఁ దృణము
గాఁగ నెంచిరి ధర్మజు గణనసేయ
రైరి వీడిరి భీష్మభయంబు మదిని 272

గీ. అంతఁ జేదిపుఁ డహి భంగి నధికపూత్కృ
తంబు సేయుచు లోకసంతాప సహిత
గాత్రుఁడై కీర్ణదంతాగ్ని కణము లురుల
బటువిప్రాయ వాక్యంబుఁ బలికె నపుడు 273

గీ. కుంతినందను లేవురు కుండకులును
వృద్ధరాజ కన్యక యీసరిత్సుతుండు
పసులగాపరి శౌరి యీపంద లిప్పుడు
భూరమణులార! వధ్యులు గారె? మనకు 274

క. బవరంబున నాయొక్కని
సవిధంబున నిల్వలేఁడు స్వల్పుఁడు కార్యం
బవధీరిత సురులగు మీ
రవనిం దోడ్పడిన నెంత హాలి యన మనకున్ 275

గీ. భీష్ము పార్థు లీసభ యందుఁ బెద్దఁ జేసి
పలికి రీకృష్ణు నితనితో బంధురగతి
సమర మొనరించిచూతము సాధ్వసాధు
భావ మది తెల్లమగు వేయు పలుకులేల ? 276

క. తడయక నాతో ననిఁ
గడఁగిన కృష్ణుని శరీర గతరక్తము బ
ల్విడి మదిషుపీతశేషము
నుడుగక ధర గోలు విహగ యుతముగఁ గాంతున్ 277

క. అనియిటు చైద్యుఁడు పరుషవ
చనముఁ బలికి పాండుసుతులు సాంత్వోక్తుల నెం
త నివారించిన నిలువక
చనియెన్ నిజశిబిరమునకు సరభసమలరన్ 278

వ. అప్పుడు స్వభావదాక్షిణ్యసంపన్నులును క్షమాశీల మహితమానసులునగు పాండునందనులు మహాసభ్యాపకారి యగుటం జేసి సద్యోవధ్యుండైనను క్షమచేతను దాక్షిణ్యంబుచేతను మాతృబంధుత్వంబుచేతను యాగార్థ మాగతుండగుటచేతను గృపచేతను శిశుపాలునియందుఁ గోపింపకుండిరంతఁ జైద్యనిర్యాణానంతరంబ చైద్యపక్షరాజకుమారులందఱు యుధిష్ఠిరదేవయజనంబుననుండి యప్రతిహత మనోరథుండై చనుచున్న దమఘోషజుని వెనుకొని యశ్వమేధీయాశ్వంబు వెనుకొని చను తద్రక్షక రాజపుత్రులుం బోలె నతిరయంబునం జనిరి. 279

క. జవనాశ్వంబులచేఁ జై
ద్యవిభుఁడు రథ్యాంతరముల నటు దాఁటిచనన్
దవిలి కనుంగొన వచ్చిన
యువతుల కోర్కులు సఫల మొందక యుండెన్ 280

## • సేనాసన్నాహము •

గీ. జనసమూహంబు గుమిగూడి సరణి యందుఁ
గలసి గుసగుసలాడుచుఁ గాంచు చుండఁ
జేదిపతి వేగ శిబిరంబుఁ జేరఁబోయి
బలము సన్నద్ధముగఁ జేసె బవరమునకు 281

గీ. అపుడు శాంఖికసస్యదాస్యానిలప్ర
పూరితంబయి గిరితట మూర్ఛిత ప్ర
తిస్వనంబయి తదోత్థ తీవ్ర శంఖ
నిస్వనం బది వినవచ్చె నిబిడమగుచు 282

వ. మఱియుఁ గల్పాంత కాల పవన ప్రేరిత సంవర్తకాది మహాజలధర దారుణ నినాదంబును గంభీర నిజ రవాంతర్గత గురు ప్రతిశబ్దాంతరం బగు చైద్యుని సాంగ్రామిక దుందుభిధ్వని సెలంగె దుందుభితాడ నానంతరంబున ససంభ్రమ విలోల సకల జన సమూహ సమాకులంబైన పరితశ్చంచల జ్యోతిశ్చక్రంబైన నభస్స్థలంబునకు సాదృశ్యంబు నొందె 283

గీ. దృఢతనుత్రాణధారులై తేజరిల్లు
నృపవరులు ధూమపటల పరీత మగుట
నతిభయంకరమైన మహాద్రిసామ్య
మొంది చూపట్టి రపుడు రణోత్సవమున 284

గీ. మఱియొక నృపుండు పరిమూఢ పరిజనంబు
చేత నాలస్యముగ సమానీతమైన
వర్మము విలంబ రోషంబు వలసఁ గరయు
గమున నప్పుడు చూర్ణంబుగా నొనర్చె 285

గీ. సమరలాభజనిత సంభ్రమునై నకో
లాహలాకులిత మహోత్సవోరు

హస్తియందు యంత లతిప్రయాసముగఁబ
ల్యాణ మెత్తి పెట్టి రతిభరమున 286

గీ. ధౌతముఖగత హేమమండనములందు
విలస దినమండలము లౌట వెలికిఁబర్వి
నట్టి దర్పంబు గలవానియట్ల నలరు
నతను దేహాశ్వములు ధాత్రినావరించె 287

గీ. చక్రమండలోత్థ చటులపరాగాభ్ర
వలయ మధ్యవర్తి వర రథములు
సాంద్ర ఘోష భీత జంతువుల్ గలుగున
ట్లశనుల క్రియఁ బఱచె నతిరయమున 288

గీ సంభృతోరశ్ఛదం బౌట శశకలాంఛి
తేందు రుచి యగుదేహంబు నొందినట్టి
రాజులు యథార్థసంసిద్ధి రహిత మధువుఁ
ద్రావి రుత్సాహ వర్ధనార్థము సతతులు 289

• భావ్యశుభసూచితములు •

మ. కమలాక్షీమణి భర్తకాసవ మొసంగన్ సాసవంబైన కాం
స్యమయాంచ చ్చషకంబు నెత్తి వసమించ న్వాసనార్థంబు సం
భ్రమతన్నించిన పద్మగ్రంధము గ్రహింప న్వ్రాలు భృంగౌఘభా
రమునన్ గ్రక్కున నేలవై చెఁగరముల్ గంపంబు నొందన్ రహిన్

చ. అసదృశశోకబాష్పమలినాంబకయై యొక కోమలాంగి త్య
క్తసరకయయ్యె శీఘ్రమునఁ దద్గుణమైన శరీరసాద మ
ట్ల సకలవాక్యవైభవము నచ్ఛకపోలము అందు దట్టమై
యొనఁగిన రక్తిమంబును వహించె విభుం డనికిం గడంగినన్ 291

చ. అని యొనరింపఁగాఁ జనెన మంచు యువుల్ పలుకన్ దదంగనల్
ఘనతరశోకవార్భిహిత కంఠనిరుద్ధ సమగ్రభాషలై
చనుఁడను వాక్యముల్ పలుకఁజాలక సాంద్ర శుగశ్రుపూర్ణలో
చనములచేత నుత్తర మొసంగిరి భావ్యశుభంబుఁ దెల్పుచున్

చ. కలనికిఁబోవుచోఁ బతులు గాఢవిశాల మహీధరోల్లస
త్ఫలక సమానవక్షముల బంధురపీనపయోధరావళితో
జ్వలవరవారవాణములు బ్రద్దలువారఁగ నాత్మపత్నులన్
వలనుగఁ గౌఁగిటం గదియఁబట్టిరి కన్నుల నీరునింపఁగన్ 293

చ. విలసనశీలరైన యొకపీనపయోధర శోక మాత్మలోఁ
గలిగియు యానవేళ నిజకాంతజయైషిణిగానఁ గన్నులన్
వెలువడు బాష్పతోయములు నించకయుండెను గాని పోరమే
ల్దలఁగఁగ జాఱి కంకణ మిలం బడు టాత్మ నెఱుంగ దెంతయున్

చ. పోవఁగ నవోఢయొర్తు పతి పోరికి నేగెద నంచుఁ బల్కినన్
వస మఱి పోఁడురమ్మనుచుఁ బల్కఁగ నేరక యూరకుండి బల్
వ్యసనముచేత వల్లభుని పాదముపై నిగళంబుబోలె సు
ల్లసిత వినీలపంకజదళచ్ఛవి నేత్రమునించె నత్తరిన్ 295

చ. అవశకునాతిభీతిమెయి నంబిక పల్కిన తర్జనోక్తులం
దవిలి వివృద్ధమన్యుఁడయి తప్పక బాలకుఁ "డెందుఁ బోయె దీ
వవిరళ భంగిఁ? దాత!" యనియాడఁదదస్ఫుటవాక్యమెంతయున్
దవశిఖ మాడ్కి నజ్జనక ధైర్యము నీఱుగఁ జేసె నత్తఱిన్

సీ. మఱియొకసతి శర సురలోక గత కాము
నుల సురత సుఖంబుఁదలఁచి తిప్ప
డయ్యప్సర స్సరశానంద మది సేఁడె
యబ్బినట్లుగ నవ్వె ఁడనుచు నీర్ష్య

చేఁబల్కె; మఱియొక్క చేడియ ప్రాణేశుఁ
డనికిఁ బోవుచునుండ నశ్రుజలము
ధవునకుఁగీడని ధార్యమాణంబయ్యు
నెగడు దుఃఖంబున నిలువలేక

గీ. మోచనముఁ జేసె నకపటబుద్ధులైన
కాంతలకు సంవరణమె యుక్తంబు వెలఁది
చెక్కులను డిగ్గ నంజనసిక్తబాష్ప
ధార శోకాగ్ని వదవి చందాన నొప్పె 297

చ. బిఱబిఱఁ గొన్నిపాదములు వెట్టి ప్రియుం డతిశోకసాదమా
తరుణి విలంబిహస్తమునఁ దప్పక జాఱెడు కంకణంబులుం
దఱుచుగఁ దత్ప్రకోష్ఠములు దాఁకఁగ జాఱిన తన్నినాదమున్
గర మది తుమ్మటంచు క్షణకాలము పోవకనిల్చె సత్తజిన్ 298

సీ. వల్లభతముఁడైనవానిముంగల గాత్ర
పాదంబు వలన విస్రస్తనిర్గ
లాయతాంశుకయయి యవని నభంబున
నతిరభసంబుగా నరుగు నొక్క
రమణి మహోల్కతో సమముగాఁ జూపట్టె
జననాథ నికరంబు జన్యమునకు
నరుగంగఁ దత్సహామరణోద్యతైకమా
నసయయి మిగులదైన్యంబునొంది

గీ. యున్న పరిజన స్రవితబాష్పోదమయ్యు
నోజ నిశ్చలస్వాంత భటీజనంబు
చిత్తమునఁ గాతరత్వంబుఁ జెందకుండె
నవని మర్తుకాములకు భయంబుగలదె? 299

వ. మఱియు నొక్కయువతి బతిదర్శనంబు మఱలం గలుగుట యతి దుర్లభంబని యెఱింగి యత్యుత్తచిత్తయగుచు రణంబునకు జను విభుండు దృష్టిపథం బతిక్రమించు నందాఁక విలోకింపుచుండె మఱియొక్క యంగన యిప్పుడె యతఁతుండవై సంగ్రామం బుననుండి చనుదెమ్మని స్నేహాయుక్తంబుగా భర్త నుద్దేశించి జేసినయాశీర్వాదం బప్పుడె విగళద్బాష్పమైనయవ్వనిత యశ్రు పూర్ణ నేత్రద్వయంబుచేతఁ బ్రత్యాఖ్యాతంబయ్యె నొక్కవనిత రజఃకీర్ణయై భిన్నవక్త్రేందులక్ష్మియై దివంబు ననుకరించె మఱి కొందఱు యువతులు దిశలుంబోలె వీతశోభలై యుద్భ్రాంత సత్త్వలై యంతర్దాహంబు ధరించిరి మఱియుఁ గొందఱంగనలు వాతసమూహంబులుంబోలెఁ బ్రతిదిశయందుఁ బరిభ్రమించిరి మఱియుఁ గొందఱు వరాంగనలు భూమియుంబోలెఁ గంపంబు నొంది రిట్లు మహీపతుల సంగ్రామ ప్రయాణంబునందుఁ గాంతలు భావికాలాశుభంబు పూర్వంబుననె సూచింపం జేసిరి* 300

• ఆశ్వాసాంతము •

మ. క్షితికన్యాగిరిజాశచీ సదృశ లక్ష్మీనర్సమాంబాసమ
న్నతగర్భోజలశుక్తిమౌక్తికమణీ ! నానావనీపాల సం
స్తుతచారిత్ర ! మహాప్రబంధకథికాస్తోకప్రభా వోదయా !
శతమన్యుప్రతిమానశౌర్య ! విలసత్సౌందర్యపంచాంబకా !

క. బలవైరిగర్వ భంజన !
లలనాజనచిత్తచోర ! లక్ష్మీరమణా !
జలజాతపత్రలోచన !
కలియుగగోపాలకృష్ణ ! కంసవిదారి ! 302

---

* మూలమునందు 15వ సర్గ సమాప్తము.

వంశస్థవృత్తము
సదానతారాతి ప్రసాదదాయకా!
సదావతోయార్ద్రిలసచ్ఛయాంబుజా!
విదగ్ధకాంతాజన వీక్షణ స్పృహా!
ప్రదాంగసౌందర్యవిభామనోహరా! 303

(గద్య)

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధ విద్యాసాంద్ర
గోపినాథ వేంకటకవీంద్ర ప్రణీతంబైన
శిశుపాలవధ మహాకావ్యంబునందు
తృతీయాశ్వాసము
సంపూర్ణము.
శ్రీకృష్ణ

శ్రీరస్తు

# శిశుపాలవధ మహాకావ్యము

## చతుర్థాశ్వాసము

క. శ్రీరుక్మిణీశ చరణాం
భోరుహపూజావిధేయ ! భూరిగుణాలం
కారరసకావ్యనాటక
సారవిశారద ! సమస్తజననుతచరితా ! 1

### చైద్యుని దూత దురాలాపములు

వ. అవధరింపు మవ్వలికథ యెట్లనిన ని త్తెఱంగున వసుమతీ పరివృఢు లందఱు సేనాసన్నాహంబు గావించిన యనంతరంబ దమఘోష నందనుండైన శిశుపాలునిచేతఁ బ్రస్థాపితుండై సమయ సముచితోత్తర స్ఫురణ శక్తిమంతుండైన యొక్కదూత సభాస్థలంబున నాసీనుండైన హరియొద్దకుం జనుదెంచి ప్రియాప్రియ రూపార్థాభిధాయకంబైన వాక్యంబున నిట్లనియె. 2

చ. అరుదుగ మున్ను నీ వచట నర్ష్మ పరిగ్రహణంబు సేయ స
త్తఱి శిశుపాలుఁ డెంతయును దాదృశవిప్రియముల్ వచించి క్ర
మ్మర ననుతాపముం గలిగి మానుగఁ దా నరుదెంచి రోషసం
భరితుని నిన్ను శాంతుఁడయి మన్నన సేయఁదలంచె నెమ్మదిన్ 3

చ. స్థిరమతినున్నవస్కుఁడగు చేదిమహీశుఁడు సత్వరంబుగా
నఱమఱఁబోవఁ బెట్టి ప్రచురాధిగతాంగసుఖుండవైన నిన్
జిరవిపులోరువిగ్రహముచేఁ దగనిర్దయ పీడనంబు దా
నురువడిఁ జేసి సమ్మదము నొందును గాక నితాంత మచ్యుతా !

చ. వలనుగఁ జేది భూపతి భవత్పరవంతుఁడు గాన నిప్పుడే
తలఁగక సర్వభూపతియుతంబుగ వచ్చి శిరంబుచేత సొం
పలరఁ బ్రణామమునున్ సలిపి యచ్చుగఁ దావక శాసనంబు దాఁ
దలధరియించి చేయునిది తథ్యము వేఱె విచార మేటికిన్ ? 5

సీ. సన్నియతస్వాంతక శక్త కర్ముఁడ వధి
కృక్రపతంగతేజుఁడవు సర్వ
రాజవిధేయవర్తనుఁడవు నగునీకుఁ
బార్థివు లెవ్వరు ప్రణతి సేయ
రధికసాధ్వసరహితాత్ముండవగుచుఁ బౌ
రాళిభూత జనత నంచితముగ
నవలంబనముఁ జేసి నందున నరులతో
నట్ల సమానుండ వైన నీదు

గీ. ఘనగుణంబుల గణ్యత్వమును ధరింపు
చున్నయవి కృష్ణ ! యనుచు ని ట్లొప్పిదములు
గాని యప్రియగర్భంబులైన ప్రియవ
చనములు వచించి మరల ని ట్లనుచుఁబలికె 6

వ. యదువరా ! సాధ్వసుండ వనపత్రపుండవు నతిమాత్రోజ్జితభ
యుండవు ననాస్తికుండవు వినయోపహితుండవు నవిస్మయుం
డవు గావునఁ ద్వత్సదృశమహాగుణవంతుం డెక్కడ లేఁడు కృత
గోపవధూరతివి వృషఘ్నుండవు విగతపాపుండవు నగు నీదు
భయంకర నరకప్రవృత్తి యిప్పుడు జనంబు చేత మిక్కిలిఁ బ్రక
టింపంబడియె సానుచరుండవుగా మహీభృద్విహితాపచితివియు
బలంబులచేత ద్విషత్సమాహితసాధ్వసుండవునయి మహామహీ
భృదుపరిప్రదేశంబున నుండుము. నీ నగరంబు నందలి వీధులు
ఘనజాలనిభవనజ మృగాదినాగకదంబకంబులచేతఁ బరికీర్ణంబులై
దురాసదంబులు గాఁగలవు విహితచేతస్కుండవైన నీశత్రుండు

సకలాపిహితనిజ పౌరుషుండును నియత వ్యాపదవర్ధితోదయుం డును సతతవ్యాధియు ననీతియు నగుంగాక. యదుపుంగవా! శిశుపాలునిచేత ఘటనొందిన భవత్స బంధి వికచోత్పల చారు లోచనంబునగు ననుర నవాసవంబు నీ యందలి బంధు సౌహార్ద్యంబు వలన ద్రావంబడుగాక శిశునంబు వలన నుపాగతుండై చైద్యుని పురశ్చరితానక దుందుభివి సబలుండవు ససారణుండవు నగదుండవు నైన నీవు సమితియందు సంభావించుట కర్హుండ వగుదువు. రణంబులయందు శత్రునిషూదనుండై శిశుపాలుని తోడంగూడి చిరకాలంబు సహానర్వసాత్వతుండవై నిశ్శస్త్రవిలాసినీ జనుండవు గమ్ము. ఈ శిశుపాలుండు మైత్రి సంబంధంబు వలన విజితక్రోధుండవు మహామహీభృద్వరులచేత పూజితుండ వసకృజ్జితసంయతుండవు సప్రమదుండ వైననిన్నుం బురోభాగంబున ముదితుండై విలోకించుగాక యని యివ్విధంబునంబలికి యూరకున్న శిశుపాలునిదూత నవలోకించి చక్రపాణిచేతభ్రూ సంజ్ఞాప్రేరితుండై కృష్ణానుజుండగు సాత్యకి యిట్లనియె.

### సాత్యకి సమాధానము

సీ. ప్రణిధిశేఖర! నీవు బహుచతురుండవ
ప్రియగర్భమైనట్టిప్రియము మధుర
మగునట్లు పలికితి వదియె మాకిప్పుడు
ప్రియగర్భమైన యప్రియమునయ్యె
నరయ బాహ్యంబున కతికోమలంబును
నంతరంగందున కార్ధ్రిపద్మ
వృత్తకర్కశమయి వెలయు నీ వచనంబు
శాకపలాశదేశ్యత వహించె

గీ. వీనులకు నతిమృదులమై మానసమున
కధికపరుషసూచ మయి యలరు నీదు
వచన మది పింగళాదిక పక్షిరుతము
కరణి సన్మార్గగతుల కగ్రాహ్యమయ్యె 8

గీ. భూవిభుఁడు కృష్ణునకు నగ్రపూజఁ జేసె
నందు మత్సరమేల మీ యధివిభునకు?
మస్తకమున ససౌరభ మహితవృత్త
సుమము నర్పింప నెవ్వఁ డసూయ సేయు? 9

సీ. అల్పులమానసం బతితుచ్ఛమై యుండు
రయమునఁ దద్గతాప్రియము నుచ్చ
రింతు రంతర్గతాప్రియమును లోపల
నిడుకొని యధికులు వెడలనీరు
సతతంబు సుజనుండు సర్వజనోపకా
రపరుండనై యుండు విపుల నతని
యున్నతి ఖలులకు నురుతరవ్యాధోగ
కారిణియగు విచక్షణుఁడు పరుల

గీ. సంపద కసూయ పడఁడెందు సంతసించు
మధ్యముఁడు పరజనుల సంపద కసూయ
కల్గియును నోటఁ బుచ్చఁడు కపటి యగుచు
నధముఁ డప్పుడె వెలిఁబుచ్చు నాఁగలేక 10

క ఫలహీనవసతి సుమనః
కులపరివర్జిత నవార్యగురుసంతాపన్
ఖలతను ఖలతవలె మతి
గల బుధుఁ డవలంబనంబు గావించునొకో? 11

గీ. పరుషములు పల్కు చేదిభూపతికి శౌరి
యించుకేనియు నుత్తరం బీయకుండె
వనదనాదంబునకుఁ బ్రతిధ్వని యొనర్చుఁ
గాక హరి నక్కయుఱుపులఁ గలఁక పడునె? 12

క. మతిమంతులు జితరోషులు
మతిహీనులు రోషజితులు మఱి వారలకున్
సతతము సఖ్యము వైరము
క్షితిలో నెన్నఁటికి నైనఁ జెల్లునె ? తలపన్ 13

క. తరమెఱుఁగక ఖలుఁడార్యులఁ
బరుషోక్తులు బలుక గౌరవం బది చెడునే ?
ధరణిరజము పైనోఁకిన
గురురత్నంబునకు విలువ కొంచెం బగునే ? 14

గీ. పరుల కత్యంత మోదసంపాది గాని
గుణము గలవాఁడు తుచ్ఛుండు కోర్కెమీఱ
నన్యజనుల నిందింపుచు నాత్మజనుల
కెలమి సంతోష మొనఁగూర్పఁదలచుఁగాదె ? 15

చ. ఖలులు స్వకీయదోష మధికంబయినన్ సహజాంధలోచనుల్
తొలఁగక సూక్ష్మమైన పరదోషమునందు నుదీర్ణలోచనుల్
పలుమరు నాత్మసంస్తవ పరత్వమునందు గభీరభాషణుల్
సలువుగ నన్యసంస్తవ మొనర్చెడు నప్పుడు మౌనులెన్నఁగన్

గీ. ఆత్మ సుగుణంబులను బోలె ననవరతము
పరులదోషంబు లెవ్వియుఁ బలుక రార్యు
లాత్మయందె సంగోపన మాచరింతు
రల్పబుద్ధులు విపరీతు లగుదురెందు 17

ఉ. విక్రమవంతుఁడైన పృథివీపతి క్రూరవిషాహిభంగి ని
ర్వక్రత వైరిమీఁదఁ దఱివచ్చినయప్పుడు చూపు శౌర్యమున్
విక్రమహీనుఁడెప్పుడును వెంబరవిత్తునిమాడ్కి శౌర్యహీ
నాక్రమవాక్యముల్ సభలయం దఱచుం బటహాంబుచాడ్పునన్

గీ. అఖిలలోకైక విఖ్యాత మగుటచేతఁ
దనగుణంబును దాఁ జెప్పికొనఁడు సాధు
లన్యులెవ్వారెఱుంగని దగుటఁ జేసి
తనగుణంబును దాఁ జెప్పుకొను ఖలుఁడు 19

చ. సరసత సంధిసేయుటకొ జన్యమొనర్చుటకో యదూత్తమున్
ఒరువడిఁజూడఁగోరె శిశుపాలుఁ డటంచు వచించి తీవు సు
స్థిరముగ దాని కవ్విధము సేయుట యుత్తర మింక జాగువ
ల్గరుగము వచ్చినన్ పిదపఁ బ్రార్థితకార్యము చక్కనయ్యెడిన్

చ. చతురత మీ విభుండు దగ సంధియొనర్చుట నిక్కమేని సం
భృతమతి యుద్ధసన్నహన మేటికిఁ జేసె మహాత్మ! శౌరి ను
ద్ధతి వెలయింపఁ జేసె నొకొ తన్మహిమంబెఱుఁగండె? వ్యర్థ మీ
యతుల ప్రయాసమంతయు భయంపడునే హరి యింతమాత్రకున్

ఉ. పండితమానియైన శిశుపాలుఁడు శౌరిసమక్షమంబునన్
మెండుగ దుష్టవాక్యములు మిన్నక పల్కె శతాపరాధముల్
నిండినదాఁకఁ బైఁ దెగుట నీతియుఁగాదని యోర్చె నన్నియున్
నిండెఁ గొఱంతలేదిఁక ననిన్ వధియింపఁగలాఁడు చైద్యునిన్

గీ. విను మసర్గళగోపురాననుఁడ వీవు
పలికిన దురుక్తిసమయంబు గలయవచ్చు
నంతదాఁక రోషానలు నడ్డగించె
నింకఁ బలికిన దండ్యుండ వీవు నీచ! 23

గీ. శినిమనుమఁ డిట్లుపలుక నా చేదినాథ
వాక్యహరుఁ డతిదుష్ట తద్వచనము విని
త్యక్తసాధ్వసుఁడై నేర్పుదనర మరల
నిట్టు లనిపల్కె వినయంబు నెసఁగ మెసఁగ 24

• దూత పరుషోక్తులు •

ఆ.వె. బుద్ధి శూన్యుఁడైన పురుషుండు పరులచేఁ
చెప్పఁబడిన యంత సేయఁజాలఁ
డూహచేసి కొన్ని యుక్తులు గల్పించి
చెప్పె ననుట చాలఁజిత్ర మరయ 25

గీ. అరయ సువివేకి యాగామ్యు నర్థముల నె
ఱుంగుఁ దనయంతఁదానె పరుండు చెప్పఁ
దెలిసికొని విశ్వసించుఁ; దాఁ దెలియ లేఁడు
పరుఁడు చెప్పిన వినలేఁడు బాలిశుండు 26

వ. యదువరా! యే నిప్పుడు సంధియ గుణంబనియు విగ్రహంబనర్థంబనియు నెయ్యది పలికితి నవ్వచనంబు నీకును గుశలంబగు సుజనులు ప్రబలవిరోధంబువలన స్వవినాశహేతుభూత కార్యకరణోద్యుక్తులైన పగతులయందును హితోపదేశతత్పరులగుదురు నాచేత సముదీరితంబులైన యీ రెండుపక్షంబులలోన నీకు నెయ్యది శుభోదర్కంబగు దాని విభజించి కావింపుము సుజనస్వాభావ్యంబువలన సుభాషితంబైన హితోపదేశవచనంబు దురాగ్రహగ్రస్తచిత్తు లగువారియందు సూర్యానురక్తంబు లగు పద్మాకరంబులయందు జంద్రకిరణజాలంబులుంబోలె నిరర్థకంబగు మఱియు 27

సీ. పార్థివోత్తమ! శిశుపాలుని వర్జించి
భీమాగ్రజుఁడు నిన్ను బెద్దఁజేసి
పూజించెఁ గావునఁ బుడమిలో గుణదోష
ములు విమర్శింపక మూర్ఖ జనుఁడు
తన యిచ్చకొలఁదిఁ మిన్నక జేయు ననుమాట
కిదియె ప్రమాణమై యెసఁగుఁ గృష్ణ!
తలఁప నీపై భక్తి గల యమసుతునిచేఁ
జేదీశ్వరుండు పూజింపఁబడక

ఆ.వె. యున్న నేమి? యన్నరోత్తముండె గురుండు.
పరగ మాంసలుబ్ధహాగి విస్పష్ట
మత్తకరిశిరస్థమౌక్తికరత్నంబు
లోకపూజితంబు గాక యున్నె? 28

గీ. అమలుఁ డమలులనేఁ బూజ్యుఁడై వెలుంగు
మలిను లగు వారి నే నధఃకరితుఁడగును
శివుఁడు శిరమున ధరియించె దివిజనదిని
హరి పదంబునఁ దాల్చెఁ బ్రత్యక్ష మిదియ 29

గీ అజ్ఞపార్థ కృతార్ఘ ప్రహర్షితుండ
వైన నీకెట్లు గలుగు యోగ్యత? సహమునఁ
బ్లవగ సేవిత కాకఫలంబు లుష్ణ
తను వహింప వెన్నటికైన వనజనేత్ర! 30

వ. యాదవేంద్రా! నీవు శిశుపాలకృతాపరాధశతంబు సహించి యున్నవాఁడ వని శినివరుండు పలికె నది యొక్క ఘనంబుగాదు రుక్మిణీ హరణంబునందుఁ జైద్యుండు సమర్థుండయ్యె ననేక శతాపరాధతుల్యంబైన భవత్కృత మహాపరాధంబు సహించి యున్నవాఁడు రాజులకు రాక్షస వివాహంబు ధర్మంబగుచుండ నది యపరాధంబెట్లయ్యె నని యంటివేని

శ్లో. హత్వాచ్ఛిత్వాచ భిత్వాచ క్రోశంతీం రుదతీం తథా
ప్రసహ్య కన్యా హరణం రాక్షసో విధి రుచ్యతే॥

యను న్యాయంబునఁ గన్యాహరణంబు గావించిన నది రాక్షస వివాహంబనంబడు పితృమాతృ భ్రాత్రాదులచేత దత్తయగుటం జేసి స్వజనబంధుండైన శిశుపాలునకుఁ బత్నియైన రుక్మిణి నపహరించుటవలనఁ బరిత్యక్తధర్మార్థుండవై కేవల కామమాత్ర నిష్ఠుండవు పరదారాపహారకుండవు బంధుద్రోహివి రాజ

ద్రోహివై తి విధి పరమసాహసి త్వంబు నీ వజ్ఞాతరూపవిశేషుం డవు సర్వ గతుండవు పరభృతపక్షకాంతి వట్టి నీకుఁ దిమిరంబు నకుంబోలెఁ జైద్యుండు సూర్యుండ నుంబోలె వినాశకరుండగు నట్లుగాకుండ నేనైన సాంత్వవాక్యంబుల మహాక్షుభితుండైన శిశుపాలునకుఁ గోపోపశమనంబుఁ జేసి నీయం దనుగ్రహంబు గలుగునట్లు చేసెదనంటినేని వేల నతిక్రమించి వెల్లివిరిసివచ్చు సముద్రప్రవాహంబును జగత్కృత్స్న జలనిర్గమమార్గం బేమి సేయంగలదు యుద్ధం బు కొఱకు యాదవసహితంబుగా ని న్నాహ్వానంబు సేయుట కేను చైద్యునిచేఁ బ్రేషితుండనై వచ్చిన వాఁడ మహావీర్యులగు మహీపతులు పరులయందుఁ జాటచ్చరుల కరణిఁగపటంబుచేత నపకారంబుగావింప రమ్మహీపతి రణార్థియై మహానదీప్రవాహంబు భంగి వచ్చుచున్నవాఁడు నీవు తీరగత వృక్షవృత్తి నాశ్రయింపక వేతస వృత్తి నాశ్రయించి నిన్ను రక్షించుకొనుము 31

చ. పరువడిఁ జేదిభర్త శిశుపాలుఁ డతండు మఱుంగునొచ్చినన్
దరుణులఁ బ్రోచునే ? యని మనంబునఁజూడకు మమ్మహీసుధా
కరుఁడు దయాసముద్రుఁ డటుగావునఁ దన్ శరణంబునొందినన్
దరుణులఁ నైనఁబ్రోచు నతిధార్మికుఁ డాతని కెవ్వ రీడిలన్ 32

చ. చతురత స్వార్థలిప్సులగు శాత్రవులెక్కుడు వానికిన్ సము
చ్ఛ్రితగతి విప్రియంబు దగఁజేయక యుండరు శంకచేత న
ప్రతిమగుణాకరుండు శిశుపాలుఁ డుదారుఁడు గాన నీవు నం
చిత మతిభక్తితోఁ బ్రణతిఁజేసిన మాత్రనె ప్రోచు నత్కృపన్

చ. విను నవు డప్రియంబులయి మీసలునోఁకిన పల్కు లవ్వలన్
ఘనసుఖమిచ్చుఁ దా వినెడు కాలము నందు నతిప్రియంబులై
తనరినపల్కు లావెనుకఁ దద్దయుదుఃఖమొసంగు నాదు వా
క్యనిచయమట్టిదై యొసఁగుఁ గైకొనిచేయుము సంధి రాజుతోన్

గీ. అనృతవచనంబు ప్రియకరమైతనర్చు
సత్యవచన మప్రియము గు చాలఁదోఁచుఁ
గడఁగి యీరెండు పరిణామకాలమందు
గరళపీయూషసమము లై కానుపించు 35

సీ. అచ్యుత ! నీ వనేకారాతిహంతవై
నను జైద్యుఁడాజిలో నిను వధించు
నిక్కువం బిది సర్వనిబిడతమోధ్వంసి
యైన సూర్యుని రాహు వసెడుతమము
గ్రమింగెనో లేదొ చర్చింపుము జితమీన
కేతనుండును రాజకేశ మణియు
వృష్ణిభోజకనమస్కృతుఁడు సర్వజ్ఞుండు
నాహవతల నిర్జితాంధకుండు

గీ. నాత్తరాజర్షభుండు దుర్గాధి పతియు
మేరుసారశరాసుం డమేయ విష్ణు
సాయకుండయి కాలాగ్ని శంభులీలఁ
దనరు చైద్యునిఁగెలువ నీ తరమె ? కృష్ణ! 36

వ. మఱియుఁ జేదివిభుండు నిహతదుర్మదకుంజరుండును గ్రమసంపాదిత భూరియశుండు నగుహరివలన భయంబునొందఁడట్టి చైద్యునకు వృష్ణులెంతవారలు రణంబులందు శత్రువులు భయంబున నతని వదనంబు వీక్షింపంజాల రనుట యెంతయాశ్చర్యంబతండు భయంబునఁ బలాయమానులగు పగతుల శరీర పశ్చాద్భాగంబు విలోకించుఁగాని యొకానొకప్పుడైన వదనంబు విలోకింపఁడు శరదృతు నధిగమించి ఖండితేంద్ర చాపంబులై యత్యల్పస్ఫురితకాంతులైన మేఘంబులు శరవృష్టి శూన్యంబులగుటం జేసి యా శిశుపాలుని శత్రువులతోడ సామ్యంబునొందును మిక్కిలిఁ గర్కశంబును సమరార్థం బాకృష్టంబు నగుచు తణ

కాలం బాశంకిత భంగం బైన యెవ్వాని శత్రుకులంబు కార్ముకంబుతోఁ గూడ నమ్రత్వంబునొందు మఱియు ననేకవారంబులు సంగ్రామ రేణువులచేత మలినం బగుటంజేసి పరిపంథిజనాంగనాబాష్పంబులచేత క్షాళితం బై యనంతరం బై యెవ్వని చరణయుగళంబునకు నమస్కారంబు గావించు నట్టి రాజుల కిరీటగతమణికాంతివర్ణకంబులచేత విలేపనంబు గావింపంబడు మఱియుఁ గుహకు లైన యింద్రజాలికులచేత సంజనిత దృష్టివిపర్యయు లై యొక్కటియైన రజ్వాదికంబును గొందఱు పుష్పమాలికనుగాఁ గొందఱు సర్పంబునుగా నెట్లు గనుఁగొందు రట్ల నా చైద్యుని సుహృజ్జనంబులు పరమాహ్లాదకత్వంబునఁ దుహినాంశునిఁగాఁ గొందఱు విరోధులు తాపకరత్వంబువలనఁ దపనునిఁగాఁ దలంతురు మఱియును 37

గీ. తొడరి యెవ్వానిఁ బగతురు దుర్లభత్వ
యంబుఁ బ్రాపించి మఱియు నేకాంతరతము
నగు నమానుషాంగము దాల్చి యవని నడుగుఁ
బెట్టక సురాధు లై యింద్రు పెంపుతోడ 38

సీ. పరగ నత్యాశ్చర్య కరపౌరుషుం డైన
చైద్యున కెవ్వాఁడు జగతివైరి
నృపుఁడు లేఁ డత్యక్త నీతిమార్గుం డైన
యతఁ డెన్నఁ డరులచే నాహవమునఁ
గడుపరాభవ మెఱుంగని శత్రురాజుల
నాశంబు నొందించె నయ మెలర్పఁ
బ్రచలితోర్ధ్వగతోరు బహుకబంధంబు లు
జ్జ్వల మకరవ్యూహ సన్నిరుద్ధ

గీ. పదవు లై నట్టి విలసదపారఘోర
భూరిసంగ్రామ సాగరంబులు తరించె

భీషణోదగ్ర నిజభుజ వీర్యగాధ
తరణిచేఁ జెక్కుమారు లాధరణివిభుఁడు 39

చ. కర మరుదార నే నృపతి గర్వితుఁడై తన యుత్తమాంగ మా
నరపతి పాదపీఠమున నమ్రతఁజేర్పకయున్న సత్కృపా
పరుఁడటుగాన నేరమును భావమునం దలపోయ కత్తటిం
బరువడి నాత్మపాదమిడు వాని శిరంబున గర్వహీనుఁడై 40

గీ. పరగఁ జైద్యుండు చతురంగ బలము విడిచి
యురుభుజద్వయ కేవలాయుధుఁడునయి పు
రందరుని దంతితోఁ జతుర్దంత యుద్ధ
మర్థిఁ గావించె నతని కీ డగుదె ? నీవు 41

సీ. పొసఁగ విచారిత భూరి చక్రత్వంబు
చెలువొప్ప శ్రీ సమాశ్లేషణంబు
చైద్యునకును నీకు సరియగు నీరెండు
నైన భేదం బించుకంత కలదు
ఇంద్రశత్రు డతండు నింద్రానుజుండ వీ
విదియ భేదంబు మీ కిరువురకును
జేదిపుతో సాటిఁజెప్ప నెట్లగు విష్ణు
శివు నైన సాటి జెప్పంగ రాదు

గీ. భూమిధరుఁడును సదహీనభోగయుతుఁ డ
నేకరిపు పుర విధ్వంసుఁ డీశుఁ డితఁడు
నైన శశికళ గోరు నయ్యుభవుఁ డితఁడు
పూర్ణచంద్రాభుఁడై పొల్చుఁ బుడమియందు 42

సీ. మఱియు నా చేదిభూవరుఁడు వర్షాకాల
తటిని పూరము తటతరులతోడఁ
బోలె నమ్రములుగాని భూమీశ్వరులతోడఁ
గేళి సల్పుచునుండు లీలతోడ

మధ్య రంధ్రమునొచ్చి మండలభేదంబు
గావించి దళములు గాసివఱిచి
మూలంబులెల్ల నున్మూలించి భూ్యవసా
రిత భుజశాఖలు వ్రేలునట్లు

గీ. బలము చేఁ దలక్రిందుగాఁ బడఁగఁద్రోచి
వేగ నమ్రత నొందిన వేతసాది
శముల వృద్ధి నొందించుచుఁ గ్రమత నిట్లు
క్రీడగావించు సతతంబు ప్రీతితోడ 43

వ. మఱియు శిశుపాలుని విపక్షావరోధ స్త్రీ లధిరూఢ నితంబభూము లును గురూపల పంక్తిశాలినులును నిరుద్ధ నిరంతరాంబరలు ననంత్యక్త మేఖలలును నవముక్తాఫలభూషణ చారుభుజోపలక్షిత కటకలును విశాలగండతలచిత్రకనియతాభియోగ ధారిణులునునై తొల్లి గృహంబు లందుంబోలె నాపత్కాలంబులందును బర్వతో పరిభాగంబులందు సమస్తంబు నిప్పటికి ననుభవింపుచున్నవారు

గీ. ఘనతమీఱంగఁ గుకురాంధకద్రుమముల
నెగడు దవశిఖ చందాన నీఱుఁజేసి
యును మహీనాథవర్యుఁ డీయుర్వి నిపు డ
కృష్ణఁగావింపఁదలకొనె నిచ్చ నహహ ! 45

గీ. అరయఁ బ్రమితాక్షరంబు నయ్యు నఖిలవిషయ
మధిగమించి ప్రతిష్ఠిత యగుచు గరిమఁ
దాలిచి తదాజ్ఞ పరిభాషలీల నొందు
మిగుల బాధింపబడకుండు జగతియందు 46

వ. తొల్లి పురాణపురుషుండు ధృతవరాహశరీరుండై హిరణ్యాక్షాది రాక్షస దంష్ట్రోత్క్షిప్తయైన యీధరిత్రిని ముహూర్తమాత్రంబు ధరించె నిప్పుడు సంప్రాప్తపక్షవిపక్షుండైన యీరాజుచేతం సవి

కృతరూపంబున విపత్తులచేత ననుపధృతయైన యీధరిత్రిని చిర కాలంబుననుండి ధరించి యున్న వాఁడీయిరువురలోన నధికుం డెవ్వండో విచారింపుము మఱియు నమ్మహారాజగుణతరంగంబులును సముద్రతరంగంబులును రెండు ననంతంబులై మిక్కిలిఁదుంగత్వంబు ధరించియుండు నైనను సముద్రమహోర్మ్ములు తీరంబు ప్రాపించి నశించు నారాజగుణమహోర్మ్ములు పారంబునొందియు నశింపకుండు నట్లగుటంజేసి సముద్రమహోర్మ్ములకంటె నారాజ గుణమహోర్మ్ము లాధిక్యంబు నొంది యుండు 47

సీ. యాదవనాథ! లోకాలోకరుద్ధ వి
హారమౌట నదృష్టమైన దుస్స
హార్కతేజంబు లోకాగ్రమం దుచ్చావ
నీభృత్తులను దాఁట నేరదయ్యెఁ
జేదీశు తేజోవిశేషం బుపశల్యజ
నాగ్రమం దతిదృష్టమై సమస్త
భూభృత్తులందు సంపూర్ణమై వ్యాపించె
హరికన్న నతఁడెక్కుడగునొ కాఁడొ

గీ. యతని పరిపంథియువతులు గతపటీర
యావకాంజనమేఖలాహార తనువ
రాధరాశినితంబకుచాఢ్య లగుట
వలన నిత్య విభూషలై యలరు చంద్రు 49

చ. అతులితశౌర్యశాలి యగు వాశిశుపాలుఁడు పోరిలోన నిన్
జతురతఁ జంపి రోదనమొనర్చు భవత్సతి బాల పుత్రులన్
సతతము వైరమున్ విడిచి సత్కృపఁ శాలన మ్డ్రిఁ జేయుచున్
క్షితి తల మందు సార్థముగఁ జేయును బో శిశుపాలనామమున్ *

* మూలమున 16 వ సర్గ సమాప్తము

• యాదవసంక్షోభము •

చ. అలయక నిట్లు వాగ్మియగు నా శిశుపాలుని దూత దిట్టయై
బలసి యుగక్షయ క్షుభిత వాతమహత్తర మైన వాక్యమున్
బలికినఁ దత్సదంబు తదపాంనిధి సన్నిభమై రహిన్ మహా
ప్రళయ సముద్యతంబగుచు బంధురకోపముఁ బూనె నత్తఱిన్

ఉ. అనుపమ రాగయుక్తయు ప్రసుతాంచితఘర్మయు సత్కరాహతి
స్వనితపృథూరుపీఠయును సంతత దంత విదంశి తోష్ఠయై
తనరెడు సాంద్రరుడ్వనిత తప్పక నప్పుడు సర్వరాజులన్
మునుకొని యావరించెఁ గడుమోదమునన్ ప్రియురాలివైఖరిన్

ఉ. సారకరోదరప్రహత సాంద్రమహాభుజుఁడౌట భగ్నకే
యూరుఁడు నైన కృష్ణునిసహోదరుఁడౌ గదు నందు నుత్పత
చ్చారుతరాబ్జ రాగవిలసచ్ఛకలంబుల చేతఁ జూడ్కి కిం
పారఁగఁ దోఁచెఁ గోపశిఖ యగ్నికణాన్వితమైన చాడ్పునన్

మ. బలరాముండు సముల్లసద్ఘళన ఘుంభద్దీధితుల్ పర్వఁగాఁ
బొలుపారంగ నవజ్ఞచేత హాసనంబుం జేసి తత్కాంతిచే
వలనొప్పన్ ఘనకోపరక్తతనువున్ బాగొప్పఁదా వెండి యు
జ్జ్వలతన్ శుభ్రము సేయుచుం దనరెఁ దత్సౌధంబు గంపింపఁగన్

వ. మఱియు నుల్ముకుండను రాజు సముత్పతత్పృథుతర ముక్తాకలాపంబు గల్గునట్లుగా గిఱుక్కున దూత కభిముఖంబుగాఁ దిరిగినఁ దద్వివర్తనంబువలన జగంబంతయు బహుశిలాతలకఠినస్కంధ ఘట్టనంబువలన భ్రమితంబైనదానియట్లఁ జూడంబడియె నత్యంత కుపితుండైన యుధాజిత్తను నృపతి వదన సరోజంబు నిశ్వాసమారుతాహతుల చేతఁ బ్రకటోష్ఠ్యంబైన సూక్ష్మపటాంచల మారుతంబుల చేత నతిశీఘ్రమువీజ్యమానంబయ్యును వెండియు మిక్కిలి స్వేదోదకంబు స్రవింపుచుండె మఱియు శత్రు

వధార్థంబు సముద్యతుండైన వాఁడగుటంజేసి యత్యంతక్రోధుం
డును నప్రతీకారుండునైన నిషధాఖ్యుండగు మహీపతిని దక్షా
ధ్వర ధ్వంసనార్థం బావిర్భూతంబైన యనౌషధ తీవ్ర రుద్ర
సంబంధి వీరభద్రరూప మహోజ్వరంబునుంబోలె జనంబు విలోకింపు
చుండె మఱియు సుధన్వుండనురా జత్యంతకోపంబునఁ బరస్పర
పీడితకరద్వయుండై పరిపిష్టకాంగుళీయక సువర్ణ చూర్ణంబుచేతఁ
బంకిలం బైన దానియట్ల కరద్వయజన్యనిరంతరవిస్రావస్వేదోద
కంబులచేత క్షాళితంబయ్యె మఱియు నాహుకియనురాజు ప్రసారి
తాగ్ని జ్వాలోజ్జ్వలనఖప్రభలచేతఁ గృతపరిధిశోభ యగుటంజేసి
పరిభ్రమత్పావకాలాత సంస్థానమైన తర్జనిని జగంబంతయు
దహించుటకుంబోలెఁ బరిభ్రమణంబు నొందించె మఱియుఁ
బ్రద్యుమ్నావతారుండైన కాముండు దురంత కోపరసదుర్నిరీ
క్ష్యుండగుటంజేసి హరుండును బూర్వజన్మంబునం దభ్యస్త
దహన సాహసంబైన తృతీయ నేత్రంబున నప్పుడా ప్రద్యుమ్నుని
విలోకింప శక్తుండు గాఁడయ్యె మఱియును 54

సీ. పృథుఁ డనుభూపతి ప్రథనంబు కాంక్షించు
వాఁడౌట నది డాయవచ్చె ననుచుఁ
గడుసంతసంబునఁ గఠినకర్కశ సతీ
స్తనతలప్రముషిత చందనంబు
గల నిజవక్షంబు కరతలతాడనం
బొనరించె నక్రూరుఁ డనఘుఁ డయ్యు
నతితీక్ష్ణమైన దూతాలాపములు విని
రహి నతిక్రాంత మర్యాదుఁ డయ్యె

ఆ. వె. నప్పు డచటి జనము లక్రూర విక్రియా
వీక్షణమున విలయవేళ భూరి
వాతచలిత ఘోర వసుధాధరోన్నత
శిఖర మనుచు విశ్వసించి రపుడు 55

చ. మదకలుషీకృతాతులను మాటికిఁ ద్రిప్పుచు స్థూలదీర్ఘహ
స్తదళితమేదినీకృత విశాలపటుస్వనులై రహిన్ గృతా
స్పదపటుకోపలోహిత విభాప్రవిభాసిత దేహులై ప్రమో
దదుఁడు ప్రసేనజిత్తులరె ధాతువిభూషిత భూధరాకృతిన్ 56

చ. గుఱుతుగ సాంద్రరక్త నవకుంకుమలిప్తశరీరుఁ డాటచేఁ
బరిణతదాడిమీ కుసుమ భాసురలోహితకోప సాత్త్విక
స్థిరతర వారిబిందువులచే ఘనవైరవిభిన్నగాత్రజ
స్ఫురదురు రక్తసక్తుఁడగు పోలికనొప్పె గవేషణుం డొగిన్ 57

చ. చటులతరాధికోపవిలసచ్ఛని పాదతలాభితాడన
స్ఫుటితభవన్మహీ వివర పుంజ వితీర్ణబిలంబులై జనో
త్కటకరముల్ రసాతలము తప్పక నొచ్చి యొకింత తాపసం
కటము నెఱుంగనట్టి యురగంబులకుం గలిగించెఁ దాపమున్ 58

ఉ. మానుగ సారణోర్వీపతి మాటికిఁ గోపవశంబునన్ శిరో
ధూనన మాచరింప శిఖితుల్య తదగ్ర సువర్ణసత్కిరీ
టానుగతోరు రత్నరుచు లాజికి నేగెడు రాజరాజికిన్
జానుగ భవ్యదీపము లొసంగినభంగిఁ దెలంగె నయ్యెడన్ 59

చ. వితత బృహద్భుజాలతుఁడు వీరవరుండు విదూరథాఖ్య భూ
పతి యొకమాటఁ జెప్పుటకు వారక విచ్చిన దౌటఁ జంచలో
న్నత రసనాగ్రమైన లవనస్ఫుటకందర మొప్పె భోగిసం
యుత వనవృక్షకోటరము నొప్పున నప్పుడు భీకరాకృతిన్ 60

గీ. క్షాత్రవోక్తుల నిట్లు తత్సదన మపుడు
క్షోభ మొందుచునుండ ముకుందమాన
సంబు గలఁగదు వారిదజలముచేతఁ
గంధిజల మించుకైనను గలఁగ నట్లు 61

గీ. పరుల నిందించుటయుఁ దన్నుఁ బ్రస్తుతించు
కొనుట ఖలులకు భువి నైజ మని తలంచి
యుద్ధవుఁడు కోప మూనక యుండె నతని
ముఖము స్మితయుక్తమై చంద్రుబోలి యుండె 62

## • యాదవసేనాసన్నాహము •

వ. ఇట్లు ప్రకటిత ప్రకోపులైన యాదవులచేత శిశుపాలప్రేషిత వచోహరకుండు నిరాకృతుండై మెల్లనం జనిన యనంతరంబ దుస్సహ స్వనభయానకంబులైన యానకంబులుగల హరిబలంబు తత్క్షణంబ యుద్ధసన్నద్ధంబయ్యె యదునరేంద్రులు కవచధారణంబు న్యాయంబని యనేకవారంబులు భగ్నప్రతిపక్షాయుధంబులును బరాక్రమానురూప ప్రకర్షావంతంబులు నద్రికటకనిర్భరంబులు నసంత్యక్త శౌర్యదంశనంబులు నగుశరీరంబులయందు గవచధారణంబు గావించి రయ్యవసరంబున నైశ్వర్యవంతులైన రాజుల సంగ్రామశ్రవణంబువలన రయంబున నుపచయంబు నొందినశరీరంబునం దన్యులచేత క్షణమాత్రంబైన దుర్భర సంతోషంబు లంతరంగంబును నెట్లు విడువవయ్యె నట్లు బహిఃకంచుకంబులు విడువవయ్యె నప్పుడు కుథాదిసన్నాహసహితంబైన దురంతదంతావళగణంబును రథగుప్తి సహితంబులైన రథంబులును జల్యయనాది సన్నాహయుక్తంబులైన హయంబులును దమయంతందామె త్వరాయుక్తంబులైనను మహీభృత్తులు హస్త్యాదిని యుక్తపురుషులను సారెసారెకుఁ ద్వరసేయుచుండి రంత స్వభావసుందరమూర్తియు సంగ్రామంబులయందు భీమదర్శనుండు నగు మధుసూదనుని ప్రకృతిమనోహరంబులును రణంబులయందు భయప్రదంబులు నధిదేవతాయుక్తంబులు నపాయులు నైన శార్ఙ్గచక్రాద్యాయుధంబులు పృథగవస్థిత స్వశరీరంబులుం బోలె సేవించెనప్పుడు మధుసూదనుండు ద్వివిధంబులైన మహీభృత్కటకాంతరంబులం దనేకవారంబులు రణంబులందు

రాక్షసశోణితాప్లుతనేమి యైనరథం బప్రతిహతంబగునట్లు సన్నిహితం బైనదాని నారోహించె. అంతలోఁ నిజప్రభాకపిశీకృత హరిన్ముఖుండగు గరుడుఁడు ధ్వనద్గురుపక్షమారుతంబు గలుగునట్లు దివంబుననుండి వచ్చి ధ్వజదండాగ్రంబునఁ బదంబుంచె. అంత

## • సేనానిర్గమము •

చ. శరదగభీరతావిజిత చారుమృదంగనినాదయున్ హాత
స్ఫురదరిహంసహర్షయగు శ్రోత్రమనోహరనాదసంపదన్
వరుసప్రతిధ్వనుల్ సలుపు బర్హవిభూషితబర్హిపంక్తికిన్
సురుచిర సంతసంబొసఁగుచుం జనెఁ దద్రథ మంచితంబుగన్ 64

సీ. సాంద్రనిరంతరస్థగిత దిగంతరం
బైన తచ్ఛౌరిసైన్యమును జూచి
జనము ప్రక్రాంతవిస్తారమహాపూర
సంచలితాంభోధిసలిలమందు
విగతకౌతుకమయ్యె నగణిత మత్తేభ
బృంహితంబులు వాజిహేషితములు
నేకమై సర్వమహీధ్ర గుహాద్వార
ములు నిండి మిన్నుబ్రద్దలుగఁ జేసె

గీ. భూరిరణజయదుందుభుల్ మ్రోయుచుండ
నిబిడప్రతినాదములు భయ నిర్గతహారు
లగు గుహాముఖంబులచేత నద్రిపతులు
ప్రమదమును బొంది సస్వనభంగి నుండె 65

చ. అతిబధిరీకృతోన్నత గుహాగత నిర్ఝరకర్ణమార్గమై
పతత చమూరవంబు సురశైలగుహాల్ వెస నిండిపర్వఁగా
నతుల విదగ్ధకాంతల నిశాంతరతాంతర కూజితంబు సం
గతి శ్రవణాధ్వగోచరముగాక నిరర్థకమయ్యెఁ జయ్యెడన్ 66

చ. శ్రుతరణతూర్యఘోషలయి .ంపుగ నిర్జరవారకామినుల్
జతురత నింక ఘోరమగు జన్యము గాంగల దందుఁ జచ్చి భూ
పతులు చిరాభికాంక్షితులు వత్తురు వారల పొందుగల్గు నం
చతులిత సంభ్రమంబు చెలువార వెసన్ గయిచేసి రంగఁబున్ 67

వ మఱియు సఫ్యస్తసాదిక్రుత్యు లగుటం జేసి విదిత యయాతాఖ్య
పాదాంకుశకర్ములగు నిషాదులచేతఁ బ్రేరితంబులై గజంబు
లేకవారంబు కరతల లోలాంతర్నాడికాహతంబు లయ్యును
మహుర్ముహు ర్ధ్వనిత ఘంటలు గలుగునట్లుగాఁ జనుదెంచె
మఱియుఁ బాదవిన్యాస విశేషగమన చలచ్చామరంబులచేత
ఖురోద్ధత మహీరజం బివ లావలం దట్టుచున్నవానివలె ధృతాఖి
నవఖాండంబులైన తురంగమంబులవలన దృష్టులు ప్రసరింప
కుండె స్ఫుటతరకృత కర్ణతాళంబైన గజఘటలచేతఁజలాంగుళి
కిసలయంబు గలుగునట్లుగా సముత్థితహస్తంబులచేత నృత్యంబు
గావించుటయు మదజలార్ద్రగండస్థల సంసక్త భ్రమరగణంబుల
చేత మధురస్వనంబుగా గానంబు నేయుటయు ధృతాభినవపూర్ణ
కుంభంబులగు దంతిఘటలచేతఁ బ్రశమితరజోజాలంబులగు
మదజలంబులచేత మహీతలంబు సేచింపంబడుటయు ముఖంబు
లచేత శ్రవణసుఖకరంబై సమున్నమత్పయోధరగర్జితగంభీరం
బైన తూర్యంబు వాయించుటయుఁ బవనావధూతపటంబులు
నభ్రంకషంబులు నగుధ్వజంబు లివలావల నుత్క్షిప్తంబులగుటయు
నిట్లు దంతిఘటలచేత శత్రువున కభిముఖంబుగా వచ్చు కృష్ణుని
పురోభాగంబునఁ దనయంత మంగళంబు గావింపంబడియెనప్పుడు

గీ. విడిచిపోయిన సేనానివేశభూమి
శూన్యతను బొందదయ్యె నీక్షోణితలము
మిగుల ఘనరససంప్లవం బగుచునుండ
మానుగఁ బయోధిసలిల విహీన మగునె ? 69

సీ. హారిరవితోఁగూడ నరుగనిప్పటము గల
దాని నంతటఁ గ్రమ్మె హాని శత్రు
బలరేణుమలినమై పరగెడుదాని దు
స్తరజగన్మోహమువిశాలశ్శంగ
ధూసరంబై మ్రోలఁ దోఁచు దిక్కును ఘూమి
తంబైన దానిచందాన జనము
వీక్షించె నప్పు డింపెసఁగ గజోద్వృత్త
వైరుల సైన్యానకారవంబు

గీ. పూని గొట్లు మనస్వుల మానసము హ
రించె నాకీర్తి సముదితోదంచితోరు
ప్రతినినదమైన ఁగూర్మియ పటుమృదంగ
సాంద్రనాదంబు హరి ఖుంపఁ జాలదయ్యె 70

గీ. హరివరుని మ్రోల మ్రోయు సమగ్రపటహ
రవము అంతంతకు సమీప మవుచునుండ
శత్రుసేనావధూమణి సంభ్రమమున
గాత్ర ముప్పొంగ డగ్గఱఁ గదియవచ్చె 71

చ. మిగుల సమీరణభ్రమిత మేదినిరేణుకణాభిరూషితం
బగుట నిరంతరోగ్రవిలయప్రవిభావితకాళికాకృతిన్
దగు ప్రతిపక్ష సైన్య సముదగ్ర సమున్నత కేతనాళి మె
ప్పుగఁ గననయ్యె నభ్రమున భూరిచలత్పటునిస్వనంబునన్ 72

సీ. ప్రతిముఖ తిగ్మాంశు ప్రతిఫలితోగ్రదీ
ధితులచే నధికప్రదీప్తమండ
లాగ్రవంక్తులచేత నతిదుఃఖకరదర్శ
నంబయ్యెఁ జైద్యుసైన్యంబు శౌరి
సైనికులకు భీతి సంపాదకంబయ్యె
నంతలోన మనోజ్ఞ మగుచుఁ దోఁచె
సమవిషమప్రదేశములందుఁ దుల్యసం
చారంబుగల భూరిసైన్యజలధి

గీ. గగనమార్గంబునందు శీఘ్రమునఁ దిరుగు
సాంద్రతర మేఘమండల చ్ఛాయపగిది
క్షణములోన వసుంధరా చక్రమెల్ల
నిండెఁ గలకలనాదంబు మెండుకొనఁగ 73

వ. అప్పుడు క్షణమాత్రం బగ్రభాగంబున విలోకింపుచున్న తనకుక్షిస్థితభువనత్రయుండైన మధుసూదనుని విశాల నితాంతాయత నేత్రంబునందుఁ దద్విపక్షమహాబలం బపర్యాప్తం బయ్యె మహీనాథ సేనావధూగణంబులు రణారంభంబునందు సురతారంభంబునందుంబోలెఁ బ్రస్విన్నగాత్రంబులును బులకవికాసితంబులును వీరశృంగారరసాధికంబైన చిత్తంబునం దభినివిష్టసాహసంబులును ససంభ్రమంబులునై జూపట్టె మఱియు శిశుపాలపక్షరాజులనుకూలమారుతప్రసారితకేతనపటంబులచేతఁ బలాత్కారంబుగాఁగృతాహ్వానులైన చందంబున ధృతతరంబుగా సముద్యతశస్త్రాస్త్రులగుచుఁ గోపంబున నత్యంతసంరంభంబునొందిరి ధీరులగువారు రణార్థులై చనుదెంచినవారిం జూచి కాలవిలంబనంబు సహింపరు గావున నప్పుడు హరిసైనికులు శత్రువాహిని మీఁద నతిరయంబున నడరి రంత 74

చ. బరతకపోతకంఠగతసాంద్రతనూరుహజాల చారుగా
సరరుచి రైనసైనికుల సచ్చరణాహతభూరిధూళి యం
బరపథమంటఁ బైకెగసి బంధురమేఘచయంబు గ్రమ్మి చె
చ్చెర దెస లావరించి యతిశీఘ్రతఁ జేసె ఘనాంధకారమున్ 75

సీ. మఱియుఁ బలాచల ఖురములచేఁ బ్రతి
పదమాహతము లయ్యెఁ బహుళసాంద్ర
ముగ నిషంగులచేత మిగుల మిథస్సమా
శ్లిష్టకాయంబులచేతను బరి

రుద్ధంబు లై నప్రసిద్ధపాంసుచ్ఛట
లోకచోట మీఁదికి నుద్గమింపఁ
జాలక క్రిందనే సంచరింపుచునుండె
మఱియు మహోగ్రసంగరము మీఁదఁ

గీ. గలుగునప్పుడు సాయకక్షతజరక్త
జలముచేఁ బంకిలత్వంబు గలుగు మహికు
నిపుడె యాకసమున కేగుటుచిత మనుచుఁ
బవన కేతుసహాయా మభ్రమున కెగసె 76

గీ. ప్రచురముఖుఁడు గరీయుండు రాగియైన
జలజగర్భుని వ్యవహిత సత్వరజము
లోకసృష్టినిమిత్త ముద్రేకమొందె
లోకనాశార్థమయ్యె ననీకరజము 77

చ. ఒక యెడ నూత్నమేఘనిచయోజ్జ్వల కర్బురవర్ణతుల్యమై
యొక యెడఁ దప్తకాంచనకణోపమపింజరమై నిరంతరం
బొక యెడ శారదాంబుదచయోన్నతపాండురమై ఖురక్షత
ప్రకట వసుంధరోత్థ ఘనపాంసుచయం బెగసెన్ ఖవీధికిన్ 78

చ. ఘనతరసైనికోద్ధతవికాసిపరాగము దిగ్మదావళా
ననములయందుఁ బర్వఁగ క్షణంబు పికాంగమలీమసంబులై
తనరిన దాన మేఘరసధార లుదీర్ణములై విసారితన్
మునుకొని దాల్చెఁజూపఱకు మోదము విస్మయమంకురింపఁగాన్

సీ. మధుపకదంబకోమలకేశములచేతఁ
దగ నుపలక్షితు లగుటఁ జేసి
పరగ నీజనులు యౌవనయుక్తులగుచు సం
గ్రామరంగమున వ్యర్థముగఁజావ

కుందురుగా కనియోజించి సేనార
జంబు గ్రక్కున శిరోజముల నపుడు
ధవళిమ నొందించెఁ ఁప్పక సణువుల
య్యును మహీరేణువు లినునితనువు

గీ. నాక్రమింపను దానెంత యధిక తేజుఁ
డైన నన్యుండు సంగతులై చెలంగు
నట్టి పెక్కండ్రుపరులచే నవనిలోఁ ది
రస్కృతుఁడు గాఁడె నిజ మీ పరాభవంబు 80

క. ధృతరథచరణప్రధీక్షిత
కుతలోద్ధతబహురజోపకుంఠితజగమున్
వితతయుగాంతంబున ని
ష్ప్రతిబంధ పయోధి నీటఁ బడి నట్లుండెన్ 81

చ. అరయ నసుల్లసద్దినకరాసనదీధితులున్ రజస్వలల్
పరిమలినాంబరాంతల నలంకృత లౌట నవీక్షణీయలున్
వరుసదిశాసితంబినులు వారక ప్రాణులకట్లు దవ్వులన్
బరిహారణీయలై రొకతుణం బశుచిత్వము నొందెసందునన్ 82

క. అనిమిషులు రణముఁజూడఁగఁ
జనుదెంచి నభమున నిలిచి సాంద్రతర పరా
గనిచితనయనోత్పలులై
జనితవ్యధులగుచు మరలఁ జనిరి భయమునన్ 83

గీ. పాదహతిధూళిపటల మభ్రమున కెగసి
ముదిరగత నీరముల నెల్ల బురదఁ జేయ
విగతచపలాగణంబులై వృష్టిమాని
ధూరిభరమున మెల్లనఁ బోవుచుండె 84

సీ. అమరనదీసలిలావగాహన ధౌత
గాత్రంబులైన దిగ్గజము లద్రి
మునమండి ముస్సన్నఁ డనసుభగాతములైన
సితపల్లవ ఘన సమూహస్థితాశ్వ
పటుఖురాహత సముత్పతస వర్ణరాజి
వర్షాభిషేకసంభావసుఖంబు
లనుభవించెను మఱి యసమానశైలసంకాశ
గాత్రములేఁ గ్రాలుకతనఁ

గీ. గరిఘటలపాదపన్యాస గౌరవమున
నవనితలము రసాతల మంటఁ గ్రుంగె
నాకసంబు రజోవ్యాప్తమయ్యె నట్లు
గాన భూతలమయ్యె జగత్త్రియంబు 85

క. మిగుల సమీకృతవివరం
బగురజమునఁ బూరితంబు లగుగిరిగుహ లొం
టిగ యువతీక్రీడారతు
లగునిర్జరవరుల కొసఁగె నవకాశంబున్ 86

గీ. ఉరుముఖచ్ఛదపటసామ్య మొందుచున్న
ఘనరజము దృక్పథంబులఁ గప్పుచుఁ బ
దైన మగుచూతగంధి మదానిలమున
గుఱుతుగొని యేగెఁ గరు లన్యకరులపైకి 87

గీ. మఱియు నుపరిస్థితపరాగమండలములు
క్రింద సప్తప్రకారవికీర్ణ నిబిడ
దానజలశాంతపాంశువులైన కరులు
భూరిపటమంటపంబులు పోలి యొప్పె 88

వ. అత్యున్నతంబు లతిమాత్రవిపులంబు లగుటం జేసి మహామహీధర
శోభ నధిగమించి యాభరణగతసువర్ణ రేఖలచేత విద్యుల్లతలతోడ

సాదృశ్యంబునొంది సముల్లసత్పింఛదూరాదిమండన సురచాపంబు
లును గాళీయనాగకాయ కృష్ణదేహంబులు నగుగజమేఘంబులు
యోగ్యకాలంబునందు మదజలవృష్టి గురియుచు మహీరేణువుల
శాంతి నొందించెం* దదనంతరంబ యుద్ధానివర్తులును గంభీరఘో
షంబులు నగుసేనాసముద్రంబులు శక్రుండు దంభోళిధారచేత
ఱెక్కలు దెగవ్రేయుటకు మున్నేకస్థానంబున వసించుటకు వాంఛింపు
చున్న సహ్యవింధ్యమహీధరంబులుం బోలె మిళితంబులయ్యెనంత

## • ఉభయసేనాసంగమము •

గీ. అరద మరదంబును హయంబు హయము నిభము
కరిని గాల్బురు గాల్బురు గాఁగ నిట్లు
సేన యాత్మాంగములఁ బ్రతిసేనతనుప్ర
రాగమున నంటెఁ బ్రియుశరీరమును బోలె 90

మ. హరిహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ ఘూర్ణితూ
ర్యరవంబుల్ సుపదాతినాదములు నైక్యంబొంది తన్నాదమే
ల్పులుపం గూడక మిన్నుముట్టి సకల వ్యాపీశ్వరోపాధి భృ
త్పరమాత్మాకృతి నుండె నప్పు డనభివ్యక్తంబునై సాంద్రమై

గీ. తొడరి దూరోద్ధృత స్థూలదోర్ధ్వజంబు
లగుచు రోషాతిశయమున నరుల మీఁది
కరుగు పత్తుల తిర్యగాయత నిశాత
ఖడ్గలతలు పతాకలకరణి నొప్పె 92

వ. మఱియు ధౌరితకాఖ్యగతివిశేషంబునం బఱచు హయసమూ
హంబుల గమనవిశేషంబువలన మీఁదికెగయు వల్గాణబంధన వర
త్రాబద్ధ సువర్ణబుద్బుదాకారమండలంబులు సర్వాంగీణమూర్తి

* మూలమున 17 వ సర్గ సమాప్తము

ఘాతదర్పవిశేషంబుల సంగ ప్రశంసించె సాంగ్రామిక చర్మంబులును బృష్ఠవంశాశ్లిష్టమధ్యబంధన వరత్రాంబులైన యిభంబులును నూట యిరువదేనువర్షంబు లాయుష్యంబుగల గజంబులకు ద్వాదశావస్థలు గలుగుటఁ జేసి యందుఁ జతుర్థావస్థయైన శారీరశోభ నధిగమించి ప్రళయానిలప్రేరితస్థూలోపలంబులఁ బడి నతితీవ్రంబు గాఁ జలించె వేగవంతంబులైన శతాంగరథాంగ చక్రాధార కాష్ఠభారంబు పరస్పర సంఘర్షణంబున నాదంబు గావింపుచు రాగంబువలన సముద్భూత ప్రతోదతోత్సాహితతురంగుండును సముత్థితపూర్వకాయుండు నగు సారథికి సముత్సాహవర్ధనార్థంబు హాహాకారంబు గావించి నట్లుండె సమున్నతకేతనస్తంభంబుల వైజయంతులు సాంపరాయాంతరాయంబు గావించు మహీరేణువులఁ బ్రమార్జనంబు సేయుటకు నంటకునిచే సముద్ధాయమానంబులగు సమ్మార్జనులుఁ బోలె. జూపట్టె నంతియును 93

క. జిఱజిఱఁ ద్రిప్పుచు ధన్వులు
గుఱుతుగఁ బాటవము దెలియుకొఱకు గుణంబుల్
పరువడి మ్రోయించిరి కరి
శిరములు నాస్ఫాలనంబుఁ జేసిరి యంతల్ 94

గీ. ఘూరిడిండిమధ్వనులు ఘంటారవములు
విపుల గ్రైవేయనాదముల్ బృంహితములు
కరుల కుత్సాహపరివృద్ధి కొఱకు యంత్ర
వాక్యమున కనుకూలతావసర మొసఁగె 95

మ. సతతం బాయుధజీవు లొక్కమొగి శిక్షాశక్తులం జూపుచున్
జతురస్రాదివిభేదయుక్తములు భాస్వత్స్వస్థవాతిస్వదా
ప్రతిబంధంబులు నైనయస్త్రముల శస్త్రశ్రేణులన్ బల్విడిన్
వితతారాతుల నేసి రప్పుడు బలోద్వేలంబు దీపింపఁగన్ 96

ఉరువడి నిద్దఱు యోధు లన్యోన్యంబు
నెదురుగాఁ బరువెత్తి కదియవచ్చి
మొనసి రోషావేశమున పోటు లటు పాఱ
వైచి హస్తంబులుఁ బట్టి మల్ల
ముష్ట్యలగతి దృఢముష్టిఘాతంబుల
ఘట్టించి బాహుయుద్ధంబు సలిపి
రంత నిర్విషము లత్యంత వేగంబులు
న ప్రతిఘాతంబు లశనిసమము

ఆ. లంబకంబులు దూరముక్తంబులగుచు
గరుడ నిలజాత రేణువుల్ గ్రమ్ముకొనఁగ
శత్రుసైన్యంబు నొచ్చి విచిత్రవాజి
తానరూపకర్మముఁ జేసె సేనయందు 97

మ. రవణం బొప్పఁగ మానవంతు లురుసంగ్రామాగ్రిమస్కంధమూ
రువులం బ్రాఁకి యనంతరంబ శిరమారోహించి సోత్కంఠులై
యవిశంకాప్తి సమానుషాధ్వమునొగిం బ్రాపించి ద్యోవీధి సం
స్తవమొప్పం డగుభంగి నెక్కిరి మహోత్సాహంబు సంధిల్లగన్

గీ. గుఱుతుగ రణాపణముఁ జేరి కొంట రథిక
వీరులం గాంతరమున మాపితములైన
యస్థిరము లగు ప్రాణమూల్యముల చేత
నవనిలో సుస్థిరంబైన యశము గొనిరి 99

వ. మఱియు సంగ్రామ రంగంబున విక్రమాహంకారంబుల చేత శ్లాఘ్యంబైన మహాద్భుత రణకర్మంబు గావించి స్వనామంబుఁ జెప్పుకొనుటకు లజ్జితులై యున్నవారిని శత్రువుల చేత సజ్ఞాత నామధేయులైన శూరుల శౌర్యశ్రీయుక్త నామధేయంబును వందిజను లుచ్చైర్నాదంబున నితండ తండని తెలియం బలికిరి

క్రోధాంధులైన శిరభటులు నభిముఖంబుగాఁ బఱతెంచుచు నన్యులచేత సమ్ముఖంబుగా ధరియింపం బడిన నిశితకౌక్షేయక ముఖంబులను వక్షోపీఠంబులచేత ముష్టిపర్యంతంబు పరప్రయత్నంబులేకనే తమయంతఁ జొచ్చి ప్రవేశించి రమ్మహాయుద్ధంబునందు సైన్యద్వయంబును మిశ్రీభూతం బగుచుండ నగ్రభాగంబునందు నెవ్వరు పరాఙ్ముఖులైరి వారలు శత్రువులైన నవధ్యులనియు నెవ్వఁడు ప్రోల నవ్యావృత్తుండై యభిముఖుండయ్యె వాఁడు స్వకీయుండైనను వధ్యుండనియు నీ ధర్మంబు వ్యక్తంబయ్యె మఱియును 100

• సంకులసమరము •

సీ. అరయ సద్వంశత్వమగుటచే నంగసం
బంధంబు నొంది మమత్వగరిమ
గడుబద్ధమైన యొక్కనిచేత యసిలత
చెలఁగి వేఱొకఁడు వంచించికొనిసఁ
దద్వశంగతయయి తప్పక ద్రోహంబు
గావించె సజలమేఘంబుభంగి
నతిమేచకంబైన యన్యుని కవచంబు
ధౌతోరునిజఖడ్గధారచేత

గీ. దారితంబగుచుండఁ దద్వర్మమందు
సాంద్రశోణితరేఖమై జాలుగొన్న
మండలాగ్రమార్గంబు శంపాప్రదీప్త
మగుచు శోభిల్లెఁ జూపఱ కద్భుతముగ 101

గీ. అన్యభట బాహువాక స్వమాయతశిత
శరపరిప్రోత మగుచుండఁ జాలబాధ
గలిగియును ధైర్యమెడలియుఁ బలుకవిసఁడు
ఘోరితర మందు కశ్లిష్టముష్టివలన 102

వ. మఱియు గృధ్రపక్షబాణవిశేషంబున నాసికనుచ్ఛేదించి వక్షంబున ప్రహతంబైన నవారూఢాశ్వంబు శిరార్ధంబు దృఢపాశంబున బద్ధంబైనదానియట్ల యశిక్షిత ముఖంబయ్యును ముఖంబు నపాకరించుటకు శక్తంబుగాదయ్యె మఱియుఁగులీనాశ్వంబుహయారోహకునిచేత నున్నతంబైన కుంతంబునఁ బ్రహరించుట కభిప్రేతంబైన గజంబువలన భయంబు నొందదయ్యెఁ గులీనులు యశంబుకొఱకు మహాపౌరుషంబు గావింప నుద్యుక్తులైన నిజ భర్తలను లజ్జితులుగాఁజేయరుగదా! మఱియు నధోదేశంబున జనంబును విలోకింపుచు విక్షిప్తసాయక హస్తులును భయరహితులు నగుజయశీలురు గజంబుల నారోహించి జంగమంబులగు గిరిదుర్గంబులు నాశ్రయించినవారియట్ల శత్రుసైన్యంబులచేత జయించుట కశక్యులై యుండిరి యొక్కవీరుండు సర్వవ్యాపకంబులగు సైన్యతరంగంబుల నీవలావలందట్టుచు సమరమధ్యంబున దూరంబునసంబోవు నిష్టబంధువును విలోకింప నిశ్చయించినవాఁడగుచు నొకచోట దూరంబున మగ్నంబైనమహీమండలంబు నవలోకించుట కాదివరాహంబు సముద్రంబు నందుం బోలె రణరంగంబునం బరిభ్రమించె గజోద్ధాపనజ్ఞుండగు యాధోరణుండు మదోద్ధాపనార్థం బుద్దీపన కర్మంబు గావింపం దలంచు నంతకు మున్నె సేనాకోలాహల శ్రవణంబువలన స్థూలంబులైన గజంబుల మహాదానప్రవాహంబులు తమయంతఁదామె ప్రవహించె దూరంబున నన్యగజమదగంధాఘ్రాణంబువలనఁ గ్రోధావేశంబై దాని హింసించుట కొకగజంబు విధూతమస్తకంబై యాధోరణునిం దిరస్కరించి దారుణాక్రందనధ్వనికృతాశేషదిగంతంబైన స్వకీయ వింశతివార్షికంబైన గజడింభంబునందుఁదిర్యగ్దంత ప్రహారంబు గావించె మఱియు నొక్క ప్రతిపక్షవారణంబు ప్రత్యాసన్నంబగుచుండ గజారోహకునిచేత సంప్రాప్త ముఖచ్ఛదంబయ్యునుఁ గ్రోధాతిశయంబునఁ గ్రూర నిర్ధారితాక్షంబయ్యును మదాంధగంధసింధురం బొక్కించుకైనఁ బురోగత ప్రతిపక్షగజంబును విలోకింప దయ్యె 108

చ. పరగ నిషాది యొక్కఁడు స్వవారణలోచనవారణాంశుకం
బురువడి నెంతలోఁ గడురయోద్ధతి మీఁదికిలాగు నంతలో
నరయఁగ శత్రుపతుగజయంత సముద్ధతి నేకపాత దు
ర్భరతర కార్ముక చ్యుత శరంబులఁ గ్రుచ్చెఁ బటంబు కన్నులన్

చ. మఱియొకఁ డప్రమత్తుఁడయి మాటికి శత్రుగజంబు మీఁదికిన్
బరువడినేగు దంతి ముఖవస్త్రము వేఁదొలఁగింప నంతలో
నిరుపమవక్త్రి లగ్నమగు నిష్ఠురకంకు కలాప భారమున్
గరమగుదార శీఘ్రమునఁ గన్నులుగప్పె క్షణంబులోపలన్ 105

వ మఱియునొక్కగజారోహకుం డాలోచితం బైన మననంబున నన
పాయదేశంబునం దుండుటవలన నపాయంబులేదని నిశ్చయించి
వంచకుల వలన నతిప్రయత్నంబున రక్షింపుచు సాధనాంతర
నాశకాలయుక్త వినియోగం బగుటవలన నభీష్టం బైన గజంబు
నొండుచోటికిఁ దోలఁగొందోలుకొనిపోయె మఱియు మదగంధ
బంధురసింధురంబులు పరస్పరకర్మవ్యతిహారంబువలనఁ బరస్పరో
ద్భేదంబు లైన కరాదిమదస్థానంబుల హస్తాగ్రంబులచేత స్పృశిం
పుచు నున్నతప్రహ్వీభూత వాలాగ్రంబులు నున్నమిత మస్తకం
బులు నగుచు సువ్యక్త దంతనాదంబులు గలుగునట్లు యుద్ధంబు
గావింపుచుండె మఱియుఁగొన్నిగజంబులు నతిదీర్ఘంబులును
బరస్పరసంఘట్టితంబులును సమాలంబిత స్థైర్యంబులును నతి
ధవళంబులు నతి చారూదగ్రంబులు నతి నిశితంబులు నగు
దంతంబులచేత సమాహతంబులగుచు రణంబుగావింపుచుండ
నప్పుడు దంతంబులు భగ్నంబు లైనను జలంబు డింపక తుండంబు
లొండొంటిం బెనుచుకొని యద్భుతంబుగా సంగ్రామంబు గావించె

సీ. గంధేభదంతసంఘట్టజాతంబును
స్వర్ణభంగసవర్ణ సంచలచ్ఛి
ఖాగ్రంబు నగువహ్ని యనుపమమాంజిష్ఠ
రక్తంబులగు చామరంబు లందు

సంక్రమించియు సైన్య సమితిచే శిక్షింపఁ
బడకుండె మత్సరోత్పాతవాత
సంయుజ్యమానోరు చారుదంత మహీజ
సంఘర్షణోద్ధాత సాంద్రవహ్ని

గీ. శిఖలచేతఁ గల్పాంతాగ్ని శిఖలచేతఁ
బోలె దంతావళోన్నత మూర్ధగగన
మందు నుజ్జ్వలనక్షత్రహార మపుడు
వితతముగ దగ్ధమయ్యె నద్భుతము గాఁగ 107

సీ. సాంద్రపయోదమేచక దంతిబృం
దంబునందు నిబిడశోణితారుణంబు
లైనదంతంబు లుద్యద్వారినిధివారి
యందు విద్రుమలతికాంకురముల
యట్లఁ బొల్చెఁ బ్రకంపితాగ్రకేతువులచే
ఘారంబు నొందిన వారణములు
చెలఁగి గ్రీవా బద్ధ శృంఖలభూష
ణావ్యఖల నినాదంబు లలరునట్లు

గీ. ప్రతిగజంబుల ఘూరిగాత్రంబు లందు
నధిక గాఢ నిమగ్నంబు లైనస్థూల
దీర్ఘదంతద్వయంబు నతిప్రయాస
మలర నుత్పాత మొనరించె బలువుచేత 108

వ. మఱియు లాంగలదండసంకాశ దంతంబులు గలయొక్కమహా
గజంబు ప్రాణోత్క్రమణదుఃఖంబు వలనఁ జలింపుచున్న శాత్ర
వీయ కుంజరంబును దంతంబుల చేత మీఁదికెత్తి శిఖరప్రాంత
ప్రావృట్కాల జలధరంబైన మహీధర శృంగంబునకు సాదృ
శ్యంబునొందె మఱియు నొక్కవారణంబు క్రోధావేశంబున
నిర్భీకంబై గయంబుసం బఱచి యతివిస్ఫాలంబయ్యును లోకవ్యా

వ. మఱియు నొక్క సేనావల్లభుండు తనముంగల మృతులైనవారి నిద్దర విలోకించి తద్వల్లభసంబంధి వేమ చేత దుఃఖించి యంత స్తాపంబునొందె 118

సీ. అతిరోషపరవశుండై దంతదష్టోష్ఠుఁ
డై సాహసంబున నతిరయమున
నసిహస్తుఁడై యొక్కఁ డరివీరు పైఁ బడి
రావేశమున వచ్చునంతలోన
నారాచశాతబాణమునఁ గంఠము దెగి
బంతి కైవడిఁ దల పైకి నెగసి
మరల నెప్పటిచోట మానక నిల్చినఁ
దత్కళేబర మట్లు తత్క్షణంబ

గీ. వ్యోమవీధికి నెగసి యనుత్తమాంగ
మయ్యును సహోత్తమాంగమైనట్లు మిగుల
సైన్యసందోహములకెల్ల సాధ్వసంబు
గలుగఁజేయుచు నృత్యంబు సలిపె నపుడు 119

మ. ఉరుసంపాదితవిస్ఫురత్కరపుటాద్యుత్తాలతాలంబులై
పరతూర్యస్వనముల్ మహాసుషిరభృద్వాద్యధ్వనుల్ మ్రోయఁగా
సొరదిన్ ఘోరకబంధ మొక్కయెడఁ బటుశ్యాన్యహస్తప్రయో
గరతిన్ నృత్యము సేయ మ్రోసెను రణత్కాంబు ప్రవేశంబొగిన్

శా. భావింపన్ దనసేన భంగపడినన్ బల్కొన్కతో వేగఁ బ్ర
త్యావృత్తుండగు శూరుకంఠమున ఘోరారాతికోదండము
క్తావార్యామిత హేమపుంఖపటుబాణౌఘంబు లొక్కుమ్మడిన్
దేవస్త్రీకరముక్తమాల్యములతోఁ దెల్పొందఁ బ్రాలెన్ రహిన్

వ. మఱియు సాయకోత్క్షిప్తసాది శూన్యాసనంబు లగుటం జేసి పర
సైనికుల చేత గ్రహించుటకు సమారబ్ధంబులై రణభూమియందుఁ

బగ్రిభామ్యవాణంబులైన మత్తేభబృందంబులచేత బంధసంస్థానం
బు స్ఫురింపఁబడియె నా సంగ్రామరంగంబునందుఁ బునఃపునరావృత్తి
సలిన రక్తగంధాఘ్రాణనంబుచేత మత్తంబైన మహాగజంబు
కోపంబువలన జనమర్దనంబు సేయుచుఁ బాదలగ్నంబైన పాశబం
ధనసంకాశదీర్ఘాంత్రమాల నాకర్షించె మఱియు నొక్కవీరుండు
గాఢప్రహారంబువలన మూర్ఛాక్రాంతుండై మదవారణశీతల
పుష్కరతుషారసిక్తుండగుటంజేసి మూర్ఛఁదేరియుండ వానివరిం
చుటకుఁ జనుదెంచిన దేవాంగన సజీవుండై యుండుట యెఱింగి
విఫలమనోరథయగుచు మూర్ఛనొందె మఱియునొక్క వీరుని
శిరంబు సాయకలూనంబయి మింటికెగసిన దానింజూచి వర
ణార్థంబు చనుదెంచిన దేవకామినులు స్వర్భానుం డనిశంకించి
భయంబున సుందరాకారంబులైన ముఖచంద్రులఁ బ్రత్యఙ్ముఖం
బులు గావించిరి 122

చ. పటుగతి నాత్మభర్త పరబాణహతుండయి నేలఁగూలినం
దటుకునఁజూచి తద్యువతి తద్విరహంబు సహింపలేక తా
నటు ప్రబలాగ్నిలో మునుఁగు నంతటిలో నొకదేవకాంత ము
చ్చటపడి వానిఁగొంచు సురశైలమహాగుహఁజేరె గ్రక్కునన్

క. అనిఁగెడసిన భర్తను ద
ద్వనిత కరటినెక్కి చూచి తద్దయుమోహం
బునఁ దనువువిడిచి గ్రక్కున
ఘనదేవత్వంబునొంది కౌఁగిటఁ జేర్చెన్ 124

సీ. మఱియొక్క వీరుండు చిరకాలమును నాక
వాసము గావించి ప్రత్యహంబు
నతిశయప్రేమచే నభినవత్వము నొంది
సరులకు నభినవానందమొసఁగి

నట్టి మనోజ్ఞదివ్యాంగనచేఁ బర
లోకంబునం దిహలోకమందు
యశముచే విఖ్యాతిఁ బ్రాపించె మూర్ఖు నొం
దిన వారిలీవఁబు దివిజలోక

గీ. మునకుఁజని యచ్చటి విలాసములనుజూచి
మఱలఁ జనుదెంచి వారివక్షంబు సొచ్చె
నంతలోలేచి తత్స్వాఖ్య మందఁగోరి
ఖండన మొనర్చిరప్పుడు చండభంగి 125

ఆ.వె. కాండనిహతిమూర్ఛితుండై యొకవీరుఁ
దొడరి మిత్రుఁ డనికిఁదొలఁగఁదీయ
నంతలోనఁ దెలిసి యతఁడెంతవలదన్న
వినక రణముఁజేసి విడిచెఁదనువు 126

గీ. పగతుచేత నాకర్షింపఁబడిన వీరు
లిరువు రేకాస్త్ర నిర్భిన్న హృదయులగుచు
నరివరస్పరావష్టంభశక్తియోగ
కలన నేగిరి నాకలోకమున కపుడు 127

సీ. ఖండితదండమై కడువడి ధరణిపై
బ్రాలిన పూర్ణచంద్రప్రభాభి
రామాతపత్రంబు శ్రాద్ధదేవుని రౌప్య
భోజనపాత్రంబు పోల్కినొప్పె
మృతులైన నృపతుల మెడనుండిపడిన స
కాశ్మీరహారముల్ కామసహిత
మగు మిత్తిరక్తమద్యము ద్రావి నవ్విన
వెలికుఱ్ఱు రదనములవిధము దోఁచె

గీ. శస్త్రహతి మూర్ఛనొందిన సత్క్షత్రజులు
సమరధర్మంబెఱింగిన శౌర్యనిధులు
గెడపఁగడఁగినఁదనవారి నుడిపి జీవ
యుక్తముగఁ బట్టుకొనిపోయి రుత్సుకమున 128

గీ. మెండుగా నిమ్నభూములు నిండినట్టి
సాయకక్షతరుధిరంబు శమనయువతి
రమ్యసంవ్యానముల కనురంజనార్థ
మిడిన కౌసుంభరసము కైవడిఁ జెలంగె 129

చ. క్రమమునఁ జెక్కుమోములు ధరాపతుల న్వధియించి పెద్దగా
లమునకు జామదగ్న్యుఁడు చలంబునఁ దద్రుధిరంబు పంచస్రో
తములుగఁ జేసె నాసమరధారుణియందు క్షణంబులోన నే
కములగు రక్తవాహిను లఖండముగాఁ బ్రవహించె నత్తఱిన్

వ. అప్పు డమ్మహారుధిరప్రవాహంబులందుఁ దరంగప్లవమాన పద్మాకారయోధవదనంబులు పద్మంబులును మహేభకర్ణపరిభ్రష్టచామరహంసంబులును వికర్ణాంత్రశైవలంబులును బాహుమీనంబులు నస్థిశర్కరంబులుంగలిగి యొప్పె మఱియు నామిషంబు భుజించుటకు మృతకళేబరంబుల యుపరిభాగంబున నాకాశంబునందుఁ బరిభ్రమించుచున్న కాకకంకఘూకగృధ్రాది పత్త్రవాహంబులు ఘోరశస్త్రంబులచేత శరీరంబులువిడిచి యిప్పుడు పూర్వాభిమానంబున దేహప్రవేశాపేక్షచేత మూర్తిమంతంబులైన ప్రాణంబులభంగి జూపట్టె మఱియు దిశాముఖంబులందుఁ బటాంతఘోషంబు విస్తరింపం జేయుచు నచేతనంబులైన బాణవ్రాతంబులు నిశితముఖాగ్రంబులచేత సైనికులరక్తంబు పానంబుఁ జేసెఁ బదంపడి నచేతనంబులైన పక్షిసంఘంబులు చంచుపుటంబులచేతఁ బానంబుగావించె 131

సీ. ఉద్దీప్తరససమా నోకజంబుకము నిబి
డౌజస్వలగు మృతయోధవరుల
గాత్రంబుతోఁగూడఁ గాంతుతో నే తిగ్మ
తేజంబు భక్షించె, దెగువమీఱఁ
దత్తైజమును వెండి దారుణోల్కాచ్ఛలం
బుసఁ గ్రక్కుచు భయంబుపుట్ట నలచె
వేగనై రంతర్యవిచ్ఛిన్నబంధుర
గాత్రాంతరాళంబు గలుగునట్లు

గీ. బాణసంస్యూత మకుట దుర్భిష్యమైన
యోధమాంసంబు జ్వాలికలోలుకు రుతము
చేతఁబరిపాక మొనరించి చెలఁగి నూత్న
రుచిగలుగఁ జేసి భక్షించెఁ గ్రోష్టృచయము 132

వ. మఱియు నిష్ప్రాణులచేత సప్రాణుల యవయవంబుల చేత నంతటఁ బరికీర్ణంబైన తత్సంగ్రామభూమి యర్ధసృష్టంబులైన రూపంబులచేతఁ బరికీర్ణమైన చతుర్ముఖుని సృష్టికర్మాంతశాల యుంబోలెఁజూపట్టె ని ట్లుక్తప్రకారంబున నవిచ్ఛిన్నవేగంబు గలుగునట్లు పరువెత్తుచున్న మహోద్ధత్యరాజసైన్యంబులకు హరిసైన్యంబులతోడ నద్భుతప్రకారంబున ననిశ్చితజయపరాజయంబగు సంగ్రామంబుచెల్లె నప్పుడు మహానదీప్రవాహంబులు మహార్ణవంబునం గలయునప్పటి మహాభీషణ నిర్ఘోషణంబునుం బోలె సైన్యకోలాహల శబ్దంబు భయంకరంబుగా భూనభోంతరాళంబు నిండిచెలఁగె *నంత సంగ్రామకాంతారంబునందుఁ బరిపంథివేణుధారియగు వేణుదారి యనునామంబుగల బాణనందనుండు నరేంద్రపాదపసమూహసంఘర్షంబువలన నగ్నియుంబోలె వెలుంగుచుఁ దలమిగిలి పఱతెంచుచుండ నతని దూరంబున నుండి యంగీకృత పరాక్రముండై బలభద్రుండు సింగంబు

* మూలమున 13 వ సర్గ సమాప్తము

సూతుండును బాణములఁ గని వలోకించి రయంబున వానికెదురుగాఁ
దివ్యరథంబుఁ బఱపించిన 183

• ద్వంద్వయుద్ధము •

(బలరాముని పరాక్రమము)

క. ప్రథిరవము ఘంటికాధ్వను
లధికంబుగ మ్రోయఁ గడుభయంకరభంగిన్
పృథివి యదరఁ దాలాంకుని
రథ ముత్పాతంబురీతి రయమునఁ నరిగెన్ 184

గీ. ప్రధనమహావిచక్షణుఁడైన బలునిమీఁద
వేణుదారి ప్రయోగించె బాణచయము
సీరికోపించి యతనిపై శితపృషత్క
వృష్టిగురియించి గ్రక్కున వెగడుపఱచె 185

గీ. హాలిశరంబుల మూర్ఛితుండగుటఁజేసి
యల్పతేజుఁడై పడియున్న యతనియంత
దక్షిణాశాగతుండైన తపనుఁబోలెఁ
దొడరి సమరాంబరమునకుఁ దొలఁగఁదోలె 186

చ. అతులప్రభావయుక్తశిని యాదవరాజు బలంబు సాల్వభూ
పతిబలమున్ బ్రతాపమునఁ బాఱఁగఁదోల జయంబుగాంచి త
ద్వితతజయప్రభూతమగు ప్రీతివికాసితవక్త్రపద్మమై
చతురత హస్తతాడనము పల్కుచుఁగేలియొనర్చె నత్తఱిన్

ఆ.వె. దిశలయందు నాత్మతేజంబు వెదచల్లు
నుల్ముకాఖ్య యాదవోత్తముండు
చైద్యసఖుని ద్రుమునిఁ జయ్యన నిష్ప్రభుఁ
జేసి మ్రోటుపడఁగఁజేసె నపుడు 188

గీ. రుక్మిణీభ్రాతయగు రుక్మి [illegible] పృథుని
ధనువు నేవాక్కున నుగోష్ఠ మనుచునిట్టుఁ
జేసె నావాకుచేత నే సిగ్గుమాలి
పాహిపాహి యటంచును బలువరించె 139

## (ప్రద్యుమ్ని వీరవిహారము)

ఆ వె. పరగ నొక్కపెట్ట బలువడిఁ జనుదెంచు
చైద్యపక్షరాజసైన్యమను
వనధి నిమ్నగాప్రవాహంబులను బోలె
నడ్డగించె నొకఁడె హరిసుతుండు 140

వ. ఇట్లతిరభసంబుగా హరిణంబులమీఁదికిం జను సింగంబు భంగిఁ గవిసిన ప్రద్యుమ్నునిమీఁద విశేషయోమయకవచు లగుటం జేసి నీల మేఘ సామ్యంబునొందిన తత్సైనికులు ప్రయోగించిన సువర్ణపుంఖసాయకంబులు శంపాలతలకైవడిఁ బ్రకాశించె నప్పుడా ప్రద్యుమ్నుండు నఖకిరణమంజరీవ్యాప్తయు నధిరూఢశిలీముఖయు నైనమహాకార్ముకశాఖను ధరించి మహోన్నతవృక్షంబు పోలికఁ బ్రకాశింపుచు రిపుసమూహాంతకుండగుచు నతిభయంకర యుద్ధంబు గావింపుచు సత్రముఖులైనవారియందు సౌజన్యంబుఁ జూపుచు నుద్వృత్తులైన ప్రతిపక్షుల బాణంబులచేత విదారింపుచు మఱియు సర్వమహీపతులు విజయాశంసచేత నగ్రభాగంబునఁ బ్రయుక్తానేకబాణంబుల బాణంబులచేత ఖండింపుచుఁ గృతానేకమాయయై సారవంతంబై యున్న సేనాతతిని ధనుష్టంకారమాత్రంబున ననాయాసంబుగా మూర్ఛనొందింపుచు సమరసన్నాహవిజృంభితుండై విహరింపుచుండ నప్పుడు 141

గీ. ఉత్తమౌజుండు దలపడ్డ నుగ్రుఁడగుచుఁ
గార్ష్ణి తత్తేజమును దూరగతముఁ జేసి
వాని పేరికసార్థకత్వము నిజాభి
ధేయమునకును ముఖ్యార్థంబు దెలియఁజేసె 142

గీ. దూరముననుండి శౌరిపుత్రుండు భల్ల
బాణములు పరసేనల బడలుపడఁగఁ
జేయ నవి మూర్ఛఁ దేలి స్వజీవితాశ
మఱల రణభూమిఁ ద్రొక్కక పఱచెనపుడు 143

క. హరిపుత్రునిచే శరములఁ
బరిపీడితులగుచు విడువఁబడిన యపరాతుల్
గరము విలక్షతనొందిరి
వరశరములు నొందవయ్యె వైలక్ష్యంబున్ 144

క. అపు డా ప్రద్యుమ్నుని రణ
నిపుణత వీక్షించి మింటనిలిచి సుపర్వుల్
విపులపులకాంకతనులై
యపరిమితోక్తుల నుతించి రటమునియుతులై 145

గీ. గంధము దిగంతరంబులఁ గ్రమ్ముకొనఁగ
నభ్రముననుండి విమలబృహత్సుమంబు
హరిసుతునిమీఁదఁ బడియెఁ దుల్యప్రకాశ
విమలతత్కీర్తి గగనభాగమున కెగసె 146

గీ. అపుడు కేశప్రచురలోకమైనయట్టి
గాఢసంగ్రామశిరము వికాసికుసుమ
లక్షణునిచేత రమ్యమాల్యంబుచేతఁ
బోలె సుపరిష్కృతంబయ్యె నాలమందు 147

గీ. సాదరంబుగఁ బోరుచు నతిరయమున
సమరరాగసమాకృష్టచైద్యసేన
మదనుచేతఁ దటస్థావస్థ మనుజసాద
రతను బొందింపఁబడియె సంగ్రామమందు 148

## • శిశుపాలుని యుద్ధోపక్రమము •

వ. ఇట్లు విజయలక్ష్మీసమాలింగితుండైన మకరధ్వజుని విలోకించి యభిమానవంతుండైన శిశుపాలుండు ప్లవమానకలభప్రమాణ మహోన్నతతురంగమయు సమాకృష్టకార్ముకమౌర్వీటంకార ప్రఘాతనిర్ఘోషతుల్యతూర్యనాదయు సయత్ననానావిధ రిపు సమూహగతిభేద విగ్రహనాశకసాయకయు రణరంగిణియు హయహ్రేషానాదకలహాయమానవాద్యయు లోలాసికృష్ణ సర్ప విశేషకలయు సముల్లసల్లోహకంచుకశ్యామ యగుటం జేసి యంతకునకు భ్రాతృస్నేహంబున సాహాయ్యంబు గావింపంగోరి సాక్షాత్కరించిన యమునానదీతుల్యయుఁ ఘోరసింహనాదజనయు ననామయయు నగుసేన మత్తధీరగజంబులు గలుగునట్లు యుద్ధ యాత్రారంభంబునం దవిచ్ఛిన్నరణరాగయు సైన సైన్యంబుతోఁ గూడ శత్రువులపై కురుపతి వెఁ దత్సమాగమసంభవమహాకోలాహలంబు కల్పాంతకాలోద్వేలపారావారరవంబు ననుకరించె

సీ. అప్పుడు భూపాలకాగ్రేసరులు విచ్చు
కత్తులతళతళల్ గ్రచ్చు కొనఁగ
మ్రోలవసించి రావేల శౌర్యానురా
గప్రౌఢనికషంబుగాదె శస్త్ర
జీవుల కాజిచేఁ జెలఁగి నిర్మలహృద్య
సాంద్రసంపదగల స్వర్గమునకుఁ
బోవఁ దలంచువాఁడే వాఁడు నసిలత
ధరియించి యశపదంబు దాల్చు

గీ. బాహుదండంబులను ముష్టిపాతసముల
నూరుసంఘట్టనంబుల నుభయబలము
సాహసంబున మత్తమై స్వపరబలవి
వేకశూన్యమై రణముగావించె నపుడు 150

వ. అనంతరంబ యహంకారహారియు బలవన్మత్తమహేభంబు నగు నమ్మహాయుద్ధంబునందుఁ బూర్ణోత్సాహజననిర్ఘోషంబు గలుగు నట్లు సైనికుల యభంగురప్రతాపంబు శోభిల్లె ధనుష్టంకారధ్వని యుక్తజవనమనోహరమత్తగజేంద్రయు విస్మృతమనుష్యజాత కలకలధ్వనియు మానిజనమహాహవయు నగునా సేన రసాంగంబు వలన మోహంబునొందె మఱియు నభంగురవక్షులాకారంబు ముష్టిగ్రాహ్యమధ్యయు నగుధనుర్లత యౌవనోద్ధతులచేత జల్లా త్కారంబు నాకర్షింపఁబడి యతిశయంబుగాఘోషంబుగావించెఁ గంతబద్ధఘంటికాసహస్రంబులు మ్రోయ ననేకదంతావళంబులు రణంబునకుం జనుదెంచి తుండాగ్రగళచ్ఛీకరంబులచేత మహీ రజం బడఁచుచు ధృతప్రశస్యగ్రశృంగారరసరాగంబులై సరోష సంభ్రమంబులై రణంబునందు రౌద్రరసంబు వెల్లిగొల్పె 151

• చిత్రయుద్ధము •

సీ. జనవరప్రాప్తపూజాప్రతిపత్తులు
సంగరైకనియతోత్సాహయుతులు
నగుపదాతుల హృదయంబున నించుక
యైన భీతి జనింపదయ్యె నపుడు
శరపరిపూర్ణనిషంగకోటరములు
ప్రబలగోధాశ్లిష్టబాహువిటప
ములు నగుధానుష్కభూరుహంబులచే బ
లాటవి కడుభీమమై తనర్చెఁ

గీ. జిత్రరణమందుఁ దేజంబుచేతఁ బరుల
కళుకుఁబుట్టించు జనసమూహాతిసాంద్ర
దృష్టినిరపాయరైన చేదీశుసైన్య
మరిబలంబులమీఁదికి నురువణించె 152

సీ. చక్ర గోమూత్రికా సర్వతోభద్ర ము
రజ ముఖ్యబహుబంధరమ్యపద్య
పంక్తిచే శిశుపాలవధమహాకావ్యంబు
చాడ్పున శిశుపాలసైన్యసమితి
చక్ర గోమూత్రికా సర్వతోభద్ర ము
రజ ముఖ్యసువ్యూహ రాజిచేత
దురవగాహంబయ్యెఁ దొడరి యెయ్యది స్వభా
వమున రణోత్పన్న ప్రతిభమయ్యె

గీ. నట్టి తేజిష్ఠసైన్య మైయలరు యదుస
మూహ ముద్వృత్తి నత్యంతసాహసమున
సింహనాదంబులు సెలంగఁ జేదివిభుని
మీఁదికిఁ జలించె రయమున మేదురముగ 153

వ. మఱియును 154

సీ. ద్రాఘీయసియుఁ జలద్ధారుణజనసులకు
లయుఁ గరిగిరిగభీరయును సార
నిర్భికగణమహానినదయుఁ గృతవైరి
వధయు దుర్వారయుఁ బ్రథితబలయు
నగుయదుసేన రయంబున రాజమా
ర్గంబును సువిశాల రథ్యకరణిఁ
బరిపంథిసేన పైఁబడియె నప్పుడు వికస
సత్పింఛహృద్యంబు జవయుతంబు

గీ. బర్హికల్పంబు వికసితబర్హచారు
వసుహరణశక్తమైన శల్యాయుధప్ర
తాన మది నాగములమీఁదఁ దక్షణంబ
పడియు నధికవేగంబున బంధురముగ 155

ఉ. ఆతతజృంభమాణనిబిడార్భటిఁ స్వ్యము సెల్లుచుండఁగా
భీతి యొకింతలేక యరిభీషణబృంహితసుల్ సెలంగ వి
ఖ్యాత నగాభవారణచయంబు బృహత్కటిసీమనుండి దా
నాతులవర్షముంగురిసె నద్రులొగిన్ సెలయేఱులంబలెన్ 156

వ. మఱియు నయ్యుద్ధంబు పునఃప్రవర్తితోచ్ఛలిత లబ్ధశుద్ధిపటాతు
లచేత గాంధర్వం బశురవిశేషంబులచేతంబోలెఁ బ్రకాశించె నిజ
ఖడ్గంబు చేత శత్రుమండలాగ్రంబుల ఖండింపుచున్న యొక్క
వీరుండు కీర్తిప్లుతమహీమండలాగ్రంబైన యనింద్యత్వంబు
బ్రాపించె మఱియొక్క వీరునిచేత సముద్యతంబైన ఖడ్గంబు
చేత నపరిమితంబైన శత్రుసైన్యంబు శీఘ్రంబున నతిమాత్ర
కలుషంబుగాఁ గావింపంబడియె సహస్రరథకుండు సహస్ర
హంతయు నైనయొక్కభటుండు తనఖడ్గంబుచేత సహస్రంబును
వధించి యందులోనొక్కకబంధంబు నృత్యంబుజేసినం జూచి
తనచేత సహస్రంబు హతంబయ్యెఁగదా! యని సంతోషంబునఁ
దానును సేనామధ్యంబునఁ నృత్యంబుగావించె మఱియొక్క
భటుండు శస్త్రవ్రణారూపశోభావదలంకరణభూషితుండై
యలంకరణభూషితుండైన రాజబుభిభంగిఁ జూపట్టెఁ బరిపంథి
శస్త్ర ప్రహారంబున నిరస్తోరుయుగ్ముం డగుటంజేసి రక్తసిక్త
దేహుండై యుభయప్రకారంబుల ననూరుండునుంబోలె
నరుణవర్ణ విగ్రహుండై చూడంబడియె 157

చ. శరధిసమాహవంబున విశాలసమేధితతేజుఁడైన దు
స్తరబల వీరుఁడొక్కఁడల దశమహాహవమందు దీప్తదు
ర్భరపృథుతేజుఁడై దనరు రాజకిరీటుని భూరికోపమై
వఱలెడు వీరభద్రుక్రియ వారకపాల్చెను దుర్నిరీక్ష్యుఁడై 158

చ. పరభటహస్తదీప్తకరవాల విలాస నిజోరు ఖడ్గులై
వెఱపున నట్టె పోక కదఃభీషణభంగిఁ గరాళ వక్త్రులై

పరగఁ బ్రహతులున్ గినుకఁ బర్వఁ బడింగని బల్ రదంబులన్
బరువడిఁ జెందలల్ గొట్టికిఁ బైచిరి బెబ్బులు లట్ల బల్విడిన్ 159

గీ. అధిపుచే మన్నన సత్కృతు లైన యోధు
లనవి ఋణ మీఁగుటకుఁ జచ్చి రాజితోఁ బఁ
గిడఁగి బతికిన సత్కృతుల్ గానివారు
కసలి గెడసిరి వారల కన్నము నెన్నె 160

వ. భార్గవ వంశంబును దేజస్విత్వంబువలన దుర్నిరీక్ష్యంబును గుపి
తంబును గీర్తార్థియు నైన వీరలోకంబునందుఁ బత్యనాదర
నిమిత్తాపయశోనివర్తకం బైన యుపాయంబు మరణంబున
కంటె నెయ్యది లేదని నిశ్చయించి శాక్తికులచేత నైశిత్యంబు
వలన నెంగును ప్రతిహతంబు నొందనిదియు నఖ్యాగ్రఫలశాలి
నియు నయోమయియు నైన శక్తి పగతులందుండు విడువం
బడియెం గాని శరీరంబువలనం బుట్టిన శక్తి విడువం బడదయ్యె
రాజుల వ్యసనంబునందును నీతి విడువక ప్రభునచేత నమాను
షంబైన రణంబు గావించి రప్పు డయ్యుద్ధంబుఁ జూచి యంతరి
క్షవర్తి సిద్ధవిద్యాధరాదిజనసంఘంబు విస్మయంబునొందె 161

సీ. త్రిణతచాపంబులు గణికల కైవడి
బలుశరంబులఁ గాముకులను బోలె
నిజగుణంబులచేత నెఱిఁ ఫలప్రాప్తి ప
ర్యంత మూకర్షించి యవల విడిచె
రయమున నేగు గుల్ఫంబులు పశువం
తను లైన శరము లేకముగ జెరసి
యారబ్ధ నవయుధ మైన శాత్రవ సైన్య
మందుఁ బ్రవేశించె నద్భుతముగఁ

గీ. గడిమి వీరుఁ డొకండు సంగర సమాగ
తారులందు శిలీముఖ వ్యథము వలన

రహి జపాసూనసమరాగ రక్తస్రుతిని
సాంద్రముగఁ గల్గఁ జేసె రోషంబువలన 162

గీ. రణముగావింపఁ గాఁతించి రయము మెఱయ
దూరమున నుండి వచ్చిన వారణముల
రెంటి నడుమ గతాసువై పృథివి గూలి
నట్టి దంతి వరండక మల్ల యొప్పె 163

గీ. భూరిభేరీరేఖాభ్రాభ భారభీర
భార భూభార మత్తేభ భూరిపంక్తి
తోడఁ బ్రతినాగములు కొన్ని గూడుకొనియె
నచ్చెరువుగాఁగ నమ్మహాహవమునందు 164

గీ. సమరగజములు భగ్నదంతములచేత
నురుమదముచే విహస్తత నొందినట్లు
శాతకరవాలలూన హస్తముల చేతఁ
బొందు పడఁగ విహస్తత నొందవయ్యె 165

గీ. కరటిమదజలసిక్తసంగరతలంబు
ఘనసరసిఁ బోలెఁ బ్రధుకరాకర్షితోరు
పిలసితసహస్రపత్రముల్ గలుగునట్లు
శోభ మొనరించె నప్పుడు గురుబలమున 166

సీ. సమరమందు గజంబు సాయకక్షతమోట
సవిషాద నిజయంతృసహితముగను
మృతినొంద నప్పుడు భృంగసంఘంబులు
రుతమిషంబునఁజాల రోదనంబు
గావించి నట్లుండెఁ గాలుని తల్పంబు
గతి నున్న సంగరక్షితితలమునఁ
గరులు మత్కుణముల కైవడిఁగను వట్టెఁ
దేజస్వియగునొక్క ధీరవరుఁడు

ఆ వె. శస్త్రశూలతోమరముల సవ్రణం బగుదేహ
మర్థిఁ దాల్చి సంప్రహారమందు
నధికసాహసమున నాహవం బొనరించి
విబుధసామ్యమొందె విక్రమమున 167

వ. మఱియు నిశ్చయచిత్తంబును శీతానంద నాశసంబును దీప్యమానంబును విజయ సంలబ్ధ సంపూర్ణ కామంబును మందోత్సాహ వివర్జితంబు నైన యమ్మహారణంబున భయంకరాసురభావంబు ధరించినవారయ్యును బరివంథులచేత నభిముఖావస్థితులై పంచత్వంబు నొందిన వీరులు దేవత్వంబుఁ బ్రాపించిరి నిపాతిత సుహృత్స్వామిపితృవ్యభ్రాతృమాతులంబైన సమరాంగణంబు పాణినీయ వ్యాకరణంబుపగిది దురవగాహంబై యుండెఁ దురంగఖురరథనేమి సముద్ధూత మహీపరాగంబు మింటికెగసి యంధకారబంధురంబుగావించి దృష్టిప్రసరణంబు లేకుండ నిరోధించుటయు నంతలో మదోత్కటకరటిఘటాకటపిగళద్దానసలిలాసారంబున నవి యడంగుటయుఁ బదంపడి యోధాగ్రేసరులు వీరావేశంబునం దలపడి సర్వాస్త్రశస్త్రపాతంబుల మహాసంగ్రామంబుం గావించి రందు విదీర్యమాణపుష్కరాకీర్ణంబులును బతచ్ఛంఖసంఘాకులంబులును ప్లవమానవత్రరథంబులు నగు సంధ్యాకాలమేఘవర్ణసవర్ణరక్తవారిప్రవాహంబు లనేకంబులు ప్రవహించె భూతభేతాళపిశాచగణంబులును గాకకంకగృధ్రాది పక్షిసంఘంబులును మేదోమాంసమస్తిష్కంబులును భుజించి కడుపులునిండ రుధిరంబులు గ్రోలి కలకలారావంబులు గావింపుచు నృత్యంబు నేయుచుండె 168

క. గతమౌర్వీ చాపములచే
నతిచిత్రము బహుశతప్రహారాన్వితమగుచున్
వితతా యోధనమేదిని
సతతంబు వెలుంగె వృష్టిజలదముమాడ్కిన్ 169

క. బలమధ్యంబునఁ గెడసిన
బలవంతునిఁ జూచి యతని బంధులు దుఃఖా
కులులైరి నిహత కుంజర
ములమెదఘుంటలును మిగుల మ్రోయకయుండెన్ 170

గీ. రణనిహతదంతిదంతగాత్రప్రకీర్ణ
యగుచు రణభూమి పిష్టలోకాసుమృత్యు
ముసలఖాస్వదులూఖల విసరకీర్ణ
మైనచందానఁజూపట్టె నద్భుతముగ 171

గీ. మానవంతుండు చైద్యుఁ డిమ్మాడ్కి రణము
నర్చుచు విధూతచైద్యాన్యనరుల నరులఁ
బరగ నభ్యవరోధంబు వలనఁ దూలఁ
దోలెఁ బవనుండు ఘనములఁబోలె నపుడు 172

క. ఈసరణి నాత్మసేనల
గాసిల్లఁగఁజేయు చైద్యుఁగని హరి సమరో
ల్లాసము ముఖకమలమునకు
భాసురబాలాతపంబు భంగిఁ జెలంగన్ 173

## శ్రీకృష్ణుని యుద్ధోపక్రమము

సీ సలలితమణిహేమవలయశోభిత దీర్ఘ
ధనువు మహేంద్రాయుధంబు గాఁగఁ
గటితటశోభితకాంచనాంబరరుచుల్
వితతశతహ్రదాద్యుతులు గాఁగ
బుంజీకృతాయతశింజినీనాదంబు
దారుణస్వనగర్జితములు గాఁగఁ
గడువడిఁ బరఁగించుబెడిదంపుటంపలు
గులుచైన పిడుగులతండు గాఁగ

సీ. మణిమయవిచిత్రమండనరశ్మిపరంప
రలు జనార్తుల మిఱుఁ ట్లుగొలుపఁ గృష్ణ
మేచకాభ్రంబు శిశుపాలమేఁగినీల
సైన్యబాహ్వాగ్ని వైఁ గ్రమ్మె సాంద్రభంగి 174

వ. మఱియు వక్షోగతకౌస్తుభమణిచ్ఛాయాచ్ఛురిత పీతాంబరంబు గలుగుటం జేసి శక్రధనుస్సంగత సౌదామనీసహిత నీలమేఘంబు భంగిఁ జెలంగునదియు ముఖసౌరభలోభభ్రమద్భ్రమర సంయుతంబును అలనోపలాలనంబును క్రీడాలోలుప విలాసాలయంబు నక్షీణపూర్వసమాగమ యగుటం జేసి తత్కాల సమాగమంబున సాభిలాషయైన విజయశ్రీకటాక్షవిలోకితంబునగు భక్తానుగ్రహ విగ్రహంబుచేత దీవ్యమానుండును ప్రభావసంపన్నుండును మహైశ్వర్యవంతుండును నక్షత్రప్రభోజ్జ్వలుండును విశిష్టదీప్తి సంపాదకుండును ఖగవాహనుండును భయరహితుండును సర్వజంతురక్షకుండును సంసారదుఃఖనివర్తకుండును మహీభర్తయు నిజపారప్రాప్తికాములును నిశ్చితులు నగు దేహత్యాగ కృతోద్యోగయోగులచేత సాక్షాత్కృతుండును నానందసాంద్రయు నక్షీణకాంతియు సర్వోత్కర్షగుణవ్యాప్తయు రమ్యకుచయు నిర్దోషయు నగులక్ష్మిచేత సత్వరంబుగా నాలింగితుండు నైన శ్రీకృష్ణు నవలోకించి శత్రువులయ్యును శిశుపాలాదులు నిష్పాపులై రరోచమానం బైనను దివ్యౌషధంబు స్వభావశక్తి చేతనే రోగంబును హరించినట్లు మాధవుండు దర్శనమాత్రంబు చేతనె వారలపాపంబు లన్నియు హరించె 175

క. జితయుద్ధబలమునం దొగిఁ
జతురత సమరంబు సేయ జనుదెంచు హరిన్
జితగదుని భువిఁ బ్రసిద్ధుని
హితవీర్యునిఁ దాఁకి గెలువ నెవ్వం డోపున్ 176

ఆ.వె. ఆ రథాంగమందు నతిగరీయంబైన
కృత్యమందు నిర్ణయింప బడిన
సారథిప్రచేత మిగుల నారోపితగుణోరు
కార్ముకంబు నక్రమగతి వహించె 177

ఆ.వె. అందుఁ బర్వయుతములగుచు రమ్యములైన
యమ్ము లపుడు సంహితంబు లయ్యె
వీను లంటు లాగి విడిచినఁ గార్ముక
ధ్వని సుపరుషమయ్యెఁ బరులకపుడు 178

ఉ. చండభుజావలేపమున శౌర్యధనుం డగు శౌరి ఘోరకో
దండము నెక్కుఁబెట్టి గుణదారుణశబ్దము ఘానభంబులున్
నిండ ననేకకాండములు నేర్పునఁగూర్చి విపక్షసేనపై
మెండుగఁ బర్వఁజేసె నటు మింట సుపర్వులు సన్నుతింపఁగన్

గీ. పరగఁ బశ్చాత్కృతంబైన పత్రులందు
నొనర నే పత్రి సుగుణసంయుక్తమయ్యె
నట్టి పత్రి మాధవుని కర్ణాంతమందుఁ
జేరె నాప్తునిచందానఁ జెలువు మీఱ 180

వ. మఱియు వీరుండును పరవిదారియు బహుళః పవంతుఁడును సప్రాపుండును శక్తవగదుండును నగు కృష్ణుఁడు శత్రువులచేత నవరుద్ధుఁడయ్యె వారికొందరు శత్రువులచేత ననంతబాణంబుల పూరితుండయ్యె 161

గీ దిఙ్ముఖవ్యాపకము లతితీక్ష్ణములును
ప్రోదులును సంతతము మర్మభేదనములు
నైన శరములు శత్రుల నచ్యుతుండు
విడిచె నేకకాలంబున వేగ మడర 182

సీ. అనిఁ జోన మాధవు ధనువొక్కటియె గాదు
మండలీకృత మౌట చండ కాండ
మథితమై రిపుసేన మండలీకృత మయ్యెఁ
మఱియు లోకాలోకి మధురభాషి
కలుషవిదూరుండు నళినలాలకుఁడు ని
రంకుశుం డకలంకుఁ డనఘమూర్తి
ప్రళయకాలమున వరాహలీల నటించు
నద్భుతచరితుండు నైన శౌరి

గీ. వర్మధరులైన పరిపంథిపరుల దృక్క
నీనికలయందుఁ బ్రసరించె నేర్పుమీఱఁ
గార్ముకమునందు సూక్ష్మలక్ష్యతయె గాని
వితరణుల యందుఁ బోలె స్థూలతయు లేదు 183

క. తతముక్త బహువిశిఖ యదు
పతిచాపం బటు హరించెఁ బరజీవితముల్
చతురతఁ బరచాపసతీ
వతను మది సహింపదయ్యెఁ బవరమునందున్ 184

ఆ.వె. వరరు డవివరుండు వైరివిదారియు
వారిరారవుండు పరుఁడు వీరుఁ
డుర్వరాగతపను నొప్పుననొప్ప ము
రారి విస్తరించె వైరమపుడు 185

గీ. అరినిహంతయునైన శ్రీహరిశరములు
తవిలి పానార్ధరక్షార్ధ ధాతువు లగు
చండ వైరుల శోణితం బొనరఁ గ్రోలె
భువనములను రక్షించె నద్భుతము గాఁగ 186

గీ. అవనిభారావతరణార్థ మంచితముగ
నవతరించిన వాఁడయ్యె నచ్యుతుండు
ప్రబల క్షాత్రవపృథుశరీరములచేత
భూమివర్ధన మొనరించె నేమిచెప్ప 187

క. హరి యొకశరమున వ్రేల్మిడి
నరిగణతరువులను గూల్చెనటు తా మును సుం
దరరామరూపమున ను
ర్వరలోఁ గావించినట్టి పనికి సమముగాన్ 188

క. శూరుఁడు లక్ష్మీప్రియుఁడగు
శౌరి దిశావ్యాపకాతిశాతశరములన్
వారక నిలఁబడ వ్రేసెను
వైరిశిరంబులను దాళఫలముల మాడ్కిన్ 189

ఆ.వె అరిమనోహరంబులై శౌరితూపులు
హృదయ మందు నిలువ కేగె నవలి
కందువలన సారె కరుల శత్రుత్వంబు
వ్యక్తమయ్యె హరికి నాలమందు 190

వ. ఇట్లమ్మధుసూదనుండఖండకోదండపాండిత్యంబు మెఱయఁ దండో
పతండంబులుగాఁ గాండప్రకాండంబులు వరఁగించిన నందు హరి
నామాంకితంబులైన కొన్నిబాణంబులు శత్రుశరీరంబుల
ప్రాణంబుల హరించెంగాని నామాక్షరంబులకు మాలిన్యంబు
గలుగునని తచ్ఛోణితంబు సంస్పృశింపవయ్యెఁ గొన్నిసాయ
కంబులు వీరవర్గప్రాణసర్వస్వంబును హరించి చోరులుంబోలె
దూరంబున మహీతలంబునం దదృశ్యత్వంబునొందెఁ గొన్ని
బాణంబులు రిపుకంఠచ్ఛేదనంబు గావించి మాంసఖండ
పరిచితంబులైన ముఖంబులు గలవియై పక్షులుంబోలె నాకా

శంబున కెగసె నప్పుడు రిపుశరీరసంజాతశోణితంబు శత్రునారీ నేత్ర సంజాతబాష్పతోయంబులుం గలసి ప్రవాహరూపంబై ప్రవహించె హరిమాయావిశేషంబున శత్రుసైన్యంబునందుఁ బరిపంథి లేక ద్వి త్రి చతుః శరీరంబులు గలవానింగాఁ గృష్ణుని విలోకించి తత్క్షణంబ తాము పంచత్వంబు నొందిరి సజామదబల ప్రాయుండును సముద్ధృతరసుండును ప్రతీత విక్రముండును శ్రీమంతుండు నగుహరి రెండవహరియుం బోలెఁ బ్రకాశించె నిట్లు హరిశరంబులు శత్రువధాత్మకంబైన యభీష్టార్థంబు గావించి యధోముఖంబులై మహీతలంబు ప్రవేశించె సర్వలక్షణపరిపూర్ణ శరీరుండును నిరస్తశత్రుతేజుండును మహాత్ముండును నగు కృష్ణుండు దైవసంపన్నవపూరణంబులైన సంగ్రామంబులందు జయంబునొంది రణసముద్రంబంతయు విస్తరించి తేజోవంతుండై ప్రకాశించె నిట్లు లబ్ధవిజయుండై కల్యాణమూర్తియు లబ్ధాఘ క్షయశుద్ధియు శ్రీవత్సలాంఛనవిశేషభూషితవక్షుండును నిర్భీకుండును శత్రుమృగవ్యాధుండును నిత్యాభ్యుదయవంతుండును నగుకృష్ణుండు రణరాగంబుపలన నహంకారోద్ధురంబైన సత్వంబు నవలంబించి మహోత్సాహంబున సింహనాదంబు గావించె* నంత 191

## శ్రీకృష్ణ - శిశుపాల ద్వంద్వయుద్ధము

## (శస్త్రప్రయోగము)

మ. హరివీర్యంబు సహింప కప్పుడు మహాహంకారయుక్తుండు చే
దిరసాధీశ్వరుఁ డుల్లసత్త్రివళిసందీప్తంబు సద్గ్రంథిల
స్ఫురితభ్రూయుగయుక్తమైన వదనంబుం దాల్చి నిర్భీకుఁడై
వరుసం బోరికి రమ్మటంచు హరి నాహ్వానంబుఁ జేసెన్ వడిన్

* మూలమున 19వ సర్గ సమాప్తము

ఉ. శౌరికరప్రముక్తశిత చక్రనిపాతన సంప్రతీతమున్
నారయ నంసనంస్థితములైన దురాసద కాలమృత్యువున్
వారక తాల్చినట్టి శిశుపాలురథం బది సూతరూప దు
ర్వార విధి ప్రయత్నమున ద్రిక్కిన నేగె మురారి డాయఁగన్

మ. జలజాతాక్షురథంబు సంఘటిత భాస్వచ్చక్రసంక్షుణ్ణభి
కగపీతాసుశరీరఖండంబు లగుటన్ గాశ్మీర ఘూజాంగలా
ఖ్యరసా ప్రోద్భవ కుంకుమారుణము లై కన్పట్టు రక్తంబులున్
స్థిగకుం దట్టపు జాజుద్రావాయుచుఁజనెన్ జేదీశుపై కుద్ధతిన్ 194

మ కలనిక్వాణక రాళకింకిణియు దీర్ఘ స్వర్ణకేత్వంకుకాం
చలమౌ శౌరిరథంబు ముక్తశిఖుఁడై చైద్యున్ రణక్షోణిలో
పలఁబంచత్వము నొందఁజేయక శిఖాబంధంబు గావింపనం
చలఘుధ్వానము సేయు కాలునిక్రియన్ వ్యాపించె దుర్వారమై

మ. నవనీలాభ్రరవానుకారియు నితాంతాపూరితాశాంతమున్
శ్రవణానందద మైనకృష్ణుని రథారావంబు నాలించి కే
కివితానంబులు నూర్ధ్వకంధరములై కేకాధ్వనుల్ మీఱ జ
న్యవనిన్ సమ్మదతాండవంబు సలిపెన్ దాలానుకూలంబుగన్

మ ఘనగంధోజ్జ్వల రుక్మిణీకుచతటీకాశ్మీరజంబాలలాం
ఛనవిభ్రాజిత భార్గవీరమణవక్షంబున్ విలోకించుమా
త్రనె చేదీశుని చిత్తమందుఁ జిరకాలస్థాయి రోషాగ్ని చ
య్యన దీపింప నొకింతసేపు వివశుండై యుండి వాఁడంతలోన్

సీ. తెలివొంది చంచలానిలచోద్యమానక
ల్పాంతకాలసంభవ మహోగ్ర
శిఖిశిఖాసంకాశశింజినీయుతమైన
ధనువును సారించి దారుణముగ

ఘనవజ్రరవ శంక గలుగునట్టుగ గుణ
నాదంబు గావించె మేదురముగ
సంధానమోక్షలక్ష్యము గానరాకుండ
శౌరిపై విశిఖవర్షంబు గురిసె

గీ. గవలమేచకరుచిమధ్య కలితదీర్ఘ
ఘోరభుజదండనాసంబు కుపితకాల
భ్రూయుగభయంకరం బయిపొలుచు చైద్య
కార్ముకం బెల్లవారిచేఁ గానఁబడియె 198

గీ. ఘూరితటిదుజ్జ్వలస్వర్ణపుంఖము లన
యోసితముఖంబు లధికరయంబులును మ
హాస్వనంబులు సైనశాతాంబకములు
గగనభాగంబు ఘనముల కరణినొప్పె 199

సీ. ఘనకర్తరీసాయకములు శాతఫలాగ్ర
నిర్భిన్నఘనగళనీరస్రవస్ఫు
టాతివేదన లగు నాశలనుండిత
ద్దయుఁగాఱుబాష్పసంతతియుబోలె
జక్రవాళంబు నాచ్ఛాదించె మఱియుఁ ద
త్కాండముల్ గగనభాగమున కెగసి
యినమండలంబు గప్పిన భూమిజనుల కా
కసము గన్పడకుండె క్షణము సేపు

గీ. పరగ నబ్భంగి సాయకాంతరితకృష్ణ
యగుటఁ జేసి వసుంధర యనిమిషులకు
నొకక్షణము చూడఁబడకుండె యుద్ధమందుఁ
జిత్రమై తోఁచెఁ జేదీశుచేతిబలువు 200

గీ. చైద్యుచే నప్పు డిట్లుంగి సకలశౌరి
భీకరానీకమున కెండ సోఁకకుండ
సాంద్రవిశిఖజాలైకవిశాలగృహము
కరణి నత్యద్భుతంబుగాఁగట్టబడియెఁ 201

వ. ఇవ్విధంబున నప్పు డమ్మధుసూదనుని సైన్యంబు శిశుపాలకృత శరపంజర మధ్యంబునఁ బతిసంఘంబుకరణిం జిక్కి చలింపకున్నం జూచి యసహాయశూరుం డగుకృష్ణుండు పరిపంథివిగళితాపరిమిత శరవర్షంబును నిజబాణంబులచేత వాదిప్రయుక్తానుమాన ప్రమాణంబు నితరంబులైన ప్రత్యనుమాన ప్రమాణంబులచేతఁ బ్రతివాదియుంబోలె నివారించె 202

శా. శ్రీకృష్ణుండు కపోణిచెత్తి కినుకన్ జేదీశు నీక్షించి వి
ల్లాకర్ణాంతముగా వడిం దిగిచి ప్రత్యాలీఢపాదస్థుఁడై
లోకాలోకగుహాముఖంబులు బదుల్ మ్రోయంగ దిక్కుల్ నభం
బాకంపింపఁగ మౌర్వినాద మటు బాహాశక్తిఁగావింపుచున్

చ. అలఘుధనుష్ప్రభావమొ గుణాతిమహత్త్వమొ ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచునున్నవో యేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్తజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియందొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్

ఉ. ఎక్కడఁజూడఁ గృష్ణుని యహీననిశాతపృషత్కకోటి న
ల్దిక్కుల నుండి వారిధుల లీల సముద్ధతిమేరమీఱి యే
దిక్కునుజూడ శత్రుబలదీవుల ముంచెఁ దదీయయోధులం
దొక్కరుఁడైనలేఁడు శరముద్ధతి సోఁకనివాఁడు చూడఁగన్

వ. ఇట్లు దానవాంతకుండుసంరంభవిజృంభితుండై తనచేతిశరలాఘవ శరలాఘవంబుల బలువుఁజూపిన శిశుపాలసైన్యంబునందు నిశితంబులైన యర్ధచంద్రబాణంబుల శిరంబులు దెగి యోధులశిరం

బులు కర్తనవేగంబున మింటికిం బఱచి గగనలక్ష్మి పట్టియాడు కలువపూబంతుల చందంబునఁ జూపట్టె నందుఁ గొన్ని శిరస్సులు మింటి నుండి మహావాతపతిత తాళఫలంబులుం బోలెఁ బుడమిం బడియె శరంబుల పరస్పరఘట్టనంబునం బుట్టి పావకజ్వాలలు మింటికెగసి మేఘంబుల సంస్పృశించి సైన్యంబుల మీఁదఁ గ్రాలిన సైనికులు కపిలముని కోపవహ్నిజ్వాలల భస్మరాసులై పుడమిం గూలిన సగరకుమారులవగిది భస్మీభూతులై మహీతలంబునం బడి రప్పుడు హరిశరపరంపరలచేత విపక్షశిలీముఖ మేఘజాలంబు విభిన్నంబైన వికసితవదన సరోజంబులైన యాదవసైన్యంబులు దిశలుం బోలె మిక్కిలిఁ బ్రకాశించె సమాచ్ఛాదిత సూర్యమండలంబులైన శర సమూహంబులచేత గగనంబు నాచ్ఛాదించె నయ్యవసరంబున హరిచాపయష్టియందు బాణం బొక్కసారి విసృష్టమై పుంఖానుపుంఖత్వంబుచేత బాణసంధానమోక్షలఘుత్వంబువలన ననేక బాణంబు లేకబాణంబుగాఁ గనుపట్టె 206

(అస్త్రప్రయోగము)

సీ. అతివేగరావంబు లతులపత్త్రముల్
కాంచనపింగళకాయకాంతు
లగు దానవారిసాయకములు భయమూఢ
కాకోదరంబులు గలుగునట్లు
ధరణిభేదించి పాతాళతలము సొచ్చెఁ
జేదీశుచే మున్ను చింతలేక
పరమర్మభేదనపరుషవృషత్కంబు
లపరాధములఁ బొంగి నచ్యుతునకు

గీ. దుఃఖ మొనరింపలేవయ్యెఁ దోడుతోడ
నధికమాయుఁడు లయకాలమందు యోగ
నిద్రితుం డగుశౌరికి నిద్రగలుగఁ
జేయుటకు స్వాపనాస్త్రంబు చెలఁగి యేసె 207

వ. ఇట్లు శిశుపాలుండు స్వాపనాస్త్రంబు ప్రయోగించిన భాస్కరుని
నర్థశూన్యసంజ్ఞ గలవానిఁగాఁ జేయుచు నిద్రాఘూర్ణిత లోచనా
రవిందంబులు గలుగ నట్లుగా నమ్మహాస్త్రప్రభవాంధకారంబు
హరిసైన్యంబు నాచ్ఛాదించె 203

చ. అప్పుడు మహీసుతుండు నిజ రాసనమందు నిషణ్ణమూర్తియై
విపులత నిద్రనొందె నది వింతయె మేల్కొనియుండువేళలన్
విపు విపద్వినాశకర విశ్రుతచాపముపై నిషణ్ణుడై
నిపుణత నెప్డు నేఁటికి నిద్దురవోయెడు శూరకోటికిన్ 209

ఆ.వె. శ్లథతనొందె వహనశక్తి లేని విపత
వరుల చేతిధనుష్షు వదలిపడియె
మొనసి యభ్యసించియును బ్రమాదంబున
గళిత మైన విద్యకరణి నపుడు 210

ఉ. నీరధిమధ్యమందు శేషను నిద్దురవోయెడు ప్రోడయయ్యు నిం
పార స్వసైన్యవార్ధిగతుఁడై భువనత్రయరక్షణంబునన్
వారక జాగరూకుఁడయి భాసిలు నాదిమపూరుషుండు ఆ
ఓమ్మరమణుండు జన్యజయశీలుఁడు మేల్కొనియుండె నత్తఱిన్

చ. అనవుగ నేమహాత్ముని సమంచితనామము నుచ్చరించినం
తనె చిరకాలభుక్తభవదారుణపాపతమం బడంగు న
వ్వనరుహపత్రలోచనుని స్వాపనబాణతమంబు గ్రమ్మునే?
దినకరు నాక్రమించుటకుఁ దీవ్రనిశోత్థతమంబు చాలునే 212

సీ. అప్పుడు హరిబాహుపాద్భుత తేజంబు
తపన తేజముఁబోలి విపులకౌస్తు
భాదర్శమందు నొయ్యన సంక్రమించిన
నందు దుర్వారసర్వాంధకార

నిరసనతమ మైన నిరుపమధామంబు
పొంద మె నాలోకవిభుండు భాస్క
రాబ్జనేత్రుఁడుగదా ! యమ్మహామణిదామ
నిచయంబు వికసితనేత్రసైన్య

గీ. సమితివలన నావిల చారుదర్శ
నంబు నట్లనె జ్ఞానంబు నపుడొసంగె
భవ్యమతులప్రసాదంబు భక్తులందు
బోలె దిశలందు వ్యాపించుఁ బొలుపుమీఱ 213

క. దిననాథుం డుదయించిన
జనములు తెలివొందినట్లు స్వాపనశరసం
జనితతమము విడిచినఁ జ
య్యన హరిసైన్యంబు లేచి యనికిఁ గడంగన్ 214

వ. ఇట్లు స్వాపనాస్త్రంబు న్యాయవాదంబునందు మిథ్యాభిశంస
నంబునుంబలెఁ గౌస్తుభమణితేజంబునసిష్ఫలంబైన నాగాస్త్రంబు
ప్రయోగించె నంత నయ్యస్త్రప్రభావంబునఁ గరాళవక్త్రింబులై
దీర్ఘపృష్ఠంబులై కోఱలవలన నక్రాంతంబు విషంబు గ్రక్కుచుఁ
జంచలరసనాద్వయాస్వాదితోభయపార్శ్వోష్ఠప్రాంతదేశంబులు
గలుగునట్లనేకంబు లేక కాలంబున నావిర్భవించి కార్ష్ణ్యంబువలన
విహితకేశానుకరణంబులై కపటంబున జయంబుగోరుచుఁ దొల్లి
సముద్రసంజనితోచ్చైశ్శ్రవోశ్వవాలంబునుంబోలె నంతరిక్షం
బును క్షణమాత్రంబులోన నైల్యంబు గావించె ముఖంబునందు
విస్తృతంబులై యనుక్రమంబుగా శరీరంబునందు గోపుచ్ఛంబు
వలె నుత్తరోత్తరం బణుత్వంబు ధరించి భరతశాస్త్రవిశారద కవి
ప్రణీత కావ్యగుంభితాంకంబులైన నాటకవిస్తారంబులుం బోలెఁ
బ్రకాశించె నప్పుడు సూర్యుండు రాహుగ్రస్తమండలుం డైన
వానియట్లు విషసహిత సముత్థితోరుధూమ్రతిరోహిత నిష్ప్రభ

మరీచి యగుటం జేసి తామ్రపిండ సచ్ఛాయంబైన శరీరంబును ధరించె 215

సీ. అప్పుడు కొన్ని మహాహులు శమనపా
శములకై వడి శరీరములుఁజుట్టి
కొనియె భోగులుకొన్ని యినుపశృంఖలముల
కరణి సైన్యంబుల కాళ్లఁబెనఁగె
విషపు కోఱలుకొన్ని ఖదురంబుల విధాన
నంగముల్ గఱచి గాయములుచేసె
వితతముఖంబుల వెడలు నిశ్వాసముల్
కాయంబు మిక్కిలిఁగములఁజేసె

గీ. నాలుకలు సాఁచుచుఁ బ్రచండలీల ఫణులు
మెడలుబంధించె నూపిరివెడలకుండ
సర్ప మయమయి పాతాళజ ముఖంగి
సమర మేదిని యొప్పె నా సమయమందు 216

వ. ఇట్లు నాగాస్త్రపాశబద్ధులై చిక్కువడియున్న నిజసైన్యంబు నవలోకించి ముకుందుండు మందహాసంబుఁజేసి నిజధ్వజాగ్రంబున నంతకుమున్నె నాగాస్త్రజనితఫణిమండలవిలోకనజాతకోపుండై యున్న నాగాంతకుని విలోకించె నంతఁ దద్విలోకనమాత్రంబున నవ్వైనతేయుండు విజృంభమాణశరీరుండై యనేక గరుత్మంతుల సృజించిన నవి యసంఖ్యాతంబులై కృష్ణనామం బుచ్చరించుచు నాకాశంబున కెగసి సువర్ణ వర్ణ వర్ణరుచులు సూర్యకిరణంబులం గలసి గగనంబంతయు స్వర్ణమయంబుఁ జేయుచు 217

సీ. శతకోటిసంకాశశాతనఖంబులఁ
దలలు చిందఱపాఱఁ దన్నితన్ని
శితచంచుపుటములఁ జించిచెండాడి ర
క్తము గ్రోలి ఖండలు నమలినమలి

యాతతపత్రసంజాతఝంఝూనిల
చాలనంబునఁ దూలఁ ద్రోసి త్రోలి
పత్రవిక్షేపసంభవభూరిరావంబు
చేత సంఘములు గూలఁ జేసెఁ బసి

ఆ.వె. చైద్యముక్తఘోరసర్పాస్త్రసంఘాత
వివిధదందశూకవిసరములను
హరివిముక్తగారుడాస్త్రజగరుడసం
దోహ మపుడు పట్టి తునిమివైచె 218

వ. ఇట్లు వైనతేయగణంబులచేత సర్పసంఘంబు హరిస్మరణాది పుణ్యంబులచేత బ్రహ్మహత్యాదిమహాపాతకంబులుం బోలె నశించె హతశేషంబులైన కొన్ని సర్పంబులు ఖగేంద్ర పత్త్ర సమీరణ బలాత్కారోన్మూలిత శైలదత్తవివర మార్గంబున వివశంబులై స్వకీయస్థానంబైన పాతాళంబు ప్రవేశించె నిట్లు నాగాస్త్రంబు మోఘంబైన శిశుపాలుండు లజ్జితుండై కదంబడి రోషవిశేషంబున సమంత్రకంబుగా నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన నది తొరగలేని మంట లుమియుచు విస్ఫులింగ పంచాలికా సంచారఘోరంబుగా వితతాయతజ్వాలాజాలుం డైన బేతాళునిపగిది నాకాశంబున కెగసి చలితోన్నతధూమకేతనుండును సరభసరభసాంబరరోహిరోహితవాహుండును శీఘ్రగమనాఢ్యసారథియు నైన పావకుండు కనకరథంబు బోలిక గగనంబున నొప్పి సముజ్జ్వలదాశాకోటరాంతరాళంబును సాంద్రదశార్ధ్రమేఘవద్ధ్వాంతరాళంబును బ్రజ్వలితదీర్ఘకాష్ఠంబు నైనవిశ్వంబును దరువునుంబోలె దహించె మఱియు గాంతారంబు నావరించిన దావానలంబువగిది యాదవసైన్యంబు చుట్టుముట్టి యట్టహాసంబున ఛటచ్ఛటశబ్దంబు లెగయ ధూమపటలంబు గగనంబున కంబుదత్వంబు సంపాదింపఁ జెలరేఁగి యాదవసైన్యంబుల నీఱు సేయందొడంగిన విశ్వంభరుండగు కృష్ణుండు విలోకించి యయ్యస్త్రంబునకంటె నిను

మడిగాఁ గోపోద్దీపితముఖుండై వరుణ దేవతాకం బైన
యస్త్రంబు ప్రయోగించిన నమ్మహనీయాస్త్రంబు 219

సీ. చతురబ్ధిగర్భవిశాలకుక్షియుఁ దనూ
సంధిలీలాభీలసింధుజాలుఁ
డంబుస్వరూపకుం డగుటఁ ద్రిధాముఁడై
కొమరొందు హరి శిరోజములవలన
జలదపరంపరల్ జనియించి ఘోరగ
ర్జారవంబు లెసంగ నఖిలదిశలు
నావరించి దినేశ్వరాక్షిఖ్యలను మాపి
యాకసంబునకు నైల్యం బొసంగెఁ

గీ. కనకనికషరేఖాగౌరఘనసముత్థి
తోరుచపలాట్టహాస మవారితాను
బద్ధఘనగర్జితాటోపబంధురంబు
నగుచుఁ గడుచిత్ర మైయొప్పె గగనమపుడు 220

గీ ఖరకరమరీచి పరిభావుకంబు లచిర
విరచితాభ్యంగజదేహవిపులకాంతు
లున్నతము లైన మేఘంబు లొప్పమీఱ
ననలునకు ధూమకేతుత్వ మొనరఁజేసె 221

గీ. ఆకసము నంటిమండు ఘోరాగ్ని నాజ్వఁ
బెఱుగు విలయమహోపూర విధము దోఁపఁ
జేయుచు వృషంబుభంగి గర్జింపుచును ఘ
నంబు వర్షించె నదులు పూర్ణంబు గాఁగ 222

వ. ఇత్తెఱంగున నప్పవమాననఖుండు ప్రియంబులైనను వివాద
వాక్యంబులచేతఁ బ్రణయప్రయుక్తకోపంబుభంగి ననుద్దీపక
మేఘోద్భవ సలిలంబులచేత మొదల వైపరీత్యంబున మిక్కిలిఁ
బ్రజ్వలించి పదంపడి క్రమంబుగా శాంతుండయ్యె నంత 223

గీ. నీరసేకంబుచే బలాత్కారశమనస
మగ్రముగ నీయమానుఁడై యాశ్రయాశుఁ
డపుడు ప్రబలమేఘంబులందు సాంద్ర
చంచలావ్యాజమునఁ బ్రవేశం బొనర్చె 224

సీ. ప్రశమంబునొందిన పావకసంబంధి
సంత్యక్తమూలవిశాల హేతి
హరిహయముక్తవజ్రాభిఘాతంబున
విచ్ఛిన్న మగు పక్షివిభుని యేక
పక్షంబు గతిఁ జూడఁబడియె నొక్కట ఘనా
ఘనసమూహంబు లగ్నిని శమింపఁ
జేసి శీఘ్రంబునఁ జెలఁగి దిశాముఖం
బులనుండి జాఱె సంచలత నొంది

గీ. యరయ నది యుక్తమే కదా! యధికు లెందుఁ
బరుల కుపకార మొనరించి ప్రాభవమున
నొనర నుపరోధ మొనరింప రుర్విలోన
నిది స్వభావ మైయుండు మహాత్ములకును 225

గీ. కృష్ణవర్త్మశిఖలఁ గృశతాసమై నవ
జీవనమున మిగుల సిక్తమగుచు
నపగతాభ్రదోష మగుమిన్ను శాపిశ
పాయితాని లతికభంగి నొప్పె 226

• శిశుపాలవధ •

వ. ఇట్లు పావకాస్త్రంబు విఫలంబైన శత్రుప్రకారి యగుశిశుపా
లుండు కుపితుండై రోగం బుపద్రవాంతరంబునుం బోలె
నేరదే యస్త్రంబు ప్రయోగించె నదియన్నియుఁ బరిపాటి వేది
యైనకృష్ణుండు వైద్యుండునుంబోలె మహానర్థప్రతిపాదకంబును

మహోపద్రవ నివర్తకంబును గుణదోషస్ఫుదియు నైనప్రత్యస్త్ర ప్రయోగంబుచేత శీఘ్రంబుగ నయ్యైయస్త్రంబుల ఖండించె నంత శిశుపాలుండు సేయునదిలేక కృష్ణుండజయ్యుండని నిశ్చయించి మర్మాతిగంబులు నపక్రంబులు నవవిత్రంబులు నగు వాక్యంబుల నొప్పించిన నమ్మాధవుం డెద్దానిచేత గాఢాలింగన వ్యాపారముఖ్యలోలుపంబులై నరాహుపత్నీకుచంబుల కాఠిన్యశోభను వ్యర్థంబుగావించె నట్టి యనలజ్వాలాభీలంబైన చక్రాయుధంబుచేత శపమానుండైన శిశుపాలుని శరీరంబును శిరోవికలంబుగావించె నప్పుడు శ్రీదేవీసేవితంబును దుందుభిఘోష దివ్యపుష్పవర్ష సమన్వితంబును ఋషిగణస్తూయమానంబును దినకరసంకాశతేజంబును నగునొక్క వెలుంగు శిశుపాలుని దేహంబున నుండి నిర్గమించి సమస్తరాజలోకంబు విలోకింపుచుండ హరిదేహంబు నందుఁ బ్రవేశించె* 227

మ. ఖలుఁ డౌచైద్యునితోడ ఘోరతరసంగ్రామంబు గావించుచోఁ
దిలకింపం బడబాగ్నికీల పగిదిన్ దీపించు కృష్ణాననం
బలవిద్వేణ్నిధవాంతమందుఁ బరిపూర్ణార్కారి చందంబునన్
బొలుపొందం గనవయ్యె యాదవబలాంభోరాశి మధ్యంబునన్

మ. ఘనుఁడామాధవుఁ డిట్లు చేదివిభు లోకద్రోహినిం జంపి మిం
చిన సమ్మోదమెలర్ప సాంద్రజయలక్ష్మీశోభితాస్యాబ్జుఁడై
యనిమేషుల్ వినుతింప ఘోరతరజన్యక్షోణి వృత్రాఖ్యునిం
దనుజుం జంపిన పాకశాసనుని చందానన్ వెలింగె న్నహిన్

వ ఇట్లు శిశుపాలవధం బాపాదించి 230

సీ. కరిబృంహితంబులు హరిహేషలును జయ
డిండిమస్వనము లొండొండ బెరయ
నంభోధిసంకాశ యాదవసేనల
జయజయధ్వనులు దిక్చయము నిండఁ

---

* మూలమ్ము పర్వమును సమాప్తము

ప్రద్యుమ్న సాత్యకి బలభద్ర ముఖ్యులు
రథముల నెక్కి పార్శ్వముల రాఁగఁ
బఠింప "రాజగోపాలకృష్ణా! పరా"
కని వందిజనంబు లందఱుఁ బొగడ

గీ. సమరజయజాతమందహాసంబు వదన
చంద్రచంద్రికావిస్ఫూర్తి సంతరింప
క్షితిసురులు ప్రీతితోడ నాశీర్వదింపఁ
గమలనేత్రుండు ధర్మజుఁ గానవచ్చె 231

• శ్రీకృష్ణుని ధర్మరాజు సత్కరించుట •

క. చనుదెంచిన హరిఁ గని గ్ర
ద్దన ధర్మసుతుండు తాను తమ్ము లెదురుగాఁ
జని తోడి తెచ్చి కనకా
సనమునఁ గూర్చుండఁబెట్టె సంభ్రమమలరన్ 232

వ. ఇట్లనంతవైభవాభిరంజితుండైన యదుకుంజరుండు సుఖాసీనుండై యుధిష్ఠిరాదిపాండవులును దక్కినపరివారంబును సేవింప నొక్కింతసేపు సమరవిజయప్రకారంబు తెల్లంబుగా వివరింపుచు నందఱ నానందరసాబ్ధివీచికాసందోహంబుల నోలలాడింపుచు నొక్కింతసేపు కొలువుండె నయ్యుధిష్ఠిరుండు కృష్ణానుమతంబున రాజసూయయాగం బొక్కింత గొఱంతపడకుండ సర్వంబు సాంగంబుగా నిర్వర్తించి యవభృథసలిలోక్షితమస్తకుండై హరికరుణావిశేషంబునఁ గృతకృత్యుండై ప్రకాశించె నంత 233

సీ. వసుదేవతనయుండు ద్వారకాగమనంబు
తెలిపిన విని యయ్యుధిష్ఠిరుండు
విడువఁజాలక "యేడు గడయ మీరలు గాక
యిక నెవ్వరున్నారు హితులు చుట్ట

లసువులు చన్న నింద్రియముల క్రియ గాదె
మీరు పోయినవెన్క మేము కృష్ణ!
నీ సహాయతఁ గాదె నేని మఖము జేసి
మిగులఁ గృతార్థుండ నగుట యెల్ల"

గీ. ననుచు నిట్లంగిఁ గడువినయమున వేఁడి
యును బురిగమనంబున నుడుపులేక
యెట్టకేలకుఁ జిత్తంబు గట్టిపఱిచి
తమ్ములును దాను యోజించి సమ్మదమున 234

సీ. వెలలేని మానికంబులు నగజాలు ప
చ్చలు దాపినట్టి సొమ్ముల నొసంగి
వస్నిశుద్ధాంశుకవసనంబు లర్పించి
పెక్కుసామజవాజులు పెక్కుహారులు
పెక్కురథంబులు ప్రేమ మీఱఁగ నిచ్చి
యతిశక్తి జాలఁ బ్రియంబు నెఱపి
ప్రద్యుమ్న బలభద్ర వసుదేవ సాత్యకి
ప్రముఖ యాదవవంశవరుల కెల్ల

గీ. మణిమయవిచిత్రభూషణాంబరము లిచ్చి
మించి వేశ్వర నందఱ నంచితముగఁ
ప్రీత చేతస్కులను జేసి సూతమాగ
ధాదులను బ్రీతులను జేసె నర్హభంగి 235

వ. అంత 236

## ద్వారకాగమనము

సీ. కడువేడ్కఁ గృష్ణుండు కాంచన స్యందన
మెక్క సారథ్యంబు నింద్రసుతుఁడు
గావింపఁ బ్రీతితోఁ బావని పూర్ణచం
ద్రనిభోన్నతాతపత్రంబుఁ బట్టఁ

గవ లిరువంకలఁ గౌముదీసంకాశ
రమణీయసితచామరములు వీవఁ
బణవమర్దళశంఖపటహాకాహళ భూరి
భేరీధ్వనులు మింట భోరు కొనఁగ

గీ. రమ్యలావణ్యనిర్జితరంభలైన
వారకాంతలు లాస్యవైభవముఁ జూప
భాస్కరునిభంగి దిక్కులఁ బ్రభలు నిగుడఁ
బోలుపు మీఱ నింద్రప్రస్థపురము వెడలె 337

వ. ఇట్లనంతవైభవంబునఁ బురంబు నిర్గమించి సముచితంబుగా ధర్మనందనభీమనకులసహదేవులను నిలువనియమించి పురుహూతపుత్రుం దోడ్కొని బలభద్రప్రద్యుమ్నాదులు వెంటనంటిరా యాదవవాహినీసమేతుండై కతిపయప్రయాణంబులం జనిచని నిజశోభాధరీకృతపురందరపురంబైన ద్వారకాపురంబుఁ బ్రవేశించి బ్రాహ్మణు లెదుర్కొని యాశీర్వదింపఁ బురపురంధ్రీజనంబును లాజపుష్పంబులు సేసలు చల్ల నిజకరుణారసాప్లుతవీక్షణంబులు పౌరజనంబుల మీఁద వెదచల్లుచు రాజమార్గంబునం జని నిజమందిరంబు ప్రవేశించి రుక్మిణీసత్యభామాదులంగూడి దివ్యాంతఃపురంబున సుఖింపుచుండె 338

## • కావ్యోపసంహారము •

చ. క్షితియు దివంబు వారిధు లశేషకులాద్రులు చంద్రసూర్యు లంచితగతి నందు రెందనుకఁ జెల్వువహింపుచు నంతదాఁక నీ
కృతియుఁ గృతీంద్రువంశమును గీర్తిరమామణి ధాత్రిలోఁ జిర
స్థితిని వహించి యొప్పెసఁగు శ్రీరమణీహృదయేశు సత్కృపన్

పుష్పమాలికాబంధము.

వరధరధీర! మానవదవప్రవరార్యమధామ! కామసుం
దర! సరవారఖండనకనత్కనకాంశుకలోకనాకపా!
హారికరిసిరిహీరహారహారహసద్యశ! శ్మేళవంశశే
ఖరవరదారదూర! కవికల్పక! ఘాతలపాలఖేలనా!

క. విద్యాభోజనృపేంద్రా!
ప్రద్యుమ్నసమానరూపలావణ్య! ప్రభా
పద్యుమణిద్యోతరుచి
ప్రద్యోతితభృత్యలోక! వదనసరోజా! 241

ఉపేంద్రవజ్రము

రమాధిపానుగ్రహలబ్ధరాజ్య
రమాసదాలంకృతరమ్యగాత్రా!
యుమాకుమారాభమహోగ్రశక్తి
ప్రమర్దితారివ్రజక్రౌంచశైలా! 242

(గద్య)

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధ విద్యాసాంద్ర
గోపినాథ వేంకటకవీంద్ర ప్రణీతంబైన
శిశుపాలవధ మహాకావ్యంబునందు
చతుర్థాశ్వాసము

శిశుపాలవధ మహాకావ్యమాంధ్రము
సంపూర్ణము.
శ్రీకృష్ణార్పణమస్తు

# రథబంధము



| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | శ్రీ | | | | | | | |
| | | | | | | క | రా | సు | | | | | | |
| | | | | | ర | రా | జ | సే | వి | | | | | |
| | | | | త | పా | ి | గో | పీ | లో | ల | | | | |
| | | | బు | ధ | జ | న | పా | ల | శు | భ | ః | | | |
| | | గు | రు | తి | ర | స | ల | లి | ప | గు | ణ | ఘ | | |
| | నా | ఘ | న | గా | త్ర | ప్ర | కృ | తి | రం | జ | న | వి | త్తె | |
| రా | మ | ణీ | య | హ | రి | కృ | ష్ణ | పా | పా | వ | హా | ది | గిం | ధ్రా |
| వ | న | భో | గి | శ్వ | ర | శ | యా | న | పు | ణ్య | శ్రీ | ల | చ | క్ర |
| ఖా | వి | త | సు | హ | స్త్ర | రు | చేం | డు | బిం | ఖా | స్వ | వే | ద | క్ష |
| | చి | న్మ | య | వి | ష్ట | వేం | ద్ర | మా | ని | ఖా | చా | ర | గు | |
| | | ణ | ని | ధి | మా | న | మ | హి | త | హా | ర | శా | | |
| | | | ర | ద | ఘ | న | హి | ర | సా | ర | ః | | | |
| | | | | త్రి | దీ | న | ర | జా | వి | మ | | | | |
| | | | | | ల | నా | మ | ది | వ్య | | | | | |
| | | | | | | గు | ణ | క | | | | | | |

| దంబరశింపునన్ను | గో | దండరామ |
|---|---|---|

# అనుబంధము

చక్రబంధము. ధరణిప శ్రీవరా కనకదామ యదుప్రవరా మనోజ్ఞకం
ధర హరి మాధవా సకలదా దవభక్షక వైనతేయసుం
దరరథ దేవముక్తిఫలదా నరమిత్రక హీరహార మం
దరధర నాథ మంజుళయ దానధురీణ విధాతృవందితా గో.రా.

ఖడ్గబంధము. రాజరాజ రాజసేవ్య రాజపూజకా జరా
రాజితామలోరు కీర్తి రమ్య సద్గుణాకరా
రాజవంశవర్య దైత్యరాజవైరి యిందిరా
రాజ సన్నిభాననాభిరాజితాబ్జ భాస్కరా గో.రా.

ఫణిబంధము. సర్వాధారప్రశస్తా జయనిధిసరసశ్యామలాపత్త్రనేత్రా
శర్వాబ్జశ్రీమహేంద్ర స్మరనరవరదా సామజత్రాణశ్రీమ
త్సర్వారంభాయనిద్రాజయదసదనసత్సాంద్రవైశద్యసారా
నిర్వాణస్థానగర్వా నిగమగ విశదా నిత్యయధ్యానసర్వా గో.రా.

చతుర్విధ కందము. సురవర సర్వశరణ్యా
సరమా మురహర సరసిజచరణా కరిపా
హరసఖ శశిరవినయనా
సరసా యదువర ధరధర సరసాత్మహరీ గో.రా.

అనులోమవిలోమకందము. పావనమానస వసువర
మావన నవసారసనయనాజసుతవిభా
భావితసుజనాయనసర
పావననవమారవ సువసనమానవపా గో.రా.

కందగీతద్రుతవిలంబితస్రగ్ధరాగర్భచంపకము.

కరివర కామదా దనుజఘస్మర ధన్యకథాజితారిమా
వరవిభ వామనా వినుతవాసవవిశ్వప విక్రమాఢ్య భూ
ధర హరి భామదా కనకదా స్థిరకార్య జగన్నుతాఖ్య శ్రీ
కర జన కాముకా ప్రణుత కార్ముకబాణ విపన్నపాలకా గో.రా.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండదగినది |
|---|---|---|---|
| 11 | 5 | శుక్రు | శక్రు |
| 12 | 3 | మంట | మఁట |
| 28 | 12 | పేరం | పేరఁ |
| 49 | 5 | నేఁచున్ | సొచ్చున్ |
| 92 | 13 | ర్తడు | త్రిదు |
| 93 | 19 | డురే ? | డునే ? |
| 111 | 26 | ఃమస | మనః |
| 121 | 24 | త్కర | త్కర్ష |
| 122 | 21 | రింప; | రించె; |
| 122 | 22 | లత్ర | లపత్ర |
| 177 | 16 | లందున్ | లందునున్ |
| 192 | 19 | లమార్గంబు | మార్గంబుల |
| 198 | 14 | కటలో | లోకట |
| 198 | 17 | గుపుత్రైననురు | గురుపుత్రైనను |
| 199 | 7 | తనొగిన్ | త మొగిన్ |
| 207 | 15 | హాసన్ము | హాసమున్ |
| 229 | 4 | తదూర | తదూ |
| 250 | 23 | గందున | గఁబున |
| 266 | 25 & 26 | తంబుసంగతి | తస్వానోద్గతి |
| 288 | 28 | నకును | నకు |

## పద్యపాదములలో మార్పు

| పుట | పద్యసంఖ్య | పదము | ఉన్నపాదము | ఉండవలసిన పాదము |
|---|---|---|---|---|
| 22 | 78 | శ్ర | 2 | 3 |
| 192 | 75 | జనుటచే | 4 | 3 |
| 192 | 75 | ప్రసిద్ధి | 5 | 4 |
| 192 | 75 | ద | 6 | 5 |
| 280 | 112 | త్పి | 5 | 6 |